

# మన హాస్యం

రచయిత:

మునిమాణిక్యం నరసింహారావు



ప్రచురణ:

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్డు :: హైదరాబాదు




ప్రచురణ:

## ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్డు :: హైదరాబాదు

# ముందుమాటలు

ఈ పుస్తకాన్ని చదవడానికి ప్రారంభించే ముందు రెండు మూడు సంగతులు పాఠకులు తెలుసుకొంటే మంచిదని తోచింది. అవి ఏమిటీ అంటే.

ఈ పుస్తకాన్ని అచ్చువేయడానికై ధన సాహాయ్యము చేసిన సాహిత్య ఎకాడమీవారికీ, సారస్వత పరిషత్తువారికి నే నెంతో కృతజ్ఞుడను, నాకు ఇటువంటి సాహాయ్యము లభించడానికి కృషిచేసిన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారికి నా కృతజ్ఞతా పూర్వక అభివందనములు.

ఇంకా మరికొంతమంది నాకు సాయము చేసినారు. డా॥ మది గొండ వీరభద్రశాస్త్రిగారు ఈ పుస్తకము వ్రాత ప్రతిగా ఉన్నప్పుడు ఆమూలాగ్రంగా చదివి కొన్ని సవరణలు చేసి, అమూల్యమైన సలహాలు ఇచ్చినారు. శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు హాస్యపారిభాషిక పదాలను సృష్టించడములో ఎంతో తోడ్పడ్డారు. శ్రీ అవంచ సీతారామా రావుగారు చక్కని దస్తూరితో వ్రాతప్రతిని తిరగవ్రాసి ఇచ్చారు. వీరం దరికిని నేను కృతజ్ఞుడను.

ఈ గ్రంథమున కొన్ని అచ్చుతప్పులు దొరలినవి. అచ్చుతప్పులు లేని తెలుగు పుస్తకం ఉండదని అంటే అది సత్యదూరముకాదు. కొన్ని ఇక్కడ ఉదాహరిస్తాను.

నా రచనలో ఉదాహరించుటకు తమ హాస్యగేయాలను ఇచ్చిన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు.

హాస్యం హాశ్యంగానూ, సంస్కృత ముక్కలు అన్నమాట, సంస్కృత ముక్కులుగాను, ఆలంకారికులు అలంకారికులుగాను అచ్చు లోకి వచ్చినవి. కొన్నిమాటలు, లేకపోతే మాటల్లోని కొన్ని అక్షరాలు జారిపోయినవి. "థ"కు "ధ"కు భేదం పాటించలేదు మా ప్రింటర్.

అస్పష్టోచ్చరిత పదప్రయోగంలో మంబ్లింగ్ అంటే అర్థంలేని పదాలను అస్పష్టంగా ఉచ్చరించుట అని వివరణ ఇచ్చాను. అదికాదు, సుశబ్దాలనే అస్పష్టంగా ఉచ్చరించడాన్ని మంబ్లింగ్ అంటారు.

ఇల్లాగే రకరకాల తప్పులున్నవి. అందులో కొన్ని ముద్రణకు చెందినవి. కొన్ని స్వయంకృతములు. పాఠకునికి ఈ తప్పులు కనపడవనే నా ఆశ. ఒకవేళ కనపడ్డా, ఒప్పుఅయిన పదము పాఠకుని మనస్సుకు తడుతుంది. అందుకని తప్పొప్పుల పట్టిక అంటూ ఒకటి తయారుచేయలేదు.

ఇంకొక్క విషయము. శ్రీ ముట్నూరి సంగమేశంగారు హాస్యంమీద ఒకపుస్తకం ఇదివరకే వ్రాశారు. అదే హాస్యానికి సంబంధించిన మొదటి సిద్ధాంత గ్రంథం అని అనుకొంటాను. హాస్యగర్భితములైన పద్యాలు వివిధ గ్రంథాలలోనుంచి ఏరి, ఆ పుస్తకంలో పొందుపరచినారు ఆయన. నేను చేయవలసిన పనిని వారు చేసిపెట్టారనిభావించి సంతోషించి ఆ పద్యాలు కొన్నింటిని నేను వాడుకొన్నాను. అట్లాచేయడాన్ని వారు తప్పుగా భావించరని అనుకొంటాను. ఈ విధంగా నాకు సాయపడ్డందుకు సంతోషించి వారిని ఆశీర్వదిస్తున్నాను. శ్రీ పల్లా దుర్గయ్యగారుకూడా నాకు కొంత సాయపడినారు. వారికికూడా నా ఆశీర్వాదములు.

ఈ పుస్తకానికి "మన హాస్యం"అని పేరుపెట్టిన శ్రీ గడియారం రామకృష్ణశర్మగారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఇన్నర్ టైటిల్ పేజీలో వేసిన బొమ్మ చి॥ బుజ్జాయి రచించినది. అతనికి నా ఆశీస్సులు.

—రచయిత.

# ప్రస్తావిక

శ్రీ మునిమాణిక్యం ఈ పుస్తకానికి పీఠిక వ్రాయమని నన్ను అడిగితే ఆశ్చర్యమూ నవ్వూ కలిగాయి. పుస్తకానికి పీఠికలాంటిది ఉండాలనే అనుస్యూతమైన ఆచారాన్ని వారు పాటించటమూ, దీన్నిపలు దశలలో పలుపర్యాయాలు చదివే అవకాశం నాకు కలిగిఉండటమూ, వారికి నాపయిన వాత్సల్య అభిమానాలు ఉండటమూ – వీటన్నిటికీ పర్యవసానం నా ఈ సాహసం.

హాస్యరసాన్ని మనపూర్వులు ప్రధానరసాలలో ఒకటిగా గుర్తించినప్పటికీ మనసాహిత్యంలో దానికి ఉండదగినంతటి ప్రాధాన్యం ఏర్పడలేదు. పాశ్చాత్య వాఙ్మయ ప్రభావం ప్రసరించిన తరువాత వచ్చిన ఆధునికాంధ్ర సాహిత్యంలో హాస్యరీతులలో కొంత వైవిధ్యమూ క్రొత్తదనమూ కనవస్తుంది. అయినా హాస్యరస స్వరూప స్వభావాలను సాకల్యంగా పరామర్శించే గ్రంథజాలం వెలువడలేదు. ఈ కొరత తీర్చడానికి శ్రీ మునిమాణిక్యం ప్రయత్నించారు.

సృజనాత్మక సాహిత్యం వెంబడి విమర్శనాత్మక రచనలు రావలసిన అవసరం ఎంతయినా ఉన్నది. ఎప్పటికప్పుడు వివిధ దృక్పథాలనుంచి సమకాలిక సాహిత్య పరామర్శ జరుగుతుంటే తప్ప అభివృద్ధి సాధ్యపడదు. మన సాహిత్యం ఉండవలసినంత పుష్టిగా, సౌష్ఠవంగా ఈనాడు లేకపోవటానికి ఇదొక కారణమనిపిస్తుంది.

తెలుగు హాస్యం అనేపేరిట ఈవరకు ఒకపుస్తకం వెలువడింది. దానికంటే ఇది భిన్నమూ విశిష్టము అయిన ప్రయత్నం. ఇందులో శ్రీ నరసింహారావుగారు హాస్యరీతులను వర్గీకరించి, ఎన్నివిధాలుగా అందులో భేదప్రభేదాలు ఏర్పడుతున్నాయో విశదీకరించారు. ఇది చాలా కష్టంతో కూడుకున్నపని. శ్రీ మునిమాణిక్యం అత్యంత సంతృప్తికరంగా వ్యాకరించి విశదీకరించారు. ఈ భేదప్రభేదాలను గురుతించటమూ

విడమరచి చెప్పటమూ ఈ పనే చాలాకష్టమనుకొంటే, అంతకంటే కష్ట మైనపని వీటన్నిటికీ పారిభాషిక నామకరణం చేయటం. దీన్నంతా నిర్వహించటంలో – ముందుముందు ఈ రంగంలో కృషి చెయ్యదలచు కున్నవారికందరికీ అవశ్యం శిరోధార్యమయిన ప్రణాళికను వారు సిద్ధం చేశారు. శ్రీ మునిమాణిక్యంవారి దీక్షకు, తత్పరతకు ఈ పరిశోధన తార్కాణం. ఇంత విపులము, నిశితము అయిన ఈ కృషి చేసి నెగ్గ టంలో వారికి ఉన్న అనుభవం ఎంత ఉపయోగకారి అయినప్పటికీ, నిజానికి వారివయస్సు కొంత ఇబ్బంది కలిగించి ఉండాలి. అయినావారు వెనుకాడక, మళ్ళామళ్ళా ఉపయుక్త గ్రంథాలు పఠించి, నోట్సు తీసు కుంటూ, మెరుగులు దిద్దుకుంటూ ఈ పుస్తకం తయారుచేయటంలో కొన్నినెలలుగా వారి కార్యక్రమాన్ని నేను సమగ్రంగా చూచాను. వయస్సు, ఓపిక, అవకాశాలూ ఉండి బద్ధకించే కొందరు యువతరం వారు నిజంగా సిగ్గుపడి వారిని చూచి నేర్చుకోవాలి,

శ్రీ నరసింహారావుగారి ప్రణాళిక, అభిప్రాయాలు అందరూ ఆమోదించగలరా ? ఆమోదించకపోవచ్చు. అయిదారుచోట్ల వారే వ్రాశారు___“మీరు ఒప్పుకోరని నాకుతెలుసు. అయినా చెపుతున్నాను. ఆలోచించి చూడండి” అంటూ. ఈ పుస్తకం కొంత ఆలోచనను ప్రేరే పించి, అవును కాదు అనే వాదప్రతివాదాలను లేవదీసినా, వారి ఆశయం నెరవేరినట్లే. ఈ పుస్తకం రచనావిధానంలో శ్రీ మునిమాణిక్యం అనుస రించిన పద్ధతి మరికొన్ని పుస్తకాలలో వారు పాటించిన మార్గమే. పారిభాషిక శబ్దములతోకూడిన శాస్త్రవిషయాన్ని ప్రజాసామాన్యానికి అందించే రీతి వారిది. దీనివల్ల గ్రంథం కొంత విస్తృతమైంది. పైగా శ్రీ నరసింహారావుగారికి కొన్ని ఖండితమైన అభిప్రాయాలూ ఉన్నవి. ఆ అభిప్రాయాలను పాఠకులు సరిగ్గా అర్థంచేసుకున్నారో లేదో అని మధ్యమధ్య కలవరపడినచోట్ల చెప్పినవిషయాలను వారు మళ్ళామళ్ళా చెప్పటం జరిగింది. అన్నిసంవత్సరాలపాటు వారు ఉపాధ్యాయ పదవి నిర్వహించారుగదా. విశదీకరించే ప్రయత్నంలో కాస్త పునరుక్తి చెయ్య టం జీర్ణించి ఉంటుంది. దాన్ని ఒక పెద్దదోషంగా అనుకోరాదు.

మరో విషయం ఏమిటంటే - ఇందులోని స్థూలవిభజనవారు ఎన్నడో తయారుచేసినా, సూక్ష్మప్రభేధాలు అన్నిటినీ నిర్ణయించే ఘట్టంలో, వారు ఫారాలు అచ్చయ్యేదాకా ఏవో క్రొత్తక్రొత్తవిమార్పులు చేర్పులూ చేస్తూనేవచ్చారు. అందుచేత ఎక్కడయినా వీటిని ఇంకో క్రమంలో చెపితే ఇంతకంటే సులువుగా బోధపడేవేమో అనిపించితే అనిపించవచ్చు.

ఏమయినా, హాస్యాన్ని వ్యాకరించి చూపటంతోపాటుగా, హాస్య రస స్వరూప స్వభావాలను గూర్చి మరికొన్ని ప్రాథమిక విషయాలను గూర్చి ఆలోచనలను ప్రేరేపించే కొంతచర్చ వారు చేశారు. మన సాహిత్యంలోని హాస్యాన్ని స్థూలంగా సమీక్షించారు. పదిమందికీ ఉపయోగించేది, భావిపరిశోధనకి మార్గదర్శకం కాగలదీ అయిన ఈ పుస్తకాన్ని వెలువరించిన శ్రీ మునిమాణిక్యం అభినందించ దగ్గవారు.

ఈ పుస్తకం నామకరణం "మన హాస్యం" అని చేశారు. ఆ మాట అనగానే ఇది తెలుగుసాహిత్యంలో ఉన్న హాస్యాన్ని సమీక్షించే గ్రంథమేమో అని భ్రమ కలుగవచ్చు. ఒక అధ్యాయం దాన్నిగూర్చి కూడా ఉన్నప్పటికీ ప్రధానంగా ఇది హాస్యరస సిద్ధాంతాన్ని, హాస్యలక్షణాలను నిరూపించే గ్రంథం. ఒకవిధంగా ఈ రంగంలో ఇది ప్రధమ గ్రంథం. తెలుగులో మునుముందు హాస్యాన్నిగూర్చి కృషి జరిగితే, ఆకృషి కంతటికి ప్రామాణికంగా నిలబడగల అనేకవిషయాలను ఇది పరిచయం చేస్తున్నది.

ఈ గ్రంథాన్ని సహృదయులకు ఈ మాటలతో సమర్పించే అవకాశము కలిగినందుకు నేను గర్విస్తున్నాను.

హైదరాబాదు
1-1-1968.

ఎమ్. వీరభద్రశాస్త్రి.

# అంకితము

రసిక శ్రీ దేవులపల్లి
రామానుజరావుగారు
ప్రభువులు మీరలు మీగలు
వంశము ప్రభువుల వంశము

తరతరములనుండియు దొర
తనము నెరపినారు మీరు.

వెలలేని యఖండ సంప
దలతో తులతూగినారు

మాన్యత యెఱుగని కడుసా
మాన్య బ్రాహ్మణుడ, నేను

ముని మాణిక్య వంశ
మ్మున బుట్టిన వాడ సూర
యామాత్యుని సుతుడను నా
నామము నరసింహరావు.

పండితుడను కాను సాహితీ
మండితుడను కాను ప
ఠించిన యది యించుక కా
వించిన సేవయు కొంచెము.

కావించిన యత్కించిత్
సేవను గుర్తించినారు.

కొంతం కథలను మీరలు
ఎంతగనో మెచ్చినారు.

ప్రేమతోడ గ్రంథములకు
పీఠిక లందిచ్చినారు.

భగవంతుని అవ్యాజకృ
పా మహిమయె ఈ తీరు
నికు మీ ఘనమగు అభిమా
నమునకు పాత్రుని జేసెను.

దేవుడె నా పాలిటి కిటు
దేవులవ లై తోచెను
సాదరముగ చిఱునవ్వుల
చల్లని చూపులు చూచెను

మూలను బడియున్న నన్ను
ముందుకు గొని తెచ్చినారు
పండిత పరిషత్తులోన
ప్రాతినిధ్య మిచ్చినారు.

ముసలి వయసులో తేరని
ముచ్చటలను తీర్చినారు.

హితుడవు సంభావితుడవు
చతుర హాస్యనిధివి. ఆంధ్ర
కథా పితామహుడ వనుచు
నతిగా నను మెచ్చునారు.

దరిద్రుండనైన నాకు
ధన సహాయ్య మిచ్చినారు.

ఉపకృతికిని, ప్రత్యుపకృతి
యొనరించెడి శక్తిలేదు.
వ్యవధితుడను దరిద్ర దశా
బాధితుడను, పీడితుడను.

చినుగు పుట్టంబు చాటున
సిగ్గు దాచుకొనెడు వగ్గు
కృతజ్ఞతా సూచకము గ
ఏ మొసంగ గలడు తాను,

ఏమి చేయజాల ననుచు
కృతఘ్నుడై యెట్లు మనును.

వైభవమున మిన్నవయ్యు
వయసులో పిన్న వగుట
హార్దికమగు ఆశీస్సులు
అందిస్తున్నాను మీకు.

వాక్పయోధి మథియింపగ
ప్రభవించిన దివ్యమైన
అమృత భాండ మిదిగో! నే
నర్పిస్తున్నాను మీకు.

హాస్యరస శాస్త్రమ్మిదె
అంకిత మిస్తున్నాను,
స్నేహబుద్ధితో దీనిని
చేకొను రామానుజయ్య
ప్రేమతోడ స్వీకరింపు
పెరియసామి, ఇదోనయ్యా.



# 10

హాస్యము
ఇదీ హాస్యము కాదు.
వేషగత హాస్యము
చేష్టా గత హాస్యము
వాగ్గత హాస్యము
హాస్య శీలుడు – పాఠకుడు
హాస్య లక్షణాలు
ఏది హాస్యంకాదు
నవ్వెందుకు వస్తుంది
హాస్య రసము
నవ్వు ఆఱు రకాలు
హాస్యము ఆనందము
హాస్య శీలుడు – కవి
హాస్యము – భేద ప్రభేదాలు

1

# హాసము - హాస్యము

హాసము :

హాసము అంటే నవ్వు. ఆ నవ్వు పుట్టించేది హాస్యము. ఏది నవ్వు పుట్టిస్తుంది? అసహజము విపరీతము అయినది ఏదైనాసరే దాన్ని చూచి నవ్వుతాము. వేషము విపరీతంగా ఉంటే నవ్వుతాము. చేష్టలు విపరీతంగా ఉంటే నవ్వుతాము. మాటలు వంకరగా ఉంటే తప్పక నవ్వుతాము. నవ్వు మానవుడు క్రొత్తగా నేర్చుకొన్నదికాదు. ఏడుపు ఎంత మానవ సహజమో నవ్వూ అంతే. బ్రహ్మదేవుడు సృష్టి కార్య క్రమం అంతా పూర్తిచేసి, తాను చేసిన పనిని ఒకసారి చూచుకొన్నాడు.

ఎన్ని పక్షులు! ఎన్ని జంతువులు! ఎన్ని చెట్లు! ఎన్నిరకాలపూలు! ఇవన్నీ చూచి, నవ్వుకొని ఉంటాడు. గాడిద, ఏనుగు, ఒంటె, మొదలగు జంతువులలో ఉండే రూపవైవిధ్యం చూస్తే ఆయనకే నవ్వు వచ్చి ఉంటుంది. కుక్క మొరిగింది. గాడిద ఓండ్రపెట్టింది. ఏనుగ గీ పెట్టింది. ఈ శబ్దాలలో ఉండే స్వరవైవిధ్యం చూచి, మళ్లీ ఒకసారి నవ్వుకొని ఉంటాడు. యాడం, ఈవులు, ఒకరిని చూచి ఒకరు నవ్వు కొనే ఉంటారు. నవ్వు సృష్టిలోనే ఉంది. పరిమళంతో కూడిన పుష్పా లనూ మధురధ్వనులు చేసే పక్షులనూ నాట్యంచేసే నెమళ్ళనూ చూచి నప్పుడు ఆయన ఒడలు ఆనందంతో గగుర్పాటు పొంది ఉంటుంది.

అట్టి ఆనందం కలుగగానే సరస్వతి వీణ తీసుకొని పాడడం ఆరంభించింది. నారదుడు మహతి తీగెలు మీటి, ఈ మనోహరమైన సృష్టిచేసిన చతుర్ముఖుని స్తుతించడం ప్రారంభించాడు. దేవ దుందుభులు మ్రోగినవి. ఆ నిమిషంలోనే సర్వకళలు సముద్భవించినవి. అన్ని

కళలు ఆనందంలో ఆవిర్భవించినవే. సర్వప్రపంచమూ, ఆనంద తరంగములలో ఉయ్యాలలూగింది. ఆ ఆనందం యొక్క బాహిరరూపమే హాసము.

హాస్యము :

మళ్లీ మొదటికొద్దాము. హాసమునకు కారణభూతమైనది హాస్యము. నవ్వించేది హాస్యము. సహృదయుడూ, ఆరోగ్యవంతుడూ, సంస్కృతమతీ, నాగరికుడూ, అయినవాణ్ణి, నవ్వించేదే హాస్యము. అంటే ఉత్తమ హాస్యము. అయితే, అసంస్కృతుణ్ణి, అనాగరికుణ్ణి నవ్వించే విషయాలుకూడా ఉన్న వన్నమాట! ఎందుకులేవూ ఉన్నవి! అట్టివిషయాలు చాలా ఉన్నవి. ఒకటో రెండో ఇచ్చట ఉదాహరిస్తాను.

మనిషికి సహజముగా అంగవైకల్యము ఉండవచ్చు. కుంటితనము, గుడ్డితనము, అనాకారితనమూ, ముక్కొంకర, మూతివంకర, ఇల్లాంటివి ఉండవచ్చును. అట్టి అంగవైకల్యాన్ని చూచి నవ్వడము సభ్యత అనిపించుకోదు. అటువంటి విషయాలను జూచి నవ్వడము ప్రాకృత సహజము, నాగరిక లక్షణముకాదు. అయితే ఒకటి. కుంటిగా నడవాలని నడచిన నటకుని జూచి నవ్వవచ్చు. ఒకడు కాలుజారి పడతాడు. ఆ పడ్డవానిని జూచి జాలిపడవలెగాని నవ్వడము సభ్యత అనిపించుకోదు. కడుపు నొప్పితో బాధపడుతున్నవ్యక్తి, వికృత చేష్టలు చేస్తాడు. మెలికలు తిరుగుతాడు, తన్నుకుంటాడు. ముఖం వికారంగా పెడతాడు. ఆ దృశ్యాన్నిజూచి నవ్వేవాడు, సంస్కృతీ సభ్యతా తెలిసినవాడుకాడు.

*ఇది హాస్యంకాదు :* అల్లాంటప్పుడు నవ్వడము ఆటవిక జనుల లక్షణము. అనాగరిక జనుల లక్షణము. ఐస్‌లాండ్‌లో మంచుగుంటలుంటవి. ప్రమాదవశాత్తు అందులో పడ్డాడామనిషి ఇక బ్రతుకు ఆశ

లేదు. అందులోకి మెల్లగా జారిపడిపోయి, ప్రాణాలను వదలుతాడు. ఆ విధంగా జారిపోతూ ఉన్న దౌర్భాగ్యుణ్ణి చూచి చుట్టూ ఉన్నవారు విరగబడి నవ్వేవారట! అల్లాగ నవ్వేవారు రాక్షసులనిపిస్తుంది. అటువంటి సమయంలో నవ్వడము సభ్యమానవ సహజమూకాదు, ఆ వృత్తాంతము హాస్యమూకాదు.

అమెరికాకు వలసపోయిన తెల్లవారు, ఆ దేశములో ఎప్పటి నుంచో ఉన్న రెడ్ఇండియన్సును నాశనం చేశారు. రెడ్‌యిండియన్స్ పట్టుబడ్డప్పుడు వారిని భయంకరమైన కుక్కలకు ఆహారంగా వేశేవారు. ఆ కుక్కలు ఆ దురదృష్టవంతులను చీల్చి చెండాడేవి. ఆ బాధలు ఓర్వ లేక వాడు చేసే వికృత చేష్టలను చూచి తెల్లవారు నవ్వేవారట! ఇంతకూ నేను చెప్పదల్చుకొన్న విషయము ఏమిటీ అంటే, సహృదయుడూ, విజ్ఞుడూ, దయామయుడూ, నాగరికుడూ, అయినవానిని నవ్వించేదే ఉత్తమ హాస్యమని. ఆ నవ్వుకు కారణభూతమైన వృత్తాంతమే ఉత్తమ హాస్యమనిపించు కొంటుంది.

దుర్యోధనునికి మయసభలో జరిగిన అనుభవము, అందరూ ఎరిగినదే. ఆ విచిత్రభవనంలో దుర్యోధనుడు నీళ్లగలచోట నీళ్ల లేవని తలచి బట్టలు తడుపుకోవడమూ, నీళ్ల లేనిచోట ఉన్నవి అనుకొని బట్టలు ఎత్తి పట్టుకొనడమూ జరిగింది. ద్రౌపది నవ్వింది. ఆ వృత్తాంతము హాస్య గర్భితమా? అనిప్రశ్నిస్తే, కాదు అని చెప్పవలసివస్తుంది. సానుభూతి చూపవలసిన సమయంలో నవ్వడము అనుచితము. ఆ ఉదంతము హాస్యముకాదు.

ఇదీ హాస్యంకాదు :

భయంకరమైన దృశ్యములను గూర్చిన ప్రసంగము హాస్యము ఎట్లా అవుతుందో నాకు అర్థం కావడంలేదు. శ్రీరామ

చంద్రుడు తాటకి ముక్కు చెవులు కోయడమూ, హనుమంతుడు లంకా పట్టణమును దగ్ధంచేయడమూ నవ్వు పుట్టించే విషయాలని, హాస్యమును గురించి వ్రాసిన ఒక హిందీ రచయిత పేర్కొన్నాడని జ. మా. గారు చెప్పారు. ఆ రచయితను ఏంజేసినా పాపంలేదు. అది హాస్యము కాదు. ఆ వృత్తాంతమువలన జనించేది హాస్యరసముకాదు. భీభత్స భయానకాలు.

ఇంకొక్క విషయము. ఇది చాలా సున్నితమైన విషయము. రసగ్రహణ చేయగలవానికే దీని సత్యం గోచరిస్తుంది. ఏమిటీ అంటే, ఇతరుల మనస్సును కష్టపెట్టేది, గుచ్చుకొనేది, ఏదీ హాస్యం అనిపించుకోదు. అది హాస్యజనకమూ కాదు. ఒకవేళ నవ్వినా ఆ నవ్వు ద్వేషము అహంకారము, అసూయ మొదలగు క్షుద్రభావములచే కలుషితమైనది. ఇంతవరకు నవ్వుకు యోగ్యముకాని విషయములు చెప్పాను ఒక విషయం మనస్సులో పెట్టుకోవాలె. ఎవరిని గురించి నీవు హాస్యంగా మాట్లాడుతావో అతడుకూడా సంతోషించగలిగిందిగా ఉండే విషయమే ' హాస్యము '. "Laugh with any body but don't laugh against him "

మరియొక సంగతి చెప్పవలె. హాస్యములో ఒకరకము తేలికతనం ఉన్నది. ఒకమనిషి ఇంకో మనిషితో అన్న మాటలో గదా, హాస్యం ఉండేది! ఆ మాటల్లో హాస్యం సున్నితంగానూ మనోహరంగానూ ఉన్నా తేలికతనం ఉండకమానదు. దానిని సరసంగా గ్రహించడానికి రసజ్ఞత కావాలె. అది లేనప్పుడు హసితుడు అవమానింప బడినట్లు భావిస్తాడు. అందుకని రసజ్ఞత పెరగని రోజులలో ఈ వాగ్వ్యాపారాన్ని పండితులు ఆదరించలేదు.

ఈ వ్యాపారము పామరజనుల హస్తగతమై సాహిత్యకమైన గౌరవాన్ని సంపాదించుకోలేక పోయింది. భాండిక జనులు, విదూషకులు, కేతిగాళ్లు, గంధోళిగాళ్లు, గొల్లభాగోతులు మొదలైనవారి పెంప

కంలో హాస్యము మనోహరమైన రూపమును పొందలేకపోయింది. వెకిలితనంతో కూడిన వ్యాపారంగా ఉండిపోయింది. అందుకనే అటు వంటి వ్యాసంగం కలవారు పంక్తిబాహ్యులు అయినారు. హాస్యగ్రంథ ములు పుట్టలేదు పుట్టినా వానికి వ్యాసపీఠము మీదకు ఎక్కే అర్హత లేకపోయింది. పాశ్చాత్య సాహిత్యప్రభావము వలననే హాస్యానికి సుస్వ రూపమూ, సరళస్వభావమూ వచ్చినవి. హాస్యము ప్రతిభాజన్య వ్యాపా రముగా భాసించడం మొదలుపెట్టినది. హాస్యము మానవహృదయాన్ని తేలికపరుస్తుంది, కాని దాని సృష్టి తేలికకాదు. హాస్యాన్ని గురించి వ్రాస్తూ ఒక కవి అన్నాడు "It lightens the heart but the process to arrive at it requires serious thinking."

ఏ దేశంలోనైనా చూడండి కవులూ, నవలాకారులూ, కథకులూ కావలసినంతమంది ఉంటారు. కాని, హాస్యరచనా వైదుష్యం కలవారు బహు కొద్దిమంది. ఈ విషయము ముమ్ముందు ఎక్కువగా చర్చకు వస్తుంది. వికృతమైన వేషమూ, వికృతమైన భాషణా, ప్రధానంగా వీటివలన నవ్వు వస్తుందని అలంకారికులు అన్నారు. ఆ విషయం పరిశీలిద్దాము.

వేషగత హాస్యము :

"వికృతాకార వాగ్వేష చేష్టాదేః కుహకాద్భవేత్
హాస్యోహాసః స్థాయిభావః"

(సాహిత్యదర్పణము)

హాస్యోత్పత్తికి ముఖ్యంగా మూడు మార్గాలున్నవి. వికృతమైన ఆకారమూ, వేషమూ, వికృతమైన చేష్టలూ, వికృతమైన భాష, వీటి వలన హాస్యము జనిస్తుంది. అంటే హాస్యము వేషగతమూ చేష్టా గతమూ, భాషాగతమూ, అని మూడు విధాలు. వేషము వలననూ, చేష్టల వలననూ, జనించే హాస్యము బాహ్యాంగములకు సంబంధించినది.

భావములో ఉండే వికృతివలన జనించే హాస్యము ఆంతరంగిక విషయము. భావములో కలిగే వికృతిని ప్రదర్శించుటకు భాష అవసరము. వికృతమైన వేషమువలనా, చేష్టలవలనా, నవ్వించడము సులభము. భాషా సంబంధంగా చమత్కారాన్ని సాధించడానికి మేధాసంపత్తి కావాలె.

అయితే వేషగత వికృతి జన్యమైన హాస్యమును సాధించడములో కూడా ఒక నేర్పు ఉంది. ఆ వికృతిని సాధించడానికి కూడా ప్రతిభ కావాలె. ప్రతిభ కలవాడే హాస్యమును జనింపజేయగల వికృతిని ఊహించగలడు. ఒక కవిగారి భార్య "మీరు ఎన్నో వర్ణనలు చేస్తూ ఉంటారు, నన్ను ఒక్కసారి అయినా వర్ణించరేమండి" అని గునిసిందట. అప్పుడు ఆ కవి "మేరు మందర సమాన మధ్యమా! తింత్రిణీ దళ విశాలలోచనా! అర్క శుష్కఫల కోమలస్తనీ! పెద్దిభట్ట గృహిణీ విరాజితే?" అని ఒక శ్లోకం చెప్పాడట. ఆ వికృతాకారం మన కళ్ల ముందు కనబడితే మనకు నవ్వు వస్తుంది. జాలీ వేస్తుంది. ఇది మనోహరమైన రచనగా నాకు కనిపించడములేదు. జుగుప్సాకరంగా ఉంది. అల్పులూ, క్షీరకంఠులూ, ఈ రకము హాస్యాన్నిజూచి ఆనందిస్తారు. విజ్ఞులూ సంస్కృతమతులూ ఇటువంటి ప్రసంగాన్ని చూచి ఏవగించుకొంటారు. వారు మేధాపౌష్కల్యజనితమైన హాస్యాన్ని మాత్రమే మెచ్చుకొంటారు.

వేశ్యామాత : వేశ్యమాతలను గూర్చిన వర్ణనలు ఏ పుస్తకంలో జూచినా జుగుప్సా కరంగానేఉన్నవి. "వక్షోజములు జారివాలిపో మీగాళ్ల కడదాక దూరు దుంకంబులాడు; పలుకరించిన చెంత జేరరాకుండ, వాతుంపురులు చిత్తవాన గురియు." ఇల్లాగే నడుస్తుంది ఆ వర్ణన. వేషానికి సంబంధించిన ఇటువంటి వర్ణనలు జుగుప్సాకరమైనవీ అమధుర భావ సంయుక్తములైనవీ చంద్రరేఖావిలాపంలో పుష్కలంగా ఉన్నవి.

*జడచుట్టలు :* మన వీధినాటకాలలో కేతిగాడు, గంథోళిగాడు, సంస్కృత నాటకాలలోని విదూషకుడూ వికృత వేషధారణలో పేరు మోసినవారు. ఆ వేషమునుజూచి నవ్వుతాము. ఇటువంటి వర్ణనలు వ్యక్తి పరంగా ఉండక సమిష్టిపరంగా ఉంటే కొంతహాయిగానే ఉంటుంది. స్త్రీల జడచుట్టలను గురించి సాక్షిలో ఉన్న వర్ణన కొంతవరకు జుగుప్సా రహితమై పరిహాసరమ్యమై ఉన్నదని తోచింది. స్త్రీల జడచుట్టలు, జారీ చెంబులవలె, జంతికల చుట్టలవలె, సంక్రాంతి పిడుతలవలె, ఈగ లున్న తేనెపట్టులవలె, వింత అల్లికలు గలవై వెర్రివెర్రి ఆకారములు గలవై ఉన్నవట! జడచుట్టలలో అంత వైవిధ్యాన్ని చూడడంలో • గ్రంథకర్త ఊహకు సంబంధించిన వైదుష్యం ప్రదర్శించినాడు. వేషగతమైన వికృతిని జుగుప్స లేకుండా పరిహాస పరిపూర్ణం చేయ డము ప్రతిభతో కూడుకొన్న విషయము.

*పసుల సభ :* పసుల సభను వర్ణిస్తూ ఇల్లాంటి వికృతి వైవిధ్యాన్ని పానుగంటి సాధించినాడు. ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను : పసులు పొట్టికొమ్ములవి, కోరకొమ్ములవి, బారుకొమ్ములవి, బొంతరోమములు గలవి, గువ్వకన్నులవి, చెదురుకన్నులవి, ఒకచో సమావేశమైనవట! ఈ వర్ణన హాస్యపరిపుష్టమై యున్నది. వేషగతమైన వికృతి ప్రదర్శ నంలో కూడా ఒక చమత్కారం భాసిస్తూ ఉన్నది. ఈ రచనలో అసభ్య మైనట్టీ, అవినీతి స్ఫోరకమైనట్టీ, జుగుప్సాకరమైనట్టీ, భావప్రకటన లేదు.

పూర్వ సాహిత్యంలో ఈ మాత్రం అందంగిల వర్ణనలు అరుదు. సూరనకవి వ్రాసిన పద్యం చూడండి. " తట్టెడంత విభూతిపెట్టి, తాతల నాటి కుండనాల్ వీనుల గునిసియాడ! మైల గ్రక్కెడు శాలుమడతలు, నెరసిన బోడి బుర్రలమీద బొసగ జుట్టి! ప్రాత నీరుంగావి పంచెలు

• (పానుగంటివారు)

వృషణముల్ గనుపింపగా తొల్లు కచ్చగట్టి, బరగు దుష్పండిత బ్రహ్మ రాక్షసులచే కవితా రసజ్ఞత కట్టుబడియె!" ఈ చాటువులో విచిత్రమైన వేషధారణ వర్ణించబడినది. ఆ వేషాన్ని చూస్తే, నవ్వూ వస్తుంది, అసహ్యమూ కలుగుతుంది.

వేషమును వర్ణించి అది నవ్వతగిన వృత్తాంతంగా చేయాలంటే ఆ వర్ణన ఈ విధంగా తయారుగాక తప్పదు. ఇంకో విధంగా వర్ణిస్తే నవ్వేవిషయం అందులో ఏముంటుంది? ఎప్పుడు నవ్వించాలని, వేష గతమైన హాస్యమును సృష్టించాలని అనుకొంటామో, అప్పుడు వర్ణ నలు ఇట్లాగే ఉండాలె. మామూలు వేషంలో ఏమి విశేషం ఉందని నవ్వుతాము? అసలు వేషగతమైన వికృతిని దర్శింపజేసి నవ్వించాలనే ప్రయత్నాన్నే మనము నిరసించాలె గాని అటువంటి ప్రయత్నాన్ని ప్రోత్సహిస్తే ఇటువంటి హాస్యమే వస్తుంది. అయినా దానిని నిరసించడం ఎందుకు? అదొక రకం హాస్యంగా అంగీకరిద్దాము.

## చేష్టాగత హాస్యము :

వికృతమైన చేష్టల వలనగూడా హాస్యమును పుట్టించవచ్చును. మనకు చిరపరిచితులైన విదూషకుడూ, కేతిగాడూ, గంధోళిగాడూ, మొదలైనవారు, వెకిలిచేష్టలు చేస్తారు మనము నవ్వుతాము. ఆ పనులు వెకిలిగా ఉన్నా జుగుప్సను కలిగింపవు అందులో ప్రతిభా ప్రదర్శనం ఏమీ లేకపోయినా, వాటినిజూచి కాసేపు నవ్వుకొంటాము.

కృష్ణలీలలు : చిన్నికృష్ణుని అల్లరి చేష్టలు భాగవతములో వర్ణితమైనవి, ఎంతో మనోరంజకంగా ఉంటవి. ఈ క్రింది పద్యాల్లో బాలకృష్ణుని కొంటె చేష్టలను కొన్నింటిని వర్ణించాడు కవి :

"ఆడంజని, వీరలపెరు।గోడక, నీ సుతుడు ద్రావి
యొక యించుకనా।కోడలి మూతిందుడిచిన।
గోడలు ప్రుచ్చనుచు। నత్త కొట్టె లతాంగి!"

"వారిల్లు సొచ్చి కడవల।దోరంబగు నెయ్యి
ద్రావి తుది నా కడవల్।వీదింట నీ సుతుండిడ।
వారికి వీరికిని దొడ్డవాదయ్యె సతీ!"

"నమ్మి నిద్దర బోవ నాపట్టిజుట్టు మా।లేగతోకతోడ లీలగట్టి
వీధులందు ద్రోల వెలది నీ కొమరుండు।రాచబిడ్డడైన రవ్వ
మేలె!"

ఈ పనులు చేసింది బాలకృష్ణుడు కాబట్టి, ఈ విషయం చదువుచున్నప్పుడు మనస్సు మధురమైనట్టీ, సుకుమారమైనట్టీ భావములచేత దీప్తిమంతమౌతుంది. మనము ఆనంద తరంగితులము అవుతాము. ఆ రచనలు చదువుతూ ఉన్నప్పుడు మనలో ఉండే తంద్రితనమూ, బిడ్డలయందు ఉండే వాత్సల్యమూ అనే గుణములు మేల్కొని పిల్లవాడు చేసే ఈ కొంటె పనులకు మధురిమమును, మార్దవమును ఆపాదించి ఆ వృత్తాంతమంతా పరమ రమణీయ భావ విలసనముగా భాసింపజేస్తవి.

పనులచేష్టలు : చేష్టాగతమైన వికృతిని వర్ణించి సాధించిన హాస్యము ఎప్పుడూ రమణీయంగా ఉంటుందని చెప్పలేము. ప్రతిభావంతుడైన రచయిత ప్రయత్నము వలన ఇట్టి హాస్యము జుగుప్సాభావమును తగ్గించుకొని రామణీయకతను పెంపొందించుకొంటుంది. మామూలుగా జుగుప్సను కలిగించే విషయము తీసికొని అట్టి భావము లేకుండా ఉండే హాస్యమును పానుగంటివారు సాధించారు. సాక్షిలోనుంచి కొన్ని వాక్యాలు ఇస్తున్నాను. ఇందులో జుగుప్స బహుతక్కువ. పసులన్నీ చేరినవట! అది ఒక మహాసభ! కొన్ని "ఇటులాగి-అటులాగుకొనుచు-ప్రక్కవానిని పొడవబోవుచు మూర్కొనుచు, మందమంద రానుమంద ధ్వనులతో యథేష్టముగా మూత్ర విసర్జన చేయుచు విలాసమైన క్రీడలయందు, ఆసక్తిని కలిగి యున్నవట! ఆ సభకు ఒక గమిడి

గేదె అధ్యక్షతను వహించినది. ముందు అది సభాముఖమున తగు మాత్రమైన మూత్ర విసర్జన చేసి తన ఉపన్యాసమును ప్రారంభించినది. ఆమె ముఖతా వెలువడిన విషయములు మహిషములన్నియు జాగ్రత్తగా విన్నవి. అన్యోన్యశృంగ సంఘర్షణముతో కొన్ని తమ ఆమోదమును వెలిబుచ్చినవి. కొన్ని తమ చెవులను అల్లలాడించి తమ వ్యతిరేకతనూ, అయిష్టతనూ, తెలియజేసినవి." ఇల్లాంటి రచనలో విషమ భావ హాస్యమైన, పరిహాస పరిఫుల్లమైన, మనోజ్ఞమైన, చమత్కారము భాసిస్తున్నది.

ఇంకో విషయం మనం గమనించాలె. ఈ చేష్టలు హాస జనకంగా ఉండాలంటే ఆచేష్టలను ప్రేరేపించే భావము, ద్వేషము, అసూయ, కసి, కార్పణ్యాది భావములచే కలుషితము కాకూడదు. లక్ష్యము కేవలమూ వినోద కల్పన అయినపుడే అవి మనస్సుకు ఆనందమును చేకూరుస్తవి.

*మరదలు పిల్ల :* క్రొత్త అల్లుడు అత్తగారింటికి వెడితే మరదలు పిల్ల ఆయనగారిని హాస్యం పట్టిస్తుంది. నిద్రపోతున్నప్పుడు, అయన జుట్టును (ఉంటే) మంచముకోడుకు కట్టివేస్తుంది. క్రొత్త పెండ్లి కూతురు బంతులాట సమయంలో పెండ్లికొడుక్కు గంధం పూస్తూ పూస్తూ చెంప చెళుక్కుమనిపిస్తుంది. తమలపాకుల చుట్టలలో చింత గింజలు పెట్టడమూ నిద్రపోతున్నపుడు నోట్లో సబ్బు నురుగు అంటించడమూ, లాంటి అల్లరిపనులు చేస్తుంది.

*శృంగార చేష్టలు :* నాటకములలో నాయిక చేసే శృంగార చేష్టలన్నీ చూసేవారికి ఆనందమును చేకూరుస్తవి. చేష్టాగత సాధ్యమైన హాస్యము ఇక్కడ పరమయోగ్యంగాను రమణీయంగానూ, ఉంటుంది. ప్రియురాలు ప్రియుణ్ణి చూచి సిగ్గుపడి నడవడమూ, తలవంచుకొని కూర్చొనడమూ, వంకరచూపులు చూడడమూ, తమలపాకుల ఈనెలు ప్రియునిపై విసరడమూ, పమిటను మాటిమాటికీ సర్దుకొనడమూ,

అతను దగ్గరకొస్తే తాను పారిపోవడమూ, కిలా కిలా నవ్వడమూ, కుహనా కోపప్రదర్శన చేయడమూ మొదలైన చేష్టలనుచూచి మనము ఆనందంతో నవ్వుకొంటాము. చేష్టాగత హాస్యము పరాకాష్ఠను పొందిన ప్రకరణము ఇది ఒక్కటే!

*పాఠశాలల్లో:* పాఠశాలలలో అల్లరిపిల్లలు పంతులుగారిని ఏడిపించడము పూర్వము జరుగుతూ ఉండేది. ఆయన కూర్చునే కుర్చీలో పల్లేరుకాయలు పోసేవాళ్లు. ఆయన చూడక కూర్చుని "అబ్బా" అంటే అందరూ నవ్వేవారు. కుర్చీ కోడుక్రింద చిన్న టపాకాయలు పెట్టేవారు. పంతులుగారు కుర్చీలో కూర్చున్నప్పుడు ఆ ఒత్తిడికి టపాకాయలు పేలి "ఢాం" అని శబ్దం రావడంతోనే కుర్రవాళ్లు విరగబడి నవ్వేవాళ్లు.

*పెండ్లిళ్ళల్లో:* పెండ్లిళ్లలో చేష్టల వలన నవ్వు పుట్టించే పద్ధతి, అనేక ప్రకరణాలలో నడుస్తుంది. ఆడపిల్లలు వరసైనవాళ్లపై బుక్కాలుచల్లుతారు, వాళ్లకు బూడిద పూస్తారు. పులుసులో బొగ్గులు వేసి వడ్డిస్తారు. పెళ్లికూతురు అన్నం తింటూ తింటూ లేచి పెరుగన్నంచేతిని పెళ్లికొడుకు బుగ్గకు అంటించి వెళ్లుతుంది. ఈ పనులు కేవలం నవ్వులాటకు చేసినవి కాబట్టి అమలిన హాస్యావిర్భావ శక్తిమంతములై భాసిస్తవి.

రసజ్ఞుడైన రచయిత చేతులలో ఇట్టి చేష్టాగత హాస్యమును గురించిన వర్ణనలు హావ, భావ, హేలాసముద్భూత, పరిరమ్యములై పరమ సుకుమార మనోభావ సంయుక్తములై రసానందదాయకములై భాసిస్తవి. మన పూర్వసాహిత్యంలో ఈ హావ, హేలా, విలాస, విభ్రమ లీలా, కిలికించిత, మోట్టాయిత పరికల్పితమైన చేష్టాగత హాస్య మొక్కటే పరమ రమణీయమైనది తదన్యము అసభ్యము. ఉదాహరణకు ఈ క్రింది కథ చూడండి. తిమ్మనకవి ఉయ్యాలలో కూర్చుని

తాంబూలము సేవిస్తూ ఉండగా రామలింగకవి వచ్చి బావా "ఊతునా" అనడమూ, తిమ్మన సరే అనగానే అతనిపై ఉమ్మివేయడమూ జరిగింది. ఇంతకంటె అసభ్యమైన పని ఏమి ఉంటుంది!

*పిల్లల అల్లరిపనులు:* ఏ అల్లరి పని అయినా పిల్లలు చేస్తే అందంగా ఉంటుంది. ఈ కథ దానికి తార్కాణము. "ఒక స్కూలు ఉంది. ఆ స్కూలు ప్రధానోపాధ్యాయుడు ప్రచండుడు. ముఖ్యంగా ఉపాధ్యాయుడుగాని విద్యార్థిగాని, పాఠశాలకు ఆలస్యంగా రావడము ఆయన సహించేవాడుకాదు. విద్యార్థినైతే శిక్షించేవాడు. ఆలస్యంగా వచ్చింది ఉపాధ్యాయుడైతే ఆయనను కఠినంగా మందలించేవాడు. ఆయన్ను ఎల్లాగైనా అవమానపరచాలని ఒక విద్యార్థి నిశ్చయించుకొన్నాడు. గడియారం ప్రధానోపాధ్యాయుని గదిలో ఉంటుంది. రాత్రి కాపలావానికి లంచమిచ్చి వాణ్ణి మంచిచేసుకొని ఆ కుర్రవాడు ఆ రాత్రి ఆ గదిలో ప్రవేశించి గడియారాన్ని పదినిమిషాలు ముందుకు త్రిప్పాడు. ఆరోజున విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, ప్రధానోపాధ్యాయుడూ అంతా ఆలస్యంగా రావడము అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. ప్రధానోపాధ్యాయుడు, తానుకూడా ఆలస్యంగా వచ్చినందులకు సిగ్గుపడ్డాడు. అయితే వారు వెంటనే గ్రహించారు ఎవరో గడియారాన్ని ముందుకు త్రిప్పినట్లు. ఇదొక అల్లరి.

ఇంకోసారి గడియారం సరిగ్గానే ఉంది. అందరూ క్లాసుల్లోకి వెళ్లారు. ప్రధానోపాధ్యాయుడుకూడా క్లాసులోనే ఉన్నాడు. ఒంటిగంటకు లాంగ్ బెల్ కొడతారు. ఆరోజున పన్నెండు ముప్పావుకే లాంగ్ బెల్ వినిపించింది. మామూలుగానే బెల్ అయిందనుకొని అందరూ క్లాసులు వదిలి బైటకువచ్చారు. ప్రతివారూ తమ గడియారం చూసుకొని ముందుగా గంటకొట్టారు ఏమబ్బా అని ఆశ్చర్యపోయినారు. హెడ్ మాస్టరూ అల్లాగే ఆశ్చర్యపడ్డాడు. అయితేనేం జరుగవలసిన అల్లరి

జరిగిపోయింది. పిల్లలు ఇంటికి పోవడము సాగించారు. ఆబెల్ అట్లా మ్రోగుతునే ఉంది. మధ్యమధ్య ఆగుతూ ఎవరో అల్లరికి ఈపని చేసి ఉంటారని అనుకొని బెల్ ఎవరు కొడుతున్నారో చూద్దామని వెళ్లాడు ప్రధానోపాధ్యాయుడు. త్రాడు లాగితే మ్రోగేగంట అది. బైట వరండాలో ఉన్నది అది. హెడ్‌మాస్టర్ అక్కడికి వెళ్లాడు. బెల్ మ్రోగుతూనే ఉన్నది. ఆ గంటను మ్రోగించే త్రాడును ఒక కుక్క తోకకు కట్టారు ఎవరో! అది తోకను లాక్కున్నప్పుడల్లా గంట మ్రోగుతూ వచ్చింది. ఇటువంటి అల్లరులు క్రమశిక్షణకు వ్యతిరేకమే. కాని వాటి వలన చేష్టాగతమైన హాస్యము సిద్ధించింది. పిల్లలు చేసిన పని కాబట్టి అంతా నవ్వుకొన్నారు. ఇటువంటి అల్లరి పనులను గురించి వ్రాసిన రచనలు హాస్యరస పరిపుష్టములే. ఈ హాస్యము వికారరహితమైనది. నిర్మలమైనదికూడా.

*ప్రాక్టికల్ జోక్సు :* ఇంకొక ప్రాక్టికల్ జోక్ ఉంది. ధౌరస్వామి అని ఒక ఆయన ఉండేవాడు. ఆయన ఒక ప్లీడరును హాస్యం పట్టించాడు. ఒకసారి అతడు గుంటూరు వెళ్ళాడు. వీధివెంట పోతూ పోతూ ఉండగా ఎవరిదో వకీలుగారి ఇల్లు కనిపించింది. ఆయనకు బైటనున్న బోర్డుపైన ఆయనపేరు వ్రాసేవుంది. లోపలికివెళ్లి ఆ పేరు పెట్టి పిలిచాడు. ఇంటావిడ జవాబు చెప్పింది. "ఇంట్లోలేరండి ప్లీడర్ గారూ!" అని. "ఎక్కడికెళ్లారమ్మా?" అని అడిగాడు ఆయన. "బెజవాడవెళ్లారు, ఇంకారెండురోజులకు కాని రారు" అని ఆవిడ చెప్పింది. చాలు. చేష్టాగత హాస్య నిర్మాణానికి అవకాశం దొరికింది ఆయనకు. ధౌరస్వామి వెంటనే బెజవాడవెళ్లి ఆ వకీలుగారికి ఒక ఉత్తరం వ్రాసి పోస్టు చేశాడు. అందులో రెండు మూడు వాక్యాలే ఉన్నవి. ఏమనీ: "ప్రియా? మీరు నావద్ద ఒక్కరోజే ఉన్నారు. ఆ ఒక్కరోజులో ఈ జీవితానికంతా సరిపోయేటంతటి సౌఖ్యాన్ని ఇచ్చారు. మళ్లీ ఎప్పుడు

వర్ణనమిస్తారు? మీ ప్రియురాలు 'శశి'." వకీలుగారు రాకముందే ఆ ఉత్తరాన్ని ఆయన భార్య చూస్తుంది. భర్తవచ్చిన తరువాత ఆ భాగ్యశాలి చేసే హంగామా ఆయన సమాధానం చెప్పుకోలేక పడే అవస్థ అంతా ఊహించుకొని, దొరస్వామి నవ్వుకొనేవాడు ఇవి "Practical Jokes". ఏదో పనిచేసి ఆ పనివలన అందరిని నవ్వించడమే వీటి ఉద్దేశము.

*ఇంకో తమాషా :* విశ్వనాథం నాకు స్నేహితుడు. ఆప్త స్నేహితుడు. చిన్నతనంలో మేము ఇద్దరం కలిసి తిరుగుతూ ఉండేవాళ్ళం. నా చిన్నతనపు రోజులవి. ఒకసారి మేమిద్దరం ఒక హోటల్‌కు వెళ్లాము. జనం కిటకిటలాడుతున్నారు. కూర్చుంటానికి ఎక్కడా ఖాళీ లేదు. మాకా, కడుపులో మాడిపోతున్నది. మావాడు ఒక తమాషా చేశాడు. దాని వలన రెండు కుర్చీలు ఖాళీ అయినవి. మేము నిలబడి ఉన్నచోట ఒక బల్ల దగ్గర ఇద్దరు విద్యార్థులు కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు. ఎంతసేపటికీ లేచి వెళ్లేలాగున లేరు. మావాడు నన్ను దగ్గరకు పిలిచి రహస్యం మాట్లాడేవాడిలాగ ముఖంపెట్టి ఆ ఇద్దరికీ వినబడే అంతటి బాగానే అన్నాడు "అరే బాబు ఆపిల్ల చాలా అందంగా లేదూ?" అని. మొదట నేను గాబరా పడ్డాను. కాని వెంటనే వాడి పథకం గ్రహించి "అందంగానే ఉంది. అయితే కులీనకాదు! కులట అని నాకు అనుమానంగా ఉంది" అన్నాను. "అయినా మనకెందుకు? హోటల్ బైట ఆ చింతచెట్టుక్రింద కాసేపు నుంచుని ఎవరైనా షోకిల్లా వస్తే వాడితో ఆమె వెళ్లిపోతుందనుకొంటాను" అన్నాడు మావాడు. "ఏం జేస్తుందో చూద్దాం రారా అన్నాను నేను. "నేను రాను, నాకు ఆకలి అవుతున్నది, ఫలహారం అయిన తరువాత వెడితే వెడదాము" అన్నాడు మావాడు. "అప్పటిదాకా అక్కడ ఉంటుందిరా. ఎవరో చంక నేసుకొనిపోరూ!" అన్నాను నేను. మా మాటలు గుసగుసలే అయినా

వాళ్లకు వినపడాలనే మా ఉద్దేశం. వాళ్లు విన్నారు. వెంటనే ఒకడు లేచి బయటకు వెళ్లిపోయినాడు. రెండోవాడుకూడా వాడి వెనకాలే వెళ్లాడు. మేము ఆకుర్చీలలో కూర్చున్నాము. వాళ్లు ఆ పిల్లకోసం వెతుక్కుంటూ ఉంటారని తోచి నవ్వుకొన్నాము. మావాడు పన్నిన పన్నాగానికి నేను సంతోషించాను. ఇల్లాంటి ప్రాక్టికల్ జోక్సు అన్నీ చేష్టాగత హాస్యానికి అంతర్భాగములే. ఇటువంటి హాస్యములో జుగుప్స లేదు. అవి అవినీతి స్ఫోరకములు కావు. పరమ రమణీయమైన వృత్తాంతములు. పరిహాస మార్దవము కలిగి కేవలమూ వినోద ప్రతిపాదకములై మనోహరంగా ఉన్నవి.

*ఇంకోసంగతి :* ఒక మహాకవి చేష్టాగత హాస్యాన్ని సాధించడానికి ఆ చేష్టలను వాచ్యంగా చెప్పక ధ్వని నిక్షిప్తము చేశాడు. ఎవరో పెద్దన కవిత్వాన్ని నిరసించి అతడు కవేకాదు పొమ్మనట్లు ఊహించి. ఆ విధంగా అన్న వ్యక్తిని తన ఊహలో ఉన్నవానిని పిడిగుద్దులు గ్రుద్దినంత పని చేశాడు. "పెద్దనవలె కృతి చెప్పిన పెద్దనవలె, అల్ప కవిని పెద్దనవలెనా, ఎద్దనవలె, మొద్దనవలె, గ్రద్దనవలె కుందవరపు కవిచౌడప్పా" అని పద్యం వ్రాశాడు. అంతే కాని ఈ పద్యంలో ఒక్కొక్కమాట అంటూ ఒక్కొక్క గుద్దు గుద్దుతూ ఉన్నట్లు మనకు అనుభూతి కలుగుతుంది. ఏదో తృప్తీ, ఆనందమూ కూడా కలుగుతవి.

వాగ్గత హాస్యము :

చేష్టలను జూచీ, వేషమును జూచీ నవ్వుతాము సాక్షాత్తు వేషమునూ చేష్టలనూచూచి నవ్వడం సాహిత్యానికి సంబంధించిన విషయము కాదు. వాటి వర్ణనలే మనకు కావలసింది. అటువంటి వర్ణనలు నవ్వు పుట్టిస్తాయా లేదా అన్న విషయాన్ని చర్చించినాము. ఆ వర్ణనలు వాక్కు రూపంలోనే గదా మనకు లభ్యమౌతవి, ఇంకా వాగ్గతమైన హాస్యము

ఏమిటి ? అని ప్రశ్న. పైనచెప్పిన వాటిలో హాస్యము పుట్టడానికి, వేషమో, చేష్టో ఆలంబన అయింది. అల్లాంటి ఆలంబన లేక, రచనలో గాని, శబ్దముల కూర్పులోగాని, ఆ రచనను ప్రేరేపించిన భావములో గాని, ఆ రచనయొక్క అర్థంలోగాని, వికృతి లేక వైపరీత్యము ఏమైనా ఉండి అది హాస్యంగా భాసించి నట్లయితే దానిని వాగ్గళమైన హాస్యము అంటున్నాను.

ఇప్పుడు చూడండి. "పట్టుమని మా ఆయన చిట్టెడునూనె తెస్తే ఏమి సరిపోతుందమ్మా! నట్టింట్లో దీపం! ముందు కొట్లో దీపం! వదినె నెత్తికి, మంగలి కత్తికి, మా బావ జుత్తుకు!" అన్నదట ఒకావిడ. ఇందులో చమత్కారం మాటల కూర్పులో ఉంది. ఒకాయన స్నేహితునితో అన్నాడు "నీవు కలెక్టరుగారి భార్యను అత్తయ్యగారూ అని పిలుస్తావు, ఎట్లా వచ్చింది ఆవరస? వాళ్ళు నాయుళ్ళాయె మీరు బ్రాహ్మణులాయె!" అని. రెండవ పెద్దమనిషి ఏమన్నాడంటే, "నేను తహసీల్‌దారుగారి భార్యను అక్కగారూ అని పిలుస్తాను, తహసీల్‌దారుగారి భార్య అక్కయితే కలెక్టరుగారి భార్య అత్తేగా మరి!" అని. అదేదో అందరికీ తెలిసిన ఫార్ముళ్ళలా అయినట్లు! ఇక్కడ చమత్కారం అతడు అల్లాన అనుకోవడంలో ఉంది. అంటే భావాశ్రయము. ఇంకొక ఉదాహరణ :

ఒకామె తన భర్తకు ఉత్తరం వ్రాసి చివర, "ఈ ఉత్తరం మీకు అందకపోతే వెంటనే తెలియజేయండి. ఈ సంగతులన్నీ మళ్ళీ వ్రాసి పంపుతాను." అన్నదట. ఈ కథలో భావ సంబంధమైన వికృతి తెలుస్తునే ఉంది. ఇదీ భావాశ్రయ హాస్యమే. ఇంకొక విధంగా కూడా చమత్కారం సిద్ధించవచ్చు. ఈ కథవలన అదేదో తెలుస్తుంది. "ఇద్దరు కుర్రవాళ్లు ఒక గాడిదను చెరొక వైపున, గట్టిగా పట్టుకొని నడిపించుకొస్తున్నారు. దారిలో ఒక చెట్టుక్రింద కొంతమంది సైనికులు కులాసాగా మాట్లాడుకొంటూ, నవ్వుకొంటూ వచ్చి పోయే వారిని వెక్కిరిస్తూ

అల్లరి చేస్తున్నారు. గాడిదను అంత జాగ్రత్తగా పట్టుకొని నడిపించుకొస్తున్న కుర్రవాళ్లను జూచి వాళ్లు విరగబడి నవ్వి, "గాడిదను అంత జాగ్రత్తగా పట్టుకొన్నారు, గాడిదంటే ఎంత ప్రేమయ్యా మీకు!" అని వేళాకోళం చేశారు. ఆ కుర్రాళ్లు "దానిని అంత గట్టిగా పట్టుకొంటానికి ఓ కారణం ఉంది. మేము ఆ గాడిదను వదిలేస్తే అదిపోయి సైన్యంలో చేరుతుందని భయం." అన్నారు. ఈ కథలో చమత్కారం అర్థాన్ని ఆశ్రయించుకొని ఉంది. ఇది అర్థాశ్రయ హాస్యము. వాగ్గతమైన హాస్యము, శబ్దాశ్రయంగానైనా ఉంటుంది, భావాశ్రయంగానైనా ఉంటుంది. లేక అర్థాశ్రయంగానైనా ఉంటుంది. ఈ విషయం ముందుప్రకరణాలలో చర్చకు వస్తుంది.

హాస్యాన్ని శబ్దాశ్రయము, భావాశ్రయము, అర్థాశ్రయము అనే విధంగా విభజించడాన్నే కొంతమంది హేళనచేసినారు. అర్థంతో ప్రమేయం లేకుండా, శబ్దముగాని, భావముగాని, ఉండదన్నారు. నిజమే. కాని నా ఉద్దేశం ఏమిటీ అంటే ఒక్కొక్క విభాగంలో శబ్ద, భావ, అర్థాలలో ఒక్కొక్కటి ప్రధానంగా చమత్కార హేతువుగా భాసిస్తుందీ అని. వేదము శబ్ద ప్రధానమనీ, కావ్యము భావప్రధానమనిన్నీ, పురాణము అర్థప్రధానమనీ మనము అనడము లేదూ! ఇదీ అంతే.

హాశ్యశీలుడు-పాఠకుడు :

వికృతి దర్శనం అయితేనేగాని హాశ్యశీలుడు కాలేడు. ఇల్లాగ వికృతి దర్శనం అయినతరువాత హాస్యప్రసంగాల నడక బహువిధంగా ఉంటుంది. ప్రతిభావంతుడైన హాస్యశీలుడు ఏ విషయమునైనను వక్ర దృష్టితో చూచి హాస్యకల్పన చేయగలడు. అచేతన వస్తువులను చైతన్యవంతంగానూ, అసుందర వస్తువులను సుందరంగానూ మలచగలడు. కవులూ అంతే. కవికొండలవారు గడ్డిపూవుమీద మధురమైన గేయము

వ్రాయగలిగినారు. "దారెంటుంటాయి, దాక్కొని ఉంటాయి, నిక్కొని ఉంటాయి, నిక్కినిక్కి చూస్తాయి." అంటూ చక్కని పద్యం వ్రాశారు. జాషువా కవికి, గబ్బిలమూ, శ్మశానమూ కావ్యవస్తువులు అయినవి. వస్తువులో గొప్పతనము ఏమీ ఉండనక్కరలేదు. ఆ వస్తువును గ్రహించు కవియొక్క ప్రతిభామాహాత్మ్యమునుబట్టి, కావ్యానికి గౌరవము ఏర్పడుతుంది. హాస్యశీలుని విషయంలోనూ అంతే.

*వక్రదృష్టి :* కవులకు దివ్యదృష్టి ఉండవలె. హాస్యకర్తకు ఈ వక్రదృష్టి ఉండవలె. పరుసవేది స్పర్శవలన ప్రతివస్తువు బంగారము అయినట్లు హాస్యవేత్త దృష్టి ప్రసరించినంతమేర బంగారం పండుతుంది. నీరసమైన విషయమును తీసికొని రసమయముగా చేయగలడు హాస్యశీలుడు. కవి దృష్టివలన ప్రపంచము, సుందరము, ఆనందజనకమూ, అవుతుంది. హాస్యవేత్త దృష్టివలనకూడా అంతే. హాస్యరచనలో వర్ణనలు ఉండనక్కరలేదు. ఉండవు. అలంకారాలూ ఉండనక్కరలేదు. పాండిత్య ప్రకర్ష అసలే ఉండదు. ఈ సాధనాలు ఏమిలేకుండానే రసవంతమైన కథాకల్పనచే హాస్యవేత్త మనస్సును రంజింప జేస్తున్నాడూ అంటే అది కేవలము అతని ప్రతిభాజన్యము అని అంగీకరించవలసి ఉన్నది. హాస్యవేత్తకు ఆ వికృతి దర్శనంకావలె. అంతే. అదికావడము వలన ప్రతిభవస్తుంది. ఈ వక్రదృష్టి అభ్యాసలభ్యము కాదనితోస్తుంది. జన్మతః వస్తుంది. ఉత్తమ హాస్యకర్త ప్రధానంగా వస్తువులో ఉండే వికృతి ధర్మమును గ్రహిస్తాడు. అయినా హాస్యశీలునికి కొంత వ్యుత్పత్తికూడా అవసరము విద్వత్తువలన హాస్యము ఉదాత్తము అవుతుంది. అట్టి హాస్యానికి ఔన్నత్యము, ధృతి, కాంతి, వన్నెవి. తళుకూ మెరపులూ ఏర్పడుతవి. లేనిచో పేలవము అవుతుంది. ప్రతిభా వ్యుత్పత్తులూలేనివాని హాస్యము అసభ్యమూ అతిపేలవమూ అవుతుంది. బూతులలో హాస్యోత్పత్తి చేసేవారు ఈ రకములోనికి వస్తారు.

*భావయిత్రి:* కవికి కారయిత్రి అనగా కావ్యమును వ్రాయించు శక్తి ఉండవలెననీ, పాఠకునికి భావయిత్రి అనగా కావ్యార్థమును భావింపజేయు శక్తి ఉండవలెననీ అంటారు. భావయిత్రి ఉన్న పాఠకుడు హాస్యాన్ని అర్థం చేసుకోగలడు. హాస్యాన్ని అర్థంచేసుకొని ఆనందించడం తేలికఅయిన పనికాదు. హాస్యవిషయంలో కర్త, భోక్త గూడా ప్రతిభావంతులై ఉండవలెను. హాస్యరచయిత ఎటువంటివాడై యుండవలయునో తెలిసికొన్నాము. ఇక హాస్యాన్ని అర్థంచేసుకొని ఆనందించగలవానిని గురించి తెలిసికొందాము. హాస్యము మనిషిని తేలికపరుస్తుంది. కాని హాస్యసృష్టి అంతతేలికైన పనికాదు. ఈ విషయం ఇదివరలోనే తెలుసుకొన్నాము.

*పాఠకుడు:* హాస్యాన్ని అర్థం చేసుకొనడమూ, ఆనందాన్ని పొందడమూ కూడా అందరికీ సాధ్యంకాదు. ఇందులో ఏముందీ? అనే తత్త్వం గలవారికి దేనిని చూచీ ఆనందించే శక్తి ఉండదు. దేన్ని చూసినా నిరసనభావంతో చప్పరిస్తారు. "అటచనికాంచి" అనే పద్యం చదివి వినిపిస్తే చప్పరించి "ఏముందయ్యా అందులో శీతశైలాన్ని చూశాడు అంతేగా?" అంటాడు. అటువంటివాళ్లు హాస్యరచనలను అసలే మెచ్చుకోలేరు.

ఒక పండితుడు ఉపన్యాసం ఇచ్చాడు. ఆ సభలో ఉన్న విశ్వనాథ సత్యనారాయణగారు, ఆ ఉపన్యాసం విని అన్నారు! "అదిఅంతా ఆయన స్వంతం అని నేను అనుకోను. ఆయన ఎప్పుడో నా ఉపన్యాసం విని ఉంటాడు." అని. ఆ పండితునితో నేను అన్నివిషయాలలోనూ ఏకీభవిస్తున్నాను.' అని అంటానికి వక్రోక్తిలో ఆయన అల్లాగ అన్నాడని గ్రహించడం కొంచెము కష్టము. ఒక సభలో నే అన్నానూ, "నేను ఐదు నిమిషాలలో ముగిస్తానూ"అని. అందరూ చప్పట్లుకొట్టారు. ఇంకోసారి "మంత్రిగారు అనివార్య కారణాలవల్ల రాలేకపోయినారు" అని అన్న

ప్పుడూ అల్లాగే చప్పట్లు కొట్టారు. ఈ సంఘటనలలో సభికులు చప్పట్లు కొట్టడం హాస్యాస్పదంగా ఉంది. 'నేను తొందరలో ముగిస్తాను' అన్నప్పుడు చప్పట్లు కొట్టడంలో అర్థం ఏమిటి? "ముగిస్తారా? బ్రతి కాము." అని అర్థంవస్తుంది. అందుకని వాళ్లు చప్పట్లుకొడితే మనకు నవ్వు వస్తుంది. నిశితంగా చూస్తేనేగాని అది హాస్యజనకమైన వృత్తాంతంగా కనిపించదు. అందులో ఉండే అసంగతము గోచరిస్తే గాని ఆనందం కలుగదు. అటువంటి సంఘటనలలో ఉండే అసంగతత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకొని ఆనందపులకితుడు కావడానికి కొంత నిశిత మైన దృష్టి కావాలె. కాబట్టి హాస్యాన్ని అర్థం చేసుకొంటానికి నిశిత దృష్టీ, భావయిత్రీ, సంస్కారమూ కావాలె. కన్యాశుల్కంలో ఉండే హాస్యాన్ని అర్థం చేసుకొంటానికి భాషలో ఉండే వాడుపు, ఊపు, కాకువులో ఉండే అందము తెలిసి ఉండాలె. మానవ స్వభావమునందూ, విపరీత మానవప్రకృతియందూ, సానుభూతి కలిగిన వాడే హాస్యాన్ని చదివి ఆనందించగలడు. రసగ్రహణ పారీణతా, నవ్వగలశక్తీ ఆరోగ్యమూ ఉండాలె. చంద్రదర్శన మాత్రాన సంద్రము ఉప్పొంగినట్లు వికృతి దర్శనమాత్రాన హృదయాన్ని ఆనందంతో నింపుకొనే శక్తి హాస్యవచనములయందు అనురక్తి అమాయకత్వమూ, హృదయ నైర్మల్యమూ, చిత్తశుద్ధీ, కావాలె హాస్యశీలునికి. మంద మారుత మృదుస్పర్శచే గులాబి హృదయం ఘుమఘుమలాడి పోతుంది. చంద్రదర్శన మాత్రాన రత్నగర్భ పొంగి గంతులేస్తుంది. అట్లాగే ఒక విరుపు, ఒక మెలికె, ఒక వక్రోక్తి, ఒక హాస్యపు పలుకు, సహృద యుని హృదయాన్ని చలింపజేస్తుంది.

హాస్యవచనాలలో ఉండే పోకడా, పొలుపూ, పలుకుబడీ, తెలిసి ఉండాలె. ఒక చిత్రకారుడు ఒక సుందరమైన స్త్రీమూర్తిని చిత్రించాడు. త్రిభంగి సంప్రదాయంలో అది చిత్రింపబడ్డది. ఆ చిత్రకారుడు తన

పొరుగువాడైన డాక్టరును ఆహ్వానించి చిత్రమును చూపి 'ఎట్లా ఉంది?' అని అడిగాడు. డాక్టరు కొంచెము ఆలోచించి 'అపెండిసిటిస్'అన్నాడట!

ఏ విషయాన్ని గురించి అర్థంచేసుకోవాలో ఆ విషయానికి సంబంధించిన సంప్రదాయం సాంకేతికాలు, తెలిసివుండాలె. హాస్య స్వరూప స్వభావాలు తెలిసినవాడూ,తత్సంబంధమైన సాంకేతిక విజ్ఞానం కలవాడూ దాన్ని చదివి అర్థంచేసుకొని పులకాంకితుడు అవుతాడు. అటువంటి అర్హతలు లేనివానికి హాస్యం అసహ్యం అనిపిస్తుంది. గెటీ విద్వాంసుడు, కాళిదాసు శాకుంతలము చదివి ఆనందంతో గంతులేశాడు. అదే గ్రంథం మా ఆవిడకిస్తే ఆవిడ దానిని చారురాచిప్ప పైన మూత పెట్టింది. రచనయొక్క విలువ తెలియకపోతే అంతే. హాస్యము యొక్క గుట్టుమట్టులు తెలియనివానికి అదియొక పేలవమైన రచనగా తోస్తుంది. అట్టివానికి హాస్యశీలుడు వెకిలివాడుగా కనపడి అపనిందకూ అవహేళనకూ పాలుఅవుతాడు. ఇంతకూ నేను చెప్పేది ఏమిటంటే, హాస్యసృష్టికి ఒకరకమైన దృష్టిఉండాలె. **'An attitude of mind'** ఇంకోమార్గం లేదు. మనిషికి ఒకరకమైన చిత్తవృత్తి ఉంటేనే హాస్య రచన చేయగలడు.

హాస్యసృష్టి: పద్యం వ్రాయడం ఎల్లాగూ అని అడిగితే సమాధానం చెప్పడం కష్టంగాదు. దానికో మార్గంవుంది. ఛందస్సు నేర్చుకొని లోకజ్ఞతను అలవర్చుకొని ఒక రమణీయమైన పద్ధతిలో శబ్దములు కూర్చుజేస్తే అది కవిత్వం అవుతుంది. అది ప్రతిభావంతమైన కవిత్వం కాకపోవచ్చు. కాని కవనం అని అనిపించుకొంటుంది. హాస్యం అనిపించుకునే రచనలు చేయడానికి ఇటువంటి రాజమార్గము ఏమీలేదు. మంచి వర్ణనలు చేస్తే అది కవనము అవుతుంది. కొంత మంది విమర్శకులు వర్ణనల వలననే కావ్యత్వం సిద్ధిస్తుంది అన్నారు. వర్ణించువాడు

కవి. అతని కర్మ కావ్యం అన్నారు. వర్ణనలు సాధించడానికి అలంకార శాస్త్రం తోడ్పడుతుంది.

హాస్యాత్మకమైన కల్పనలు చేయడానికి ఇటువంటి సాహాయ్యము ఏమీ దొరకదు. అలంకారశాస్త్రము కూలంకషంగా చదివినా ఒక్కచక్కని హాస్యపు పలుకు పలుకలేకపోవచ్చు. పద్యాన్ని పాడి శ్రోతను రంజింపజేయవచ్చును. హాస్యవచనాన్ని పాడి రంజింప జేయలేము. పద్యం చదువుతూఉంటే ఏదో ఊపువస్తుంది. పద్యము ఉయ్యాల లూగిస్తుంది. హాస్యపు పలుకువలన ఇటువంటి భ్రమ కలుగజేయడానికి వీలుపడదు.

హాస్యలక్షణాలు :

హాస్యము అంటే ఏమిటి అని అడిగితే నవ్వుపుట్టించేది హాస్యము అని చెప్పాలిసివస్తుంది. అయితే ఎవరికి నవ్వు పుట్టించేదీ అని మళ్లీ ప్రశ్న. ఆరోగ్యవంతునికి సహృదయునికి నవ్వు పుట్టించేది హాస్యము అని అంటే ఒకవిధంగా సరిపోతుంది. సహృదయుడు అంటే బోలెడు తెలిసినవాడు. ముఖ్యంగా నవ్వతగిన విషయాలేవో, నవ్వకూడని విషయాలేవో తెలిసినవాడే సహృదయుడు. ఆ విషయాన్నే ఇక్కడ కొంచెం పరామర్శ చేద్దాం.

*అసహజత్వము:* ఒక విషయములో ఉండే (Incongruity) అసహజత్వము, వైపరీత్యము, నవ్వు పుట్టిస్తుంది. మనిషి రెండు కాళ్ళపైన నడవడము సహజము. ఒంటికాలుమీద నడవడము అసహజము. విధివశాత్తు ఒకకాలు ఏ యుద్ధంలోనో పోయి, ఒంటికాలుమీద నడుస్తూవుంటే నవ్వురాదు. కాని, ఒకడు తమాషాకు ఒకకాలుతో నడిచినా తల క్రిందపెట్టి, కాళ్లు పైకెత్తినా చూచేవాళ్ళకు నవ్వువస్తుంది. మనుష్యులు గుఱ్ఱాలను ఎక్కితే బాగానే ఉంటుంది. కాని గుఱ్ఱము

మనుష్యుల పైకెక్కితే ఏరగబడి నవ్వాల్సివస్తుంది. సహజంగా జరగ వలసిన పని అట్లా జరక్క ఇంకొకవిధంగా జరిగితే విపరీతంగా ఉండి నవ్వుతాము. మంచిగాని చెడ్డగాని మన సంఘంలో పత్నికి పతి దైవ సమానం అనేమాట బహుజన సమ్మతం అయిపోయింది. పత్నియే పతికి దైవము అంటే వైపరీత్యము ఉదయించి నవ్వుకు కారణం అవుతుంది. ఒక పరమసత్యాన్ని ఒక సామాన్య విషయాన్ని విపరీత విషయంగా పరామర్శచేస్తే అప్పుడూ, ఆ కథనము అసహజము విప రీతమై హాసజనకము అవుతుంది.

'అర్ధరాత్రి దొంగలు పడ్డారు. కన్నంవేసే లోపల ప్రవేశించారు. ఇది సామాన్య విషయము. ఇందులో ఆశ్చర్యపడవలసిన సంగతి ఏమీ లేదు. అయినా ఒకడు ఆ సంగతి విని చచ్చేటంతటి ఆశ్చర్యాన్ని ప్రక టించి, "రాత్రా! అర్ధరాత్రా! అందరూ నిద్రపోతున్నప్పుడు వచ్చారన్న మాట! దొంగలు! అందులో కన్నంలోనుంచి! అరే! కన్నంలోనుంచి ఎట్లా ప్రవేశించారో!" అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తే మనము ఆమనిషి అట్లా విస్తుపోవడాన్ని చూచి నవ్వుతాము. ముందుముందు ఈ విషయం ఎట్లాగూ చర్చకువస్తుంది గాబట్టి ప్రస్తుతం ఈ పరామర్శ ఈ ఒక్క ఉదాహరణతో వదిలేస్తాను.

అయితే ఒక్కవిషయం. సహజమైన విషయాన్ని అసహజమైన వృత్తాంతంగా ప్రదర్శించడంలో రచయిత ప్రతిభ కనబడుతుంది. చిలుకమర్తివారి ప్రహసనాల్లో చెవిటివాళ్ల సంభాషణా, నత్తివాళ్ల సంభా షణా హాస్యజనకం కావడానికి కారణం ఆ సంభాషణ అసహజం కావడమే! అది normal కాదు. ఉదాహరణకు పానుగంటివారి బధిర విధవాప్రహసనము చూడండి.

*ఆశ్చర్యము:* (Surprise) ఒక సంగతి వింటూ ఉంటాము. కథో ఉపన్యాసమో అల్లాంటిది. దాని పర్యవసానము ఇల్లా ఉంటుందని

మన ఊహను తడుతుంది. కథాంతంలో మనము అనుకొన్నదానికి వ్యతిరేకంగాగాని, భిన్నంగాగాని, జరిగితే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. (Surprise) ఆశ్చర్యం వలన ఆనందం కలుగుతుంది. ఆకస్మికానందానుభూతివలన నవ్వువస్తుంటి. మాకు ఒక అధ్యాపకుడు ఉండేవాడు. ఆయన గ్రీకుచక్రవర్తి అయిన అలెగ్జాండరును గురించి ఉపన్యాసం ఇస్తున్నాడు. చక్రవర్తి గ్రీసు మొదలుకొని బియాస్ నది వరకు గల దేశాన్ని జయించాడనీ, ఎషీరియా, పరిష్యా, ఇరాక్ దేశాల ధరణీపతులను పరాభవించాడనీ, తనకు ఎదురుతిరిగిన పట్టణాలను నిర్ధూమధామం చేశాడనీ, ఆయన మెట్టని దేశంలేదు అనీ ఆయనకు తలవంచని భూపతి లేడు అనీ గంభీరంగా, కొండవీటి జలాపాతంలాగ ఉపన్యాసం నడిపి, "చివరకు, ఆయన ఏంజేశాడంటే" అని ఒక్కక్షణం ఆగేసరికి విద్యార్థులమంతా ఆ చక్రవర్తి ఏదో మహత్కార్యము చేసివుంటాడని నోరు తెరుచుకొని చూస్తుంటే ఈ వాక్యంతో ఆయన ఉపన్యాసాన్ని ముగించాడు. ఆ వాక్యం ఏమిటంటే "ఆ మహాచక్రవర్తి ఆకస్మికంగా ఎవ్వరికీ చెప్పకుండా "ఢాం" అని చచ్చాడు" క్లాసంతా గొల్లుమన్నది.

ఆ ధోరణిలో అంత స్వల్పవిషయాన్ని మహద్విషయంగానూ అద్భుతవిషయంగానూ చెప్పడంవల్ల ఆశ్చర్యం కలిగి నవ్వు వచ్చింది. ఆయన ఉపన్యాసం ఇస్తున్నంతసేపూ ఆ క్రమమూ, ఉత్సుకతా, ఉద్వేగమూ, తీవ్రత, మొదలైన భావములచే మనస్సులో గాంభీర్యము స్థాయియై ఉండగా చటుక్కున ఆ భావాలకు భిన్నమైనదీ, అతి సామాన్యమైనదీ, పేలవమైనదీ అయిన భావమును ఆ వరుసలో నిలిపేసరికి, ఆ వృత్తాంతమంతా వికృతమై అసహజమై ఫక్కున నవ్వు వస్తుంది. అసహజత్వము, ఆశ్చర్యమూ ఈ రెండూ హాసజనకములే. ఈరెండూ వికృతిని కలిగించేవే. ఎక్కడ అయితే వికృతి ఉంటుందో, ఎక్కడ అసహజత్వము ఉంటుందో అక్కడ హాస్యజనకవృత్తాంతము

ఉంటుంది. ఒక హఠాత్ జనితమైన ఊహ లేక సంభవము తలవని తలంపుగా జరిగే సంఘటన ఒక ప్రసంగంలో పూర్వభాగమునకు భిన్నమైన ముగింపు, ఆశ్చర్యాన్ని కలిగించి నవ్వును పుట్టిస్తున్నది.

ఆశ్చర్యమును కలిగించి హాస్యము సాధించినట్లే ఒకమాటకు ఉన్న అర్థమునకు భిన్నమైన వేరొక అర్థమును సాధించిగాని లేక స్ఫురింపజేసిగాని మృదుమధుర మందహాస పరిమితమైన హాస్యమును సాధించవచ్చు. మొదటి అర్థానికి సాధితమైన అర్థము వ్యతిరేకమేకాక నిర్హేతుకము నిర్నిరీక్షితము అయినపుడే నవ్వు వస్తుంది.

మంగలి క్షవరం చేస్తున్నాడు. ముఖంమీద గాట్లు పడుతున్నవి. రక్తం వస్తున్నది. బాధ తగ్గించడానికి మంగలి ఆ మనిషిని మరో సంభాషణలోనికి దింపి "బాబూ మీరెప్పుడైన ఇదివరకు మా షాపుకు వచ్చారా" అని అడిగాడు మంగలి. క్షవరితుడు "లేదు ఆ చెయ్యి యుద్ధములో తెగిపోయిందయ్యా" అన్నాడు. మంగలి అసమర్థతవలన ఆయనకు కలిగిన మనఃక్లేశము ధ్వని నిక్షిప్తమై మంగలికి తలవంపులు కలిగించినా నవ్వడానికి తగిన పదార్థము ఇందులో లేకపోలేదు. ఇక్కడకూడా ఆశ్చర్యంకలిగే మనకు నవ్వువస్తున్నది.

*సందర్భశుద్ధి లేకపోవడము :* సందర్భశుద్ధిలేని ప్రసంగములలో ఉండే వికృతి (**Impropriety**) నవ్వుకు కారణం అవుతుంది. "తాటి చెట్టు ఎందుకు ఎక్కావురా" అంటే "దూడకు పచ్చగడ్డి కోసం" అన్నాడట. శుభమైనపెళ్ళి జరుగుతున్న సమయంలో "వచ్చిపోయెడు వారు, వక్కలాకుల కేడ్వ, గుగ్గిళ్లకై పెళ్లి గుబ్బమేడ్వ. పెద్దమగండని పెళ్లికూతురు ఏడ్వ, కట్నంబుకై గ్రామకరణమేడ్వ" మొదలగు అవాకులూ, చవాకులూ వింటే నవ్వురాకపోదు. ఆ నవ్వు నిర్మలమూకాదు, రసజనకమైన చిత్తవృత్తిని ఆశ్రయించినదీగాదు. అయినాఅదిహాస్యమే. సందర్భశుద్ధి లేకపోవడము హాస్యానికి కారణము.

*అప్రియమును ప్రియముగా మలచుట:* (Distortion) కష్టం కలిగించే విషయమును మెత్తనిమాటలతో చెప్పడంవల్ల కూడా వికృతి జనిస్తుంది. అప్రియమును ప్రియమైనదానివలెనూ, అసత్యమును సత్యము వలెనూ, దుఃఖమును సుఖమువలెనూ, సుఖమును దుఃఖమువలెనూ, మలచడము, నేర్పుతో వికృతిని సాధించడము అన్నమాట. దీనిని (distortion) అనవచ్చు.

ఒకఊళ్లో భూకంపాలు తరుచుగా వస్తున్నవి. ఒక పిల్లలుగల ఆసామీ తన పిల్లలను మరోగ్రామంలో ఒక స్నేహితుని ఇంటికిపంపాడు. ఎందుకైనా మంచిదని. నాలుగైదురోజులైన తరువాత ఆయనదగ్గర నుండి, టెలిగ్రాంవచ్చింది పిల్లలతండ్రికి. ఏమనీ? "పిల్లలను నీదగ్గరకే పంపివేస్తున్నాను భూకంపాలను మాఊరు తోలేశెయ్యి"అని. ఎంతో అప్రియమైన విషయాన్ని ఎంతో సుకుమారంగా చెప్పాడు. అప్రియత్వమూ, సౌకుమార్యమూ, భిన్నభిన్నవిషయాలు, ఒకచో చేరడంవల్ల వికృతి జనించి హాస్యానికి ఆలంబన అయింది.

*అతిశయోక్తి:* అతిశయోక్తి (Exaggeration) కూడా హాస్య సాధనకు ఒకమార్గము. అయితే ఆ విషయం నిజంగా అతిశయోక్తి అయితేనే హాసజనకము అవుతుంది. పరమసత్యము అయితే నవ్వురాదు. ఈ కథ చూడండి.

"ఒకామె నల్లని నలుపట. ఎంతనలుపూ అంటే ఆమెకు చెమట పోసినపుడు ఆ చెమటను గుడ్డతో అద్ది గాజుబుడ్డిలో పిండి కావలసినంత నల్లసిరా తయారుచేసుకోవచ్చునట." ఇది అతిశయోక్తి. అంటేఅభూత కల్పన. సత్యమైన విషయము ఎప్పుడూ అతిశయోక్తికాదు హాసజనకమూకాదు. అయితే అతిశయోక్తులలాగ కనపడేవి, నిజంగా అతిశయోక్తులా, సత్యమైనగాథలా అని నిశితదృష్టితో పరిశీలించాలె. ఒక హిందీపుస్తకంలో ఈ క్రిందివిషయం ఉంది.

"అగస్త్యుడు సప్తసముద్రాలను ఆపోసనపట్టడమూ, ఆంజనేయుడు సంజీవిపర్వతాన్ని అరచేతిలో పెట్టుకొని తీసుకొనిరావడమూ. ఈ వృత్తాంతాలు కడుపుబ్బ నవ్వుపుట్టిస్తవి" అని. ఆ కథలను కవి హాస్య కల్పనకై వ్రాయలేదు. ఆ విషయం సులభంగా ఊహించవచ్చు. కవి యొక్క ఉద్దేశంలో అవి పరమసత్యాలు. సత్యమైన వృత్తాంతంలో వికృతీలేదు. వైపరీత్యమూలేదు. ఆ వ్యక్తుల మాహాత్మ్యాన్ని మనము గ్రహించాలని కవి ఉద్దేశం కాని, వానినికల్పనాకథలనుగా, హాస్యవృత్తాంతాలనుగా భావించమనికాదు. "అవి నిజంకాదు. అంతఎత్తున అతిశయోక్తులు కట్టాడనండి." అని మనము అనగలిగితే మంచి మనోహరమైన హాస్యపుపలుకులు అవుతవి అని. అతిశయోక్తి హాస్యజనకం కావాలంటే దానిపునాదులు అసత్యంమీద వేయాలె. అప్పుడే అది నవ్వు పుట్టించే శక్తిగల అతిశయోక్తి అవుతుంది.

ఏది హాస్యంకాదు :

భయంకరమైన దృశ్యములు, జుగుప్సాకరమైనవి, దుఃఖహేతువులైనవి, అయినవృత్తాంతములూ ఆ సందర్భముగా వచ్చిన వర్ణనలూ, హాస్యవంతములుకావు. తాటకి ముక్కూ చెవులూ కోయడము బీభత్స రసాన్ని పుట్టిస్తుంది కాని హాస్యజనకం ఎట్లాఅయిందో నాకు అర్థం కాలేదు. అది నవ్వుపుట్టించే విషయంగా భావించేవాడు పసిపిల్లవాడు అయినా అయివుండవలె, పిచ్చివాడైనా అయివుండవలె. అల్లాగే లంకా దహనదృశ్యం భయంకరమైనది. రసము, బీభత్సమూ, భయానకమూనూ. రాక్షసుల గృహాలే అయినా తగులబడిపోతుంటే నవ్వురాదు. మన దేవుడు రాముడు. ఆయనకురాక్షసులు విరోధులు. విరోధుల ఇండ్లు తగల బడుతున్నాయని కొంతతృప్తి ఉంటే ఉండవచ్చును మనస్సులో. కాని విరగబడి నవ్వడం ఎల్లాసంభవం!

ఒకటేమాట నేనంటాను. ఒకవిషయము అసహజంగానూ, విప రీతంగానూ, ఉన్నప్పుడే అక్కడ వికృతి ఉంటుంది. సందర్భశుద్ధి లేనప్పుడూ, స్వవచన విఘాతము ఉన్నప్పుడూ ఆ ప్రసంగం వికృత మైనది అవుతుంది. సత్యాన్ని అసత్యంగానూ, అసత్యాన్ని సత్యంగానూ అసుందరతను సుందరతగానూ, సుందరతను అసుందరతగానూ, దుఃఖాన్ని సుఖంగానూ, సుఖాన్ని దుఃఖంగానూ, ప్రదర్శించినప్పుడే వికృతి ఆవిర్భవిస్తుంది. వికృతివల్లనే హాస్యముజనిస్తుంది. వికృతి లేకపోతే హాస్యములేదు.

ఈ దృష్టితో చూస్తే కవులు సాధించే చమత్కారానికిన్నీ హాస్య శీలుడు సాధించే చమత్కారానికిన్నీ బోలెడంత భేదమున్నది. రెండవది వికృతికిసంబంధించినది. మొదటిది కవిత్వానికి సంబంధించినది. ఈ రెండూ ఆనందాన్ని కలుగజేస్తవి. ఆనందం మందహాసంద్వారా ప్రక టితమౌతుంది. కాని ఆ నవ్వువేరు. ఈనవ్వువేరు.

విజయవిలాసంలో "పరువంపు మొల్లమొగ్గల దొరగా బల్లుదురు బల్కుదురు జవ్వనికిన్." అన్న పద్యములోనూ, ప్రభావతీప్రద్యుమ్న ములో ఇంద్రుడు కృష్ణునితో తన కష్టాలనుగురించి చెప్పుకొంటూ:

"పంకరుహనాభ! యేబడ్డ పాటులరయ
నెందు నెవ్వరు బడరు, నీకేమి చెప్ప!
'నెంతపాపంబుచేసిన జంతువొక్కొ
యింద్రుడగు'నని యపు డాత్మ నెన్నుకొంటి."

అని తన్నుతా తిట్టుకోవడంలోనూ, తెనుగుతనంలోని జీవం, చేవ, లాలిత్యం భాసిస్తున్నవి. ఇది కవితాగుణం, హాస్యంగాదు. కొంతమంది ఇదంతా హాస్యమని వ్రాసినారు, అందుకని ఇది హాస్యంకాదని చెప్ప వలసివచ్చింది. యమకము అనుప్రాస మొదలైన శబ్దాలంకార యుక్త

మైన రచనలోకూడా, మనలను సంతోషపెట్టేది కవితాగుణంగాని హాస్యంకాదు. "పౌన్నాడ కామరాజని ఉన్నాడొక చిన్నవాడు యోగ్యుడు గాదే" 'నలువదియేండ్ల వయస్సని పలుకుదురేగాని మూడుపదులకు దాటంగల యీడున్నట్టు తోచదు'. 'అతడొక ముండనుంచుకొన్నట్లు నాకు, లేనిసంశయమొకటి కల్పించినారు. ముండయు ముసుగులేదుత్త ముండని పలుకుబడిమీద తెలిసె నాకు." అనేపద్యంలో పదలాలిత్యం ఉందిగాని వికృతిప్రదర్శనం నాకేం కనపడడంలేదు.

ఇల్లాగే పూర్వగ్రంథాలలో ఉన్న ఏదో కవిత్వానికి సంబంధించిన మెరుగులను తళుకులను చమత్కారాలనూ చూచి నవ్వతగిన హాస్యంగా భావించడం న్యాయంగాదు. పూర్వకావ్యాల్లో హాస్యం అంతగాలేదు. నేననడం ఎందుకూ, చిలుకూరు నారాయణరావుగారే అన్నారు ఈ మాటలు. "హాస్యరసము భారతీయవాఙ్మయంలో మృగ్యము. వికారమైన అంగవ్యాపారముల వర్ణనలలోనూ, తిండిపోతుతనమును వర్ణించడం లోనూ, శీఘ్రముగా వెగటుపుట్టించే హాస్యము అక్కడక్కడ కనపడు తుంది కాని, చల్లనిది, చిరునవ్వు పుట్టించి మనస్సును ఆనందపరుచునది అయిన హాస్యము సంస్కృతములోవలెనే తెలుగులోకూడా చాలా తక్కువ అని చెప్పవచ్చు. ఒక సూరన గ్రంథములోమాత్రం అది కొంం చెముగా కనబడుతుంది. చేమకూర వేంకటకవి విజయవిలాసంలో కొంత గోచరిస్తుంది. ఆంధ్రములో పూర్వకావ్యములలో హాస్యరసము లేనే లేదనుట అతిశయోక్తికాదు. పాల్కురికి పండితారాధ్య చరిత్రలో హాస్యము మరికొంత గోచరిస్తుంది.

పదలాలిత్యమూ, సౌకుమార్యమూ మొదలైనవి కావ్యగుణాలనీ, వానిని హాస్యవృత్తాంతములు అనడము ఉచితంకాదనీ అంటున్నాను. ఏది నిజమైన హాస్యము, ఏదికాదూ అనేచర్చలో ఇంకొక ముఖ్యవిషయం ఉంది. ఏవిషయాన్ని గురించిఅయినా ఉన్నదిఉన్నట్లుగా వర్ణించడము

కవితానుగుణముక్రింపకూ రాదు, హాస్యముగానూ పరిగణింపబడదు. ఉన్నదిఉన్నట్లుగా చెప్పడంలో చమత్కారం ఏమీలేదు. కాబట్టి అది కవిత్వమూకాదు. వికృతి ఏమీలేదు, కాబట్టి అదిహాస్యమూకాదు. 'ఆవు నాలుగుకాళ్లమీద నిలబడును.' అనడము ఉన్నది ఉన్నట్లు చెప్పడము. 'ఆవు శరీరమునకు నాలుగుకాళ్ళు వ్రేలాడుచున్నవి'. అనడము హాస్యం క్రిందికివస్తుంది. అందులో వికృతివుంది. 'ఆమె జడ నల్లగా పొడుగ్గా ఉందంటే అది ఉన్నదిఉన్నట్లు చెప్పడమే! 'ఆమెజడ నల్లత్రాచువలె ఆమె భుజస్కంధములనుండి వ్రేలాడుచున్నది' అంటే అదికవిత్వం. 'ఆమెజడ గరిటెకాడవలె నున్నది' అంటే అది హాస్యము అయింది.

## నవ్వెందుకు వస్తుంది ?

ఈ ప్రశ్నకు జవాబు ఏమీ కష్టంకాదు. నవ్విస్తే నవ్వు వస్తుంది. ఆ నవ్వించేది వికృతమైన వేషము గాని చేష్టలు గాని, మాటలు గాని, కావచ్చునని ఇదివరకే చెప్పాను. అయితే ఈ వంకర మాటలలో ఉండే ఏ గుణము, ఏ ఉద్దేశంలో అన్న మాటలు, నవ్వుకు కారణం అవుతున్నవీ అనే విషయము తీసుకొందాము. 'బర్గ్సన్' వంటి విమర్శకులు శారీరంగా ఏమి మార్పులు వచ్చి నవ్వు తెప్పిస్తున్నవి అనే విషయం కూడా తీసుకొని చర్చించారు. అంటే ఫిజియాలజీ శాస్త్ర పరిజ్ఞానం దృష్ట్యా ఆ విషయాన్ని పరామర్శించారు. ఆ దృష్టితో ఈ విషయాన్ని చూడనక్కరలేదని నాకు తోచింది. జ్వరం ఎందుకు వస్తుందీ? అన్న విషయాన్ని పరిష్కరించడానికి అటువంటి దృష్టి అవసరం కాని దీనిని ఆ దృష్ట్యా పరిష్కరించ నక్కరలేదు.

నవ్వు రావడం ఒక జబ్బుకాదు. దీనికి మందు కనిపెట్ట నక్కరలేదు. అందుకని శారీరకశాస్త్ర పరిజ్ఞానముతో దీనిని పరామర్శ చేయక మనస్సులో ఏఉద్దేశం పెట్టుకొని వంకర మాటలు అంటే నవ్వొస్తుందీ?

అన్న విషయాన్ని మాత్రమే తీసికొన్నాను. నేను ఈ విషయాన్ని పరామర్శించడంలో హాస్యశీలుని మనస్సులోనికి తొంగి చూస్తున్నాను గాని శరీరంలోనికి కాదు.

*ఆత్మౌన్నత్యాస్ఫురణ :* ఈ విషయాన్ని గురించి అనేక శష భిషలు వెలుడడ్డాయి. అనేక తర్జన భర్జనలు జరిగినవి. 'బర్గ్‌సన్' అనే విమర్శకుడు అహంభావము ఆత్మౌన్నత్యస్ఫురణా, హాస్యానికి మూలము అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఏదైనా ఒక సంభవాన్ని చూచి, నవ్వితే ఆ సంభవము తెలివితక్కువతనము వలన జరిగింది అని అనుకొన్నప్పుడే నవ్వుతాము. ఒకడు కాలు జారి పడతాడు. వాడు తెలివి తక్కువ వలననే పడ్డాడనే భావం నీలో గుప్తంగా ఉన్నప్పుడే నీకు నవ్వు వస్తుంది.

దుర్యోధనుడు మయసభను చూస్తూ నీళ్లు లేని చోట నీరు ఉన్నదనుకొని, గుడ్డలు పైకెత్తి నడిచాడు. నీరు ఉన్న ప్రదేశంలో లేదనుకొని మామూలుగా నడిచి గుడ్డలు తడుపుకొన్నాడు. ద్రౌపది నవ్వింది. ఆ నవ్వు మరుగున హృదయాంతరాళంలో ఉన్న భావాన్ని గుర్తించి మాటలలోకి మారుస్తే, "ఓయ్ తెలివి తక్కువ దద్దమ్మా నీరున్న ప్రదేశమేదో లేని ప్రదేశమేదో తెలిసికోలేకపోయినావు." అని అనడము అవుతుంది. 'నేనైతే అట్లా ప్రవర్తించను' అన్న భావము కూడా ఉన్నది ఆ నవ్వులో. మొత్తంమీద ఆ నవ్వులపాలైన వ్యక్తి యందు నిరసన భావం ఆ నవ్వులో అభివ్యాప్తమై ఉన్నది.

"All laughter is really founded on a feeling of superiority on the part of the ammused person over the victim of the incident which arouses laughter."

అని ఒక రచయిత అన్నాడు. ఆ విమర్శకుడు, వెక్కిరింతలో, వేళాకోళంలో, అధిక్షేపంలో, అవలగితంలో, అన్ని రకాల హాస్య

ప్రక్రియలలోనూ ఈ స్వాతిశయ భావము ముసుగు వేసికొని ముసి ముసి నవ్వులు నవ్వుతునే ఉంటుంది అని అంటాడు. ఇదే 'బర్గ్‌సన్' ప్రతిపాదించిన Derision Theory.

*అనూహ్యామైన మలుపు :* రెండోది "The theory of pleasant Disappointment." అంటే ఒక పని నీవు ఊహించినట్లు గాక ఇంకోవిధంగా జరగడమూ, ఒక వాక్యానికి నీవు అనుకొన్న అర్థం కాక క్రొత్త అర్థం స్ఫురించడమూనూ. అంటే కథనంలో అనూహ్యామైన మలుపు హాస్యానికి మూలమని ఈ సిద్ధాంతము చెపుతుంది. 'రోడ్డువెంట నడుస్తున్నవాడు హఠాత్తుగా జారిపడతాడ'ని మనము ఊహించము. ఆ పని జరిగితే నవ్వుతాము. "శివుడద్రిని శయనించుట, రవి చంద్రులు మింటనుంట, రాజీవాక్షుండవిరళముగ శేషునిపై బవళించుట నల్లి బాధ పడలేక సుమా!" అనే పద్యం ఒకటుంది. ఆ పద్యంలో చెప్పిన సంఘటనలన్నింటికీ కారణము నల్లి బాధ అని మనము అనుకోము. మనము అనుకోని విషయము చెప్పగానే నవ్వొస్తుంది. ఒక విషయము, ఒక క్రమాన్ని, సహజత్వాన్ని అనుసరించి ఉండక హఠాత్తుగా మనము ఊహించని విధంగా పరిణామం చెందినపుడు (దానినే Pleasant disappointment అన్నాడు విమర్శకుడు) నవ్వువస్తుంది.

ఉక్తి విశేషాలలో (Jokes) కథకు మనము ముందుగా ఊహించనట్టి మలుపు రావడం వల్లనే హాసము జనిస్తున్నది. అదే హాస్యము. ఈ ఉదాహరణ చూడండి. "మండుటెండలవలన బాధపడే నెలల్లో మే నెల ఒకటి. మిగిలినవి, జూలై, జాన్యువరీ, సెప్టెంబరు, ఆగస్టు, ఏప్రియల్, నవంబర్, జూన్, మార్చి, డిశంబరు, అక్టోబరు, ఫిబ్రవరీలు" అన్నాడు ఒక హాస్యశీలుడు. ఎండల వలన అసౌఖ్యం పొందే నెలలలో మే ఒకటి అన్నప్పుడు మిగిలినవి ఏ ఒక్కటో రెండో

చెపుతాడు అనుకొంటాము గాని ఉన్నవి అన్నీ చెబుతాడు అనుకోము. ఆ వాక్యము మనము అనుకోని విధముగా పర్యవసించింది. మే నెల ఒకటీ అన్ని మిగతావి ఏవీ అనే ఉత్సుకతను ప్రేరేపించి, ఇంకా ఒకటో రెండో ఉంటవి అనే భావాన్ని కల్పించి తెలుసుకోవలెననే తీవ్రతను కలిగించి, సంధిగ్ధావస్థను ఏర్పరిచి మెల్లగా ఒక్కొక్క నెలనే పేర్కొని చివరకు అన్ని నెలలూ చెప్పేసరికి కథకుడు అల్లిన వ్యూహము తెలిసి ఫక్కున నవ్వేస్తాము. హాస్యానికి కారణం Disappointment అంటే ఇదీ అర్థము. మనలను మభ్యపెట్టి ఒకటి అనుకొనేటట్లు చేసి ఇంకొకటి భాసింపచేస్తే మనకు కలిగే భావాన్నే Disappointment అన్నాడు విమర్శకుడు.

ఇటువంటిదే ఇంకొకటి. ఒకడు తన స్నేహితుణ్ణి ఒక చిక్కు ప్రశ్నవేశాడు. ఏమిటీ అంటే; "ఒక వ్యక్తి నా మనస్సులో మెదులుతున్నాడు. అతను నాకు బాగా తెలిసినవాడు. రోజూ చూస్తున్నాను. నావాడే. అతనికీ నాకూ తల్లిఒకతే, తండ్రి ఒకడే. కాని ఆ వ్యక్తినాకు సోదరుడూగాడు. సోదరీకాదు. నామనస్సులో మెదలుతున్నవ్యక్తి ఎవరు చెప్పుకో" అన్నాడు. తల్లీతండ్రీ ఆ వ్యక్తికీ ఇతనికీ ఒకరే అయినప్పుడు, అతడు మగవాడైతే సోదరుడో, ఆడదైతే సోదరియో అయితీరాలె! కాకుండా ఎట్లా ఉంటారు? ఏమీతోచక ఆ స్నేహితుడు 'నువ్వే చెప్పమని' పృచ్ఛకుణ్ణే అడిగాడు. అతడు నవ్వుతూ 'నేను నన్నుగురించే ఆలోచిస్తున్నాను. ఆవ్యక్తిని నేనే' అన్నాడు. ఇందులో కూడా. మనలను ఒక దారిని పట్టించి ఒక తికమకలో ఇరికించి, ఎవరో ఆ వ్యక్తి అనే జిజ్ఞాసను రేకెత్తించి మన ఊహకు స్ఫురించని ఒక పరిష్కారాన్ని ప్రదర్శించినపుడు మనకు విస్మయము కలుగుతుంది. మనస్సులో ఆశ్చర్యమును పొంది విభ్రాంతులము అవుతాము. అదే ఆనందానికి కారణము. ఆనందమును కలిగించేదే హాస్యము. హాస్యము యొక్క బాహిర రూపమే హాసము.

ఇంకా కొన్ని ఉదాహరణలు: మనకు వచ్చే ఆపదలు రెండు రకాలు. ఒకటి, మనకు కలిసిరాకపోవడమూ, రెండు, ఇతరులకు కలిసిరావడము. గర్భిణీ స్త్రీ అనివార్యంగా నిర్నిరీక్షితంగా వచ్చే ఇద్దరుఅతిథులను ఆద రించక తప్పదు. ఎవరు? కవలపిల్లలు......ఈ రెండు కథలూ, పై సిద్ధాంతమును బలపరిచేవే.

*ఇతరుల అజ్ఞానము:* "We laugh at others' ignorance" అనే సిద్ధాంతం ఒకటుంది. ఇతరుల అజ్ఞానాన్నిచూచి మనము నవ్వు తాము. ఒకసైనిక పాఠశాలలో జరిగిన విషయము. ఉపాధ్యాయుడు అమెరికా స్వాతంత్ర్య యుద్ధాన్నిగూర్చి చెపుతూ స్వాతంత్ర్య ప్రకటనపై "(Declaration of Independence)" సంతకం ఎవరూ చేసింది? అని ఒక బాలుణ్ణి అడిగాడు. జవాబురాలేదు. "ఆ స్వాతంత్ర్య ప్రకటన పత్రము మిక్కిలి పవిత్రమైనది. దానిపై సంతకం చేసిందెవరు?" అని ఉపాధ్యాయుడు మళ్లీ రెట్టించి అడిగాడు ఆ కుర్రవాణ్ణి. వాడు నోరు విప్పలేదు. ఉపాధ్యాయునికి కోపంవచ్చి ప్రథానోపాధ్యాయునికి ఈ విషయం చెప్పాడు. ఆయన కొంచెంసేపు ఆలోచించి "వాడు పెంకెగా ప్రవర్తిస్తున్నమాట నిజమే. ఏదోఒకటి చెప్పాలెగాని నోరుమూసుకొని కూర్చోడము ఏమిటి? అయినా మనం తొందరపడకూడదు. ఆ బాలుని తండ్రిని పిలిపించి అతనితో సంప్రదిస్తాను." అన్నాడు. ఆ బాలుని తండ్రివచ్చాడు. ఆయనకూడా కుమారుని ఆప్రశ్నే అందరిముందు అడిగాడు. ఎప్పటిలాగే వాడు మౌనము వహించాడు. అప్పుడు తండ్రి కుమారునితో "నాయనా ఇదిసైనికుల పిల్లల పాఠశాల. మాట్లాడక పోవడం అవిధేయత క్రిందికి వస్తుంది. ఆ పత్రముపై నీవు సంతకము చేసి ఉంటే ఆ సంగతి ఒప్పుకొని క్షమాపణవేడుకో" అని హితబోధ చేశాడు. ఈ కథలో కుర్రవాడే కాక తండ్రికూడా అజ్ఞానే. ఈ అజ్ఞానం మనము నవ్వడానికి కారణం అవుతుంది.

ఇతరుల అజ్ఞానాన్నిచూచి నవ్వడంలో ఆ అజ్ఞానం ఎంతఎక్కువ అయితే ఆ వృత్తాంతము అంత వైపరీత్యం కలది అవుతుంది. వైపరీత్యం ఎక్కువైన కొద్దీ అసహజత్వము ఎక్కువ అవుతుంది. ఎక్కువ అసహజత్వముగల వృత్తాంతము ఎక్కువగా నవ్విస్తుంది. నేనొకసారి ఒక పల్లెటూరువెడితే అక్కడ ఒకవృద్ధుడు, అమాయకుడు నన్నుపిలచి "ఏమండీ! మనకు స్వరాజ్యం వచ్చిందనీ, ఇంగ్లీషువారు మూటాముల్లే కట్టుకొని వెళ్లిపోయినారనీ అంటారు, నిజమేనంటారా?" అనిఅడిగాడు. నేను నవ్వు ఆపుకొని "బాబూ అటువంటి వదంతి ఒకటి నాచెవునా పడ్డది. నిజమో అబద్ధమో భగవంతుడికి తెలియాలి. అయినా మన కెందుకులెండి. నాతో అంటేఅన్నారు ఇంకెవ్వరితోనూ అనబోకండి" అన్నాను. ఆయన "ఆమాటా నిజమే" అని గొణుక్కుంటూ వెళ్లిపోయినాడు. ప్రపంచానికంతా తెలిసిన బ్రహ్మాండమైన సత్యము అతనికి తెలియకపోతే నవ్వురాకుండా ఉంటుందా? అయితే ఒకటి, మనము నవ్వటానికి ఒకటి అవసరము. మనకు (Mood) నవ్వే మనఃస్థితి ఉండాలె. నవ్వటానికి సంసిద్ధులము కాకపోతే ఆ మాటలు విసుగును కలిగిస్తవి. లేకపోతే అల్లా అన్నవ్యక్తియందు అసహ్యం కలుగుతుంది. మనము క్రీడాసక్తులమైపరిహాసానురక్తులమై ఉంటే ఆ వ్యక్తియందు జాలికలుగుతుంది. ఆ అమాయకునియందు సానుభూతి కలుగుతుంది. "Sublimely idiotic talk is real humour. We laugh, but that is a laughter of affection." అన్నారు ఒకరు.

ఇతరుల అజ్ఞానాన్ని చూచి నవ్వడంలో ఎవ్వరినిజూచి నవ్వుతామో వారియందు మనకు సానుభూతికలగాలె. ప్రేమకూడాకలగాలె. ఇంకొక కథ. ఆడవాళ్ల క్లబ్బులో జరిగింది. ఆక్లబ్బు సెక్రటరీగా ఉన్న ఆమెకు ఇంగ్లీషురాదు. గుమాస్తా వచ్చి "అమ్మా ఈసంవత్సరపుఆదాయ వ్యయపట్టిక తయారుచేశాను, మనకు డిఫిసిట్ వచ్చింది అన్నాడు.

'ఏమాత్రం?' అనిఅడిగింది ఆమె. 'రెండువేలరూపాయలు' అని 'మరి ఏంజేద్దామమ్మా' అన్నాడు. ఆమె కొంచెం ఆలోచించి, చాలారోజుల నుంచి రెడ్‌క్రాసువాళ్లు అడుగుతున్నారు మనలను ఏమైనా సాయంచేయ మని. వాళ్లకు ఈ డిఫిసిట్ మనీఅంతా ఇచ్చేద్దాము' అన్నది, అసిస్టెంటు సెక్రటరీ "అంతా ఒకళ్లకే ఇస్తే ఎట్లాగ! సగం రెడ్‌క్రాస్‌వాళ్లకు సగం స్థానిక వైద్యశాలకు ఇద్దాము" అన్నది. అంతా దీనికి అంగీకరించారు. ఆ సెక్రటరీ అజ్ఞానానికి అమాయకత్వానికి మనం నవ్వుతాము. ఈకథలో అజ్ఞానాన్ని ప్రదర్శించిన వ్యక్తియందు మనకు సానుభూతి కలుగుతుంది. ఆవ్యక్తియందు ప్రేమకలుగుతుంది. అది ఆకథలో పాత్రల సంగతి. మరి ఈ కథ కల్పించినవాడి సంగతి ఏమిటి? అతడు ప్రతిభా వంతుడు. ఈకథలోని భావము మనోహరంగాఉన్నది. 'There is poetry in it.'

అజ్ఞానాన్ని చూచి నవ్వటానికి నీవు కొంతతెలిసినవాడవై ఉండాలె. ఒకడన్నాడు. "నాకు ఎపెన్-డి-సిటిస్ రెండుసార్లు తీసివేశారు. అని." ఈమాట వింటే ఎపెన్-డి-సిటిస్‌ను గురించి తెలిసినవానికి నవ్వు వస్తుంది. ఎపెన్-డి-సిటిస్ ఒకసారి తీసివేస్తే మళ్ళీపెరగదు ఆసంగతి తెలిస్తే అతనిఅజ్ఞానం హాసజనకం అవుతుంది. అల్లాగే ఇంకొకవాక్యము. ఒకడన్నాడు. "వజ్రాలు అసలులేకపోవడంకంటే, అరిగిపోయినవైనా ఉంటే నయంకాదూ." అని. అసలు వజ్రాలు అరగవు. ఆసంగతి తెలి సినవాడికి ఆమాటలు అన్న వ్యక్తియొక్క అజ్ఞానం హాసహేతువు అవుతుంది.

*ఇతరులను ఏడ్పించాలనే సరదా :* ఇల్లాగ నవ్వుకు కారణం ఏమిటీ అన్న ప్రశ్నకు సమాధానంగా చాలా సిద్ధాంతాలు పుట్టినయి. ఒక హాస్య విమర్శకుడు అంటాడూ; "మనిషి నవ్వడానికి కారణం ఇదేదీకాదు. మనిషికి ఇంకో మనిషిని ఏడిపించడం సరదా" అని.

కృష్ణుడు వెన్న దొంగిలించి ఆ నేరాన్ని ఒక ఇంటికోడలకు అంటగట్టాడు. ఆ కోడలు బాధపడుతుందని తెలిసిన మనము ఏదో కసి తీరినట్లు నవ్వుతాము. జోక్సులో ఎదుటివానినో ఎవరినో దెబ్బతీయడమూ, హాస్యం పట్టించడమూ ఏడిపించడమూ ఉంటుంది. అవతలవాడు మానసికంగా దెబ్బతినడము మనకు తృప్తిని యిస్తుంది.

*ప్రతిభా ప్రదర్శనం :* ఇవన్నీకాదు. అసలు నిజం ఏమిటీ అంటే మనము వికృతిని చూచి నవ్వుతాము. విచిత్రమూ, విపరీతమూ, అసహజమూ, అసంగతమూ అయిన వికృతిని జూచి నవ్వుతాము. ఆ వికృతిని సాధించడానికి ఎంతో వైదుష్యము కావాలె, మేధాసంపత్తి కావాలె. ఆ వికృతి, శబ్దముల కూర్పులో ఉండవచ్చు. ఒక విషయాన్నిగురించి ఏవేవోఊహించడంలో ఉండవచ్చు, లేక అర్థంలో ఉండవచ్చు. వికృతిని సాధించడము ప్రతిభతోకూడిన విషయము. ఆ ప్రతిభ మనలను ఆనంద చకితులనుజేసి నవ్విస్తుంది. కాబట్టి మనలను సంతోషపెట్టేది రచయిత ప్రతిభ అన్నది ఇంకో సిద్ధాంతము.

హాస్యరసము :

హాస్యాన్ని రసము అని ఒప్పుకొన్నా ఆలంకారికులు లక్షించిన అర్థంలో అది రసముకాదు. ఆ రసమువేరు, ఈ రసమువేరు. లాక్షిణికులు నిర్వచించిన ప్రకారం విభావానుభావ వ్యభిచారీ భావములచే వ్యక్తము చేయబడిన స్థాయీభావమునకే రసత్వము. ఆ రసము ఉద్భవించాలంటె నాటక రంగమూ, రంగముపైన నటుడూ కావాలె. నాయికానాయకులు ఉండాలె. వారి ఉనికి ఆలంబన, విభావము అవుతుంది. వారి చేష్టలు ఉద్దీపన విభావాలు అవుతవి. ఈ విభావాల వలననే రసత్వము సిద్ధిస్తుంది. అదీగాక నాయకునితో సామాజికుడు అభేదమును పొందాలె. మనము ఏదో ఒక హాస్యోక్తి గాని, ప్రసంగముగాని, కథగాని చదువుతున్నప్పుడు ఈ పని అంతా జరుగుతున్నదా? ఆలంబన ఎవరు?

ఉద్దీపనవిభావములేవి? పాఠకుని అంతర దృష్టికి ఒక నాయకుడు కనబడ తాడు అంటారు. నాకు ఎప్పుడూ కనబడలేదు. నేను నవ్వుతూ ఉన్న నాయకునితో తాదాత్మ్యమును పొందలేదు. హాస్య రచనలు చదవడము వల్ల కలిగే భావానికి రసంగా పరిణతి అయ్యే పుష్టిలేదు. ఆలంబన విభావమూ ఉద్దీపనవిభావమూ ఇవన్నీ లేకుండానే ఆనందం కలుగు తున్నది పాఠకునికి. ఇల్లాగ కలిగేది కేవలము భావానందమే కాని రసా నందము కాదు. అంటే విభావానుభావ వ్యభిచారీ భావములచే పరిపుష్టిని పొందిన స్థాయిభావమువలన జనించే రసానందం కాదు ఇది. ఈ ఆనం దానికి రసపుష్టి లేదూ అని నా ఉద్దేశము. కానీ దీనిని నేను అంగీక రించమని మిమ్మలను కోరడంలేదు. ఇందులో ఏమన్నా పాయింటు ఉందేమో చూడండి అంటున్నాను. హాస్యరచన వలన కలిగే ఆనందం రసానందంగా పరిపుష్టిని పొందలేదు. అది భావానందం అని కొందరు అంటారు. అయితే ఇది ఎవ్వరూ ఒప్పుకోరు. ఒప్పుకోనివారి వాదన ఇది. మనము నవ్వటానికి కారణంగా మన ఎదుట ఒక విషయము ఉంటుందిగా. అదే ఆలంబన విభావము. ఆ కథలో సందర్భోచితంగా ఉన్న వర్ణన ఉద్దీపన విభావము. ఈకథ చూడండి.

చర్చిలో లౌడ్‌స్పీకర్ (Loud speaker) ఏర్పాటు చేశారు. మతాధికారి ఆ విషయాన్ని వెల్లడిచేస్తూ ఇల్లా అన్నాడు. "మన చర్చిలో క్రొత్తగా Public address system పెట్టాము. మైక్రోఫోను వైరింగు మొదలగు పరికరాలకు కావలసిన సొమ్ము చర్చి ఫండ్సులో నుంచి తీశాము. Loud speaker మాత్రం ఒక మెంబరు తన భార్య జ్ఞాపకార్థము కొని యిచ్చాడు." ఈ కథలోని వస్తువు ఆలంబన విభా వము. మైక్రఫోను వైరింగు మొదలగు విషయముల ప్రశంస ఉద్దీపన విభావము. 'Loud speaker ఆ మెంబరు కొని ఇచ్చాడు.' ఆయన భార్య పెద్దగా అరుస్తూ ఉండే స్వభావము గలది అన్నమాటలలో ఉన్న

ధ్వనిలో ఈ విభావాలన్నీ పర్యవసించి ఆనందానుభూతి కలుగుతుంది. అదేస్థాయీభావము. అప్పుడు విరగబడి నవ్వడము అనే అనుభావము చేత ఆనందము పుష్టిగలదై భాసిస్తుంది. ఈ విధంగా విభావ అనుభావ ములచే పరిపుష్టినిపొంది, రససిద్ధినిపొంది హాసము అనే స్థాయిభావము ఏర్పడుతుంది. ఇట్లా అంటారు లాక్షణికులు. అయితే పైనచెప్పిన విష యాన్నిగురించి ఆలోచించండి.

నవ్వు ఆరు రకాలు :

నవ్వటాన్ని గురించి లక్షణ గ్రంథకర్త వ్రాస్తూ, ఉత్తములు, దంతములు వెలికి కానరాకుండ మృదువుగా నవ్వుతారనీ, స్మితమూ, హసితము, అను ఈ రెండురకాల నవ్వేవిధమే ఉత్తముల లక్షణమూ అనీ అన్నాడు. పెద్దగా నవ్వడము (అపహసితము, అతిహసితము) అంటే శిరస్సును భుజమును కదులుస్తూ నవ్వడము. అపహసితమనీ, కన్నులనుండి బాష్పపూరమును ప్రవహింపజేస్తూ నవ్విననవ్వు అతిహసిత మనీ ఈ రెండూ నీచత్వమును సూచిస్తవనీ అన్నాడు...ఎప్పటికీకాదు. పెద్దగా భుజాలు ఎగరేస్తూ, ఆనందబాష్పాలు రాలుస్తూ, హో హో అని నవ్వేవాడు కల్మషంలేనివాడు. నిర్మలమనస్కుడు, అమాయకుడు, రస మయమైన చిత్తవృత్తి గలవాడు. ఎంతపెద్దగా నవ్వితే అంతఎక్కువగా ఆనందాన్ని పొందుతున్నాడన్నమాట. నవ్వును అణచిపెట్టుకొని పెద వులు బిగించి కొద్దిగా నవ్వేవాడు 'దొంగ'. వాడికి నవ్వటానికి ధైర్యం లేదు. ఇతరులు ఏమనుకొంటారో అని భయం. మాయకుడు, కుటిలుడు. కడుపార నవ్వగలవాడే రసజ్ఞుడు. నవ్వక దానిని మరుగుపరచేవాడు అరసికుడు అయినా అయిఉండవలె లేకపోతే మోసగాడు అయినా అయి ఉండవలె సంతోషాన్ని వెల్లడించడమే సహజము. దానిని దాచిపెట్టడము అసహజము చంద్రదర్శనం కావడంతోనే గంభీర స్వభావంగల సము ద్రుడుకూడా తన సంతోషాన్ని బాహాటంగా వెలువరిస్తాడు. ఎగిరిగంతు

లేస్తాడు. తనకు అందికలోలేని పూర్ణచంద్రుణ్ణి ఉత్తుంగ తరంగ హస్తాలతో కౌగిలించుకోబోతాడు. అట్టహాసంచేస్తాడు. అల్పమైన తటాకం చిరునవ్వు నవ్వుతుంది అంతే. చిరునవ్వు నవ్వడం కొలదిగా నవ్వడం ఉత్తమ లక్షణమైతే అసలునవ్వకపోవడం అత్యుత్తమ లక్షణంకావాలె. మురుగుకాలవ ఎట్టివికాసమునూ చూపలేదు. అదేగొప్పా! కాదు. కొలదిగానవ్వడమూ, అసలు నవ్వకపోవడమూ, మూర్ఖుని లక్షణం. జడుని లక్షణం, రోగపీడితుని లక్షణం, కుటిలహృదయుని లక్షణం. పెద్దగా నవ్వడం సహృదయుని లక్షణం, అమృతహృదయుని లక్షణం. పాఠక మహాశయులు ఈ విషయాన్నైనా ఒప్పుకొంటారా? ఒప్పుకోరు అని నాకుతెలుసు. ఆ వాదనలో మనలను ఒప్పించేటంతటి బలములేదు. అల్లాగ పెద్దగానవ్వడం సభ్యతకాదనీ, మనిషికి కలిగిన ప్రతివికారమును బహిర్గతం చేయకూడదని మనవాళ్లు అంటారు. అయినా ఒక ఆంగ్ల రచయిత అన్నమాటలు చెప్పాను అంతే. ఎందుకు అల్లాగ అన్నాడని మిమ్మలను అడుగుతున్నాను.

హాస్యము-ఆనందము :

సృష్టిలో నవ్వగల ప్రాణి ఒక మనుష్యుడే. ఏ ఇతర ప్రాణీ నవ్వలేదు. కోతులు ఇకిలిస్తవి. ఆ ఇకిలింపు ఆనంద జన్యముకాదు. మనోవికాసము వలన కలిగిందికాదు. కోతులు కోపం వచ్చినప్పుడు ఇకిలిస్తవేమో! ఆనందాన్ని బాహిరరూపంలో ప్రదర్శించగల శక్తి ఒక్క మానవునికేఉంది. కోకిల ఆనందతో పాడుతుంది. అది తన ఆనందాన్ని వ్యక్తంచేయడంలేదా అనవచ్చు. మావి చిగురులను కడుపునిండాతిని సంతోషంతో అల్లాగ కూస్తుందో, కడుపునొప్పివలన బాధపడుతూ అల్లాగ రెట్టించి అరుస్తుందో మనము చెప్పలేము కుక్కమటుకు సంతోషాన్ని, కోపాన్ని ప్రకటించగలదు. సంతోషం కలిగితే, తోకఆడిస్తుంది. కోపంవస్తే కోరలు చూపుతుంది. కాని ఒక్కమాటమాత్రం

నిజం. చాలా జంతువులు కోపాన్నీ, దుఃఖాన్నీ ప్రదర్శించగలవుగాని సంతోషాన్ని ప్రకటించలేవు.

*దేవతలు :* ఆనందం అనేది అనుభూతులలో పైస్థాయిలోనిది. జీవపరిణామంలో పైకిపోయినకొద్దీ ఆనందానుభూతి ఎక్కువ అవుతుంది. మనకు కొంతఆనందంఉంది. జంతువులకు, ఆనందమేలేదు. ఉన్నా అవి ప్రదర్శించలేవు. ఈ ఆనందం బ్రహ్మానంద సహోదర మైనది. ఇట్టి ఆనందాన్ని ప్రదర్శించేశక్తి ఒక్కమానవుడికే ఉన్నది. దేవతలు, ఈ ఆనందానుభూతిని ఎక్కువ మోతాదులో పొందుతారు. ఇంకా పైకిపోతే ఈశ్వరుడు ఆనందస్వరూపుడు. అందుకనే మనము దేవతలను మందస్మిత వదనారవిందులనుగా చిత్రించుకొన్నాము.

*ఈశ్వరుడు ఆనందస్వరూపుడు:* ఆనందముయొక్క పరాకాష్ఠ రూపము ఈశ్వరుడు. ఈశ్వరత్వము ఆనందమయము. కాబట్టి ఆనం దముపొందడమూ, అనుభవించడమూ, దేవతాలక్షణము. నవ్వు దైవత్వ చిహ్నము. జీవితంలో నవ్వగలగడము దైవత్వాన్ని సాధించడము. ఈ అనుభూతిని ఎంతఎక్కువ చేసుకుంటే అంతగా మనము దైవత్వాన్ని సాధించామన్నమాట. ఎప్పుడైతే ఇతరభావాలను పారద్రోలి ఆనందాన్ని పొందగలిగామో అప్పుడే మనము దైవత్వాన్ని సాధించామన్నమాట ఒక్క నిమేషమాత్రము మనము ఆనందాన్నిపొంది నవ్వగలిగినా ఆ ఒక్కనిమిషమూ మనము, దైవత్వలేశాన్ని పొందగలిగినామని చెప్ప వచ్చు.

*నవ్వు పవిత్రమైనది:* ఒక గొప్ప విశేషాన్ని గమనించవలె. ఒక్క హాస్యపు పలుకునూ ఒక చమత్కారవాక్కునూ విని ఆనందం పొందిన క్షణములో మనస్సు ఎల్లాగుందో పరిశీలించుకుంటే ఒకఅద్భుత విషయం తెలుస్తుంది. ఆ క్షణములో మన మనస్సు నిర్మలమై క్షుద్రభావ

శూన్యమై భాసిస్తుంది. ఆత్మపరీక్ష చేసుకొంటే అంతర్ముఖులమై చూసుకొంటే ఆ క్షణము ఎంత పవిత్రమైనదో తెలుస్తుంది.

*దొంగనవ్వు:* కోపంతో ఉన్నప్పుడు నవ్వలేము. ఒకవేళ నవ్వినా ఆ నవ్వుయొక్క స్వభావంవేరు. ద్వేషం ఒకచెంప హృదయాన్ని దహించివేస్తుంటేనూ, ఈర్ష్యాదులు హృదయాన్ని కొరుక్కుతింటూ ఉంటేనూ నవ్వలేము. అంటే ఆనందంతో నవ్వలేము. ఒకవేళ నవ్వినా, అది వెకిలినవ్వూ, దొంగనవ్వూను. అది మనః ప్రసన్నతతో హృదయ నైర్మల్యాన్ని బ్రహ్మానంద సహోదరమైన ఆనందానుభూతిని వ్యక్తం చేసేదికాదు. ఏడ్వలేక నవ్వవచ్చు. క్రౌర్యాన్ని కప్పిపుచ్చడానికి నవ్వవచ్చు. కాని ఆనవ్వు నవ్వుకాదు. అటువంటి నవ్వు విషయమై కాదు మనము ఆలోచిస్తున్నది.

*నవ్వు శుభప్రదమైనది:* నిజమైన ఆనందానికి ప్రతిబింబంగా కనపడేనవ్వు దైవత్వాన్ని చూపుతుంది. ఆ క్షణంలో మనకు పరమశివుని సాన్నిధ్యం లభిస్తుంది. నవ్వుయొక్క మాహాత్మ్యం అటువంటిది. అట్టి పరమ భాగవతమైన నవ్వు శివప్రదమైనదీ, సుందరమైనదీ, క్షుద్రత్వాన్ని, అల్పత్వాన్ని, రాగద్వేషాదులను సమిలి మ్రింగివేయడానికి సమర్థమైనదీ అయిన చిరునవ్వు విషయమయ్యే నేనుమాట్లాడుతున్నాను. అట్టి పవిత్రమైన చిరునవ్వును జనింపజేయగల రచనయే ఉత్తమ హాస్యరచన. మనలను తేలిక పరచగల గుణమూ, మనలను భువినుండి దివికి లేవనెత్తగలశక్తీ, క్షణమాత్రమైనను మనకు దైవత్వం ఆపాదింపగల మహత్తూ, అట్టి ఉత్తమహాస్యానికే ఉన్నది. ఒక్క హాస్యరచనలోనే నిర్మలమైన ఆనందమూ, శాంతీ ఉన్నవి. అన్నిటికంటే దైవత్వము ఉన్నది. దేవతలు అంతా ఆనందస్వరూపులు.

## ఉత్తమ హాస్యము :

*అంగవైకల్యము హాస్యానికి ఆలంబనకాదు:* హాస్యలక్షణములను తెలిసికొన్నాము. ఇక ఉత్తమహాస్యలక్షణాలను స్థూలంగా పరామర్శ చేద్దాము. మొదటి సంగతి. మనిషికి సహజంగా అంటే జన్మతఃవచ్చిన అంగవైకల్యాన్ని హాస్యసృష్టికి ఆలంబనగా తీసికొనడము న్యాయము కాదు. సంస్కృతమతులూ నాగరికులూ,అటువంటిరచనలనుచూచి మెచ్చు కోరు. అటువంటి రచనలు అధమజాతికి చెందినవి. జాలిపడవలసిన సందర్భంలో నవ్వడము సభ్యతకాదు. అట్లా చేయడము, మానవత్వమే కాదు.

*ఏడ్వలేక నవ్వు:* నవ్వినప్పుడల్లా మనకు హాస్యరసానుభూతి కలిగింది అనుకోవడముకూడా పొరపాటే. మనస్నేహితుడు తనకష్టా లన్నీ మనతో చెప్పుకొంటే మనము నవ్వి ఏవో ఓదార్పుమాటలు అంటాము. అది ఏడ్వలేక నవ్వడము. ఆనవ్వుకు కారణమైనఉదంతము హాస్యముకాదు. నవ్వడము మానవుని సహజప్రకృతులలో ఒకటి. ఒక ప్పుడు అసూయాద్వేషాదులను వ్యక్తంచేయడము ఇష్టములేక నవ్వి ఊరుకొంటాము. ఆ నవ్వు మృదుభావప్రేరితముకాదు. జుగుప్సను కలి గించు రచనలు మనలను నవ్వించినా అవి ఉత్తమహాస్యరచనలు కావు.

*చంద్రరేఖావిలాపము:* చంద్రరేఖావిలాపంలో జుగుప్సాకరమైన వర్ణనలు ఉన్నవి. అసహ్యంతో నవ్వుతాము. ఆనవ్వు ఏహ్యాభావ సముద్భ వమైనది. ఏహ్యాభావ కలుషితము. అటువంటి రచనలు ఆనంద భావ తరంగిత దీప్తిమంతములుకావు. వానిని విజ్ఞులు ఉత్తమహాస్యరచనలుగా పరిగణించరు. బూతులూ, తిట్లూ, వీనిలో కొంత వైపరీత్యము ఉంది. అందుకనినవ్వుతాము కాని ఆనవ్వులో విలక్షణత లేకపోలేదు. ఆమాటలు మనలను కొంత వికారపెట్టి నవ్విస్తవి. అదీగాక బూతులు మాట్లాడ టమూ, తిట్టటమూ, సభ్యవ్యాపారముకాదు. అది అసాధారణ వాగ్విల

ననము కాబట్టి నవ్వుతాము. ఆ నవ్వు నిర్మలమైన ఆనందమువలనా, రసానుభూతికి ఫలితంగానూ, నవ్విన నవ్వుకాదు. అందువలన అటువంటి రచనలు, ఉత్తమ హాస్యరచనలు కావు. ఏ రచన అయితే ఇతరులను కష్టపెడుతుందో, మనఃక్లేశమును కలిగిస్తుందో అట్టి రచన ఉత్తమ హాస్య వాగ్వ్యాపారముకాదు.

*కలిసి నవ్వాలోవాలి:* అవహేళనకు గురియైనవాడూ, అవహేళన చేసినవాడూ కలసి మనసారా నవ్వుకోగలిగినప్పుడే అది ఉత్తమహాస్యం అవుతుంది. వ్యక్తిగతమైన దూషణతోకూడిన రచన ఏకారణంచేతనైనా నవ్వించినా అది ఉత్తమహాస్యంక్రిందికి రాదు. అందుకనే అవహేళనా, అధిక్షేపమూ, మొదలైన హాస్యప్రక్రియలను సాధించేటప్పుడు సంస్థలనూ, అభిప్రాయాలనూ, సంప్రదాయాలనూ, దుష్టమైన ఆచారాలనూ అవహేళనచేస్తే అటువంటి రచన హాస్యాభిరామము అవుతుందిగాని, వ్యక్తిగత ఉపాలంభనము, దూష్యమూ, నిందార్హమూను.

*వ్యక్తిగతము కానిది:* మరొక విషయం ఏమిటీ అంటే హాస్యానికి గురియైన వ్యక్తియందు మనకు సానుభూతి ప్రేమ ఆదరణా కలుగజేసే రచనే ఉత్తమ హాస్యం అని గట్టిగా చెప్పవచ్చు. వెక్కిరింతలూ, వేళాకోళాలూ, హాస్య ప్రక్రియలు. ఒకవ్యక్తిని వెక్కిరించడము గాని, వ్యక్తిగతమైన లోపాలను వేళాకోళము చేయడముకాని, ఉత్తమ హాస్య రచయిత గర్హించ తగిన విషయములు. మానవ స్వభావంలో ఉన్న దుర్గుణాలనూ, దుష్టమైన ఆచారాలనూ, అపహాస్యంచేస్తే ఆ రచన నిస్సంశయముగా ఉత్తమ హాస్య రచనగా భాసిస్తుంది.

*ప్రయోజనములేనిది ఉత్తమహాస్యము:* అన్నిటికంటె ముఖ్యమైన విషయము ఇంకొకటి ఉంది. ఒక ప్రయోజనాన్ని సాధించడానికి హాస్యాన్ని వినియోగించవచ్చు. ఒక దురాచారాన్ని మాన్పాలనే ఉద్దే

శంతో దాన్ని హాస్య ధోరణిలో దుయ్యబట్టవచ్చు. కాని ఆ అవహేళన గుప్తంగా ఉండి ధ్వనినిక్షిప్తమై ఉంటేనే రమ్యంగాఉంటుంది కాని, వాచ్యంగావుంటే సొగసులేదు. అసలు ఏదోఒక ప్రయోజనాన్ని సాధిద్దామనే ఆలోచనే లేక ఆనంద సముపార్జనమే ధ్యేయంగా పెట్టుకొని చేసిన రచన రమణీయమైన అత్యుత్తమ హాస్యరచనగా భాసిస్తుంది.

హాస్యశీలుడు - కవి :

*ఇద్దరికీ ప్రతిభ ఉండాలె :* కవిత్వానికి ఉన్న గౌరవం హాస్య రచనలకు లేకపోవడం శోచనీయము. హాస్యసృష్టికికూడా ప్రతిభ కావాలె. ఈ రచనలను తేలికగా ఎందుకు చూస్తారో నాకుఅర్థంకాలేదు. అర్థంకాని కవిత్వాన్ని చూచి గౌరవిస్తారు. అర్థమై ఆనందం కలిగించే హాస్యరచనలను చదివి రచయితను క్షమిస్తారు. హాస్యము మనస్సును తేలికపరుస్తుంది. అందుకని హాస్యసృష్టికూడా తేలికే అనుకొంటారు. దానివిలువకూడా తేలికేనని భావిస్తారు. రామాయణం వ్రాయడానికి ఎల్లాంటి ప్రతిభకావాలో ఒక హాస్యగ్రంథం వ్రాయడానికి అల్లాంటి ప్రతిభే కావాలె.

ఒకవిమర్శకుడు ఈ విషయాన్నే ఈవిధంగా చెప్పాడు. Mark Twain's "Huckel bury fin" is a greater work of art than Kant's 'Critique of reason' Charles Dickens did more for the elevation of human race than Cardinal Newman's "Lead Kindly light amidst encircling gloom". Newman only cried for light in the gloom of a sad world. Dickens gave it" ప్రతిభలేనివాడు హాస్య రచన చేయలేడు. కవికి ప్రతిభతోపాటు పాండిత్యంకూడా కావాలె. హాస్య రచయితకు భాషలోవుండే వడుపు, ఊపు, పలుకుబడి తెలిసి ఉండాలె.

*ఇద్దరికీ వస్తువు ఒకటే :* హాస్యానికీ, కవిత్వానికీ వస్తువు ఒకటే. సూర్యోదయమూ, సూర్యాస్తమయమూ, పగలూ, నక్షత్రాలూ, ప్రకృతీ, సౌందర్యమూ, జీవితములోని అనేక సంఘటనలూ కావ్యకర్తకు వస్తు సామగ్రి అవుతున్నవి. హాస్యవిషయమునకూడా అంతే. మానవజీవితములోని ఒకసుందరమైన సత్యము, ఒకవిచిత్రానుభూతి, ఒక్క గిలిగింత, ఉచ్చారణలో వైపరీత్యము, ఒకఊపు, మాటల కూర్పులోఒక్క మెలిక, ఒకవింతచేష్ట, ఒకమధురమైన తలంపు, ఒకహఠాత్ జనితమైన మధురోహ, హాస్యానికి వస్తువు అవుతుంది.

*లలితకళల సృష్టి :* హాస్యసృష్టికూడా ఇతర లలితకళల సృష్టి వంటిదే. ఒక్క ప్రతిభాశాలి గణబద్ధమైన వాక్కులో తన ఆనందాన్ని వెలిపుచ్చుతాడు. అది కవిత్వం అయింది. మరియొకడు చిత్తరువును గీస్తాడు. ఆ గీయటంలో అతడు తన ప్రతిభను ప్రకటిస్తాడు. ఇంకొకడు పాడతాడు. ఒకడు చమత్కార కల్పనచేస్తాడు. అదే హాస్యము. వాక్కును రచియించి నగిషీలుచెక్కి అలంకారాలు చేరిస్తే కవిత్వం అయింది. అల్లే ఒక, వాక్కును ఒక ప్రత్యేక రసం సాధించడానికి రచనచేస్తే అది హాస్యం అయింది.

*గుడ్డముక్కతో రాతిబండను బ్రద్దలు కొట్టడము :* హాస్యానికిగాని, కవిత్వానికిగాని వస్తువులో విశిష్టత ఏమీ ఉండనక్కరలేదు. దేనినుంచి అయినా హాస్యాన్ని పిండవచ్చు. చాకలిబట్టలు ఉతుకుతున్నాడు. ఇది అతిసామాన్యమైన విషయము. వస్తువైశిష్ట్యము ఏమీలేదు. ఇది తీసికొని రమణీయమైన పద్యరచన చేయవచ్చు. స్మితజనక సమర్థమైన హాస్యపుపలుకుబడినీ సాధించవచ్చు. "మార్క్‌ట్వెయిన్" అనే హాస్యశీలుడు అన్నాడు ప్రక్కనున్న మిత్రునితో "ఏమిటండీ అది. అతడు గుడ్డముక్కతో బండను బ్రద్దలు చేయాలని చూస్తున్నాడు!" అని.

*కవిత్వం:* కవిత్వ రచనకైనా, హాస్యరచనకైనా, దృష్టిలో ఒక వక్రత ఉండాలె. ఒకవస్తువును జూచి సామాన్యుడు అనుకొనే పద్ధతిగాక మరొకవిధంగా అనుకొంటేనే, కవిత్వమైనా హాస్యమైనా పుడుతుంది. గిన్నెలో ఎఱ్ఱని ద్రాక్షసారాయి పోశారు. ఎఱ్ఱని ద్రాక్షరస ముపై తెల్లని సురుగుగట్టి అందంగావుంది. సారాయి నురుగగట్టిందీ అంటాడు, సామాన్యుడు. మధువు సిగ్గుపడి మందహాసం చేసింది అంటాడు కవి. ఎఱ్ఱతనాన్ని సిగ్గుకు గుర్తుగాను సురుగును నవ్వుగాను భావించాడు కవి. మధువుకు ప్రాణంపోసి మందహాస సుందరమైన సౌందర్యమూర్తిని చేశాడు. మామూలువిషయమే దృష్టిలోని విలక్షణత వలన ఈవిధంగా తయారైంది.

*శాశ్వతత్వము:* హాస్యములో బరువులేకపోవడము మూలాన అది శాశ్వతంగా ఉండటానికి కావలసిన జీవశక్తి అందులో లేదనీ, మెరుపులాగ అది క్షణికమనీ, తాత్కాలికంగా ఆనందాన్ని ఇస్తుందిగాని, శాశ్వతంగా అంటే మళ్లీ మళ్లీ చదివినప్పుడల్లా ఆనందాన్ని నిచ్చే దార్ఢ్యం దానికిలేదనీ అంటారు. కవిత్వానికీ, హాస్యానికీ, ఇదిఒక ముఖ్య మైన భేదంగా చెపుతారు. ఒక చక్కని పద్యం ఎన్నిసార్లు చదివినా ఆనందాన్ని ఇస్తుంది. మళ్లీమళ్లీ చదవాలనీ అనిపిస్తుంది. ఒక హాస్యపు పలుకును మొదటిసారి విన్నప్పుడు ఆనందిస్తాడు. మళ్లీచదవడానికి బుద్ధి పుట్టదు.

*పద్యంలో లాలనము ఉంది:* మళ్లీమళ్లీ చదివించేశక్తి పద్యానికి ఉన్నమాట నిజమే. పద్యానికి ఆశక్తి ఎక్కడనుంచి వచ్చింది? పద్యంలో సంగీతం ఉంది. ఊపు-లాలన, ఉన్నవి.

"ఉల్లల దలకా జలకణ
పల్లవిత కదంబ ముకుళ పరిమళ లహరీ
హల్లోహల మద బంభర
మల్లధ్వను లెసగ విసరె మరుదంకురముల్."

అనే పద్యంలోఉండే సంగీత గుణము మనలను గిలిగింతపెట్టి మళ్ళీ మళ్ళీ చదివిస్తుంది. కవిత్వం పదార్థం లేకపోయినా మనము పద్యాన్ని మళ్ళీ మళ్ళీ చదవడానికి అదేకారణం.

అయితే కవిత్వ పదార్థమున్న పద్య రచనను ఏవిధంగా మళ్ళీ మళ్ళీ చదివి ఆనందిస్తామో, హాస్యపదార్థం ఉన్న రచననూ అల్లాగే మళ్ళీ మళ్ళీ చదివి ఆనందించగలమా? చదివినప్పుడల్లా ఆనందాన్ని ఇచ్చేశక్తి దానికి ఉందా? అని ప్రశ్నిస్తే ఉందనే సమాధానం చెప్పవలె. అయితే వస్తువునుబట్టి దాని శాశ్వతత్వముగాని క్షణికత్వముగాని ఏర్పడుతుంది. దాని ఆయువు అల్పముగాని అక్షయముగాని అవడము దానిలో ఉండే పదార్థాన్నిబట్టి ఉంటుంది.

సార్వకాలికము : ఏదో ఒకవ్యక్తిని గురించిగాని ఒకకాలానికి ఒకపరిస్థితికిగాని సంబంధించిన రచన ఆ వ్యక్తి పోవడంతో, ఆకాలం గతించడంతో ఆ పరిస్థితి మారడంతో నశిస్తుంది. మానవస్వభావానికి సంబంధించినట్టి ఒకప్రత్యేక కాలానికి గాని, ఒకవిశిష్టమైన పరిస్థితికి గాని, సంబంధించనట్టి సర్వకాల సర్వావస్థలకు సంబంధించినట్టి శాశ్వతమైన సమస్యలకు చెందినట్టి హాస్యరచనలకు చావులేదు. వితంతువివాహములు, రజస్వలానంతర వివాహములు ఇటువంటివిషయాలు తాత్కాలికములు. వాటికి శాశ్వతత్వములేదు. ఇటువంటి సమస్యలకు సంబంధించిన రచనలు ఆ సమస్యలతోపాటు నశిసిపోతవి.

సార్వజనీనము : భార్యాభర్తల జీవితాన్ని గురించిన సమస్యలు ఒకకాలానికి పరిమితముగావు. అందరకు సంబంధించినవి. సర్వజనులకు సంబంధించిన విషయము అది! మానవులు మానవులుగా ఉన్నంతవరకు అది సజీవమై ఉంటుంది.

శకున ఫలోక్తులు: కొన్నివందల ఏండ్లక్రింద మనకవులు ప్రయోగించిన ఫలోక్తులను చదివి మనము ఈనాటికీ ఆనందిస్తున్నాము.

రామలింగని వినోద ప్రసంగాలు ఈనాటికీ మనకు నవ్వుపుట్టిస్తున్నవి, కాబట్టి నిజమైన జీవితసమస్యలను గురించి, కష్టసుఖాలను గురించి వ్రాసిన హాస్యరచనలు, ఇంకా వందఏండ్లు గడిచిన తరువాతకూడా ఆనందాన్ని ఇస్తవి. అందుకు సందేహంలేదు.

హాస్యము-భేదప్రభేదాలు :

హాస్యంమీద ఎవరు మాట్లాడినా ఏదో పద్యం చదివి ఎంత హాస్యవంతంగా ఉందో చూడండి అంటారు. హాస్యంలో భేదాలను గురించి ఏలక్షణ గ్రంథములోనూ లేదు. అసలు భేదాలు ఉన్నవని గుర్తించినట్లే కనపడదు. అలంకారాలను తీసికొందాము. ముందు శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ అని రెండువిధములు. మళ్లీ శబ్దాలంకారాలూ యమకము అనుప్రాసము ముక్తపదగ్రస్తము, అని ఎన్నోరకాలు. ఇక అర్థాలంకారాలు నూటిదాకా ఉన్నవి. రూపకము, ఉపమ, భ్రాంతిమంతము అల్లాంటివి. అల్లాగే హాస్యంలోకూడా ఉన్నవి. హాస్యంలోని భేదాలను ఎవరూ గుర్తించలేదు. ఆ భేదాలేవో చూపాలని నాప్రయత్నం.

*శబ్దాశ్రయము:* ఇక వాక్ గతమైన హాస్యాన్ని శబ్దాశ్రయము భావాశ్రయము, అర్థాశ్రయము అని మూడువిభాగాలు చేశాను. ఈ విషయం ఇంతకుముందే తెలిసికొన్నాము. శబ్దములకూర్పులో వికృతిని ప్రదర్శించవచ్చు. ఉచ్చారణా వైపరీత్యము అన్యభాషాపదప్రయోగము, అస్తవ్యస్త పదప్రయోగము, అశ్లీల, అసభ్యపదప్రయోగము క్లిష్టశిష్ట విశ్లథ పదప్రయోగము మొదలగువాని వలన వికృతి సిద్ధిస్తుంది. అటువంటి రచన హాస సమర్థంగా ఉంటుంది. ఇదంతా శబ్దాశ్రయ హాస్యము.

*భావాశ్రయము:* ఇక భావాశ్రయ హాస్యము రెండవరకము. భావంలో ఒక మెలిక ఒకవైపరీత్యము, ఒకవైచిత్రి, వింతపోకడ, విరోధభావముల సంయోగము భిన్నార్థములుగల మాటలకలయిక. భావా

శ్రయ హాస్యానికి మూలము. రసమూ హేతువూ అలంకారమూ భావము ఇవి అభాసమానంలో సమ్మిళితమవిగా ఉంటవి. భావాశ్రయ హాస్యంలో ఇవి అంతర్భాగాలు.

అర్థాశ్రయము: మూడవది అర్థాశ్రయహాస్యము. అసభ్యోక్తులు కానిదీ రమణీయార్థ ప్రతిపాదకమైనదీ అలంకార సమన్వితమైనదీ, ధ్వని వ్యంజకంగా ఉండేదీ, వికారరహితమైనదీ, రసానుభూతిని కలి గించేదీ శుభ్రభావహాస్యమైనదీ, రసజనకమైన చిత్తవృత్తికి కారణ మైనదీ, ఆనందమే అవధిగాగలదీ అర్థాశ్రయము.

*Perceptual Humour* : ఈ మూడురకాలలో శబ్దాశ్రయ హాస్యము అనుభవాశ్రయము. అనగా ఇందులో చూచినట్టి. వినినట్టి విషయములలోని వక్రతను మాత్రమే గుర్తించడము జరుగుతుంది. దీనిని ఆంగ్లవిమర్శకులు perceptual Humour అన్నారు.

*Imaginative Humour* : భావాశ్రయ హాస్యము పై మెట్టు లోనిది. భావాశ్రయ హాస్యములో లేనిదానిని ఊహించుకొని ఆ ఊహించు కొన్న దానిలోని వికృతిని గమనించి నవ్వుతాము. రసము లేని చోట రసము ఉన్నట్లు హేతువు లేని చోట హేతువు ఉన్నట్లుభావించి అట్టి సంభావనలో వికృతినిచూచి నవ్వడము జరుగుతుంది. దీనిని Imaginative Humour అన్నారు ఇంగ్లీషులో.

మూడవ రకము హాస్యము అర్థాశ్రయమైనది. ఇది హృదయ సంవాది సుందరమైనది. ప్రేమా, సానుభూతీ మొదలగు గుణములకు సంబంధించినది. అంతేకాదు. అర్థాశ్రయ హాస్యంలో భాగమైన ఉక్తి విశేషాలు నిశితమైన మేధాసంపత్తివలన ఉద్భవించినవి. ఈ ఉక్తులు రసభావనా సామర్థ్యమునకు నిధానములు. మొత్తంమీద అర్థాశ్రయ

హాస్యము హృదయమునకూ మేధస్సునకూ సంబంధించినది. ఆ కారణం చేతనే దీనిని అత్యుత్తమమైన హాస్యముగా పరిగణన చేస్తారు కొందరు విమర్శకులు.

*అంతర్భాగాలు:* మళ్ళీ ఒక్కొక్కరకము హాస్యము ఎన్ని విధాల సాధించవచ్చునో చూపడానికి ప్రయత్నం జరిగింది. శబ్దాశ్రయ హాస్యము అస్తవ్యస్త పదప్రయోగము అన్యభాషా పదప్రయోగము ఆదిగాగల పన్నెండు విధముల సాధించవచ్చును. అల్లాగే భావాశ్రయ హాస్యము సాధించడానికి కొన్ని ప్రకరణాలు చూపినాను. అవి పదహారో పదిహేడో ఉన్నవి. తరువాత అర్థాశ్రయ హాస్యము, శక్తిమూలము, ఉక్తిమూలము రెండురకాలుగా విభజించి వాటిని సాధించేమార్గాలు చూపించడానికి ప్రయత్నం జరిగింది. ప్రతిదానికి ఉదాహరణలుకూడా ఇచ్చాను.

*పారిభాషికములు:* ఒక్కొక్కరకము హాస్యానికి ఒకపేరు పెట్టాలెగదా! ఈరకం ఉక్తి విశేషానికి 'ఇది పేరు' అని నిర్ణయించడము కష్టమైనపని అయింది. లక్షణగ్రంథాలలో రకరకాలైన, రసాలకు అలంకారాలకు పేర్లువున్నవి. కవిత్వపరంగా అవి సాధ్యము. అయితే నేనొక పనిచేశాను. వాటినే వాడుకొని హాస్యపరంగా వాటికి క్రొత్తనిర్వచనాలను కల్పించాను. ఈవిషయంలోమాత్రం కొంత నిరంకుశంగా ప్రవర్తించవలసివచ్చింది. అట్లాచేయడము తప్పనిసరి అయింది. హాస్యవిషయంలో పారిభాషికపదాలు లేవు. నేను సృష్టించుకోవలసిన అగత్యం కలిగింది.

*సమాసోక్తి:* అందుకని ఇల్లాగ పాతపదములకే క్రొత్తఅర్థం కల్పించవలసివచ్చింది. ఉదాహరణకు 'సమాసోక్తి' అంటే 'ప్రకృతముయొక్క విశేషణముల సామ్యమునుబట్టి అప్రకృతార్థము తోచునట్లు చేయుట' అనివుంది. అయితే నేను "ఒకటి రెండుమాటలలో వ్యక్తం

చేయగల భావాన్ని ఒకపెద్ద సమాసంలో చెపితే నవ్వువస్తుందనీ అది సమాసోక్తి" అనీ నిర్వచనము చేశాను. ఆ పదాలు హాస్యవిషయకంగా క్రొత్తఅర్థంలో రూఢమైపోతాయని నావిశ్వాసం. నేను ఈ పారిభాషిక పదాలను సృష్టించడములో లక్షణగ్రంథాలలో ఇచ్చిన నిర్వచనానికిగాని, వారు నిబంధించిన లక్షణానికిగాని, కట్టుబడి ఉండలేదు. లక్షణగ్రంథాలలో ఆ పదానికి ఉన్న ధర్మార్థం ఒకటి. నేను హాస్యవిభాగ నిర్ణయంలో కల్పించిన ధర్మార్థము మరొకటి.

*హాస్యము. పర్యాయపదాలు:* హాస్యం అనే అర్థంలో చాలా పదాలు ఉన్నవి. "అవలగితము - మేలము - చతురు - చమత్కారము హరువు-పరాచికము పరిహాసము వెక్కిరింత-కంటసము-కేరడము-క్రేణి-ఎగతాళి-ఎకసక్కెము-అపహాస్యము వికటము-ఇసిరింత-పిసాళము-అచ్చిక-దిసంతు-గద్దెపొంకము-చిడిపిమాట - ఉల్లంఠనము - అవక్షిప్తము-ఉల్లకుటు-ఎత్తిపొడుపు-కోడిగము" అనేమాటలు ఉన్నవి. ఇవన్నీ పర్యాయపదాలో అర్థభేదాన్ని సూచించేవో? తెలియలేదు. ఇవి కాక 'అణకించు-పిసాళించు - కేకరించు - తాళిసేయు - గుసగుసపోవు-తచ్చనలాడు-తచ్చనసేయు-ఙక్కలించు" అనేక్రియలు 'అపహాస్యము చేయు' అను అర్థముగలవి ఉన్నవి. 'కేళీకీలుడు-ఆగడీడు' అను విశేష్యములూ ఉన్నవి 'హాస్యశీలుడు' అనేఅర్థం వచ్చేవి. కాని వీటి అర్థం తెలియకపోవడము వలన హాస్యభేదాలనుగురించి వ్రాసేటప్పుడు వాటిని ఉపయోగించుకోలేకపోయినాను, ఒకటో రెండో తప్ప. ఇక హాస్యభేదాలను గురించీ వానిస్వభావ స్వరూపాలను గురించీ, సోదాహరణంగా చూపవలసిఉంది. ముందు ప్రకరణాలలో ఆ వివరణ అంతా ఉన్నది.

---(O)---

అస్తవ్యస్త పద ప్రయోగము
(స్ప్వానరిజం - మేల ప్రాపిజం)
నిరర్థక పద ప్రయోగము
శక్తిహీన పద ప్రయోగము
అన్యభాషా పద ప్రయోగము
అస్పష్టోచ్చరిత పద ప్రయోగము
(అవిస్పష్టము, అనర్థకము)
వికృతోచ్చరిత పద ప్రయోగము
ఊత పద ప్రయోగము
ఆడంబర పద ప్రయోగము
అప్రసిద్ధ పద ప్రయోగము
అప్రయుక్త పద ప్రయోగము
అశ్లీల పద ప్రయోగము
అసభ్య పద ప్రయోగము
గ్రామ్య పద ప్రయోగము
శ్లిష్ట పద ప్రయోగము
క్లిష్ట పద ప్రయోగము
పరిచ్ఛిన్న పద ప్రయోగము
అనర్థ పద ప్రయోగము
పారిభాషిక పద ప్రయోగము
బధిర సమాధాన పద ప్రయోగము
అవస్యందిత పద ప్రయోగము
అపలాప పద ప్రయోగము
అసంబద్ధ పద ప్రయోగము
అవివేకి పద ప్రయోగము
ఛాందస పద ప్రయోగము
అనుకరణ పద ప్రయోగము

# శబ్దాశ్రయ హాస్యము

## అస్తవ్యస్త పదప్రయోగము :

శబ్దాశ్రయ హాస్యము అనేకప్రకరణాలలో సాధించవచ్చును. అందులో ఒకటి అస్తవ్యస్త పదప్రయోగము. ఈ విషయాన్ని గురించి ఇప్పుడు ముచ్చటిస్తాను. అస్తవ్యస్త పదప్రయోగము అంటే మాటల లోని అక్షరాలను అటున్నవి ఇటూ, ఇటున్నవిఅటూ వేయడము. ఇల్లాగ అక్షరాలను తారుమారుచేయడంవలన ఒకవిధమైన వాగ్వికారము సిద్ధిస్తుంది. అది హాస్యానికి మూలము అవుతుంది.

*మాటలు తారుమారుకావడం:* మాటలు తారుమారు కావడానికి తొందరపాటు, భయము, ఆవేశమూ, తొట్రుపాటు కారణాలు కావచ్చు. బుద్ధికుశలురు ఈ తడబాటువలన ఉత్పన్నమయ్యే వాక్చమత్కృతిని గుర్తించి అల్లాంటి చమత్కారాన్ని బుద్ధిపూర్వకంగానే సృష్టించవచ్చు. కళాసృష్టి అంతా ఆ విధంగానే జరుగుతుందిగదా! ప్రకృతిలో పుష్పము ఉన్నది. దాని లోకోత్తరమైన అందాన్నిచూచి, మనోహరమైనరంగును గుర్తించి అదేమోస్తరు పుష్పాన్ని కళాశీలి కృత్రిమంగా తయారు చేస్తాడు. అదేమాదిరిగా హాస్యశీలుడు ఈరకము శాబ్దికవైకృతిని సృష్టిస్తున్నాడు.

*బితీన్-డి-గేట్ సర్:* శబ్దాల మార్పువల్లగానీ, కేవలమూ వర్ణ క్రమంలో అస్తవ్యస్తము వల్లగానీ ఇల్లాంటి వాక్చమత్కృతిని సాధించవచ్చు. ఒకకుఱ్ఱవాడు, ఉద్యోగాన్వేషణలో ఒక అధికారిని చూడడానికి

(8)

ఆయన ఇంటికివెళ్ళాడు. గేటు వేసివున్నది. తీసుకొని లోపలికిపోవలె. తీస్తే ఎవరైనా కోప్పడుతారేమోనని భయం. కాసేపు తటపటాయించాడు. ఆ కుఱ్ఱవాడు చివరకు ఎల్లాగో ధైర్యంచేసి గేటుతీస్తూ ఉండగా కుక్కఒకటి భయంకరంగా అరుస్తూ లోపలినుంచి వచ్చింది. పాపం కుఱ్ఱవాడికి మరీభయంవేసింది. దిగాలపడి నుంచున్నాడు. ఇంతలో ఆ అధికారి వచ్చి ఆ పిల్లవాణ్ణిచూచి, "ఎవరు నీవు?" అని గర్జించాడు. ఆ కుఱ్ఱవాడికి ఉన్నధైర్యంకూడా పోయింది. అప్పుడు కలిగిన తడబాటులో ఆ అబ్బాయి అన్నాడూ: "ఐతీస్ దిగేట్ సర్, ఇటీజ్ మూన్."

ఆ మాటలు ఇంగ్లీషులో ఉన్నవి అనుకోండి, అయినా తొట్రుపాటువలనా, భయంవలనా, జరిగేపనికి ఇది ఉదాహరణ కావడానికి అభ్యంతరం ఏమీలేదు. అస్తవ్యస్త పదప్రయోగంవలన జనించేహాస్యము ఇల్లాంటిదే! దీనిని మాటల తడబాటువలన వచ్చే హాస్యము అంటే మరీ బాగుంటుంది.

ఇక సిసలైన అస్తవ్యస్త పదప్రయోగానికి వద్దాము. అటువంటి వ్యాపారాల్లో ఒకదానిపేరు ఇంగ్లీషులో 'స్పూనరిజం' అంటారు. ఈ వ్యాపారం మన తెలుగుసంభాషణలో ఉన్నా దీనిని ఒకహాస్యప్రక్రియగా మన లాక్షిణికులు గుర్తించినట్లు కనబడదు. అసలు హాస్యవిశేషాలను చాలా వదిలేశారేమో మన లాక్షణికులు. ఈ హాస్యపు పలుకుబడి ఎల్లా ఉంటుందో, దాని లక్షణాలేమిటో, చెప్పేముందు ఒక్క ఉదాహరణ ఇస్తే దానిస్వరూపం బాగాతెలుస్తుంది. ముద్దా సుబ్బయ్యగారు అని ఒకరు ఉండేవారు. మాటలు తడబడో, చమత్కారానికో ఏమోకాని కొంత మంది ఆయనను సుబ్బా ముద్దయ్యగారు అనేవారు. ఇల్లాగ మాటలను తిరగేసి చమత్కారాన్ని సాధిస్తే వచ్చేవాగ్వికృతి "స్పూనరిజం" జాతికే చెందుతుంది. అస్తవ్యస్త పదప్రయోగ విశేషాలలో ఇదిఒకటి.

*స్పూనరిజం:* ఒక లాక్షణికుడు స్పూనరిజాన్ని ఈవిధంగా నిర్వ చించాడు.

"A twist of transposing of words or syllables is called 'Spoonerism'. This derives from spooner an absent minded British professor, who during a talk at a Women's College meant to speak of weary benches that confronted him. Instead he said I address this audience of weary wenches."

*గుశ్వము:* మాటలు తడబడడం వలన ఒకమాట అనబోయి వర్ణక్రమంలో దానికి అతిసన్నిహితమైన ఇంకోమాట అనడంవలన ఈ రకమైన చమత్కారం జనిస్తుంది. ఒక విద్యార్థి తన ఉపాధ్యాయునితో మాట్లాడుతూన్నప్పుడు, 'ఆ గుఱ్ఱము గ్రుడ్డిది'అని చెప్పాలిసివచ్చింది. పండితులతో మాట్లాడుతున్నాడు కాబట్టి కాస్త మంచిపదం ఉపయో గిద్దాము, 'గుఱ్ఱం' అనేమాట మరీతేలికగానూ, తెలుగుగానూ ఉందను కొన్నాడు. ఏమాట ఉపయోగిద్దామా అని ఆలోచిస్తే 'అశ్వము' అనే మాట బాగుందనితోచింది. కాని ఆ తొందరలో 'గుఱ్ఱము' అనేమాట పైన 'అశ్వము' అనేమాట ఎక్కి చటుక్కున ఆకుఱ్ఱవాడు, 'గుశ్వము గుడ్డిదిసార్' అన్నాడు. 'స్పూనరిజం' అంటే ఇదే:

*చచ్చినగుర్రం వచ్చింది :* సరీగా ఇదేమో స్తరుది ఇంకోటుంది. ఒక కుఱ్ఱవాడు పైఅధికారితో "గుఱ్ఱము చచ్చిపోయింది" అని చెప్ప వలసివచ్చింది. అది అంతకు క్రితంరోజుననే ఆ అధికారి ఇంటికి వచ్చింది. 'వచ్చిన-చచ్చిన' అనే మాటలు తారుమారైనవి. ఆ తొంద రలో "సర్, సర్, నిన్న చచ్చిన గుఱ్ఱం ఇవ్వాళ వచ్చిందిసార్" అన్నాడు; 'నిన్న వచ్చినగుఱ్ఱం ఇవ్వాళ చచ్చింది' అనబోయి. 'స్పూన రిజం' నడక అల్లాగ ఉంటుంది.

సూరంపూడి కారెయ్యా : అల్లాగే కారెంపూడి సూరయ్యగారు, సూరెంపూడి కారెయ్యగారు అయినాడు. ఈ వ్యాపారంవల్ల మాటలేకాక ఒకమాటలో ఉండే అక్షరాలు, అటున్నవి ఇటూ, ఇటున్నవి అటూ జరగడంవల్ల ఈ శాబ్దిక వైచిత్రి సిద్ధిస్తుంది. రైలుపెట్టెలో అంతా కూర్చున్నారు. ఇరుకుగాఉంది. ఒకాయన ప్రక్కవాడితో "కొంచం జరగండి, సర్దుకు గూర్చుందాం!" అనబోయి "కొంచం జరగండి గుద్దుకు సర్దాం" అన్నాడట! మాటలోని అక్షరాలు జారిపోయి, వాటికి సన్నిహితమైన క్రొత్త అక్షరాలు శబ్ద శరీరంలోకి ప్రవేశించడంవల్ల ఆ శబ్దానికి ఆ వికృతివచ్చింది. 'చదువుకొంటూనే నిద్రపోయినాను' అనే వాక్యం ఈ విధమైన అవకతవకతులోనై 'నిద్రపోతూనే చదువుకొన్నాను' అయింది.

* స్పూనరిజంకే మరో ఉదాహరణ ఇస్తున్నాను. బళ్ళారి కృష్ణమాచార్యులుగారి ప్రమీలార్జునీయంలో సుయోగుడు ప్రమీల సభలో "మహారాణీ మసత్కార" మంటాడు. 'రాయబారి' అనటానికి 'రాయహారి' అంటాడు. మాటలు తడబడ్డాయి. సరిగ్గా స్పూనరీజంకాకపోయినా అదేమోస్తరు వ్యాపారమిది.

బందరులో స్థానంవారి నాటక ప్రదర్శనము అయిపోయిన తరువాత పేపరుకు రిపోర్టు వెళ్ళింది. అందులో "స్థానంవారు వరలక్ష్మిని తానే స్వయంగా నాటకానికి ఆహ్వానించినాడు" అనే వాక్యముంది.అచ్చులో ఆ వాక్యములోని 'నాటకానికి' అనేమాటలోని మధ్యాక్షరాల్లో అటు ఉన్నది ఒకటి యిటూ, యిటుఉన్నది ఒకటి అటూ పడ్డాయి. మర్నాడు దేశంఅంతా అట్టహాసాలతో దద్దరిల్లిపోయింది.

ఈ మోస్తరు పలుకుబడి సాధారణంగా, అప్రయత్నంగా, అనుకోకుండా, వస్తూఉంటుంది. అయితే ప్రతిభాశాలి అయినవాడు,

---

* డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారి "ఆంధ్ర నాటక పితామహుడు" అను గ్రంథమునుండి గ్రహించిన విషయము.

కావాలని ఇల్లాగ తారుమారుచేసి హాస్యసృష్టి చేస్తాడు. అది ప్రతిభతో కూడుకొన్నవిషయం, అని గ్రహించవలసిఉంది. అచ్చుతప్పులలో జరిగే పని ఏమిటి? అక్షరాలు ఇటున్నవి అటూ, అటున్నవి ఇటూ పడడమూ, లేక ఒకఅక్షరానికి బదులు అదేమో స్తరు మరోఅక్షరం రావడమూనూ. 'స్పూనరిజం' లో జరిగేపని ఇదే.

*కాశేశ్వరరావుగారు ప్రసవించారు :* ఈ అస్తవ్యస్త పదప్రయోగాలు పొరపాటున లేక ప్రమాదవశంచేత జరిగినా, బుద్ధిపూర్వకంగా జరిగినా, హాస్యస్ఫోరకంగా ఉంటాయి. బుద్ధిపూర్వకంగా ఇల్లాంటి పనివల్ల హాస్యం పుట్టడం సంభవిస్తే అది ప్రతిభాప్రదర్శనం అవుతుంది. లేకపోతే ప్రమాద ప్రదర్శనం అవుతుంది. ఒకసారి జన్మభూమి పత్రికలో ఈ క్రిందివాక్యం అచ్చుఅయింది "నందిగామలో శ్రీ కాశేశ్వర రావుగారు వేయిమందిగల బహిరంగసభలో ప్రసవించారు" అని. 'ప్రసంగించారు' అనడానికి బదులు ఈమాట పడడంవల్ల చదివినవాళ్ళంతా విరగబడి నవ్వుకొన్నారు. ఇల్లాంటివాటివల్ల ఎవ్వరికీ కోపంరాకూడదు.

*శవావధాని ;* అటున్నవి ఇటూ, ఇటున్నవి అటూ, జరగడంవల్ల, లేక ఒక అక్షరంజారి అదేమో స్తరు మరొక అక్షరం రావడంవల్లా 'స్పూనరిజం' అనబడే హాస్యప్రక్రియ ఎల్లాగ సాధింపబడుతుందో మళ్ళీచూద్దాము. కృష్ణాపత్రిక కృష్ణారావు పంతులుగారి చేతులో ఉన్న రోజులలో జరిగిన విషయం ఇది. శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు బందరువచ్చి ఉపన్యాసం ఇచ్చారు. ఆ విషయం పత్రికలో ప్రచురించారు. కృష్ణారావుగారే ఆ వ్యాసం వ్రాశారు. ఆ వ్యాసానికి శీర్షిక "శవావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ఉపన్యాసం" అని పడ్డది. కృష్ణారావుగారు సహితం నవ్వలేకుండా ఉండలేకపోయినారు. అయితే ఆ ఫారం అంతా తీసివేసి క్రొత్తగా మరోఫారం అచ్చువేయించారు.

ముద్రారాక్షసాలు ; ఇంకో పత్రికలో సరోజినీదేవిని గురించి వ్రాయబడిన వ్యాసంలో అద్భుతమైన అస్తవ్యస్త పదప్రయోగం జరిగింది. ఆమెగారు ఎక్కడో సైన్యవిన్యాసం చూచి మెచ్చుకొని అన్నారు. "సైనికులు దేశాన్ని రక్షిస్తున్నారు, వారు మనకు గర్వ కారణం" అని. ఈ విషయంగల వ్యాసానికి శీర్షిక 'మనదేశంలో సైనికులే గర్భకారణం' అని పడ్డది. మర్నాడు పేపరులో ఈ విషయం చదివి దేశంలోని ప్రజలంతా విరగబడి నవ్వారు. 'స్పూనరిజం' అనఒదే హాస్య ప్రక్రియలు మిక్కిలి హాస్యజనకంగా ఉంటవి. ఇటువంటి అచ్చు తప్పులకు 'ముద్రారాక్షసాలు' అని పేరుపెట్టాడు మిత్రుడు భావరాజు నరసింహారావు.

పదప్రయోగంలో అస్తవ్యస్తము వలన జరిగే మరొక శబ్ద వ్యాపారానికి ఇంగ్లీషులో "మేలప్రాపిజం" అనిపేరు. ఆ హాస్యప్రక్రియను గురించికూడా, ఈ ప్రకరణంలోనే చెప్పవలె.

మేలప్రాపిజం ; ఒకమాట అనాలని, అనుకొని దాని స్వరూపం తెలియకగానీ, వర్ణక్రమం తెలియకగానీ, సరియైనపదమే వాడుతున్నానని భ్రమపడిగానీ, ఆ పదానికి సన్నిహితమైన మరో పదమో లేక అదే పదముయొక్క భ్రష్ట రూపమో వాడితే దాన్ని 'మేలప్రాపిజం' అంటారు. అస్తవ్యస్తపదప్రయోగంలో ఇదీ ఒక ప్రకరణమే. పానుగంటివారి కంఠాభరణంలో ఇల్లాటి శాబ్దిక చమత్కారము పుష్కలంగా దొరుకుతుంది. ఒక ఛాందస బ్రాహ్మణుడు తాను శుద్ధ వైదిక భాషను ఉపయోగిస్తునట్లు భ్రమపడి "ప్రాయచ్ఛిత్వము" అంటాడు 'ప్రాయశ్చిత్తము' అనడానికి.

వృషఃకాలస్థానము ; ఈ వాక్యం చూడండి. "వృషఃకాలస్థానము బ్రాహ్మణులకు విధికృత్వమట." ఇల్లాగ ఒకమాటకు సన్నిహితమై

యున్న నిరర్థక పదముగానీ, విరోధార్థమూ, విపరీతార్థమూ, వచ్చే పదం గానీ ఉపయోగించడం ఈ రకము హాస్యరచనకు లక్షణం. బందరులో ఒకసారి ఒకసభలో 'పట్టాభిగారి' చిత్రపటాన్ని ఇన్సూరెన్సు కంపెనీ వారు వారి హాలులో గోడకు తగిలించారు. దానిపైన తెల్లని పల్చటి తెర వేశారు. ఆ తెర తొలగించి దానిని అందరికీ కనపడేలాగున చేయ డానికి ఓ చిన్న వేడుక జరుపుకొంటున్నారు. జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు ఆ వేడుకను జరిపిస్తున్నారు.

సభకు రావలసినవారంతా వచ్చినతరువాత ప్రెసిడెంటుగారు లేచి పంతులుగారి దేశసేవనూ, ముఖ్యంగా వారు కంపెనీకి చేసిన సేవనూ, గురించి ముచ్చటించి చివరకు ఇట్లాఅన్నారు. "ఈ మహానీయుని చిత్ర పటాన్ని బహిష్కరించే భాగ్యము నాకు కలిగినందులకు నేను ఎంతో గర్విస్తున్నాను"అని. ఇది పదారువన్నె బంగారంలాంటి 'మేలప్రాపిజం.' అయితే పెద్దపదవులలో ఉన్నవారు ఈమాత్రం తెలియకుండా ప్రవ ర్తిస్తారా! అని సందేహించనక్కరలేదు. 'ఈ చిత్రపటాన్ని బహిష్క రిస్తున్నాను' అనిఅనడం శబ్దస్వరూపం తెలియకకాదు. ఏదో తడబాటు వలన, అల్లాగ ఒకమాట అనబోయి ఇంకోమాట అనడము సంభవిస్తూ ఉంటుంది.

*భసరస్మం:* ఇల్లాగే రేడియో అన్నయ్యగారు ఒకసారి అనుకో కుండా ఈరకం హాస్యపుపలుకు పలికారు. ఏదోసందర్భంలో 'జబ్బు విశేషించింది' అనబోయి, విశసించింది అన్నారు. విశసించింది అంటే చంపింది అని అర్థంవస్తుంది. ఈమో స్తరు శాబ్దిక వ్యాపారంవల్ల 'సభ అంతా రసాభాస అయిపోయింది' అనేవాక్యం 'రసభస్మం అయింది'గా మారింది. ఇదీ మేలప్రాపిజమే! మళ్లీ 'రసభస్మం' అనాలని 'భసరస్మం' అన్నాడా, అది 'స్పూనరిజం' క్రిందికివస్తుంది. "బుద్ధిజాడ్య జనితో న్మాదుల్" అనబోయి "బుద్ధిజాడ్య జతనోన్మాదుల్" అనడం 'స్పూన

రిజం'. ఇల్లాగ ఈరెండు హాస్యప్రక్రియలు అతిసన్నిహితంగా ఉండి, చెట్టాపట్టాలు వేసికొని సంభాషణలలో స్వైరవిహారంచేస్తూ ఉంటవి.

ఒక సన్మానసభలో నన్ను గురించి ఒకాయన మాట్లాడుతూ, 'కీర్తిశేషులైన మునిమాణిక్యం నరసింహారావుగారిని గురించి రెండు ముక్కలు చెప్పడానికి నాకు అవకాశం వచ్చినందులకు నేను ఎంతో గర్విస్తున్నాను' అన్నాడు. ఇదీ 'మేలప్రాపిజమే'. ఇంతవరకు శబ్దాశ్రయ హాస్యము అనేక విధాల సాధించవచ్చునని చెప్పి అట్టిపద్ధతులలో ఒకటైన అస్తవ్యస్త పదప్రయోగము అనే పద్ధతివలన హాస్యము ఏవిధంగా సాధింపబడుతున్నదో చూపాను. ఒకమాటఅనబోయి దానికి సన్నిహితమైనట్టి మరోమాటఅనడం మేలప్రాపిజం. ఒకమాటలోని అక్షరాలు, మార్పుచెందితే అది స్పూనరిజం అవుతుంది.

నిరర్థక పదప్రయోగము :

శబ్దాశ్రయ హాస్యములో నిరర్థక పదప్రయోగము ఒక ప్రకరణము. అర్థములేని పదాలను కొన్నిటిని సేకరించి అర్థం ఉన్నట్లు భ్రమ కలిగేలాగున కూర్పుజేయడమే ఇందులో జరిగేపని. ఆ కూర్పులో ప్రతి పదానికీ అర్థం ఉంటుంది. ప్రత్యేకంగా ఆ పదాలకు ఆ అర్థం ఉన్నప్పటికీ సాముదాయకంగా సాధింపతగిన అర్థవిశేషము ఏమీ ఉండక పోవడమే ఈ హాస్య ప్రక్రియలో ఉండే వైచిత్రి.

ఈ కూర్పులో ఉండేవిఅన్నీ సుశబ్దాలే. కాని, ఆ రచన మాత్రం వికృతభావ ప్రతిపాదకముగా ఉంటుంది. ఏ వాక్యానికావాక్యము విడిగా చూస్తే అర్థవంతంగా ఉంటుంది. కాని మొత్తంమీద భావం అగమ్య గోచరం. విశిష్టమైనట్టీ, రమణీయమైనట్టీ, ఒక భావాన్ని వ్యక్తం చేయడానికి ఇందులో ఉండే శబ్దాలు తోడ్పడడంలేదు. కాబట్టి ఈ రచన

నిరర్థక పదసంకలనం అయింది. తత్ఫలితంగా స్ఫురించే హాస్యము అనుభవసాక్షికమేగాని, లక్షించి, వివక్షించి, వివరించడానికి వీలు అయింది కాదు.

*ఆటవెలది ద్విపదకర్తగారు:* ఒకచిత్రంలో ఇది ముక్కూ, ఇది చెవీ, ఇదికన్నూ అని తెలుస్తూనేవున్నా మొత్తంమీద అది మానవాకృతి అని తెలియకపోవడంలో ఎల్లాంటి నిరర్థకత్వము ఉందో ఈ రచనలోనూ అల్లాంటిదే ఉంది. ఈ పద్యం చూడండి. "కాకికేమితెలుసు సైకో ఎనాలిసెస్సు। ఆటవెలది ద్విపద కర్తగారు, అయిదు నాల్గు మూడు ఆముక్తమాల్యద విశ్వదాభిరామ వినురవేమ."

ఈ రచనలో ఏమాటకు ఆమాటకు అర్థంఉన్నా సాముదాయకంగా సాధింపబడిన అర్థం ఏమీలేదు. కాని ఇందులో ఒకచమత్కారం భాసిస్తూ ఉంది. మనకు స్ఫురించని అర్థవిశేషము ఏదోఉన్నదీ అనిపిస్తుంది. ఎవరినో వెక్కిరిస్తూ ఉన్నట్లూ, దేనినో హేళనచేస్తూ ఉన్నట్లూ లీలగా తోస్తుంది. ఈ రచన చదివినమీదట నీ పెదవులపై రేఖామాత్రంగానయినా చిరునగవు భాసింపకమానదు. నిరర్థక పద ప్రయోగజన్యమైన హాస్యానికి ఇదిఒక ఉదాహరణ.

కవి ఉద్దేశించిన అర్థవిశేషము మనకు తెలియనపుడూ రచనలో ఉండే రమణీయభావము మనకుఅందనపుడూ, ఆ రచన అర్థంలేనికూర్పు అని అనేస్తాము. అయితే అర్థంలేని మాటలు కూర్చినంతమాత్రాన హాస్యం ఉత్పన్నంకాదు. ఆ కూర్పులోకూడా ఏదో చమత్కారం ఉండవలె. ధ్వని నిక్షిప్తమైన రామణీయకత మనకు గోచరించవలె. అప్పుడే అది ఈరకమైన హాస్యముక్రిందికి వస్తుంది. లేకపోతే పిచ్చివాగుడు అవుతుంది.

*భగవంతుని టోపీలం:* ఈ పద్యం చూడండి. "ఇస్పేటు జాకీలం, ఎగేసినబాకీలం, మృత్యువు సినిమాలో మూడుభాషల టాకీలం, భగవంతునిటోపీలం, పవిత్రయపు కాపీలం." అని ఒకపద్యం ఉంది. ఈ పద్యానికి కవి అనుకొన్న అర్థం ఏమిటో ఆ భగవంతుడికే తెలియవలె. కాని, ఇందులో ఏదో చమత్కారం ఉంది. "గుడుగుడు గుంజాలం, రెక్కలమంచాలం, మృత్యువు ఇనప్పెట్టెలో జెర్మన్‌సిల్వర్ కంచాలం! భగవంతుని పొరపాట్లం, పొగలుగ్రక్కే సిగరెట్లం, కట్టెలుట్టిపాయలం కొండలమధ్య లోయలం, భగవంతుని కోతులం, పలుకరాని బూతులం!" ఇది ఇంకొక పద్యము. ఈ రచనకూడా అటువంటిదే. తాత్పర్యం తెలియకపోయినా తమాషాగా ఉంది.

*యక్షీకృత పక్షీంద్ర లక్ష్యా:* ఈ నిరర్థక పదప్రయోగానికి ఇంకొక ఉదాహరణ. నన్నొకసారి మిత్రులు బలవంతపెట్టారు 'మీరు వ్రాసిన పద్యం ఒకటి చదవండీ'అని. నేను పద్యాలు వ్రాసేవాణ్ణికాదు. అయినా ఆమాట ఎందుకు చెప్పాలె అని ఈపద్యం గడగడా అనేశాను. "ఆశ్రిత పక్షవిచక్షణ కృతరక్షణరక్షితా దుర్నిరీక్ష భక్ష్యాంతర దక్షిణాక్షోణీధరా! కమలాక్షా! తక్షణయక్షీకృత పక్షీంద్రలక్ష్యా! వైరిస్తుతకీర్తి సాంద్ర వసుక్ష్మాపాల చంద్రా!" అర్థంలేని ఈ కూర్పునుజూచి మిత్రులంతా విరగబడి నవ్వారు.

ఇంతవరకు మనం ప్రతిపదానికి అర్థం ఉండి మొత్తంమీద అర్థంలేని పద్ధతిలో వ్రాయబడిన హాస్యస్ఫోరకమైన రచనావిశేషాలను గురించి పరిశీలించాము. నిరర్థక పదప్రయోగంవల్ల హాస్యసాధన ఎల్లా జరుగవచ్చునో చూపడానికి ఇంకొక కథకూడా ఇక్కడ ఉదాహరిస్తున్నా.

కీ॥ శే॥ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు గొప్పకవి. ఆయన హాస్యప్రసంగాలు చేసేవారుకూడాను. అది అందరికీ తెలిసిన

విషయమేకదా! ఆయన తండ్రికూడా హాస్యప్రసంగ కుశలుడే. ఒక రోజున డోలువాయించే వాద్యగాళ్లు ఇద్దరు వచ్చారు ఆయనదగ్గరకు. తమ ఇద్దరిలో ఎవరునేర్పరి, ఎవరు సమర్థుడు, అనేప్రశ్నపై వారు తగాదాపడ్డారు. బుచ్చిసుందరరామశాస్త్రిగారి తండ్రికూడా చిన్నచిన్న గేయాలూ, దరువులూ, వ్రాస్తూ ఉండేవారు. ఆయనకు లయజ్ఞానము బాగావున్నదనీ, సంగీతశాస్త్రంలో చెప్పుకోదగిన పాండిత్యము ఉందనీ అంతా అనుకొనేవాళ్లు.

అందుకని వాద్యగాళ్లు ఇద్దరూ శాస్త్రిగారిదగ్గరకు వచ్చి "బాబూ మేము ఇద్దరం ఒక దరువు వాయించి చూపుతాము. మాలో ఎవరు రమ్యంగానూ, శాస్త్రయుక్తంగానూ, వాయించగలిగినామో, మీరు చెప్పండి." అని కోరినారు. అసలు ఆయనకు ఈవిషయంలో తగినంత శాస్త్రపరిజ్ఞానము లేదు నిజానికి. కాని ఆమాట చెప్పితే తనకు అప్రతిష్ఠ. కాబట్టి ఎవరో ఒకరు గట్టివారూ, అని తేల్చి చెప్పవలసిన అగత్యం ఏర్పడింది.

శాస్త్రిగారు 'సరే వాయించండి' అన్నారు. ఆ ఇద్దరు వాద్యగాండ్రూ తమతమ శాస్త్రజ్ఞానాన్నీ, ఉపజ్ఞనూ, ప్రదర్శించారు. 'సరే ఇప్పుడు చెప్పండి' అన్నారు. శాస్త్రిగారు "అబ్బాయిలూ, మీ ఇద్దరూ ప్రతిభావంతులే. అయితే మీయిద్దరిలో యితడే కాస్తమెరుగు అనాలిసి వస్తుంది" అన్నాడు అందులో ఒకరినిచూపిస్తూ. ఆ రెండోవాడు "ఎందుచేత అల్లాఅన్నారండీ! అతగాడి గొప్పఏమిటో చెప్పండి?" అనిబలవంత పెట్టాడు.

*దిలీః :* శాస్త్రిగారు "అబ్బాయ్! నీవు 'గాత్ర సంవాహనై రాశ్య సంకోచః' అనే పద్ధతిలో వాయించావు" అన్నారు. ఈ మాటలు విని తాను ఏదో మంచి పద్ధతిలోనే వాయించి ఉండవలెనని అనుకొన్నాడు

మొదటివ్యక్తి. తన పద్ధతికి సంస్కృతంలో ఒక లక్షణం ఉందిగదా అని తృప్తినిగూడా పొందాడు. శాస్త్రిగారు మళ్ళీ ఇట్లాఅన్నారు. "కాని వాడు 'భయహర్షామయాదిభిః' అన్న సూత్రానికి అనుగుణంగా వాయించాడు. ఏమంటావు నిజమా అబద్ధమా?" పాపం అతడు 'నిజమేనన్నాడు.' 'అయితే మరి వాడు మెరుగన్న మాటేగా' అన్నారు శాస్త్రిగారు. కాదని ఎట్లాఅంటాడూ! సంస్కృతంలో అల్లాగ స్పష్టంగా కనబడుతూఉంటే. అయినా సందేహంతో "అయితే మీరు అనడం 'దిభిః' అనే పద్ధతే మంచిదనా?" అని అడిగాడు. శాస్త్రిగారు పెద్దగానవ్వి "దిభిః అక్షరద్వయ ప్రళయస్యదుఃఖాభ్యాం చేష్టాజ్ఞాన నిరాకృతిః" అన్నాడు శాస్త్రకారుడు. అల్లా శాస్త్రప్రవచనం ఉంటూ ఉన్నప్పుడు నువ్వేంజేస్తావు అన్నారు. 'నిజమేలెండి' అని అనుకుంటూ ఇద్దరూ వెళ్ళిపోయారు.

ఇందులో శాస్త్రిగారు అన్నమాటలకు అర్థంలేదు. నోటికివచ్చిన సంస్కృతంముక్కల్లో అల్లాధ్వనించేవేవో అన్నారు. దేశకాలపాత్రలను మనస్సులో ఉంచుకొని హాస్యాన్ని పిండాలనే నిశ్చయంతో ఉచితమైన పద్ధతిని నేర్పుగా, చమత్కారంగా, నిరర్థక పదాలను ప్రయోగించి, ఈ మోస్తరు హాస్య కల్పన చేయవచ్చు.

శక్తిహీన పదప్రయోగము :

*స్పైనాజర్ :* అర్థంలేకుండా ఉండే పదాలను తీసుకొని రచన చేయడము శబ్దాశ్రయ హాస్యాన్ని సాధించడంలో మరొకపద్ధతి. ఒకసారి నేను రైలులో ప్రయాణం చేస్తున్నాను. సెకండుక్లాసు కంపార్టుమెంటు అది. నేను వెళ్ళేటప్పటికే ఒక పెద్దమనిషి ఆ పెట్టెలో కూర్చుని ఉన్నాడు. ఎక్కడో ఆయనను చూచినట్లుంది. కాని ఎవరైందీ జ్ఞాపకంరాలేదు. సరేనని లోపలికెళ్లి కూర్చున్నాను. బైట ప్లాట్‌ఫారం మీద నిలబడి ఉన్న ఓ కుర్రాడితో ఆయన ఏదో మాట్లాడుతున్నాడు.

ఎందుకో గట్టిగా కోప్పడుతున్నాడు కూడాను. ఆయన అన్న మాటలు ఇవి. "అల్లాగ తెల్లబోయి చూస్తావేంరా స్కేనాజర్ ఒకటి తెచ్చిపెట్టమంటే? స్కేనాజర్‌రా! స్కేనాజర్ అంటే తెలియదురా సన్యాసీ! ఒరే ఇంతమాత్రం తెలియనివాడవు ఎల్లాగ బ్రతుకుతావురా? ఓరి సన్యాసీ ఇప్పటికైనా వెళ్ళి స్కేనాజర్ కొనుక్కురారా!"

ఇవీ ఆయన అంటున్న మాటలు. ఆ మాటలు విని నేనూ ఆశ్చర్యపడ్డాను. ఆ పెద్దమనిషి నావంక తిరిగి "బాబూ చూశారా ఈకాలపు పిల్లల తెలివితేటలు! ఒక స్కేనాజర్ తెమ్మన్నానండీ మామూలు స్కేనాజర్ సుమండీ!! అయినా వాడికి అదిఏమిటో తెలియడంలేదు. ఇంకా వీడు ఎందుకైనా పనికొస్తాడంటారా?" అన్నాడు. నే నేమని చెప్పేది. ఆ స్కేనాజర్ ఏమిటో నాకూ తెలియదు నిజానికి అదేమిటో మీరైనా చెప్పండి మావాడితో అని ఆయన అంటే నాపనిఏంకావాలె?

నిజానికి ఈకాలపు కుర్రవాళ్లు వాడేవస్తువులు కొన్ని నాకు తెలియవు. ఈయన ఇల్లు బంగారంగానూ అదేమిటో చెప్పమని నన్ను అడుగుతాడేమోనని నేను భయపడుతూనేఉన్నాను. ఆయన అడగనే అడిగాడు. అయితే స్కేనాజర్ అంటే ఏమిటో చెప్పమని అడగలేదు గాని "చూడండి ఇంతమాత్రం తెలియకపోతే ఎట్లాగండీ కుర్రవాళ్ళకూ! ఈ సజ్జునుపెట్టుకొని కాపురంచేయడంఎట్లాగండీ!" అని అన్నాడు.

వెధవచదువులు: 'చచ్చానురా బాబూ!' అనుకున్నాను. మౌనం వహిస్తే వదిలిపెట్టేరకం లాగలేదు. ఎందుకంటే ఆయన నావంకేచూస్తూ ఊరుకొన్నాడు జవాబు చెప్పమని గట్టిగా అడుగుతూ ఉన్నట్లు. ఇక మర్యాద దక్కేలాగునలేదు. నేను అన్నాను "నిజమేనండీ ఇటు

వంటివాళ్ళతో కాపురం కష్టమే" అని. ఆయన నావంక చిరాకుగాచూస్తూ "పైగా వీడు స్కూలుఫైనలు ప్యాసైనాడు కూడాను" అనిఅన్నాడు వాడి అజ్ఞానానికి నేనేదో బాధ్యుణ్ణయినట్లు. అంతటితో ఊరుకోక 'వెధవ చదువులు, వెధవచదువులు!' అని అన్నాడు నావంక కొరకొరాచూస్తూ.

*స్కేనాజర్ అంటే తెలియకపోతే:* వీడు నన్ను పట్టుకొన్నా డేమిటీ ఈ దుస్థితికి నేనేదో కారణభూతుణ్ణి అయినట్లు! అనుకున్నాను నేను. "నిజమేనండీ, వెధవచదువులు కావుటండీ ఈ కాలపు చదువులూ! మీరన్నమాటా నిజమే! స్కేనాజర్ అంటే తెలియకపోతే ఇంక వాడు ఎందుకు పనికొస్తాడండీ. అటువంటివాళ్లు చూశారూ అడుక్కుతింటూ పోవాల్సిందే" అన్నాను నేను ఏదో కసితీర్చుకొన్న తృప్తితో. ఈమాట మీద ఆయన "అడుక్కుతింటానికి మాత్రం ఎల్లాగా పనికొస్తాడండీ, వెధవది స్కేనాజర్ అంటే ఏమిటో తెలియకపోతే" అన్నాడు.

నేను ఏంచెప్పేది. 'అడుక్కుతింటానికికూడా స్కేనాజర్ అంటే ఏమిటో తెలియాలెకాబోలును' అనుకొన్నాను. ఆయన నన్ను ఇంకా అనేక ప్రశ్నలు వేసేటట్లు ఉన్నాడు. నాతెలివితక్కువ తనాన్ని కూడా బయటపడేయాలనే ఆయన ఆలోచిస్తూ ఉన్నట్లుంది ఆయన వ్యవహారం చూస్తే. ఆయన అడిగే ప్రశ్నలకు నేను చెప్పే జవాబులలో ఎక్కడో నా అజ్ఞానం బైటపడకమానదు. అయితే ఒక్క ఉపాయం తోచింది. ఆయన చెప్పిందానికల్లా "నిజం, నిజం, అంతేనండిమరి" అని కప్పదాట్లువేస్తే ఆయన నన్ను పట్టుకోలేడు అనుకొన్నాను.

*ఎందుకూ పనికిరాడు:* అక్కడనుంచి ఆయన ఇష్టంవచ్చినట్లు మాట్లాడాడు. మొదట ఆయన 'ఆమాటకు అర్థం తెలియనివాడు ఎందుకూ పనికిరాకుండా పోతాడు,' అంటే నేను 'నిజమే అటువంటివాడు ఎందుకు పనికివస్తాడండీ!' అంటూ దీర్ఘాలుతీశాను. 'అటువంటి తెలివి

తక్కువ దద్దమ్మను తలో మొట్టికాయ వేస్తారు.' అని ఆయన కచ్చితంగా చెపితే, "వెయ్యక ఊరుకొంటారుటండీ!" అని ఆమోద సూచకంగా నవ్వాను. ఆయన చెప్పినదానికి నేను అంగీకరించడం వలన ఆయనకు ఉత్సాహం కలిగి 'చూడండీ, భూమి గుండ్రంగా ఉందనీ స్కేనాజర్ నల్లగా ఉందనీ తెలియకపోతే ఇంకేముంది చెప్పండీ, అంతా నవ్వుతారా నవ్వరా?" అన్నాడు. 'తప్పకుండా చచ్చినట్లు నవ్వుతారు.' అంటూ తార్కాణంగా నేను విరగబడి నవ్వాను.

*వెధవన్నర:* 'ఆమాత్రం జ్ఞానంలేనివాడు వట్టివెధవ.' అని ఆయనఅంటే 'ఇంకానయం మెల్లగా అంటారేం అటువంటివాడు వెధవేమిటి వెధవన్నరకూడానూ అన్నాను ముఖం చిట్లించి, కనుబొమ్మలు ముడివేసి అటువంటిమనిషియందు నాకుగల ఏహ్యాభావాన్ని వ్యక్తపరుస్తూ ఆ తరువాత అక్కడుంటే లాభంలేదని తోచింది నాకు. ఉంటే నాచేత అవాచ్యాలన్నీ వాగిస్తూ ఉంటాడని తోచి, మూటా ముల్లే తీసికొని దిగిపోదామని లేచాను.

ఆయన నారెక్కపుచ్చుకొని మర్యాదగానే 'దిగకండి మాస్టారూ, రైలుకదులుతున్నది.' అంటూ లోపలికి తీసికెళ్ళి కూర్చోబెట్టాడు. 'మాస్టారూ అని సంబోధించడంవల్ల ఆయన నావిద్యార్థి ఏమోనన్న అనుమానం కలిగిందినాకు. 'ఈరోజుల్లో ప్రతివాణ్ణీ మాస్టారూ అని అంటున్నారుగదా అని సరిపెట్టుకొని ఊరుకొన్నాను. చూస్తే ఆయన ఇంకేదో ప్రశ్నలు వేసేలాగున్నాడు. అందుకని ఏదో తీవ్రమైనవిషయం ఆలోచిస్తున్నట్లు ముఖంపెట్టాను. ఏదోఆలోచిస్తూఉంటే అతనిమాటలు నాకు వినిపించవుగదా అని నాఎత్తు.

*స్కేనాజర్ ఖరీదు రూపాయి:* ఆయన 'ఇంకా ఏదో స్కేనాజర్ ప్రసంగం చేస్తూనేఉన్నాడు. ఆయన ఈ ప్రసంగం చేస్తున్నంతసేపు

నాకు ముళ్ళమీద కూర్చున్నట్లుంది. చివరకు ఆయన 'ఏమండీ మాస్టారూ! స్కానాజర్ రూపాయికంటే ఎక్కువ ఖరీదు ఉంటుందంటారా?' అని సూటిగా అడిగాడు. నాకు దానిఖరీదు తెలియదాయె! అయితే నాకు తెలియదూ అని నానోటితో నేను ఎట్లాఅనేది. క్షణంముందు స్కానాజర్ అంటే ఏమిటో తెలియనివాడు ఎందుకూ పనికిరాకుండా పోతాడనీ, శుద్ధ తెలివితక్కువ దద్దమ్మఅనీ ఒప్పుకొని, ఇప్పుడు దానిఖరీదు ఎంతో తెలియదని ఎట్లాఅనేది! చచ్చినట్లు దానిఖరీదు 'ఇంత' అని చెప్పితీరవలె గదా.

*స్కానాజర్ ధర పెరిగింది:* 'దానిఖరీదు రూపాయికంటే ఎక్కువ ఉంటుందండీ' అనికదూ అడిగింది. అయితే దానికి జవాబుగా, ఏదో తెలిసినవాడిలాగా, 'ఎబ్బే రూపాయికంటే ఎక్కువ ఉండదండీ. ఇంకా కాస్తోకూస్తో తక్కువే అయిఉంటుంది.' అని, మళ్ళీ ఎందుకైనా మంచి దని, 'కాకపోతే ఈమధ్య అన్నివస్తువులలాగే దీనిఖరీదు కూడా పెరిగిం దేమో' అన్నాను. దాని తరువాత ఆయన నన్ను స్కానాజర్‌ను గురించి రకరకాలవాక్యాలు పలికించాడు. 'యుద్ధానంతరం మంచి స్కానాజర్‌లు రావడంలేదంటే' 'నిజం' అనీ, 'ఏవస్తువా మంచినాణెమైనది రావడం లేదనీ' ఓ చిన్న ఉపన్యాసం ఇచ్చాను. 'పూర్వము ఒక్కొక్క స్కానా జర్ నెలా రెండునెలలు పనికివచ్చేది' అంటే 'నెలేంఖర్మండీ ఒక్కొక్కరు దానిని ఆరునెలలదాకా వాడేవారు' అన్నాను.

*ఎప్పుడైనాచూశారా :* ఇల్లాగ పదినిమిషాలు నాచేత రకరకాలుగా అనిపించి విరగబడి నవ్వడం సాగించాడు ఆయన. ఆనవ్వడం ఎందుకో నాకు అర్థంకాలేదు. కాసేపునవ్వి 'మాస్టారూ! స్కానాజర్ మీరెప్పుడైనా చూశారా అండీ?' అన్నాడు నవ్వు ఆపుకొంటూ. నేను తెల్లముఖం వేశాను. 'నేను మీ విద్యార్థినండీ మాస్టారూ. మీతో హాస్యం ఆడుదా మనుకొన్నాను. మీరు నన్ను గుర్తించక పోవడంవల్ల మరీ సులువుగా

ఈ నాటకం ఆడగలిగాను.' ఇల్లా అని, తాను ఎవరో, ఎప్పుడు, నాదగ్గర చదువుకొన్నాడో, ఆవిషయమంతా నాకు జ్ఞాపకం చేశాడు.

*నాకుతెలియదు :* నేనూ నవ్వుకొని 'అయితే ఇంతకూ ఆ స్కైనా జర్ అంటే ఏమిటో చెప్పావుకావు?' అన్నాను. 'ఏమో నాకూ తెలియదండీ, ఏమన్నా తెలిస్తే మీకే తెలిసివుండాలె, ఆ మాటకు అర్థం తెలియనివాడు ఎందుకూ పనికిరాకుండా పోతాడని మీరేగా అన్నారు అన్నాడు 'ఆమాటా నిజమేనయ్యా, నేను ఎందుకూ పనికిరానివాణ్ణే.' అన్నాను నవ్వుతూ.

"అంత మాట అనకండి మాస్టారూ! క్షమించండి. మీరూ . . హాస్య ప్రియులూ, ఏమీ అనుకోరు, అనే ధైర్యముతో మిమ్ములను నవ్వులాట పట్టించాను" అన్నాడు. ఏమీ అనుకోకపోవడమేకాదు, ఇంతతమాషా చేయగలిగిన నీవు నా విద్యార్థివి అయినందులకు నేను గర్వపడుతున్నాను. అని నేను అన్నాను, నిజంగా సంతోషాన్ని పొందుతూ. ఇంతకూ నేను చెప్పొచ్చింది ఏమిటీఅంటే శక్తిహీన పదప్రయోగం వలన హాస్యము సాధించడము జరిగిందీ అని!!.

*జొకున్యాజ్ :* ఇంకొక ఉదాహరణ ఇస్తున్నాను, శక్తిహీన పద ప్రయోగానికి. "కోర్టువారు మళ్ళీ సమావేశమైనారు. న్యాయవాదులు తమతమస్థానాలలో ఆసీనులయినారు. న్యాయాధిపతి వచ్చి తనస్థానంలో కూర్చుని హత్యానేరమును విచారించడము సాగించినాడు. ఒకడు అది ఘోరమైన నేరమనీ, నిందితుణ్ణి కఠినంగా శిక్షించాలనీ కోర్టువారికి మనవిచేశాడు. న్యాయాధిపతి నిందితుణ్ణి అడిగాడు "ఏమయ్యా నీవు చెప్పుకోవలసింది ఏమైనాఉందా?" అని. అతడు ఈ విషయాన్ని గురించి మీరు జాగ్రత్తగా విచారణచేయండి. తగిన శిక్ష విధించండి "జొకున్యాజు అండి జొకున్యాజు. అందరూ కోరేది జొకున్యాజు." అన్నాడు గట్టిగా.

ఒకలాయరు 'నిందితుడు జొకూ్యజు అన్నాడు కాబట్టి అతన్ని వదిలి వేయాలన్నాడు.' ఇంకో వకీలు 'అతడే జొకూ్యజు అన్నాడు కాబట్టి శిక్షించడానికి అభ్యంతరం ఏముందీ' అన్నాడు. న్యాయాధిపతికి ఏమీ తోచక 'జొకూ్యజ్' అని లేచిపోయినాడు. తరువాత అక్కడ చేరిన ప్రేక్షకజనం అంతా కేసు 'జొకూ్యజు' అయిందనీ తమలోతాము చెప్పు కొంటూ, 'కేసు ఏమైందీ?' అని అడిగినవాళ్ళకు, 'కేసు జొకూ్యజు అయిందని' చెపుతూ వెళ్ళిపోయినారు. ఈ కథ వ్రాసినఆయన "To my mind and eye Jokuse is one of the funniest words yet invented. It belongs to no known tongue" అన్నాడు. ఇల్లాగ శక్తిహీనమైన పదములవల్లకూడా బహురమణీయ మైన హాస్యమును సృష్టించవచ్చును.

అన్యభాషా పదప్రయోగము :

రెండు భాషల సంయోగము వలన వికృతి జనిస్తుంది. బహు భాషా సంబంధక పద సమాహారజనిత వైకృత పరినిష్టా రామణీయకత హృదయమును గిలిగింత పెట్టుతుంది. ఆ భాషలేవైనను కావచ్చు. ఇంగ్లీషు-తెలుగు, తెలుగు-సంస్కృతము, కలుపవచ్చును.

*సంస్కృతము-తెలుగు :* సంస్కృతము తెలుగు సంయోజనము వలన ఎట్టిహాస్యము జనించునో చూద్దాము. "దినం దినం అస్మత్ భార్యే కలహాయతి. నేను ప్రతిదినము శిరోవేదనేషు బాధ్యతే". 'అన్నం కళపళాయతే. చిటపటాయతే. మిమ్ములను పునరపిసాయంకాలే స్కూల్ వేషు ఆవరణే చూడగలను. తస్మిన్ సమయే బాలాః ఫుట్ బాల్ క్రీడ యంతి. ఇటువంటి వాక్యాలు కొంతతమాషాగాఉంటాయి. ఇంకోవిధమైన కలయికఉంది. సంస్కృతపదాలు ఆంధ్రీకరింపబడి తెలుగు పదాలు సంస్కృతీకరింపబడితే అదో తమాషా అయిన పదజాలం అవుతుంది.

*ఎండామండిత ప్రదేశం:* ఒకాయన ఇక్కడ ఎండలు ఎక్కువ అనడానికి, 'ఇది ఎండా మండితప్రదేశము' అన్నాడుట. ఎండలచేత మండింపబడిన, అంటే దగ్ధము చేయబడిన ప్రదేశము అని అర్థము. ఇక్కడ 'మండిత' అనేపదము సంస్కృతపదంలాగ, పరామర్శింప బడినది. ఇట్లాగే 'తిట్టు' అనే తెలుగుపదాన్ని తీసుకొని సంస్కృత పదంలాగ పరామర్శిస్తే, వికృతరూపమువచ్చి చమత్కారముసిద్ధిస్తుంది. ఆ రూపము 'తిట్టిత'. వాడు తిట్టితుడైనాడు అనవచ్చు. 'పోవాలనేకోరిక' అనే అర్థంలో 'జిగమిష' అనే సంస్కృతపదం ఉంది. అల్లాగేతినాలనే కోరికను, 'తినమిష' అనడమూ అనవలయుననే కోరికను 'అనమిష' అనడమూ ఇల్లాంటి వ్యాపారంవల్ల సిద్ధించేవి ఒకరకం వికృతి రూపములు. ఆ వికృతిరూపములు హాస్యపోషకములు. అల్లాగే దూషితుడు వలె, తన్నితుడు, కొట్టితుడు, అను రూపాలను కల్పించి నవ్వించవచ్చును. సంస్కృత పదాలనూ తెలుగు పదాలనూ కలిపికూర్చిన ఈ క్రింది పద్యం వినోదభాసురముగా ఉంది.

క్షుధాతురాణాం నడుడికిర్న ఉడకః
అర్థాతురాణాం నచెల్లిర్నచెల్లః
నిద్రాతురాణాం నమెట్టర్నపల్లః
కామాతురాణాం నముసలిర్నపిల్లః

మన భాషకు చెందిన పదాలను ఏ ఇతరభాషకు చెందిన పదాలతోనైనను సంయోగపరిస్తే అటువంటి సంయోజనము, అసహజమై వికృతీదీపితమై హాస్యజనకము అవుతుంది. ఆ కలగలపు ప్రసంగాలలో ఇంకేవిధమైన సౌందర్యమూ ఉండదు. హృదయానికి తగిలి ఝల్లుమనిపించే వృత్తాంతమూ ఉండదు. హఠాత్‌జనితమైనట్టీ, మధురమైనట్టీ, రమ్యమైనట్టీ, భావసముచ్చయము కనిపించదు. ఉన్నదల్లా రెండుభాషల కలయికవలన వచ్చిన వికృతి. ఆ కలయికలో ఏదో క్రొత్తదనము భాసిస్తుంది. తత్కారణంగా ఏదో చమత్కారం సిద్ధిస్తుంది. ఆ కలపడ

ములో కొంతనేర్పు లేకపోలేదు. కొంత అర్థవంతంగానూ, చమత్కార ప్రేరకముగానూ ఆ పదాలను సంయోగపరచవలసి ఉంటుంది. దానికి కొంత వైదుష్యము అవసరమే.

పగటివేషగాళ్ళు ఈ రకము కలగలపు హాస్యాన్ని మనకు విని పిస్తూ ఉంటారు. ఏవో తమాషాఅయిన శ్లోకాలు చదువుతారు. "బాకీ సార్థా సుమనసా సర్వాదాయం. యథాక్రమం తిన్నట్టే తిసకున్నట్టే ...మాడడం। మాటమాట ప్రసంగేన దబ్బు దిబ్బు స్త దైవచ। పాదరక్ష ప్రయోగేనా శరీరం పీడ వర్జయేత్." వాళ్ళు చదివే శ్లోకాలలో ఇదిఒకటి. ఇటువంటి శ్లోకాలను చదివేటప్పుడు వేదం చదివినట్లుగా, ఉదాత్తాను దాత్త స్వరభేదంతో చదివితే, మరీతమాషాగా ఉంటుంది.

*ఇంగ్లీషు-తెలుగు;* తెలుగూ సంస్కృతమూకలిపినట్టుగానే ఇంగ్లీషు తెలుగులు కలిపి హాస్యాన్ని సాధించవచ్చు. అటువంటి హాస్యం కన్యా శుల్కంలో పుష్కలంగా దొరుకుతుంది. బుచ్చెమ్మను చూచిన తరువాత గిరీశం శిష్యుడితో అంటాడు. "ఇన్నాళ్ళాయ్ నీకు విడోమేరేజివిషయమై లెక్చెర్లు ఇస్తుంటే ఈ కథ ఎప్పుడూ చెప్పావుకావు. మీ ఇంట్లోనే ఓ అన్‌ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగ్‌విడో ఉందటోయ్! ఏమి దురవస్థ! మైహార్టుమెల్ట్సు, నేనే తండ్రినైతే ఈ పిల్లకు విడోమేరేజి చేసి శాశ్వత మైనకీర్తిని సంపాదిద్దును. ఏమిచక్కదనం! ఈ సొంపు ఎక్కడా చూడ లేదే! పల్లెటూరులో ఊసుపోదనుకొన్నాను గాని, పెద్ద క్యాంపెయన్‌కు ఇక్కడకూడా అవకాశం ఉండడము నాఅదృష్టం."

*అరబాలోకద వేస్సు:* కవులు రెండుభాషల కలయికతో పద్యరచన కూడా చేశారు. అవికూడా తమాషాగానే ఉంటవి. ఒక ఉదాహరణ. "పోస్టాఫీసున పోస్టుచేయుడొక కార్డున్ రేపె నామాటలన్। చెస్టున్ జేయగవచ్చు స్టార్టి మిడియట్లే యంచు వైరిచ్చుటే। బెస్టన్నింటను వైరు

చూచుకొనుచున్ వేవేగ మేల్ట్రైనులో। నే స్టార్టౌనత డారణాలెకద మీకేమైన వేష్టయిన చోన్." ఈ రచనలోకూడా ఇంగ్లీషు తెలుగు భాషల కలయిక హాస్యప్రోద్బలంగానే ఉన్నది. ఏ రెండు భాషలు కలిసినా ఇల్లాగ తమాషాగా ఉండకమానదు. 'వరశుల్కము' అనేమరో నాటకంలో గ్రంథకర్త తెలుగు అరవభాషలను కలిపి మంచి చమత్కారాన్ని సాధించాడు.

*కన్నడం-తెలుగు:* పండితారాధ్య చరిత్రలో హాస్యంకోసం కాక పోయినా తెలుగు కన్నడ భాషలను కలపడంమటుకు జరిగింది. దానిని మణిప్రవాళ రచన అంటారు. ఈ కథలో కొంచం చమత్కారం ఉంది. ఒక ఆంధ్రుడు, కన్నడిగుడు చేస్తున్న విందుకు వెళ్ళాడు. అందరూ భోజనం చేయడము ప్రారంభించారు. ఆయనకు రెండుమాటలు వినబడుతున్నవి. "సాకు"అని. "బేకు"అని. అయితే పదార్థం కావాలంటే ఏమాట వాడవలెనో 'వద్దు' అంటానికి ఏమాట అనవలయునో అతనికి తెలిసిందికాదు. తనకు కావలసిన పదార్థం వచ్చినప్పుడల్లా "కొంచెం సాకు, కొంచెం సాకు" అనడము సాగించాడు. కన్నడ పదాలనూ, తెలుగు పదాలనూ కలిపి వాడుతున్నాడు. ఆ వడ్డనచేసేవాడు, ఆయనకు వడ్డించకుండా వెళ్ళిపోతూఉండేవాడు. కడుపు మండిపోతున్నది. ఎవ్వరూ ఏదీ విస్తర్లోవెయ్యకుండా పోతుండిరి! ఆయన విసుగెత్తిపోయి ఆ తరువాత ఎవరో రాగానే 'ఏమయ్యోయ్! అరగంటనుంచి ఒక్కరూ నాకు సాకలేదు. నీసాకు చట్టుబండలుగానూ నీవైనా రెండుబేకులు బేకిపో" అన్నాడు. ఆ పరిస్థితిని అర్థంచేసుకొన్నవాళ్ళు విరగబడినవ్వారు. ఇది భాషలకలయికవలన సముద్భవించిన మంచి హాస్యము.

కన్నడముమాటలూ, తెలుగుమాటలూ, కలిపివ్రాసిన ఈపద్యాన్ని చూడండి. కాస్త తమాషాగానే ఉన్నది. "మళె ఇల్ల ధరపైన కెఱె ఇల్ల చెరువులో। చెరువులో ఉదకమన్నిల్ల। సూర్యకలయిల్ల, మారయిల్ల

వంట ఎట్లయ్యెనే వామనేత్రీ?" "ఉన్నవరు కట్టింతురు మంచిమంచి మాళిగలను। నామాటువే, నీపాడవే, కర్మ పరిపాకమునుగూర్చి." ఇట్లాగే సంస్కృతం, ఉర్దూభాషల కలయికవలన హాస్యజనకమైన వికృతి సాధింపబడినది. ప్రతాపరుద్రీయంలో ఈరకం హాస్యం కావలసినంత ఉన్నది.

*ఉర్దూ సంస్కృతము;* ఉర్దూ సంస్కృత భాషల కలయికవల్ల రమణీయమైన హాస్యం జనించిన ఒక కథ ఇది. ఉర్దూ బాగావచ్చిన బ్రాహ్మణుడు ఒకడు వరుసగా పదిహేనురోజులు సంధ్యావందనం చెయ్యడానికి వీలుచిక్కక చివరకు వీలుకలుగగానే పదిహేనురోజుల సంధ్యావందనం ఒకేసారి చెయ్యవలసివచ్చింది. అయితే సంకల్పంలో ఆసంగతి సంస్కృతంలో ఎల్లాగ అనవలెనో తెలియక, "పంద్రా యామ్‌కా సంధ్యావందన్ ఏక్‌దమ్ కరిష్యే"అని అన్నాడట. ఇల్లాగ ఏరెండుభాషలైనా కలిపి హాస్యవంతం చేయవచ్చు.

## అస్పష్టోచ్చరిత పదప్రయోగము :

అస్పష్టమైన పదము ప్రయోగించడమువలన హాస్యము జనిస్తుంది. ఉచ్చారణలో వికారం రావడమే ఇక్కడ ఈనవ్వుకు కారణం. శబ్దానికి అస్పష్టత ఆపాదించడానికి కొన్నిమార్గాలున్నాయి. అందులో "మ్లిష్టము" ప్రధానమైనది. ఈ మ్లిష్టముకూడ రెండువిధాలు. ఒకదాని పేరు 'అవిస్పష్టము' రెండోదానిపేరు 'అనర్థకము'. ఈ రెండింటిలో కూడా శబ్దంయొక్క అస్పష్టతా ఉచ్చారణకు వికృతి ఎలా ఆపాదించబడుతుందో చూద్దాం.

*మ్లిష్టము:* మ్లిష్టము అంటే అర్థము 'తెలియరాని మాటలు'. (An indistinct speech) అని అమరకోశములోఉంది. అర్థము తెలియరాని మాటలను ఉపయోగించి, హాస్యమును సాధించవచ్చు.

అర్థం తెలియరానిమాటలను ఉపయోగించడంలోకూడా పైనచెప్పినట్లు రెండుప్రకరణాలున్నవి. అందులో మొదటిది 'అవిస్పష్టము'. దీన్ని గురించి విచారిద్దాం.

*అవిస్పష్టము:* అవిస్పష్టము అనేమాటకు ఆంగ్లంలో Mumbling అనిపేరు. ఇది గొణుకుడులాంటిది. ఈ 'గొణుకుడు'ను గురించిన వివరాలు చెప్పాలె ఇప్పుడు. ఇంగ్లీషులో ఇది ప్రసిద్ధమైన హాస్య ప్రక్రియ. ఫోను సంభాషణలో ఈ అస్పష్టోచ్చారణ సహజమై ఎక్కువ రమణీయంగానూ, ప్రహ్లాదజనకంగానూ ఉంటుంది. ఒక ఉదాహరణ ఇస్తున్నాను.

"హల్లో రావు!"

"ఆ! రావునే మాట్లాడుతున్నాను."

"నమస్తే" మీరు మత్స్యశాస్త్రాన్నిగురించి ఎక్కువగా చదివారు గాదూ! ఇవ్వాళ్ళప్రొద్దున మేము అపురూపమైన చేపలనుపట్టుకొన్నాము

"ఏమిటవి?"

"౦డ్ ఫల్ జాతివిన్నీ, అంబుల్-క్కా–చ్చీ జాతివిన్నీ!"

"ఏమిటవీ?"

"౦బుల్-క్కా–చ్చీ, ౦డ్ఫుల్ జాతి. మచ్ఛవిశేషాలు."

"ఏమిటో?"

"౦బుల్-క్కా–చ్చీ, ౦బుల్క్కాచ్చీ, అయ్యా!"

"నాకు తెలియడంలేదు."

"శాస్త్రగ్రంథాలు తిరగెయ్యి!"

ఈ మాటలు ఫోనుకు ఆ చివర ఉన్నవాడిని చాలాగాభరా పెడుతవి. ఆ సంగతి ఊహించుకొని ఇవతలవాడు నవ్వుకొంటాడు.

*అనర్థకము:* శ్లిష్టపదప్రయోగము అనే విభాగంలో రెండోది అనర్థకమనే హాస్యప్రక్రియ. ఇందులోనూ, అర్థరహితమైన మాటలే ఉపయోగింపబడతవి. కాని వాని ఉచ్చారణ ఎట్లాఉంటుందీ అంటే: ఆ మాటలు సుష్ఠుప్రయుక్తములేమో అన్నభ్రమను కలుగజేసేటటువంటివిగా ఉంటవి. ఈ భ్రమ కలుగజేయడమే ఈరకము హాస్యప్రక్రియకు ప్రధాన లక్షణము. వినేవాడు అదేదో సుశబ్దమే, మనకు సరిగ్గా వినపడడంలేదు. అని భావించి ఎంతసేపటికీ అర్థంకాక, తికమకలు పడతాడు. దీనిని ఇంగ్లీషులో డబుల్‌టాక్ 'double talk' అంటారు.

*వేండాయమానం:* ఒకఉదాహరణ. ఒకసారి 'రావూరు' మాఇంటికి వచ్చి, 'మాస్టారూ రాత్రి నేను జమ్మలమడక మాధవరాయశర్మగారి ఉపన్యాసం విన్నాను. మీరూవిన్నారుగదా! అయితే చెప్పండి. 'మొక్కపాటి' ఆ ఉపన్యాసంఅంతా వేండాయమానంగా ఉందంటాడు. అందులో లాటానుస్ఫురణఉంది. అది వేండాయమానంగా ఏమాత్రం లేదని నేనన్నాను. మీరుచెప్పండి ఎట్లాఉంది ఆ ఉపన్యాసం? అని అడిగాడు. నేను సంగతి గ్రహించి చూడండి! ఆ ఉపన్యాసం వేండాయమానంగానూ లేదు, లాటానుస్ఫోరకంగానూలేదు. అది భారవేరంగాఉంది. "కాళిదాసస్య భారవేరః" అన్నాడు. కాబట్టి ఆ ఉపన్యాసం భారవేర సంయుక్త సమాహారము. అందుకు సందేహంలేదు. అని గట్టిగాచెప్పాను. అంతా నవ్వుకొన్నాము.

*మఖాత్తేలు:* ఇంకో ఉదాహరణ. ఒకసారి 'రావూరే' నాతో అన్నాడు. 'మీ కథ చదివాను, చాలాబాగుంది. అందులో అభ్రుణీ, అభ్రుతీ కూడా ధ్వని నిక్షిప్తమై ఉన్నవి. ఆ కథ చదువుతూ ఉన్నంత సేపూ నాకు మావంతుడైన క...క్క...శ్వేశ్వరుడు, మఖాత్తేలు, డిక్రీంచుచున్న మహారస్సు శ్రమాత్రమీనమైనది అని. ఇంకోసారి భమిడిపాటివారూ నేనూ విశ్వనాథవారి ఉపన్యాసం విన్నాము. ఎట్లా

ఉందండీ అని అడిగాను. హృషితంగానూ, అపిశమితంగానూ, అమిత వశ్యంగానూ, హాస్యంగానూ ఉంది అన్నాడు.

ఇంతకూ అనర్థకమనే హాస్యధోరణిలో తమాషా ఎక్కడుందంటే అర్థంలేనిమాటలను స్పష్టంగా ఉచ్చరించి, అవి అర్థవంతములనే భ్రమకలుగజేసి, మనిషిని తికమకలుపెట్టి వైహాసికుడు ఆనందించడంలోఉంది. గౌణుకుడులోనూ, డబుల్‌టాక్‌లోనూ ఉపయోగింపబడేవి అర్థంలేనిమాటలే. అయితే వైధర్మ్యము ఏమిటీఅంటే మంబ్లింగులో అస్పష్టోచ్చారణవల్ల ఆమాటలు ఏమిటో తెలియక ఖంగారుపుడుతుంది. డబుల్‌టాక్‌లో ఆ అర్థశూన్యమైన శబ్దాలనే స్పష్టంగా ఉచ్చరించి సుశబ్దాలనే భ్రమ కలుగజేసి కథకుడు హాస్యం జనింపజేస్తున్నాడు. రెండిటిలోనూ అనుభూతి ఒకటే.

*కవిత్వంలో అనిర్వాచనీయత:* *(Obscurity) ఇల్లాగే అనుభూతి ప్రధానమైన కవిత్వం ఒకటుంది. ఆరకం కవిత్వంలో కవి ఏమి చెపుతున్నాడు అనే విషయం తెలియకపోయినా పద్యం ఏదో బాగుంది అనే అనుభూతి కలుగుతుందట. ఇక్కడా అటువంటి అనుభూతే ప్రధానము. నిరర్థక పదప్రయోగమూ, శక్తిహీన పదప్రయోగమూ, ఇల్లాంటివే. కాని ఏదైనా సూక్ష్మాతి సూక్ష్మమైన భేదం ఉండకపోతుందా అని వీటిని వేరుగా వ్రాసినాను.

*నత్తి:* నత్తిగా మాట్లాడడముకూడా ఉచ్చారణా వైపరీత్యం క్రిందకేవస్తుంది. ఈ వైపరీత్యాన్నీ ఈ అసహజత్వాన్నీ ఆలంబనగా తీసికొని చేసిన రచన హాస్యజనకంగా ఉండకమానదు.

నేను ఒకసారి క్లాసులో పాఠం చెబుతున్నాను. అది నెపోలియన్ చక్రవర్తిని గురించిన విషయము. యూరోపును అంతా హడలగొట్టి,

* "కవిత్వంలో అనిర్వచనీయత" చిరుమామిళ్ళ సుబ్బారావు సాహిత్య వ్యాసావళి.

యుద్ధాలలో అనేకమంది రాజులను పరాజితులనుచేసిన ఆ మహా పరాక్రమవంతుని చరిత్ర చెపుతూ ఉన్నప్పుడు, ఎవరికైనా రక్తం పొంగుతుంది. ఆవేశమూవస్తుంది. నాకూ అల్లాగే ఆవేశము వచ్చింది. ఆ ఆవేశంలో మాటకాస్త తడబడ్డది. ఒక్కపర్యాయంమాత్రం 'నె-నె నెపోలియన్' అన్నాను నత్తిగా.

*నానెన్నెనెన్నెపోలియన్ :* పాఠం చెప్పడం అయిపోయింది. చెప్పిన విషయాన్ని పాఠ్యగ్రంథంలోనుండి చదవమని ఒకకుఱ్ఱవాడిని అడిగినాను. ఆ కుఱ్ఱవాడు చదవడము మొదలుపెట్టి "నేనెనెపోలియన్, యూయూరప్‌ను అంతా జజజయించెను" అని చదివినాడు. వీడు నన్ను హేళనచేస్తున్నాడేఅని కష్టం వేసింది. అయితే వాడిని ఏమనికోప్పడేది! కోప్పడక "ఏమిటిరా! నాకేదో ఒక్కసారి నత్తివచ్చింది! ఆ మాత్రానికి నన్ను వెక్కిరిస్తావా? మర్యాదేనా ఇది." అన్నాను. వాడు ఏడ్పుముఖం పెట్టి "నే-నేన్నేను,మిమిమిమ్ముల్ను ఎఎఎక్కిరించవలసిన కర్మం ఏఏ ఏమొచ్చిందండీ! నానాన్నాకు, ననన్తి, లేలేలేకపోతేగద!" అన్నాడు. వాడికి పాపం నత్తిఉంది.

*నత్తి గొప్పవాళ్ళలక్షణము :* ఈ మాటలు అని ఆ అబ్బాయి సిగ్గుతో తలవంచుకొన్నాడు. అప్పుడు నేను అన్నానూ, 'ఒరే నాయనా? ఇందులో సిగ్గుపడాల్సిన అవసరం ఏమీలేదు. అయినా ఇంకోసంగతి. ఈ నత్తి ఉంది చూశావూ! ఇదిగొప్ప గొప్ప వాళ్లకు ఉండే లక్షణం. బహు గ్రంథకర్త అయిన వర్జిల్‌కూ, మాహావక్త అయిన డిమాస్తె నీస్‌కూ, నత్తిఉండేది. మొన్న మొన్నటిదాకా ఇంగ్లండులో ప్రధాన మంత్రిగా ఉంటూఉన్న చర్చిల్‌కు బాల్యంలో నత్తి ఉండేది. అంత గొప్పవాళ్లకు ఉంటూవచ్చిన నత్తి నీకూ ఉందంటే నీవుకూడా, అంత కాకపోయినా కొంతఅయినా గొప్పవాడవు కాక తప్పదు." అన్నాను. ఆ కుఱ్ఱవాడు సంతోషించాడు. ఇంతకూ నేను చెప్పవచ్చిన విషయం

ఏమిటీఅంటే నత్తివలన పదోచ్చారణలో ఒక వైపరీత్యమూ, ఒక అసహజత్వమూ, ఏర్పడుతుందనీ, దానివలన నవ్వు వస్తుందనీ.

*ప్రణాదాత్మకము :* 'ప్రణాదము' అను మరొక భాషితము ఉంది. ఇది 'అనురాగజః' అనురాగమువలన పుట్టినది. "Sound indicating affection." అని అమరములో-ఉంది. మనము బిడ్డలను ముద్దు చేసేటప్పుడు అనే పదములు, అనురాగ భరితములూ, ప్రేమాస్పదములూ, అయినకారణాన, ఒక రకము కాకువు సిద్ధించి, శబ్దవైకృతి ఉద్భవిస్తుంది. అట్టి వికృత పదప్రయోగము హాస్య కౌశలమును వెలువరిస్తుంది. మనము హర్షాతిరేకమున "నాతండ్రే! ఎందుకునాన్నా ఏత్తావు? అమ్మ కొత్తిందా? ఎందుక్కొ_త్తింది నాన్నా? అక్క_కూడా కొత్తిందీ? లేదులే బబ్బో!" అంటాము. అందులో శబ్దవికృతి ప్రియముగానూ, మధురంగానూ, ఉంది.

*చీలాములు :* విశ్వనాథవారు నవ్వించడానికి కాకపోయినా, ఇటువంటి ప్రణాద వాక్ప్రయోగముచేసి ప్రియత్వాన్నీ, వాత్సల్యమునూ వలకపోసే పద్యం వ్రాశారు. కౌసల్యరాముణ్ణి "రావయ్యా నాకూన! రావయ్యా నాతండ్రీ! రావయ్యా నాబాబు! రావె! రా!" అని పిలిస్తే రామచంద్రుడు తల్లిదగ్గరకు పోతాడు. ఆ సందర్భంలో పద్యం.
"తానో లాములు।తండ్రిపేరెవరయా, దాచాతమాలాలు। ............
................ అంచున్ కౌసల్య ముద్దాడెడిన్."

*నాన్నాలూ :* ఇంకో ఉదాహరణ. మనము చిన్నపిల్లలను ముద్దు చేస్తున్నప్పుడు ఈ మాటలు ఉపయోగిస్తాము. లాలబోసుకొన్నావా, బూతిన్నావా, మావయ్య బుర్రెక్కి_వత్తాదా." అని, పిల్లవాడు అంటాడు. "నాన్నా మోతాలుకాలు కొనునాన్నా, నాన్నాలూ, నాన్నాలూ, అమ్మ చూలూ, కొత్తొత్తుంది" అని. ఈ మాటలు మనలను సంతోషపెడుతవి.

గ్రస్తము: (వర్ణలోపము) గ్రస్తము అని ఒక భాషణముఉన్నది. అది ఒక వర్ణముగాని పదముగాని లోపించగా ఏర్పడ్డవాక్యము. ఇటువంటి వాక్యాలలో వర్ణలోప, వర్ణాగమములచే శబ్దము వికృతము అయి నవ్వు పుట్టిస్తుంది. ఈ క్రింద కొన్ని పదాలిస్తున్నాను. ఆ పదాలలో వర్ణలోపమో, వర్ణసంకరమో ఉంటుంది. మొత్తంమీద అవి వైకృతములు. అట్టివాక్యాలుఇవి. "కవితల్లడంలో అతడు మొనగాడు." 'మావోడు నాలోర్కిల్లోవస్తాడు.' 'రచెతను సమ్మానిస్చాలె.' ఇటువంటి వాక్యాలు, 'అస్దంలో' ముళ్ళపూడి వేంకట్రమణ మొనగాడు. మరికొన్ని వాక్యాలు ఇస్తున్నాను. వాటిలో వర్ణసంకరము ఎక్కువగా గోచరిస్తుంది. వీనిలో కొన్ని శబ్దాలు. వింతరూపాలను వెలార్చుకొని హాస్య పరిపుష్టంగా ఉన్నవి.

సంకరము: కొన్ని శబ్దాలలో శబ్దంలో ఉండే ఒక వర్ణాన్ని మరొకవర్ణము కౌగిలించుకొని, ఒక వింతరూపమును సంతరించుకొని ఆ సంశ్లిష్టరూపంలో పరమరమణీయ పరిహాసప్రకరణంగా భాసిస్తుంది. 'నేపర్యుస్పాటు' 'ఏప్లొమటు'. 'ఆస్యం చేస్తున్నాడయ్యా ఆయన.' 'షమ్మయ్యా' (ఇష్ + అమ్మయ్య). 'పస్తకం కొంతమెందుక నెరవు తెచ్చాను'. 'వాణ్ణనాల్సిన పనిలేదు.' ఇటువంటి వింతరూపాలుసంతరించుకొనిన శబ్దాలు వేంకటరమణగారి పుస్తకాలలో కొల్లలుగా దొరుకుతవి. ఇవి జ్ఞాపకంమీద వ్రాశాను. వర్ణక్రమంలో నాపైత్యం కొంతకలిసిందేమో క్షమించండి. ఈ సంశ్లేష, అన్యభాషలోని పదాలలోకూడా జరుగవచ్చు. ఉదాహరణ. మనశ్శాటిన్ షాక్షను. 'దైరక్టన్నిల్దీసి అడుగుతాను.' యయాతి చరిత్రలో ఉంది ఈ వాక్యము. 'అడుగువారలకు లేదనుమాట తనమది దలపడెన్నడును నబ్దులకరీము.' 'అతనికి కూరిమి తమ్ముడు షేకీభరాము చతురుడు.'

భ్రష్టము: వర్ణక్రమ దోషాలే ఇవన్నీ. ఇవన్నీ సుశబ్దాలకు, భ్రష్టరూపాలే అయినా, భ్రష్టపదప్రయోగము వేరుగా పైవానికి భిన్న

మైన భ్రష్టతగా సంభావించి, ఈపేరా వ్రాస్తున్నాను. ఆ పదాలు ఇవి. 'అమ్మకు జబ్బుగావుంది. నీవు తచ్చునం బయలుదేరి రా.' 'అస్స్ప్రిస్ యత మనదేశంలో తప్ప ఇంకెక్కడాలేదు.' 'వ్రెందుకు ప్రేర్పరచినావో ఈ భ్రంధిఖానా.' ఇల్లాగా వర్ణక్రమంలో విపరీతపుపోకడలు పోయి, ఆ శబ్దాన్ని వికృతంచేసి, హాస్యాన్ని సాధించవచ్చు.

ఈ విధంగా గ్రస్తము-సంకరము, భ్రష్టము అను మూడు పద్ధతులవలన శబ్దరూపంమారి, వికృతము అవుతుంది. అటువంటి వైకృత శబ్దసంయుక్తమైన వాక్యములతో చేసిన రచన, 'హాస్యంపు పలుకులకు కుదురై పండితుల మన్ననల కెన్నికయై చెన్నొందును.' అంటానికి సందేహించనక్కరలేదు.

*లోహలం:* అస్పష్టోచ్చరిత విధానములన్నిటిని గురించి వ్రాయాలంటే, ఇంకా ప్రలాపం, నిరస్తము, లోహలము, అనే మూడురకాల అస్పష్టోచ్చరిత పదాలసంగతిని గురించికూడా వ్రాయాలె. లోహలం అనే మాటను ఇంగ్లీషులో 'Lisping' అంటారు. ఈరకం అస్ఫుటవాక్కు స్వరూపాన్ని ఈ క్రింద ఉదహరించిన మాటలలో చూడవచ్చును. 'దైల్లో త్రంకుపెత్తె మలిచిపోయినా. ఎవలైనా తెత్తిఇత్తే బౌమానం ఇత్తా' అన్నవాక్యం 'లోహలము' అనుభాషణకు ఒక ఉదాహరణ.

*తూత ఇనయోపేత:* ఇటువంటిదే ఇంకొకటి. ఒక అమ్మాయి అన్నదీ, 'అమ్మా మనదొడ్దులో పూలు పూత్తున్నయ్యే. వాల్లదొడ్లో పూత్తలేవు'అని. మనం ఈరకం మాటలను ముద్దమాటలు అంటాము. ఈ పద్యం చూడండి.

క॥ "అనిదుద్దని చాలిత్తము
ఇనుతకు తూకు ఉదయములు-ఏదుక పొదమెన్
ఇనిపింపు తయిత్తరముగ
ఇనుత బుదవాత, తూత ఇనయోపేతా."

(అనిరుద్ధ చరిత్రము. కథాప్రారంభము)

ముద్దమాటలు ఇల్లాఉంటవి. ఎవరైనా ఇల్లాగ పలుకుతున్నప్పుడు వింటే కాస్త నవ్వురాక మానదు. అసలు పద్యం ఇది.

క॥ "అనిరుద్ధుని చారిత్రము
వినుటకు మాకు హృదయములు వేడుక పొడమెన్
వినుపింపు సవిస్తరముగ
వినుత బుధవ్రాత సూత, వినయోపేతా."

*ప్రలాపం:* ప్రలాపం అంటే అప్రయోజకమైనమాట. 'Incoherent speech'. దీన్నికూడా, హాస్యస్ఫోరకమైన పలుకుబడిగా చేయవచ్చు. ఉదాహరణ కుదరలేదు.

*నిరస్తం:* త్వరితోచ్చరిత పదాన్ని 'నిరస్తము' అంటారు. పదాలను గబగబ పలుకడంలో కొన్నిఅక్షరాలు జారిపోయి ఆపదము హాస్యాకరము అవుతుంది. 'సత్యనారాయణగారు' అనే పదాన్ని మనము తొందరలో 'సత్తనాన్‌గార్' అని అంటాము. అలాఅనాలని అనము. అలా అంటున్నామని, మనకు తెలియనూతెలియదు. అట్లావచ్చేస్తుంది అంతే. 'విశ్వనా సత్యనాన్‌గారు' అంటాము. తొందరలో అల్లా అన్నామని గుర్తించినపుడు మనకే నవ్వువస్తుంది. అల్లాగే 'రామాంజ రావుగారు' 'సుబ్బమన్యంగారూనూ. అయితే ఒకటిమాత్రం నిజం. పఠిత హాస్యవచనములయందు అనురక్తుడూ, క్రీడామనఃప్రవృత్తి గలవాడూ, బహుహాస్య రచనాపఠన జనిత ఉత్సాహభాసితుడూ, అయినపుడే ఇది హృదయంగమ వ్యాపారంగా భాసిస్తుంది. అటువంటివాడికే ఈవాక్యాల లోని స్పృహణీయమైన చమత్కారం గోచరిస్తుంది.

విపరీతార్థ పదప్రయోగము :

వాక్యానికి ఏదో మార్పుకూర్పులవలన విపరీతార్థాన్ని సాధించవచ్చు. కొన్నిమాటలు నొక్కిపలికితే అర్థాంతరం స్ఫురిస్తుంది.

ముఖ్యంగా అపసంహిత, మృషార్థకము, కాకువు అని మూడు ప్రకరణ ములద్వారా విపరీతార్థము వచ్చేట్లు చేయవచ్చును.

అపసంహిత: అపసంహిత అనేపద్ధతివలన హాస్యపరిపోషకము లైన వాక్యాలను రచించవచ్చును. పదములను ఉచ్చరించేటప్పుడు, వర్ణములనూ, వాక్యములు పలుకునపుడు పదములనూ సన్నిహితముగా పలకడము అనగా ఒకదానికొకటి దగ్గరగాచేర్చి పలకడము 'సంహిత' అనబడుతుంది. అయితే విపరీతార్థము కొరకు వాక్యమును విశ్లేషము చేయుట అపసంహిత, అంటే వాక్యంలోని పదాలను పలకవలసిన క్రమంలో, వేగంలో పలకక, కూడనిచోట విశ్రాంతిని ఇచ్చి అర్థాంతర మును సాధించడమే ఇందులో జరిగేపని.

ఒకాయన ఒక కాలేజీలో బుద్ధిహీనులను గురించి ఉపన్యాసం ఇయ్యడానికి ఒప్పుకొన్నాడు. ఆ కాలేజీ ప్రిన్సిపాల్ ఆయనను సదస్యు లకు పరిచయంచేస్తూ "ఇవ్వాళ మీరు బుద్ధిహీనులను గురించి మంచి ఉపన్యాసం వింటారు. మంచి అని ఎందుకు అంటున్నానూ అంటే ఆ ఉపన్యాసం ఇచ్చేఆయన బుద్ధిహీనతను...గురించి, దాని స్వరూప స్వభా వాలను గురించీ ఎక్కువగా పరిశోధనచేశారు." ఇక్కడ బుద్ధిహీనత అన్నమాట దగ్గర కావాలని ఏర్పరిచిన విశ్రాంతివలన అర్థాంతర స్ఫురణ కలిగింది. చమత్కార జనకమూ అయింది.

ఆ ఉపన్యాసకుడు లేచి ఇల్లా అన్నాడు. "నేను బుద్ధిహీనతను గురించి ఎక్కువగా చదివినమాట నిజమే కాని బుద్ధిహీనత విషయంలో మీ ప్రిన్సిపాల్‌గారు...తెలిసికొన్నంత నేను తెలిసికోలేదు." ఉపన్యాస కుడుకూడా కాకువులో నిక్షిప్తమైన అర్థాంతరాన్ని సాధించాడు. ఈ హాస్యము శబ్దములు ఉచ్చరించడంలో కాకువు వలన జనించింది. ఇది శబ్దాశ్రయ హాస్యవిశేషమే!

ఇటువంటిదే ఇంకొకటి. ఒక న్యాయాధిపతి ఒక నేరస్థుని గూర్చి "ఇంత స్కాంత్రతలేను నేనెక్కడా చూడలేదు." అనిఅంటే ఆ నేరస్థుడు జవాబుగా ఇల్లాఅన్నాడు. "నేను దుర్మార్గుణ్ణే కాని గౌరవనీయులైన న్యాయాధిపతి నాకంటే......పెద్దదుర్మార్గుణ్ణి చూడలేదనడము అన్యాయం." 'నాకంటే'దగ్గర ఏర్పడ్డ విశ్రాంతివలన విపరీతమైన అర్థం వచ్చి చమత్కారం సిద్ధించింది. ఈ రెండు కథలలోనూ బుద్ధిపూర్వకంగా కల్పించిన విశ్రాంతివల్ల విపరీతార్థం ధ్వనిస్తున్నది. ఈ మోస్తరుగా కాకువవలన హాస్యోత్పత్తి శబ్దములు ఉచ్చరించడంలో గల వైచిత్రి వలననే సిద్ధిస్తున్నది.

*కాకువు:* శబ్దాశ్రయ హాస్యమును సాధించడంలో ఇంకోపద్ధతి ఉన్నది. దానిని కాకుస్వర పదప్రయోగం అన్నాను. హ్రస్వంగా పలక వలసినచోట దీర్ఘంగా పలకడమూ, దీర్ఘాంతంగా ఉన్నపదమును హ్రస్వాంతం చేయడమూ, జరుగుతుంది ఈ వ్యాపారంలో. ఈప్రక్రియ సాధనలో అట్లాచేయడంవల్ల హాస్యం జనిస్తుంది. అందరికీ తెలిసిన ఒక ఉదాహరణ ఇస్తున్నాను.

*అబద్ధం చెప్పనూ:* కోర్టులో సాక్షిని ప్రమాణం చేయిస్తున్నారు. 'దేవుని ఎదుట——దేవుని ఎదుట' 'అంతా——అంతా' 'నిజం చెపుతాను—నిజం చెపుతానూ!' 'అబద్ధంచెప్పను——అబద్ధంచెప్పనూ!'

*కుక్క కాకానిమీదుగానో :* ఇక్కడ హ్రస్వాంతమైన పదమును దీర్ఘాంతం చేయడంవలన అర్థాంతరం స్ఫురించి చమత్కార హేతువు అయింది. దీనికి మరొక ఉదాహరణ ఇస్తాను. ఇది అందరకు తెలిసిందే. గుంటూరుకు సమీపంలో 'లంజచెరుకూరు.' 'కుక్కకాకాని.' అనే గ్రామాలు ఉన్నవి. ఒక యువకుడు మార్గమధ్యంలో తనకు తారసిల్లిన ఒక సొగసుకత్తెతో వేళాకోళంగా అన్నాడు. "లంజా, చెరుకూరుకు

దారేదీ?" అని. 'లంజ' అన్నమాట సంబోధించినట్లు ఉచ్చరించాడు. ఆ పిల్లకూడా ఈ సరసోక్తిని అర్థం చేసుకొని, "కుక్కా, కాకాని మీదుగా పో!" అన్నది, 'కుక్క' అన్నమాటలను కొంత దీర్ఘాంతంచేసి. ఇందులోకూడా పైన చెప్పిన దాంట్లోవలెనే వాక్య మధ్యమంలో విశ్రాంతి కల్పించడం వల్లనూ, హ్రస్వాంతమును దీర్ఘాంతము చేయడం వల్లనూ జనించింది చమత్కారము.

*మృషార్థకము :* ఈ కాకువు వలననే ఇంకా రమ్యమైనట్టి పరిహాస కుశలమైనట్టి అర్థమును సాధించడానికి వీలువుంది. ఈ పద్ధతిలో వాక్యములోని ఏదో ఒకపదాన్ని నొక్కి ఉచ్చరిస్తే విపరీతార్థం స్ఫురిస్తుంది. ఉదాహరణ – 'ఏమండీ! మీరు ఈ ఊళ్ళో ఇల్లుకొన్నారా?' అని అడిగితే ఒకాయనను, ఆయన "ఇల్లు కొనలేదు" అన్నాడు. ఇల్లు అనే మాటను నొక్కిపలుకుతూ. అంటే ఇల్లుకాక మరేదో కొన్నాడని అర్థం వస్తుంది. పొలమోబొట్రో కొన్నాడని సరిపెట్టుకోవచ్చు. 'తమకు బిడ్డలు పుట్టారా?' అని అడిగినప్పుడు 'బిడ్డలు పుట్టలేదు' అన్నాడు మరొకడు బిడ్డలు అనేమాట నొక్కిపలుకుతూ. బిడ్డలు పుట్టలేదు ఇంకెవరో పుట్టారు అనే అర్థం స్ఫురిస్తుంది. అప్పుడే నవ్వువస్తుంది. బిడ్డలుకాక మరేంపుడతారు? ఇల్లు కొనలేదు అన్నప్పుడు పొలం కొన్నాడుకామాలునని సరిపెట్టుకోవచ్చునుకాని బిడ్డలుపుట్టక మరేమీ పుట్టడానికి వీల్లేదు కాబట్టి మరేదో పుట్టింది అన్నమాట అసంభావితము.

*బిడ్డలుకాక ఇంకేంపుడతారు?* ఇక్కడ ఏమాటా సమాధానంగా మక్కశించదు. ఆ కాకువువల్ల స్ఫురించిన అర్థముఅంటే బిడ్డకాక ఇంకేదో పుట్టిందనే అర్థము, అసంభావితంగా తోస్తుంది. అల్లాగ తోచినందువలన నవ్వువస్తుంది. అసంభావితమైన అర్థము వచ్చేమాటను లేక పలుకుబడిని మృషార్థకము అనవచ్చు. మృషార్థకము అంటే మిక్కిలి అసంభావితమైన అర్థముగల మాట. ఇక్కడ కాకువువలన స్ఫురించిన

అర్థము అసంభావితము కాబట్టి మృషార్థకము అన్నాను. ఆ స్ఫురణ ఒకసందేహములో పర్యవసిస్తే ఏమనాలె? ఉదాహరణవల్ల నేను చెప్ప దల్చుకొన్న విషయము బోధపడుతుంది.

*గర్భమందు జనియించె:* అనిరుద్ధ చరిత్రములో కృతికర్త వంశ ప్రకార వివరణలో, 'అతనిసాధ్వి కొండమాంబ గర్భమందు జనియించె వినయ విద్యాచణుండు హరిహరధ్యాన సేవాపరాయణుండు, మహిత గుణశాలి అబ్బయామాత్యమౌళి' అన్నాడు కవి. ఈవాక్యంలో నవ్వు పుట్టించే సంగతి ఏమీలేదు. అయినా నేను నవ్వుకొన్నాను. ఎందుకూ? 'గర్భమందు జనియించె' అన్నాడు. గర్భమందు జనియించక దేనియందు జనిస్తాడూ? దేనియందూ జనియించడానికి వీలులేదే అని ఒక అనుచిత మైన ఊహవచ్చి నవ్వుకొన్నాను.

*హాస్యశీలుని జబ్బు:* ఈ స్ఫురణకూడా అసంభావితమైన మాటకు దగ్గరసంబంధము గలదే. అందుకని దీనినికూడా మృషార్థకంగా పేర్కొంటున్నాను లేనిపోని ఊహ వచ్చిందని అనుకోవచ్చు. హాస్యాను రక్తుడు ఏవాక్యంలోనుంచి అయినాసరే హాస్యం పిండుకోవలయునని చూస్తాడు. ఉచితానుచితములను ఆలోచించడు. హాస్యశీలునికి ఉండే జబ్బులో ఇదిఒకటి. అయితే ఆ ఊహ జుగుప్సాకరమూ అశ్లీల స్ఫోర కమూ అయితే దానిని పరిత్యజిస్తాడు. ఈ ఊహలో అశ్లీల స్ఫురణ లేదని తోచింది. హాస్యశీలుని పలుకుల్లో ఉండే స్వారస్యము గ్రహించ వలె. అంతే. హాస్యపుపలుకులు తర్కసహితముగా ఎప్పుడూ ఉండవు.

ఒకవాక్యము రమణీయార్థ ప్రతిపాదకంగానూ, రసాత్మకం గానూ ఉంటే అదికావ్యము అని అన్నారు. అల్లాగే వాక్యము పరిహాస మంజులంగా ఉంటే అది హాస్యము. ఆవాక్యము పరిహాస సుందరమా, కాదా, అని నిర్ణయించవలసినది సహృదయుడే. పతిత సంస్కారాన్ని

సంస్కృతినీ వయస్సునూబట్టి వాక్యము రసపరిపుష్టమో కాదో నిర్ణయింప బడుతుంది. ఒకడు పరమరమణీయమైన హాస్యంగా స్వీకరించిన ఉదంతాన్ని మరొకడు అతిపేలవమైనదానినిగా భావిస్తాడు. మృషార్థకము అనేశీర్షికక్రింద చేర్చిన కథాసముచ్చయము రమణీయమైనది అనే నేను భావించాను.

బిడ్డలుకాక ఇంకేం పుట్టారు? గర్భమందు కాక ఇంకెక్కడ పుట్టారు? అనేమాటలు అసంభావితములు కాబట్టి వానిని మృషార్థక వచనాలుగా పేర్కొన్నాను. అట్లాగే ఇంకొకటి. "స్త్రీని ఐరావత ద్విప కుంభ కుచకుంభనుగానూ, పర్వత స్తనినిగానూ వర్ణించిన ఘట్టములు చదివితే నాకుమాత్రం నవ్వొస్తుంది. వాక్యార్థముకాదు మనము తీసుకో వలసింది. కుచములు ఎత్తుగానూ కఠినంగానూ ఉన్నవి అనే స్ఫురణ మాత్రమే మనము గ్రహించవలెనని కవిసామ్రాట్టు పైడిపాటి అంటాడని నాకుతెలుసు. అయినా అవి పర్వతాల్లాగుంటే అబ్బో! ఇంకేమైనా ఉందా చచ్చిఊరుకోమా అని ఒక ఆలోచనవచ్చి కాస్తనవ్వుకొన్నాను నేను. 'కుచములు పర్వతాలంతా!' అన్నమాట అసంభావితమై హాస్య జనక సమర్థము అయింది.

వికృతోచ్చరిత పదప్రయోగము :

*స్వర సంధానము:* స్వరములో మార్పుతేవడము సంధానము. ఇదీ ఉచ్చారణకు సంబంధించిన వికృతే. పదోచ్చారణ స్వరం మార్చువలన వికృతము అవుతుంది. అప్పుడు ఆ వ్యాపారం హాస్య పరిరమ్య సంయుక్తము అవుతుంది. స్వరం మార్చువలన సూక్ష్మంగా శబ్ద వికృతి తప్పక జనిస్తుంది.

అనుష్టుప్: ఒకసారి నేను మా శివశంకరస్వామివారిని అనుష్టుప్ నడక ఎల్లాగ ఉంటుందని అడిగాను. ఆయన "ఒకకాని ఒకేకాని, రెండు

కానులు అర్ధనా, మూడుకానులు ముక్కానీ, నాలుగుకానులు ఒకఅణా." అనే చిరు వాక్యాలను అనుష్టుప్‌లాగ చదివి దాని నడక అల్లా ఉంటుం దన్నారు.

*ఇంగ్లీషు-సంస్కృతంవలె:* పూర్వము ఎవరో ఒకాయన దేశం అంతా తిరిగి ఉపన్యాసాలు ఇచ్చారు. ఆయనపేరు కృష్ణమాచారి. ఆయన ఇంగ్లీషు వాక్యాలను వేదబుక్కల్లాగ ఉదాత్తానుదాత్తాది స్వరవైవిధ్యంతో చదువుతూవుంటే ఎంతో తమాషాగా ఉండేది. ఒక వాక్యం ఇస్తున్నాను. దానిని వేదబుక్కల్లాగ మీరు చదువుకోవలసిందేకాని ఆ చమత్కా రాన్ని ఇంకోవిధంగా తెలియజెప్పలేను. "Oh! what a heart I must have to contemplate without emotion that elevation and that fall."

*ఇంగ్లీషు తెలుగువలె:* 'మై మదరు కేము హియర్. షి ఈజ్ నాట్ హాపీ. షి ఈజ్ ఇల్లు.' మా అమ్మగారు అస్వస్థతగా ఉండి ఇక్కడిక్ వచ్చారు. అనేమాటను ఇంగ్లీషులో సరిగా తెలుగువలె మాట్లాడడం జరిగినప్పుడు, ఎదుటివాడు మాట్లాడేది తెలుగా ఇంగ్లీషా అనే భ్రమ కలుగుతుంది మనకు. అల్లాగే 'వాటూ! ప్రేసు హాజ్ నాటుకమ్మా'- లేటా? హౌ మచూ?" "యూ ఆర్ గోయింగా?" రైటో అనేవికూడా ఇటువంటివే.

*తెలుగు సంస్కృతమువలె:* తెలుగులో వ్రాయబడిన ఈ క్రింది పద్యాన్ని సంస్కృతంవలె ఉచ్చరిస్తే రమణీయమూ అనింద్యమూ అయిన హాస్యము జనిస్తుంది. అయితే ఈ క్రింది పద్యాన్ని శ్లోకము చదివినట్లు చదవవలె. అల్లాంటి పరామర్శకు లోనైనప్పుడే అది అందంగా ఉంటుంది. ఈ రచనను సంస్కృత శ్లోకంలాగ నడిపించే నేర్పు ఉండవలె చదివేవానికి. తెనుగు పదాలలో కూర్చిన ఈ రచనను

సంస్కృతశ్లోకంవలె చదివి ఉచ్చారణా వాల్లభ్యమువలన సంస్కృత శ్లోకమేమోనన్న భ్రమ కలుగజేయడంలో ఉందినేర్పంతా!

"దొంగల్లారా భ్రమలు పడితే పేదవాళ్ళం గదట్రా
కుండా మండా పగలగొడితే కొనుక్కోలేం గదట్రా!"

ఇంకో ఉదాహరణ. "అనవేమ మహీపాలా చూపులున్‌గడు లెస్సలున్ యుద్ధమందు మహాశూర్లా శహభాసునే భలాముండా ధియోయోనః ప్రచోదయాత్!" అని వ్రాశాడు ఒకకవి. దీన్నికూడాశ్లోకంవలె చదివితే తమాషాగా ఉంటుంది.

ఊతపదప్రయోగము :

ఊతము అనగా నేయబడినది అని అర్థం. వస్త్రములను నేయునపుడు వచ్చిన దారమే పదే పదే వచ్చినట్లు కొందరు మాట్లాడు తున్నప్పుడు ఒక విధమైన పదము మళ్ళీ మళ్ళీ వస్తుంటుంది. కనుక లాక్షణికార్థమును ఆశ్రయించి దీనిని సంస్కృతపదముగా స్వీకరించవచ్చును. లేక ఊత అనునది కేవలము దేశీయమే అనుకొన్నచో దీనిని మిశ్రమ సమాసంగా స్వీకరించవలయును. ఊతపదప్రయోగంవల్ల హాస్యాన్ని జనింపజేయడానికి సంకులము బిభీషికము అతివచనము అనబడే మూడు ప్రసిద్ధమైన పద్ధతులున్నాయి. వీనిని ఏవిధంగా ప్రయోగించవచ్చునో చూద్దాము.

*సంకులము :* సంకులం అనే భాషణం ఒకటి ఉంది. పూర్వోత్తర విరుద్ధమైన వాక్యాన్ని సంకులవాక్యం అన్నారు లాక్షిణికులు. ఇదికూడా శబ్దాశ్రయ హాస్యంక్రిందికే చేరుస్తున్నాను. ఒక్క మాటవల్ల విరుద్ధార్థం వస్తుంది. చమత్కారంఅంతా ఆ ఒక్కమాటపైనే ఆధారపడి ఉంటుంది. కాబట్టి దీనిని శాబ్దిక హాస్యంగా భావించాను. సాధారణంగా కాకపోయినా కొంతమంది ఇల్లాంటివాక్యాలను అంటూఉంటారు. ఉదాహరణ. "నేనూ,

నిన్నసాయంత్రం (I mean) అంటే ఇవ్వాళ్ళ ప్రొద్దుననుకో మీఇంటికి వస్తే నీవులేవు." "పాపంవాడు చనిపోయినాడు. అంటే ఇంకా చావలే దనుకో, అందుకు సిద్ధంగా ఉన్నాడు"

ఇటువంటి పలుకుబడి ప్రాచుర్యంగా సంభాషణలో ఉంటుంది. మొదట ఒకవాక్యం పలికి అది తనఅభిప్రాయం కాదని తప్పును తెలిసి కొని రెండవవాక్యంలో తాను ఆ తప్పును దిద్దుకొంటాడు. కొందరి విషయంలో అదొక అలవాటు. వారివిషయంలో తప్పుగా అన్నామని తెలుసుకోవడమూ దాన్నిదిద్దుకోవడమూ అదంతాఏమీఉండదు. ఆవిధంగా మాట్లాడడం వారికి అలవాటుఅయిపోయి ఉంటుంది. పై వాక్యాలలో ఉత్తరభాగము పూర్వభాగానికి విరుద్ధంగా ఉందని మనము జ్ఞాపకం ఉంచుకోవలె.

*భర్తను చేతికిఅందినదానితో కొడుతుంది:* ఈ సంకుల వ్యాపారము ఇంకోవిధంగాకూడా జరుగుతూ ఉంటుంది. అంటే మొదట ఒకడు ఒక మాట అని తరువాత ఆ మాటకు విరుద్ధమైనమాట ఇంకొకటిఅని ఆ రెండూకలిసి ఒకేఅర్థంలో భాసించేటట్లు చేయడానికి ప్రయత్నిస్తాడు కథకుడు. ఈ క్రిందివి ఉదాహరణలు: "ఆమె, కోపంవచ్చినప్పుడు, భర్త అనే జ్ఞానంలేకుండా తనచేతికి దగ్గరగా ఏదుంటే అది తీసుకొని విసురుతుంది అన్నమాటేగాని, చాలాయోగ్యురాలు. ఇతరవిషయాల్లో చాలామంచిగా ప్రవర్తిస్తుంది."

ఇంకొకటి "ఆయన ఏకపత్నీవ్రతుడు అంటానికి ఏమీసంశయించ నక్కరలేదు. కాకపోతే ఎవరైనా ఆడవాళ్లు క్రొత్తవాళ్లు కనిపిస్తే ఊరికే తినేసేటట్లు చూస్తాడు కాని అతని శీలాన్ని సంశయించనక్కర లేదు." మరొకటి. "ఆయనకు కాస్త ప్రథమకోపం అన్నమాటేగాని చాలాయోగ్యుడున్నూ శాంతమే భూషణంగా కలవాడున్నూ." ఇటు వంటి భాషణలలో హాస్యరసము తొణికిసలాడుతూ ఉంటుంది. ఈ

వాక్యాలు ఆనందసంపాదకములు అనడానికి సందేహములేదు. ఇవి ప్రసంగవచన చాతురీ ప్రకటితములు అని భావిస్తున్నాను.

*బిభీషికము* : ఇంకోరకం పలుకుబడి ఉంది. దానికి బిభీషికము అనిపేరు. బిభీషికము క్రిందచేర్చే పదములు సంభాషణలోనే రాణిస్తవి గాని గ్రంథస్థమైతే వాటిరాణింపు లుప్తమైపోతుంది. ఒకవిధంగా అవి ఊత పదాలు. అవి పలకబోయే వాక్యానికి ముందుగానీ వెనుకగానీ ఉండి, ఊతగానో తూకంగానో ఉంటవి. ఏకబురు చెప్పినా సరే విని 'చచ్చాం' అంటారు కొందరు. ఇది వాక్యం చివర వచ్చి తూకాన్ని సరిపుస్తున్నది. "కొంపలంటుకుపోయినవి। వాడు నిన్నసాయంత్రం ఊరికెళ్ళిపోయినాడు" అంటాడు మరొకడు.

కొంపలేమీ అంటుకుపోకపోయినా అట్లాఅంటారు. అంతే. ముందు గానీ వెనుకగానీ అటువంటివాక్యము చేర్చడము అవతలవాణ్ణి భయపెట్టి ఏదోజరిగింది అనుకొనేట్టుచేసి తాను చెప్పబోతున్నదానిని వింటానికి సుముఖుణ్ణిగా చేసుకోవడము కోసమేగాని మరెందుకూకాదు. కాబట్టి బిభీషికమును ఒకభాషణావిశేషంగా పేర్కొంటే వచ్చిన విప్రతి పత్తి ఏమీలేదు. బిభీషికము అంటే నవ్వులాటకు భయపెట్టుట.

*అతివచనము*: ఇంకో ఊతపదం ఉంది. తెలంగాణాలోనివారు ఈ ఊతపదాన్ని ఎక్కువగా ఉపయోగిస్తూ ఉంటారు. మాట్లాడుతూ ఉన్నప్పుడు ప్రతివాక్యాంతమందూ 'వింటిరా' అనేమాట తగిలిస్తారు. ఉదాహరణ: "ఆంధ్రసారస్వత పరిషత్తువారు వింటిరా, ఈ సంవత్సరం వింటిరా, కార్తీకమాసంలోనే విశారద పరీక్షలు నడిపిస్తున్నారు వింటిరా" ఇదీ ధోరణి. ఇట్లామాట్లాడడము నేను ప్రథమతః విన్నప్పుడు విరగ బడి నవ్వుకొన్నాను. అవతల పెద్దమనిషి 'వింటిరా' అన్నప్పుడల్లా 'వినలేదు' అని అనాలని అనిపించేది. అల్లాగ అన్నట్లు భావించుకొంటే మరీ నవ్వొచ్చేది.

పశ్చిమగోదావరి జిల్లావారు "బోధపళ్లే" అంటారు. అప్పుడు కూడా 'బోధపళ్లేదు' అని అన్నట్లు ఊహించుకొని నవ్వుకొనేవాణ్ణి. తెలిసిందా, తెలియాలా, అని కొందరంటారు. అల్లా అనేవాళ్ళకు తాము అల్లాగ అంటున్నాము అనే అభిజ్ఞకూడా ఉండదు ఒకసారి "తెలియ లేదు" అంటే ఎట్లాఉంటుందో! "నమ్మో నమ్మకపో వాడు పొద్దున్న భోజనం చేసే ఆఫీసుకు వెళ్ళాడు." అంటారు. ఇందులో నమ్మకపోడమే టంతటి మహద్విషయం ఏముంది? అదొక ఊతపదం. కొంతమందికి అల్లాఅనడం ఒక అలవాటు. 'నేను చెప్పలేదుటయ్యా.' 'చంపావు' 'మరిగంటే' ఇవన్నీ ఊతపదాలే. ఈ ఊతపదాలవల్ల మనము స్మిత వదనులము కాకపూనము. ప్రసంగవచన చాతురీ విఖ్యాతులగు మొక్క పాటి భమిడిపాట్యాదులు. ఈ ఊతపదాలను, సరసాభిరామ సాహిత్య గోష్ఠులలో తరుచూ ప్రయోగించి శ్రోతలను హాస్యవశ్యులనుగా చేశేవారు. ఈ ఊత పదాలను ఒక రమణీయమైన ఊపుతో అనాలె. అయితే ఇటువంటి ఊతపదాలతో కూడినవాక్యాలు సుకుమార సుందర రసగుళి కలనీ, సముత్కర్షా హేతువులనీ గుర్తించడానికి ఒకవిలక్షణమైన మనః స్థితికావాలె. ఈ ఊతపదప్రయోగమువలన మధురత్వ, రసవత్వ రమణీ యత్వాలు సిద్ధిస్తవని తెలిసిననాడు హాస్యశీలునికి సాహిత్య సామ్రాజ్య పట్టాభిషేకము జరుగుతుంది.

ఆడంబరపదప్రయోగము :

*మశక మహారాజు :* రచనలో మామూలుగా ఉపయోగములో ఉన్నమాటలుకాక పెద్దపెద్ద మాటలు ఉపయోగిస్తే ఆ వాగాడంబరత వలన వికృతి జనిస్తుంది. ఆ వికృతి ఆనందజనకమూ హాస్య ఆవిర్భావ సమర్థమూను. సాక్షిలోనుంచి తీసుకొన్నాను ఈ ఉదాహరణ. దోమ లన్నీ సభచేసినవి. ఆ సభకు కిష్కింధనుంచి కొన్ని దోమలువచ్చి ఒకచో చేరినవి. వాటి వర్ణన ఇది. శ్రీమాన్ మహా మండలేశ్వరుడు,

మహా రాజాధిరాజు, క్రీర పటీర నీహారచంద్రికా సాంద్ర ధిక్కార జగద్విశ్రాంత యశస్సాంద్రములైన కిష్కింధ మశక మహారాజులుంగారి విడిదియది." పానుగంటివారు వాగాడంబరమువలన హాస్యమును సాధించినారు ఇక్కడ.

అప్రసిద్ధ పదప్రయోగము :

ప్రసిద్ధముకానివీ వికృతమైనవీ అయిన పదముల ఉపయోగము వలన రచన వైపరీత్యమును చేకూర్చుకొని సుమనోజ్ఞమైన హాస్యమువలె భాసిస్తుంది. ఇటువంటి హాస్యము ఈ క్రింద ఇచ్చిన ఉదాహరణలలో కనబడుతుంది. బాగా పాడగలవానిని గురించి మనము మాట్లాడేటప్పుడు, వాడిగొంతు బాగుంది అంటాము. వాడిపీక బాగుంటుంది అంటే నవ్వు వస్తుంది. పీక అప్రసిద్ధమైన పదము. సాధారణంగా మనము 'వాడు భోజనంచేశాడు' అంటాము. భోజనం చేశాడు అనక ఆ అర్థంలోనే 'మూతి తుడుచుకొన్నాడు' అనీ, 'సాపాటు చెల్లించాడు' అనీ, 'పిండాకూడు తిన్నాడు' అనీ, అంటే నవ్వుతాము.

*మానవుడు జంతువులను ఫలహారంచేస్తాడు:* అప్రసిద్ధ పదభూయిష్టమైన ఈ క్రింది రచనకూడా భమిడిపాటివారిదే. మనిషితినే ఆహారాన్ని గురించి ఆయన ఇల్లాగ వ్రాశారు. "ప్రాణం ప్రాణాన్ని పోషిస్తుంది. పెద్దప్రాణి చిన్నప్రాణిని మింగేస్తుంది. మానవుడు ప్రాణినీ ప్రాణేతరమునూకూడా తినేస్తాడు. మనుష్యుడు ఇంకోమనిషిని ఆహారంగా పుచ్చుకోటంకూడా కొన్నిచోట్ల ఉన్నది. మనలో ఆ ఆచారంలేదు, గాని ఒక్కొక్కమనిషికి ఇంకొక మనిషిపై కోపంవచ్చినపుడు అతనిని తినేసేటట్లు చూస్తాడు కాని తినడు. సాధారణంగా మానవుడు జంతువులను ఫలహారంచేస్తాడు తననే తినేస్తుందేమో అనేభయం కలిగించిన జంతువుల జోలికిపోడు. అటువంటి భయంలేకపోతే మటుకు ఏ జంతువునైనా చప్పరిస్తాడు. అంతేకాక గాల్లోతిరిగే పక్షుల్నీ, నీళ్ళల్లో సంచరించే

చేపల్నీ, ఆహారంగా స్వీకరిస్తాడు. వృక్షాన్నికూడా మూలం లగాయతూ చిగురుదాకా ఆరగిస్తాడు. ఒక్కొక్క మహానుభావుడు ఉడకబెట్టి జంతువును జంతువుపాళంగా ఊదేస్తాడు."

ఇల్లాగ అప్రసిద్ధ పదప్రయోగ జన్యమైన హాస్యమును సాధించడములో సిద్ధహస్తుడు భమిడిపాటి. ఆయన అప్రసిద్ధపదములను ఏరుకోవడమేకాకుండా మామూలుపదాన్ని పట్టిలాగి కుదించి మెలేసి ఒక విచిత్రమైన పదంగా రూపొందించగలడు.

అప్రయుక్త పదప్రయోగము :

*మట్టికొడుకులు:* అప్రయుక్త పదములుకూడా అప్రసిద్ధ పదముల వంటివే. అప్రయుక్తము అంటే ఉపయోగింపరానిది అనిఅర్థం. సందర్భానుగతంగానే ఒకపదము ప్రయుక్తమో అప్రయుక్తమో అవుతుంది. ఒకసుశబ్దమే ఒకానొక సందర్భములో అప్రయుక్తము అవుతుంది. Son of the soil అన్నమాటను మట్టికొడుకులు అనీ, cool headed fellow అన్నవాక్యాన్ని చల్లని తలగలమనిషి అనీ తర్జుమా చేసినపుడు అన్యత్రా సుశబ్దములు అప్రయుక్తములై, హాస్యజనకములూ అయినవి. శబ్దాశ్రయ హాస్యవ్యాపారాత్మకమగు ఇట్టి వాక్సృష్టి అజ్ఞాన జన్యముకాక, హాస్యావిర్భావమునకు ప్రయత్నలబ్ధము అయినట్లయితే అది వైదుష్యంక్రిందికే వస్తుంది. హాస్యనిర్మాణ కృషిలో అది ప్రతిభా ప్రదర్శనము.

*తలా వెంట్రుకలు నరకబడును :* ఒక హాస్యచిత్రంలో మంగలి షాపు చిత్రించబడినది. ఆ షాపుబయట ఉన్న బోర్డుపై "ఇక్కడ తలా, వెంట్రుకలూ (తలవెంట్రుకలు) నరకబడును." అని వ్రాసిఉన్నది. ప్రయుక్తయోగ్యము కాని 'నరకబడును' అనేమాటవల్ల నవ్వుపొంగులు పొంగులుగా వస్తుంది. "ఇక్కడ కూడు వేయబడును"అన్న అరవ

హోటలు ప్రకటనకూడా ఇల్లాగే నవ్విస్తుంది. ఇంకో ప్రకటనలో ఇల్లా ఉంది. "ఇక్కడ ముఖము కోయబడును" అని ముఖక్షవరానికి వచ్చిన తిప్పలు అది.

అశ్లీల పదప్రయోగము :

అశ్లీల పదములను ప్రయోగించి హాస్యమును సాధించడము జరిగింది పూర్వపురోజులలో. బూతులు అశ్లీలములు. బూతులలో చేసిన రచన అశ్లీల పదప్రయోగ బాహుళ్యమైన రచన. రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దమే కావ్యమని ఆలంకారికుల నిర్వచనము. అయితే రామణీయకము అర్థంలోనేకాక శబ్దములోకూడా ఉండవలె. మన పూర్వులు ఈవిషయము గుర్తించినారా? గుర్తించి ఉన్నట్లయితే హాస్యోత్పత్తికి బూతులు మాట్లాడడము ఒకమార్గమని వారనుకొన్నట్లు మనకు అనుమానం ఎందుకు కలుగజేయవలె? బూతురచనలను ఉత్తమ హాస్యరచనలుగా పరిగణించిన రోజులున్నవి మళ్లీ మాట్లాడితే।

*బూతాడక నవ్వుపుట్టదు :* "ఒకింత బూతాడక దొరకు నవ్వు బుట్టదు ధరలో." "నీతులు బూతులు లోకఖ్యాతులురా కుందవరపు కవి చౌడప్పా" అన్నాడు కవి. కవిచౌడప్ప తరువాత చాలామంది బూతులలో రచనలుచేసి ఉంటారు. తగినంత ఆదరణలేక అవి అదృశ్యమై ఉండవచ్చు. బూతులు రమణీయమైన శబ్దాలుకావు. ఆ రచనలు రమణీయార్థ ప్రతిపాదకములూ కావు. అయినా అవి నవ్వుపుట్టిస్తాయని ఒప్పుకోవలె. అవి ఉత్తమమైన రచనలు మాత్రంకావు. అయితే నవ్వురావడానికి రమణీయమైన శబ్దాలేకాక బూతులుకూడా పనికివస్తవి. అశ్లీలార్థ స్ఫురణవలన బలహీనమైన నరములలో ఏదో చలనము కలిగి చక్కిలిగింత పెట్టినట్లయి నవ్వుతాము.

*రతి-చుంబనము :* జుగుప్సను కలిగించే రచనలు హాస్యప్రోద్బలకములు ఎల్లాఅయినవి అన్నది మంచిప్రశ్నే. దానికి ఒకకారణంఉన్నది.

ఏమిటీఅంటే ఆ బూతురచనలు సభ్యసమాజంముందు చదివితే జుగుప్సా కరంగా ఉంటవి కాని, ఒంటరిగా కూర్చుని చదువుకొంటే ఏహ్యాభావం కలుగదు. తమాషాగానే ఉంటవి. మన రహస్యాంగాలను ఇతరులముందు బయలుపెట్టడానికి సిగ్గుపడతాము. అసహ్యం కలుగుతుంది. కాని ఒంటరిగా స్నానంచేస్తున్నప్పుడు కలిగే అనుభూతి జుగుప్సను సంబంధించినదికాదు. ఆ రచనలు హాస్యరచనల క్రిందే లెక్క. ఉత్తమమైనది కాకపోయినా అది హాస్యమే ఆ రచనలవలన ఆనందం కలగడానికి ఇంకోకారణంకూడా ఉన్నది. రతి చుంబనము మొదలైన కామకలాపాల ప్రశంస వచ్చినపుడూ అవి చదువుతున్నపుడూ వానిని అనుభవిస్తున్నట్లే ఉండి ఆనందం కలుగుతుంది.

*కామక్రీడల అనుభూతి :* ఎట్లాగయినా అటువంటివర్ణనలు ఉత్తమ హాస్యసాహిత్యంలో చేరవు. కల్లుత్రాగితే ఆనందం కలుగుతుంది. ఉపనిషద్వేదాంతం తెలుసుకొన్నా ఆనందం కలుగుతుంది. మరి ఈ రెండింటికిని భేదంలేదూ? ఇదీఅంతే. ఇంకోసంగతి. సంభోగము చుంబనము మొదలగు శృంగార కార్యకలాపాలు సహజమైనవి. వాని పరితృప్తికై మనస్సు రెపరెపలాడుతూ ఉంటుంది. ఆ కోరికలు అవచేతనములో దాగియుండి చాలాఅల్లరిపెడుతూ ఉంటవి. మనము వానిని అణచిపెడుతూ ఉంటాము. బూతురచనలు వ్రాయడమువలనా, చదవడమువలనా, ఆ సహజప్రేరణకు మానసికంగానైనా ప్రతీకారం జరిగింది అనుకోవచ్చు. నాయికానాయకలు కామక్రీడా నిమగ్నులైయున్నట్లు వర్ణించబడిన వర్ణనలు చదివినపుడు ఆ కామక్రీడలవలన కలిగే ఆనందం మానసికంగా మన అనుభూతిలోనికి వచ్చినట్లే. అందుకని అటువంటి రచనలుఇష్టంగా చదువుతాము. తద్రచనాగతమైన హాస్యము అశ్లీల భావకలుషితమైనను మనకు ఆనందాన్నీ తృప్తినీ ఇస్తుంది.

అసభ్య పదప్రయోగము :

బూతులవలెనే తిట్లుకూడా అసభ్యపదములు. ఒకరిని ఇంకొకరు తిడుతూఉన్నా ఆ ఇద్దరూ ఒకరినొకరు తిట్టుకుంటూఉన్నా వాళ్ళమాటలు వింటానికి మనము కుతూహలపడతాము. ఈ తిట్లు అకారణంగాకాకుండా న్యాయసమ్మతంగా ఉన్నట్లయితే మనకు మరీ ఆనందం కలుగుతుంది. ఈ దూషణ వ్యక్తిగతంగా కాక ఒకఅవినీతినో, ఒక అధర్మాన్నో ఒక అన్యాయాన్నో పట్టుకొని తిట్టినట్లయితే మనకు తృప్తీ ఆనందమూ కలుగక మానవు.

హేమాహేమీల్లాంటి కవులు ఒకరినొకరు తిట్టుకుంటూ ఉంటే అది సభ్యత అనిపించుకోదు. అది వ్యక్తిగతదూషణ. జుగుప్సాకరము. పద్యాలలో తిట్టుకొన్నా అది వ్యక్తిగత దూషణ కాకపోదు. తిరుపతి కవులూ, కొప్పరపుకవులూ, ఒకరినొకరు తిట్టుకొన్న ఉదంతము అందరికీతెలిసినదే. ఆ రచనలు తాత్కాలికంగా ఏదోకొంచం తమాషా అనిపించినా అవి శాశ్వతమైన ఆనందాన్ని ఇవ్వలేవు. కవి ఎవ్వరిని తిడుతున్నాడో అందరికి తెలిసినపుడు పేరు ఉచ్చరించకపోయినా అది వ్యక్తిగత దూషణే అవుతుంది. ఆ రచనలు ఏహ్యామై తిరస్కారభావమునకు గురియై పండితుల మన్ననలను కోల్పోయి మనలను వికారపెడతవి అని అంటానికి సందేహములేదు. వాటికి సాహిత్యికమైన విలువలేదు. శాశ్వతత్వము అసలే లేదు. సాహిత్యోద్యానవనములో కలుపుమొక్కలుఅవి. వాటిని పెరికి పారవేయవలె.

సంస్థలనుతిట్టవచ్చు : అయితే ఒక అవినీతిభూయిష్ఠమైన సంస్థను, ధర్మతత్పరతలేని ఒక సమాజమును, సద్ధర్మాచరణకు ప్రతిబంధకమైన ఒక ఆచారమును ధర్మచ్యుతినిపొందిన ఒక సంప్రదాయమును దూషించుటవలన ఆనందమే కలుగుతుంది. దురాచారములయెడ దుశ్చింతలపట్ల

మనకు ఏవగింపు కలుగుటకై వానిని హాస్యధోరణిలో హేళనచేయవచ్చు. కందుకూరివారూ చిలకమర్తివారూ ఇటువంటి పనిని జయప్రదంగా నిర్వహించి హాస్యమును సాధించినారు. ఆ హాస్యము నిర్మలమూ శుద్ధమూ రసజనకమూ అయినది కాకపోవచ్చు. ఒక ప్రయోజనము సాధించుటకై వినియోగపరచిన హాస్యము అత్యుత్తమమైనది ఎప్పటికీకాదు. అయినా అది హాస్యమే.

*ఎద్దుకు కొంత వివేకము కద్దు :* ఇటువంటి రచనలలో హాస్యసాధన అసభ్య పదప్రయోగమువలననే సిద్ధించింది. అశ్లీలార్థములు స్ఫురింపజేసే ఆ మాటలు తీసివేస్తే ఆ రచన పేలవమై అర్థరహితం అవుతుంది. కాబట్టి ఇది శబ్దాశ్రయ హాస్యములో తక్కువరకము. ఇందులో అర్థవైభవముగాని రసపుష్టిగాని వ్యంగ్యమర్యాదగాని శ్లేషసొంపుగాని ఏమీ ఉండదు. నిందాసూచకమైన అసభ్య పదప్రయోగమే ఆ రచనలకు ప్రాణము. హాస్యోత్పత్తికి కారణమూను. సద్విద్యలను, సరససాహిత్యాన్ని, సత్కవితను ఆదరించనివారిని "విద్దెల మేలెరుగని నరు।డెద్దేగా గడ్డితినెడి దెద్దా।పసులందెద్దుకుకొంత వివేకము।గద్దప్పా కుందవరపు కవిచౌడప్పా" అనే పద్యంలో తిట్టినా అదికాస్త సరసంగానే ఉంది. వ్యక్తిగతదూషణకాదది "ఇయ్యగ నిప్పించగల।యయ్యలకేగాని మీసమందరికేలా రొయ్యకు లేదా మీసము కయ్యమునకు కుందవరపు కవిచౌడప్పా". అన్న పద్యంకూడా అటువంటిదే.

*వీనినాలుక పీకా :* కాని సత్యం అడిగితే ఎవరో ఇయ్యలేదని "శాస్త్రుర్లట ఈ నీచుడు।పాసొత్తుల మగడువీని పరువేమోకా।కాస్తంత సత్యమడిగిన నాస్తీయని పలికె వీని నాలుక పీకా!"అన్నాడు ఒకకవి. సత్యం లేదన్నమాత్రాన ఇంతపెద్దశాపమా! అయిననూ పద్యంలో తిట్టడంలో కొంత చమత్కారాన్ని సాధించాడుకవి. ఇల్లాగ అరసికతను

పినాసితనాన్ని తిట్టడమూ ఆ తిట్టడంలో కొంత చమత్కారం సాధించ డమూ దాన్ని హాస్యస్ఫోరకము చేయడమూ బాగానే ఉంది.

*తిట్లు-హాస్యం:* తిట్టు కవిత్వంవల్ల కొంత హాస్యము సాధింపబడ్డ మాట నిజమే. కాదని ఎవరూ అనలేరు. అయితే అది ఉత్తమ హాస్యం కాదంటాను. అంతే. పింగళి సూరన మొదలైనవారు తిట్టడంలో దిట్టల మని గర్వంగా చెప్పుకొన్నారు. "తిట్టుదునా మహోగ్ర కర తీవ్రవచోవర గద్యపద్య సంఘట్ట ఫణీంద్రకోటి ఘనకంఠ విషాగ్నులరీతి మెట్టునన్ నెట్టన దాకగా వలయు నిందయుజేయక పద్యమిస్తినా పట్టపురాజురీతి బహుభంగుల లెస్స సుఖింపగావలెన్" అన్నాడు ఆరుద్రకవి.

తిట్టుకవిత్వం హాస్యవంతము అని తలచి యుండకపోయినట్ల యితే అది ఇంతకాలం నిలిచిఉండేదికాదు. తిట్లతోకూడిన రచన బూతు రచనలవలెనే మనిషిలోఉండే ఒకానొక గుర్తింపరానిదియు హృదయపు లోతులలో దాగియున్నదియు చిత్రప్రమేయము లేనిదియు అయిన ఒకా నొక ప్రేరణకు ప్రతీకారచర్యగా గ్రహించవలసియున్నది.

*Sadist tendency :* అంటే ఒకరిని తిట్టుటలో మనకు తృప్తి కలిగించే గుణం ఏదోఉన్నది. ఒకరిని బాధించి ఏడ్పించడము మనకు ఏదోఆనందాన్ని ఇస్తుంది. ఈ తిట్టడంఅనేది ఒకసహజప్రేరణ. దీన్ని ఆంగ్లంలో *"Sadist tendency"* అంటారు. ఇది ఒక సహజాతము. ఆ సహజప్రేరణకు ఇతరులను తిట్టడమూ కొట్టిబాధించడమూ అనేవి ప్రతీకారములు. అందుచేతనే ఇతరులను అకారణంగా తిట్టినా మనకు సంతోషం కలుగుతుంది. చిన్నపిల్లలు ఒకరినొకరు కొట్టుకోవడమూ తిట్టుకోవడమూ ఈ సహజాత ప్రేరణవల్లనే.

పెద్దవారూ పండితులూ విజ్ఞులూ సంస్కృతమతులూ ఈ ప్రేర ణను అదుపులోపెట్టడము నేర్చుకొంటారు. కాని ఏదో ఆవేశము కలిగి

నపుడూ, మితిమీరిన సంతోషం కలిగినపుడూ, మనిషి ప్రమత్తుడై ఈ ప్రేరణకు లోబడినవాడు అవుతాడు. అప్పుడు ఆ ప్రతీకారచర్య స్వరూపం మారుతుంది. 'లంజకొడకా' అంటే మళ్లీ 'లంజకొడకా' అనితిట్టడం ఈ ప్రతీకారచర్యయొక్క సహజరూపం. ఈక్రింది కథలో ఈ చర్య క్రొత్తబట్టలను కట్టుకొని అలంకారభూషితమై మనోహర రూపాన్ని పొందింది.

రోమన్‌చక్రవర్తి అయిన అగస్టస్ కాలంలో ఇద్దరు యువకులు ఒకే పోలికలో ఉండేవారు. అయితే వారు వేరు వేరు కుటుంబములకు చెందినవారు. వేరువేరు గ్రామములకు చెందినవారు. తల్లిదండ్రులు వేరు వేరు. అయితేవారు ఒకే పోలికగలవారు ఎట్లా అయినారు? పలువురు పలువిధముల ఆడిపోసుకొన్నారు. ఆ మాటలు ఆ పిల్లల చెవులబడ్డవి. వారికి మనఃక్లేశము కలిగింది. ఒక రోజున వారిద్దరూ రోములో ఒక శృంగాటకములో తారసిల్లినారు. అందులో ఒకడు రోము పట్టణ నివాసి రెండోవానిని అడిగాడు "అన్నా! మీ తల్లి కొంతకాలము ఈ పట్టణమున నివసించినదా? అని". అంటే నాతండ్రికి నీ తల్లి ప్రేయసి అయి ఉంటుందనీ ఆ కారణాన నాతండ్రిరూపున నేనుపుట్టినట్లే నీవూ నా తండ్రి రూపునే పుట్టినావని స్ఫురణ.

*కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్* : ఈ స్ఫురణ ధ్వని నిక్షిప్తమై ఉన్నది. ఆ రెండవ యువకుడు "నాతల్లి ఈ పట్టణమున కెప్పుడును రాలేదు. నా తండ్రిమాత్రము కొంతకాలము ఈ గ్రామములో నివసించి యుండేవాడు" అన్నాడు. దానితో మొదటివాడు సిగ్గుపడి తల వంచుకొన్నాడట. "లంజలకొడకా ఎక్కడ కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్" అనే మాటకంటే ఈ యువకుల సంభాషణలోని నర్మోక్తులు మనోహరంగా ఉన్నవి. ఇంకో సంగతికూడా ఉన్నది. ఇతరులను తిట్టకుండా తనముతాను పొగుడుకుంటే అది ఇతరులకు కష్టం

గానే ఉంటుంది. ఇతరులను తిట్టడాన్ని తిరగేస్తే తన్నుతా పొగడుకోవడం అవుతుంది.

*శ్రీనాథుడు నాజూగ్గా తిట్టాడు :* శ్రీనాథుడు తెలుంగురాయనివద్దకు పోయి "ధాటీఘోటక రత్నఘట్టనమిళద్ధారాఘిష్ఠ కల్యాణ ఘంటాటంకార విలుంఠలుంఠిత మహోన్మత్తాహితక్షోణి భృత్కోటీరాంకిత కుంభినీ ధర సముత్కూటాటవీఝూట కర్ణాటాంధ్రాధిప! సాంపరాయని తెలుంగా! నీకు బ్రహ్మాయువౌ"అని దీవించి. "అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికాభిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్ దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరో భామినీవక్షోజ ద్వయకుంభి కుంభములపై వాసించు దద్వాసనల్" అని చెయిజాపి ఉంటాడు కస్తూరికై.

మొదట అంత దీర్ఘమైనదీ కఠినపదభూయిష్టమైనదీ అయిన సమాసాన్ని వాడింది ఆ సాంపరాయని స్వీయపాండిత్య ప్రకర్షచే హడల కొట్టడానికే. తన్నుతాను పొగడుకొనడము ఇతరులను తక్కువచూపు చూడడమే. కొంచం అతిశయోక్తిగా చెప్పాలంటే శ్రీనాథుడు ఆ సాంపరాయని రెండుతిట్టి ఇప్పుడు ఏమంటావు? కస్తూరి ఇస్తావాఇవ్వవా? అని అడిగినట్లు తోస్తుంది. ఈ చమత్కారానికి శ్రీనాథుడు తనలోతాను నవ్వుకొని ఉంటాడు.

*వరూధిని బాగాఏడ్చింది:* ఇల్లాగే ఒకఆమె ఏడుస్తే నీవు బహు అందంగా ఏడ్చావు అనడంలో కొంచం కొంటెతనం ఉంది. ఏడ్చే దానితో నీవు బహురమ్యంగా ఏడ్చావు అనడం ఏమిటీ? ఆమె ఒళ్ళు మండాలనికాకపోతే! అదీ ఒకరకమైన తిట్టే.

కలస్వనంబుతో మీటిన విచ్చు గబ్బి చనుమిట్టల నశ్రులు చిందు వందగ ఏడ్చినా, పంకజ శ్రీసఖమైన మోముపయి చేలచెరంగిడి బాల

పల్లవ గ్రాసకషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనిన్ ఏడ్చినా కిన్నర వధూరాజత్కరాంభోజ కాంభోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్ ఏడ్చినా, అది ఏడ్పేగాని మరొకటికాదు. ఏడ్చిన మనిషితో నీవు మహబాగా 'ఏడ్చావు అనడం ఒకరకం వెక్కిరింపు. ఉపాలంభనము. మరీ తెలుగ్గా చెపితే అది ఒకవిధంగా తిట్టడమే! అయితే ఆ తిట్టు సుకుమారంగా సుందరంగా శ్రవణపేయంగా ఉన్నది. రామకృష్ణుడు "నా కవిత్వమంటొకనికి దప్పుపట్ట పనియుండదు. కాదని తప్పుపట్టినన్ మొగమటు క్రిందుగా దివిచి ముక్కలు వోవ నినుంప కత్తితో సిక మొదలంట గోయుదును చెప్పునగొట్టుదు మోము దన్నుదున్" అనేపద్యంలో వాచ్యంగాను బండగానూ మోటుగాను తిట్టినాడు. పైనచెప్పిన పద్యాలలో తిట్టుఉన్నా అది కృష్ణశాస్త్రి కవిత్వంవలె ధ్వనివ్యంజకంగానూ లలితంగానూ మృదువుగానూ హాయిగానూ ఉన్నది. తిట్టగలవాడు ఉంటే అట్లాతిట్టించుకోవలెనని ఉంటుంది. కాబట్టిఒకప్పుడు తిట్టడమూ తిట్టించుకోవడమూ కూడా మనోహర వ్యాపారమే అవుతుంది. రమ్యంగా తిట్టడము వాక్చమత్కృతే అవుతుంది. హాసజనకవృత్తాంతమూ అవుతుంది.

ఇంతకూ నేను చెప్పదల్చుకొన్నది ఇది. తిట్టడము మానవునికి పుట్టుకతో వచ్చిన ఒకానొక ప్రేరణకు ప్రతీకార చర్యఅనీ, అందుకనే తిట్టుకవిత్వం చాలామందికి హాస్యస్ఫోరకంగానూ సంతోషజనకంగానూ ఉంటుంది అనీ. అటువంటి రచనలు చదివి ప్రజలు నవ్వారు. ఆనందించారు. ఆ రచయితలను సన్మానించారు.

సామాన్యులైనవారి తిట్లు వాచ్యమై అలంకారశూన్యమై జుగుప్సాకరమైన వాక్కులుగా ఉంటవి. రసాభిజ్ఞులు సరసులు అయినవారి తిట్లు అలంకార భూషితములై వ్యంగ్య వైభవోపేతములై రత్నరాసులవలె భాసిస్తూ మనిషిని అపహాస్యంచేయడమూ ఎత్తిపొడుపుమాటలు అన

డమూ వేళాకోళంచేయడమూ వెక్కిరించడమూ అన్యాపదేశంగా సాధించడమూ మొదలైన సాహిత్యప్రక్రియల రూపాన్ని పొందుతవి.

అయితే మనిషియొక్క సంస్కారము సంస్కృతి విద్య నాగరికత సభ్యత వీటినిబట్టి పైనజెప్పిన సహజప్రేరణ ప్రభావజనితమైన ప్రసంగం, మోటుతనమునుగాని కర్కశత్వమునుగాని, సరళతనూ సౌమ్యమునూ సౌకుమార్యమునూ లాలిత్యమునూ ప్రసారగుణమునూ గాని అలవర్చుకొంటుంది. మనిషి సంస్కారహీనుడైనపుడు కర్కశత్వము బయటపడి ఈ సహజప్రేరణకు జరుగు ప్రతీకారము దిగంబరమై వాచ్యమై ఏహ్యమైన తిట్టుగా రూపొందుతుంది.

మనిషి పండితుడూ సంస్కృతీపరుడు అయినపుడు ఆ ప్రతీకారము సరళరూపములో ఉక్తిప్రయుక్తి గర్భితమైన సంభాషణలోనూ, సరసోక్తి నర్మోక్తి మొదలైన ఉక్తి విశేషాలలోనూ, ప్రదర్శితమవుతుంది. ఉక్తి విశేషాలలో ఈ ప్రేరణ ప్రతీకారచర్యలు సూక్ష్మమై అక్షరశయ్యా సౌకుమార్యమునుగలవై రమణీయమై భాసిస్తవి. ఈ ప్రతీకారచర్య కనపడనంత నాజూకుగా ఉన్నా తిట్టు కవిత్వంలో రచయిత యొక్క అహంభావము కనపడకమానదు. రచయిత అనితరసాధ్యమైన పనిని తాను సాధించగలిగినట్లు తృప్తిని పొందుతాడు. తిట్టడంలో అందులో నాజూకుగా తిట్టడంలో తను చేసిన సాహసానికీ చూపిన ప్రజ్ఞకూ తనను తానే అభినందించుకొంటాడు. ఏదో అవమానమునకు ప్రతిక్రియ జరిపినట్లు సంతోషమును పొందుతాడు. ఏడ్పును రమణీయమైన వాక్చమత్కృతిగా భావించడంమాట అటుంచి, మిగిలిన తిట్లవిషయంలో ఒకమాటమాత్రము నిజం. గూఢమైనా బయల్పడినదైనా హాస్యరసపరిపుష్టమైనా కాకపోయినా తిట్టుతిట్టే. అట్టి నిందాత్మకమైన రచన అహంకారము స్వాభిమాన స్ఫురణ ఆదిగాగల క్షుద్రభావసంజనితము మాత్రము అవును. అహంకారంతో సంకుచిత హృదయంతో స్వార్థచిం

తతో అన్నమాటలు సాహిత్యికమైనట్టీ రమణీయమైనట్టీ వికారరహిత మైనట్టీ క్షుద్రభావశూన్యమైనట్టీ హాస్యాన్ని ఇముడ్చుకోలేవు. అట్టి హాస్యము ఉత్తమ హాస్యము కానేరదు. సాహిత్యగతమైన హాస్యము నిస్స్వార్థమై విశాల ఉదారహృదయసంజనితమై వికారరహితమై క్షుద్రభావ శూన్యమై ఆనందమే అవధిగాగలదై ఉంటుంది.

తిట్టు కవిత్వము అంత సరసమైనది కాకపోయినా అది ఉత్తమ హాస్యం అని అనిపించుకోకపోయినా దానిని హాస్యరచనలక్రిందనే పేర్కొనవలసి ఉంది. అందులో కొంత చమత్కారమూ హాస్యమూ ఉన్నది కాబట్టే ఆ రచనలు ఇంతకాలం నిలిచిఉండడము జరిగింది. ఇదివరలో చెప్పిన విషయాన్ని మరొకసారి ఇప్పుడుచెబుతున్నాను. ఈ తిట్టడము ఒకవ్యక్తినిగాక ఒకజాతినో ఒక సంఘాన్నో ఒకదురాచారాన్నో దుశ్శీలతనో తిడితే కాంతాసమ్మితమూ అవుతుంది కమనీయమూ అవుతుంది.

*మధ్యావైష్ణవునకు నామములుపెద్ద* : ఈ క్రిందిపద్యంలో సంఘంలో ఉన్న దుష్టమైన కొన్ని ఆచారాలను హాస్యధోరణిలో నిరసించినాడు కవి. ఒక పద్యం ఉంది. "పెట్టనేరని రండ పెక్కునీతుల పెద్ద। గొడ్రాలి ముండకు గొంతుపెద్ద। గుడ్డి గుర్రపుతట్టు గుగ్గిళ్లు తినపెద్ద। వెలయ నాబోతు కండలకుపెద్ద। అల్ప విద్యావంతుడాక్షేపణకు పెద్ద। రిక్తుని మనసు కోరికలపెద్ద। మధ్యావైష్ణవునకును నామములుపెద్ద." అని. ఈ మోస్తరే నడుస్తుంది.

ఇతరులను తిడితే మనకు ఆనందం కలుగడానికి కారణంమరొకటి ఉన్నది. సంఘంపై మనకు ఎందుకో ఒకందుకు అసూయా ద్వేషమూ కోపమూ ఉంటాయి. వానిని బహిరంగంగా వెల్లడించడానికి వ్యక్తిగత మైన సభ్యత అడ్డువస్తుంది. నీకుగల ద్వేషాన్ని కోపాన్ని ఇంకెవరైనా

బహిర్గతంచేస్తే నీకు సంతోషము. నీవు చెయ్యాలనుకొన్నపని అతను చేశాడుకాబట్టి ఎవరు ఎవరిని తిట్టినా నీకు ఆనందం కలుగుతుంది.

## గ్రామ్య పదప్రయోగము :

గ్రామ్య పదప్రయోగమువలనకూడా హాస్యం సాధ్యమే. విద్యాగంధంలేని పామరులు మాట్లాడేమాటలు మనకు అపరిచితములు అయిన కారణాన క్రొత్తగాఉండి నవ్వుతాము. పామరులు మాట్లాడే మాటలతో కూర్చబడిన రచన చదివినపుడు కలిగే అనుభూతి మాంచి హాస్యరచనలు చదివినపుడు కలిగే అనుభూతికి సన్నిహితంగా ఉంటుంది. ఈ క్రింది రచన చూడండి. తెలంగాణములో నిరంకుశ ప్రభుత్వము నకులోనై బాధలను అనుభవించిన ఒక సేవకుని సొద ఇది.

*నింగలం పెట్టమంటారు :* "ఏంగాశారమో రామరామ యెవలకు జెప్పినా యేంపాయిదలేదు. మారాతే గిట్టున్నది. పట్వార్లట పటేండ్లట తాసీల్దార్లట మోతిమీనట తాలుగుదార్లట కసీరు సెప్రాసులట అమీన్ సాబట ఇంకెవలో ఇంకెవలో తీరుతీరు హోద్దర్లొస్తరు. వచ్చింతడువే 'బేగరోన్కి పకడ్‌లావ్' అంటరు. గుఞ్జంముంగ టుర్కమంటరు. బచ్చాలోనింట్ల సోదమసాలలు పట్టించ్కరమ్మంటరు. ఈ ఉర్కులు బర్వులు యెట్ల జెయ్యాలబ్బా! కాదంటె అంటరుదీసుకొని యీపంతావాయగొడ్తరు. ఉక్కాల్దాగాలె మాకు నింగలం బెట్టమంటరు. ఆల్ల యిండ్ల కాడ ఆల్ల పెండ్లాలేంజేయమన్నా చెయ్యాలె. మాశాతగాదంటే బర్తరపు జేయిస్తమంటరు. ఇదంతా మా నసీబ. మునుపటిజల్మల మేంగూడ గిట్టనే హోద్దార్లమైయుండి మందికొంపలు ముంచినం గట్టనేమో లేకుంటె మాకీజల్మెందుకొస్తది? ఏమిశిత్రమో యేమో ఆల్లయితె కుక్కల్తోని నాకిచ్చుకొంటరు. మమ్మల్నేమొ గంతదూరాన సూస్తె నే మండిపడ్తరు. ఆల్లుగూడ మావోలిగెనే యెట్టిబరువులు మోస్తే తెలి

సొ్తది." ఇల్లాంటి రచనలు నవ్వుపుట్టిస్తాయిగదా! కేవలం పామర జనులు వాడే పదాల ఉపయోగంవల్లనే చమత్కారం వచ్చింది.

*చంద్రశేఖర శతకము :* చంద్రశేఖర శతకములోని ఒక పద్యము ఇది. ఇందులోకూడా పామరజనోపయోగంలో ఉండే పదాలవలననే వాక్చమత్కృతి సిద్ధించింది. "సంగితకాడ పాడకిక సాలిచు నీవది పాడి నందుకున్। యింగితమెంచి నేను మరియిన్నదుకున్ సరిపోయె-వింటివా?। అంగుననే తలూపి నటి అప్పుకు తంబుర యీడబెట్టిపో।బంగుడు బాప నాడయని పల్కును మూర్ఖుడు చంద్రశేఖర" ఇందులో చమత్కృతి గ్రామ్యపదప్రయోగము వలననే సిద్ధించింది. వ్యాకరణ సంస్కారహీన మైన పదప్రయోగంచేత ఈ వికృతి సాధ్యమైనది. కావ్యదోషాలు చాలా వరకు మనకు హాస్యసాధనకు ఉపయోగిస్తాయన్నమాట నిజమే. దైనందిన జీవితవ్యాపారంలో ఎక్కడ ఇల్లాంటి మాటలువచ్చినా అవి నవ్వుపుట్టిస్తూనే ఉంటవి.

*ఈగీత ఆగీతకు తగులుద్ది :* ఇంకో ఉదాహరణ. ఒక ఉపాధ్యాయుడు లెక్కలపాఠం చెబుతూ ఇలాగ అన్నాడు. "చూడండి, ఈ గీతుంది చూశారూ దీన్ని పొడిగిస్తే ఆ గీతకు తవులుద్ది. అప్పుడు అక్కడ కోణం ఏర్పడుద్ది." మనలో చాలామందిమి పదాలను శిష్టజన వ్యవహార నిష్ఠమైన ఒకరూపంలో వాడతాము. ఆ రూపానికి భిన్నమైన రూపాలను అటు ఛాందసులు ఉపయోగించినా ఇటు పామరులు ఉపయోగించినా విపరీతంగాఉండి నవ్వడానికి ప్రేరకములు అవుతున్నవి.

*గ్యానము-గ్దేహము :* కన్యాశుల్కంలో దుకాణాదారు అన్న మాటలు పామరజనులు వాడేవి. అతడు తన దుకాణంలో ఉన్నవారితో అంటాడు "ఎందుకు కొట్లాడుతారు. నీదేవుడూనిజమే, అదుగో ఆసీసాలో ఎలుగుతున్నాడు. నారాముడూ నిజమే." ఇసండి. "గాజుకుప్పెలోస

గడుగుచు ద్వీపంబు ఎట్టులుండుగ్యాన మట్టులుండు, తెలిసినట్టివారి దేహంబులందున ఇశ్వదాభిరామ ఇనురవేమ. కొట్లాటమానేసి గ్యానం ఇనండోన్ ఎఱ్ఱిగొల్లోళు."

*వంకరతనం కనపడితేనే నవ్వు:* ఆ వస్తువులోగాని భాషలోగాని ఏదోఒక వంకరతనం ఉంటేనేగాని నవ్వురాదు. ఇక్కడ భాషలో వంకరతనంఉందని నవ్వుతున్నాము. మనిషి నడవడిలో స్వభావంలో ఊహలో వైపరీత్యం ఉంటే అది భావాశ్రయ హాస్యానికి కారణం అవుతుంది. రూపభేదాన్ని పొందిన శబ్దముల ఉపయోగమువలన సిద్ధించిన చమత్కారము శబ్దాశ్రయమునకు చెందినది. అయితే ఆ శబ్దముయొక్క నిజస్వరూపం తెలిసిఉంటేగాని వక్రతను మనము గుర్తించలేము. వస్తుపరిజ్ఞానము నవ్వతగిన వక్రతను చూచేలాగున చేస్తుంది. ఆ జ్ఞానములేనపుడు వంకరతనం కనపడనూ కనపడదు. నవ్వు రానూరాదు. అందుకనే పామరజనులు వాడే మాటలవలన మనకు నవ్వువస్తుందిగాని వాటిని వాడేవాళ్లకు వైపరీత్యం ఏమీగోచరించదు.

శ్లిష్ట పదప్రయోగము :

*చచ్చిపోయినాడు కాబట్టి బ్రతికిపోయినాడు :* పదాలను శ్లేషించి విశేషార్థమును సాధించడము మన కావ్యాలలో ఎక్కువగా కనిపిస్తుంది. కాని శ్లిష్టపదప్రయోగమువలన హాస్యాన్ని సాధించడం చాలా అరుదు. ఆంగ్లంలో ఈ హాస్యప్రక్రియను 'పన్'అంటారు. ఒకడు చాలాఅప్పులు చేసి చనిపోయినాడు. అప్పులవాళ్ళు వచ్చి మృతుని ఆస్తిని అంతా వశపరచుకొంటూ అతని భార్యా పుత్రులయందు దయదల్చి కొంతఆస్తిని వదిలివేశారు. అతడు బ్రతికియున్నట్లయితే ఆస్తిఅంతా తీసుకొనిపోయేవారు. ఆయన పెళ్లాంబిడ్డలు అల్లాడిపోయేవాళ్లు. ఆ సమయంలో చనిపోయినవాని మిత్రుడు ఒకడు అన్నాడు. "వాడుచనిపోయినాడు కాబట్టి బ్రతికిపోయినాడు కాని బ్రతికిఉన్నట్లయితే అన్యాయంగా చచ్చేవాడు

అని." ఇక్కడ చావడం బ్రతకడం అనేమాటలు ఒకచోట ఒకఅర్థం లోనూ మరొకచోట మరొక అర్థంలోనూ వాడబడినవి. ఆ కారణంవల్ల ఆవాక్యం హాసజనకము అయింది.

*హాస్యసంపద గాలికి కొట్టుకపోయింది :* భమిడిపాటివారు ఒకసారి అన్నారు, మన కవులు బ్రతికి ఉన్నన్నినాళ్లు చచ్చినట్లుండి చచ్చిన తరువాత బ్రతకడము మొదలెడతారూ అని. చావడము బ్రతకడము శ్లేషింపబడినవి. శ్లేషించి హాస్యసాధన చేయడము పూర్వకావ్యాల్లో అక్కడక్కడ ఉంది. కాని చాలాఅరుదు. ఇల్లాంటి వ్యాపారం సంభాషణలో ఎక్కువగా రాణిస్తుంది. పూర్వకవులయొక్క సంభాషణలో ఎంత హాస్యం దొర్లిందో తెలుసుకొనడానికి మనకు ఆధారాలులేవు. ఆ సంపద అంతా గాలికి కొట్టుకుపోయింది. కాలంమ్రింగేసింది. అయితే వారు చెప్పిన చాటువులలో కొద్దిగా మిగిలింది.

*గంగవిడుము. పార్వతిచాలున్ :* శ్రీనాథుడు పలనాడులో ప్రయాణంచేస్తూ నీరుదొరక్క ఇబ్బందిపడి ఈ విధంగా శివుణ్ణి ప్రార్థనచేశాడట. "సిరిగలవానికి చెల్లును।తరుణుల పదియారువేల దగ పెండ్లాడన్।తిరిపెమున కిద్దరాండ్రా పరమేశా గంగవిడుము పార్వతిచాలున్." ఈపద్యంలో గంగ శబ్దముశ్లేషింపబడి చమత్కారానికి తావు ఇచ్చింది. ఇంగ్లీషులో శ్లేషవలన సాధింపబడిన హాస్యపుపలుకులు మనోహరమైనవి కనుపిస్తవి.

*ఆవరణలు వేరు :* సిడ్నీస్మిత్ వీధివెంటవెడుతూ ఉన్నాడు. వీధికి ఒకవైపునఉన్న ఇంటిఆవరణలో నిలువబడియున్న ఒకస్త్రీ అవతలవైపున ఉన్న ఇంటి ఆవరణలో నిలువబడిన మరియొక స్త్రీతో పోట్లాడుతున్నది. వీరిద్దరిమధ్యా రోడ్డు ఉన్నది. ఆ సందర్భంలో స్మిత్ అన్నాడూ, "It is impossible for those women to agree since they are arguing from different Premises." ఇక్కడ Premises

అనేమాట శ్లేషింపబడినది. ప్రిమిసెస్ అంటే ఆవరణ అని ఒకఅర్థం. తర్కశాస్త్రంలో ప్రిమిసెస్ అంటే వాదనకు ప్రాతిపదిక.

ఇల్లాంటిదే తెలుగులోకూడా ఒకటి ఉన్నది. ఒకాయన సంగతి. బ్రతికున్నపుడు ఆయన సర్వవిషయములను చక్కగా నిర్వహించాడు. చనిపోయినాడు. ఆయనను స్మశానానికి తీసుకొని వెళ్ళడానికి వాహకులు దొరకలేదు. అప్పుడు ఒక మిత్రుడు *"మావాడు బ్రతికిఉన్నప్పుడూ నిర్వాహకుడే చచ్చిపోయినా నిర్వాహకుడే అయినాడు అన్నాడట. ఇల్లాంటి శబ్ద చమత్కృతి ఉత్తమ హాస్యంకాదు. అయినా హాస్యపు పలుకుబడే!

*రంభతో క్రీడిస్తున్నాడు:* శిష్ట్లా రామకృష్ణశాస్త్రిగారు ఒకవ్యాసంలో శిష్ట్లా సీతారామశాస్త్రిగారు ఇట్లాఅన్నారని వ్రాశారు. వీరు గుంటూరులో మిషనుకాలేజీలో ఉండేవారట. ప్రిన్సిపాల్‌గారు వారినిపిలిచి మీకు ఎన్ని ఏండ్లు అని ప్రశ్నిస్తే శాస్త్రిగారు "తొమ్మిదేళ్లు" అన్నారట. తొమ్మిదేళ్లు అరవైమూడు. ఆదివారు అనుకొన్న అర్థం. అదేశ్లేష...శివశంకరశాస్త్రి గారు మా యింటికి అప్పుడప్పుడు వస్తూ ఉండేవారు. మేము బందరులో ఉండగా ఒకసారి వచ్చినపుడు మా అబ్బాయి దొడ్లో అరటిచెట్టు దగ్గర ఆడుకొంటూ ఉండడముచూచి, ఏంజేస్తున్నావురా అని అడిగితే వాడు ఆడుకొంటున్నాను అన్నాడు. అప్పుడు శాస్త్రిగారు ఒరే అబ్బాయి రంభతో క్రీడిస్తున్నావురా అన్నాడు. మనోహరమైన శబ్దవ్యాపారము ఇది.

*మగవాళ్ళకు మతిలేదు:* రంభ, క్రీడించు అనే రెండు పదాలు శ్లేషింపబడినవి. రావూరివారి కథ ఒకటి ఉదహరిస్తాను. వారు ఎవరినో అడిగారట చంద్రమతి, సుమతీ ఉన్నారా అని. అవతలి పెద్దమనిషి ఆడ వాళ్లా అన్నాడట. రావూరువారు "ఆడవాళ్లకుకాక మగవాళ్లకు మతి ఎక్కడుందయ్యా! అన్నారట. ఇది ఒకరకమైనశ్లేష. ఇల్లాగ శ్లేషవలన

* ఈ కథ నడిమింటి మంగశేశ్వరశాస్త్రిగారి పేర చెపుతారు.

సున్నితమూ, మనోహరమూ అయినహాస్యాన్ని సృష్టించవచ్చు. కాని ఈ శాబ్దికహాస్యము అత్యుత్తమమైన హాస్యముక్రిందికిరాదు. అనేవాళ్లు ఉన్నారు. ఈ హాస్యప్రక్రియను గురించి ఒక ఇంగ్లీషు గ్రంథకర్త వ్రాసిన రెండువాక్యాలు ఇక్కడ ఉదాహరిస్తాను. "It cannot be denied that an adroit play upon words rarely fails to make the reader smile. But punning pure and simple cannot reach a high standard of humour and should he indulged in with great discretion and very sparingly."

*ఆదిశేషుడు చుట్టలుతాగేవాడు:* ఇంకొక ఉదాహరణ ఇస్తున్నాను. కాటూరు కవిగారు ఒకసారి రాత్రి పడుకోబోయేముందు పొగాకు ముందేసుకొని చుట్టలు చుట్టుకొంటూ ఉంటే నేను అన్నాను. "ఇప్పుడు ఎందుకండీ చుట్టలు చుట్టడము? ఎట్లాగూ పడుకొని నిద్రపోతారాయెను" అని. ఆయన అన్నాడూ "చుట్టచుట్టుకొని పడుకోవడము మంచి అలవాటయ్యా. ఆదిశేషుడు కూడా చుట్టలు చుట్టుకొని పడుకొన్నట్లు పోతన వర్ణించాడు"అని.

*పతితద్విజుడు:* ఈ శ్లిష్టవ్యాపారానికి ఉదాహరణగా మరొక కథ నేను విన్నది ఇక్కడ ఉదాహరిస్తాను. వేంకటశాస్త్రిగారు ఒకపండితుని గురించి మాట్లాడుతూ ఆయనకు పళ్లు ఊడిపోయిన కారణాన ఆయనను పతితద్విజుడు అని అన్నారట. పతితద్విజుడు అంటే పళ్లు ఊడిపోయిన వాడు అనే అర్థమేకాక చెడిపోయిన బ్రాహ్మణుడు అనేఅర్థంకూడా వస్తుంది. ఆ పండితునకు ఈ లక్షణంకూడా ఉండడంవల్ల ఆ మాట సరిగ్గా అతికిపోయి ఆయనకు తగిలొచ్చింది. అక్కడ ఉన్నవారంతా ఈ మాటవిని విరగబడి నవ్వారట.

*గురక కవికి ఉండాల్సినలక్షణము:* కవిత్వంలో ధ్వని ఉండవలె. ధ్వనిక్పాష్కల్యం ఉత్తమకావ్యానికి ఉండవలసిన లక్షణం. ఈవిషయమై

నాకూ జమదగ్నిశర్మకూ సంభాషణ జరుగుతున్నది. శర్మ చివరకు ఈ మాట అన్నాడు. మా అబ్బాయిలోకూడా మహాకవికి ఉండవలసిన లక్షణం ఎక్కువగా ఉందిఅని. ఏమిటి ఆ లక్షణం అనిఅడిగితే 'వాడు స్వప్నావస్థలో ధ్వనికావ్యాన్ని ప్రదర్శిస్తూ ఉంటాడు అన్నాడు జమదగ్ని. ధ్వని శ్లేషింపబడినది. ఇల్లాగే మాతమ్ముడు ఆఫీసులో కైంకర్యము చేస్తున్నాడు అంటేకూడా నవ్వుతాము. కైంకర్యము అంటే సేవ అనీ దొంగతనమనీ అర్థాలు ఉన్నవి.

క్లిష్ట పదప్రయోగము :

*మేస్టరు కిష్టాయ:* యమకంతోగాని అనుప్రాసతోగాని వాక్యము రచనచేసి శబ్దవైచిత్రి సాధించవచ్చు. ఛేకానుప్రాసము లాటానుప్రాసము మొదలైన శబ్దాలంకారాలు హాస్యసాధనకై వినియోగింపబడినప్పుడు ఒకరకమైన శబ్దాశ్రయ హాస్యము సిద్ధిస్తుంది. "మిస్టరు కిష్టాయ కష్టపడిచదివి ఎష్టాగోఅష్టా మెష్ట్రిక్లేషన్ ఫస్టునప్యాసై, అష్టకష్టాలూపడి మొన్న ఆగస్టులో జస్టు పక్షంరోజులుండే మాస్టరీపని అతికష్టంమీద సంపాదించి పనిలోచేరి శిరోవేష్టం ధరించి డస్టరుచేత్తో పుచ్చుకొని దిష్టిబొమ్మలాగ తయారైనాడు."

*వైదికులు:* ఇల్లాంటి రచనలో శబ్దముల గడబిడతప్ప మరేమీ లేదు. ఇల్లాగ చిత్రశబ్దప్రయోగంవల్ల హాస్యోత్పత్తి చేయవచ్చునని పూర్వకవులకు తెలుసు. కవులు చెప్పిన చాటువులలో ఇల్లాంటిశాబ్దికమైన గడబిడ చాలాచోట్ల కనిపిస్తుంది కాని వాట్లో హాస్యం ఏమీలేదు. అందుకని అటువంటి పద్యాలు ఉదాహరించడంలేదు. అయితే ఒకటి రెండు కనపడ్డవి. వాటిలో ఇదిఒకటి. "నీళ్లకు నిర్రితోళ్లకును నేతికరళ్లకు దొడ్డయుత్తరేన్। వ్రేళ్లకు దర్భముళ్లకును వేదపునోళ్లకు సన్నకుట్టువి। స్త్రీళ్లకు రావిపేళ్ల కనిశంబును మళ్లకు పప్పుకూర పచ్చళ్ళకు రాగిబిళ్లలకు సంతతమందుదు రాంధ్ర వైదికుల్."

*ఇందులో ఏముంది?* యమకాది అలంకారాలతో కూడిన ఈ శబ్ద వైచిత్రిలో ఒక వైలక్షణ్యం ఉన్నది. దానినిగుర్తించి ఆనందించడానికి ఒకరకమైన చిత్తవృత్తి అవసరము. ఇందులో ఏముంది అనుకొంటే ఏమీఉండదు. ఏ రచనలోనైనా చమత్కారాన్ని చూడడానికి మనిషిలో ఆసక్తి ఉండాలె. హాస్యాన్ని అర్థంచేసుకోవలెననే కోరిక ఒకటుండాలె ముఖ్యంగా. చంద్రదర్శన మాత్రాన రత్నగర్భ ఉప్పొంగేవిధంగా వికృతదర్శన మాత్రాన హృదయంలో రసవాహిని పొంగులెత్తే స్వభావం కలవాడై ఉండాలె పఠిత.

*రాళ్లు.కూళ్లు.ఊళ్లు:* పైన ఉదాహరించిన పద్యాలలో యమకాది శబ్దాలంకారాలు హాస్యసాధనకై వినియోగింపబడ్డవి. ఇందులో హాస్యం ఛాయామాత్రంగా ప్రతిపాదితమగుతూన్నది. శబ్దాశ్రయ హాస్యంలో ఇదియొక అంతర్విశేషము. ఈక్రింది పద్యాలను కూడా అదేదృష్టితో చూస్తే అందులో ఆస్వాదయోగ్యమూ హృద్యమూ అయిన శబ్దాశ్రయ హాస్యము కనిపిస్తుంది. "చిన్నచిన్నరాళ్లు చిల్లరదేవుళ్లు। నాగులేటి నీళ్లు నాపరాళ్లు। సజ్జ జొన్నకూళ్లు సర్పంబులును తేళ్లు। పల్లెనాటి సీమ పల్లెటూళ్లు!"

పై పద్యంలో అక్షరావృత్తి తీసేస్తే రచన పేలవమైపోతుంది. దానివలననే చమత్కారం సిద్ధించింది. ఇందులో శబ్దవైశిష్ట్యమే గాని విషయవైశిష్ట్యములేదు. ఒకవిధంగా ఆలోచిస్తే శబ్దాశ్రయ హాస్య లక్షణమే అది. ఇల్లాగ శబ్దావృత్తివలన పోషింపబడిన హాస్యము చిన్న పిల్లల పాటలలోకూడా కనిపిస్తుంది. ఇది వదినమీద పాట: "అక్కల కర్ర ముక్కలపీట కూర్చోవదినా కూర్చో। వేపచెక్క వెల్లుల్లిగడ్డ పోక తమ్మి వేసుకో। కాకిబొడ్డు గచ్చకాయ మెక్కి విందు తీర్చుకో। అల్లి తుట్ట మర్రిరొట్ట పైటవేసి కట్టుకో। ఉల్లిపూలు నువ్వుచేరు కొప్పునిండా

పెట్టుకో। అత్తమాట క్రొత్తకుండ సవతిపోరు దిద్దుకో। ఆలగోలు బాలగోలు రవ్వవదిన మాన్పుకో।"

*సీతమ్మ మగడా:* ఇంతవరకు ఉదాహరించిన శబ్దావృత్తి అర్థవంతంగా ఉంది. అర్థంలేకుండా కూడా శబ్దావృత్తి కల్పించవచ్చు. అంటే అంత్యానుప్రాసను కల్పించి వాక్యాన్ని హాస్యవంతం చేయవచ్చు. ఈ క్రింది వాక్యాలు చూడండి. నిరక్షరకుక్షీ గండభేరుండపక్షీ. శీతాంశుకులావతంస సీతమ్మ మొగడా, ఆకర్ణాంత విశాలనయనా వల్లభ రసాయనా।

పరిచ్ఛేదపద ప్రయోగము :

*జల్లెడుమోమువాడు :* పద రూపంలో వికృతిని సాధించడానికి ఉన్న మార్గాలలో ఒక పదాన్ని ఇతరపదసాంగత్యాన్నుంచి విడదీయడం ఒకటి. ఉదాహరణ చూడండి. 'చిగురు + ఆకు = చిగురుటాకు' అయింది. ఆ మాటలో "చిగురు" అనే మాటయొక్క సాంగత్యాన్నుంచి విడదీసి "టాకు" అనేదాన్ని ప్రత్యేక శబ్దంగా తీసుకొంటే అది పరిచ్ఛేద శబ్దం అయింది. "కృపారసంబు పైజల్లెడు మోమువాడు" అనే వాక్యంలో 'జల్లెడు' అనేమాటనుతీస్తే ఆ విశ్లథపదానికి ఇతరపదాల సాంగత్యంలో ఉన్నప్పుడు ఉన్న అర్థంకాక మరో అర్థం రావడానికి వీలుంది. 'జల్లెడు మోమువాడు' అంటే జల్లెడవంటి మోముకలవాడూ అని అర్థం కల్పించి చెప్పి హాస్యాన్ని సృష్టించవచ్చు.

*Don't talk:* నేను ఉపాధ్యాయుణ్ణిగా ఉన్నప్పుడు ఇల్లాంటి తమాషా ఒకటి జరిగింది. తెలుగు పాఠాలు చెప్పమని నన్ను ప్రధానోపాధ్యాయులవారు కోరారు. తెలుగుపండితులక్లాసుల్లో కుర్రవాళ్లు అల్లరి చేస్తున్నారట. ఇంగ్లీషువచ్చిన మాష్టరు అయితే బాలురను క్రమ శిక్షణలో ఉంచగలడనీ అటువంటివాడు తెలుగుపాఠాలు చెబితే క్లాసుల్లో అల్లరి

ఉండదనీ ఆయన అభిప్రాయపడ్డాడు. అందులోకొంత నిజం లేకపోలేదు. కుర్రవాళ్లు అల్లరిచేస్తుంటే 'Don't talk. Sit down' అని గట్టిగా కోప్పడితే వచ్చే సత్ఫలితము 'మాట్లాడకు కూర్చో' అని ఎంత గట్టిగా అరచినారాదు. ఇంతకూ ఏమైందిఅంటే ఆయనకు ఇంగ్లీషూ తెలుగూ సమానంగా వచ్చినవాళ్లు కనబడక నాతో 'నువ్వు తెలుగుపాఠాలు చెప్పాలె తప్పదు అన్నాడు.

*వెంకయ్యవ్యాకరణం*: నాకు తెలుగులో పాండిత్యంలేదు. ఏదో కాస్తోకూస్తో పరిచయము ఉంది. నీవే తెలుగుపాఠాలు చెప్పాలె అని ఆయన అన్నప్పుడు నేను కాదనలేకపోయినాను. చెప్పలేకపోతానా అని అనుకొన్నాను. ఏదో తెలుగుసాహిత్యంతో కొద్దిగా పరిచయముండె. వెంకయ్య వ్యాకరణంకూడా చదివి ఉంటిని. వాళ్లకు చెప్పడానికి ఈ మాత్రంచాలదా అనుకొన్నాను. అదీగాక తెలుగుపాఠ్య గ్రంథాలకు అయిదుగురు పండితుల నోట్సు ఉండనేఉండె. ఎలాగో లాగేద్దాముఅని కూడా ఆలోచించాను. అన్నిటికంటే ముఖ్యం తెలుగుపాఠాలు చెప్పాలని సరదాకూడాఉందినాకు. సరే అన్నాను.

*పండితులు పళ్లుకొరికారు*: నన్ను తెలుగుపాఠాలు చెప్పడానికి నియోగించేసరికి అసలు తెలుగుపండితులకు పుట్టెడంత కోపంవచ్చింది. "ఈయనకు తెలుగు ఏమివచ్చునని పాఠాలు చెప్పడానికి ఒప్పుకొన్నాడు. ఈయనకు ఇంతధైర్యం ఎల్లాగవచ్చింది. ఏమి చెప్పగలడో అదీ చూస్తాము!" అని పళ్లు కొరికారట పండితులు. వాళ్లు విద్యార్థులను నాపై ఉసిగొల్పారు. ఈమాటకు అర్థం అడుగు. ఈ సమాసానికి విగ్రహం చెప్పమను అని వాళ్లను పంపేవాళ్లు. పిల్లలువచ్చి అడుగుతూ ఉండే వాళ్లు. తెలిస్తే చెప్పేవాణ్ణి తెలియకపోతే ఆమాటకు వికృతి ఏమిటిరా దానికి వికృతిలేదు అని దబాయించి ఉపాయంగా నెట్టుకొస్తూ ఉండేవాణ్ణి.

*వ్యాకరణం రాదు :* ఇల్లాగ ఎంతోకాలం గడవకముందే నాకు తెలుగు బాగారాదనీ వ్యాకరణ జ్ఞానం బొత్తిగా శూన్యమనీ ఒకపుకారు బయలుదేరింది. దాంతో నేను కుర్రవాళ్లకు లోకువైపోయినాను. ప్రతి బొడ్డూడని వెధవ వచ్చి ఏదోప్రశ్న అడిగి నేనుచెప్పిన సమాధానంతో తృప్తిపడక ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వెళ్లిపోతూ ఉండేవాడు. ఒకరోజున ఒకకుర్రవాడువచ్చి నా పాండిత్యాన్ని పరీక్షిస్తున్నవాడిలాగ తెలివైన చూపులుచూస్తూ మాస్టారూ 'లంగూడీ' అంటే ఏమిటండీ అని అడిగాడు. లంగూడీ ఏమిట్రా ప్రభూ నేను ఈమాట ఎప్పుడూ విన లేదే అని అనుకొని 'ఆమాట ఎక్కడొచ్చిందిరా'అని అడిగాను. వాడు 'వెంకయ్య వ్యాకరణంలోనండి' అన్నాడు. చచ్చానురా బాబూ ఈ మాటకు అర్థం చెప్పలేకపోతే నాకు తా॥ వెంకయ్య వ్యాకరణంకూడా రాదనుకొంటారు. అనిభయపడ్డాను. ఇంతలో గంటకొట్టారు. నేను క్లాసు వదలి వెళ్ళిపోయినాను. ఆ కుర్రాడు జ్ఞాపకం ఉంచుకొని మరునాడు మళ్లీ అడగొచ్చాడా అనుకొన్నాను. కాని వాడికి జ్ఞాపకం ఉండనూఉంది. వచ్చి అడగనూ అడిగాడు 'లంగూడీ అంటే ఏమిటండీ' అని.

*లంగూడీ :* ఈ లంగూడీ ఎక్కడనుంచివచ్చిందో నా ప్రాణం తీస్తున్నది అనుకొని 'ఆమాట నీకు ఏ పుస్తకంలో వచ్చింది. ఆపుస్తకం ఒకసారి తీసుకొనిరా' అన్నాను. అసలు ఆ పుస్తకంలో చూస్తే ఆమాట ఏమిటో ఏ సందర్భంలో ఆమాట ఉపయోగింపబడ్డదో తెలుసుకో వచ్చునుగదా అని ధైర్యం తెచ్చుకొన్నాను. అసలు శతవిధాల ఆమాట అక్కడ ఉండదనే నాధైర్యం. అయితే ఆ కుర్రాడు ఆ పుస్తకం తెచ్చి చూపించాడు. అందులో ఆమాట ఉండనేఉంది. ఏమిటి ఆవాక్యం అ,ఆ,ఇ,ఈ లంగూడి అని. ఓరి సన్యాసి ఎంతభయపెట్టావురా అని విసుక్కుని ఆ కుర్రవాణ్ణి పంపేశాను. మాటను విడదీయడంవల్ల ఇల్లాంటి హాస్యము వస్తుందీ అనిచెప్పడానికి ఇదంతా చెప్పాను.

*గాదె రావణుడు :* ఇల్లాంటిదే ఇంకొకటి. కుర్రవాడు ఒకడొచ్చి రావణుని ఇంటిపేరు ఏమిటండీ? అనిఅడిగాడు. ఆకాలంలో ఇంటిపేర్లు ఉండేవికావు అన్నాను. వాడు లేకేమండి మీకు తెలియకపోవచ్చు. రావణుని ఇంటిపేరు 'గాదె' వారండీ అన్నాడు. నీకెట్లా తెలిసిందిరా అంటే నాపాఠ్యపుస్తకంలో ఉన్నదని తెచ్చిచూపాడు. ఉన్నది. 'గర్వించి చెడిపోయె...గాదెరావణుడు.' సంధివలన వచ్చేమార్పులు తెలియక ఇల్లాంటి అవస్థలు వస్తూఉంటవి.

*బంపుమామ :* 'అల్లుడా రమ్మని ఆదరంబున బిల్వ బంపుమామను బట్టి జంపగలమే!' అన్నవాక్యంలో ఉన్న 'బంపుమామ' తెలుగు నేల మీద చాలాకాలంనుంచి ఉంటూన్నసంగతి అందరికీ తెలిసిన విషయమే. ఒక వాక్యంలో ఉన్న ఏశబ్దానికైనా ఇతరశబ్దాల సహచర్యం వలన అర్థము నిర్ణయింపబడుతూ ఉంటుంది. అన్యశబ్దాలనుండి దానిని విడదీస్తే విపరీతార్థము సిద్ధిస్తూఉంటుంది. అల్లాంటి విశ్లథ శబ్దము వికృత భావ ప్రతిపాదకమై హాస్యస్థాయికము అవుతున్నది. శబ్దాశ్రయ హాస్యములో ఇదికూడా ఒక అంతర్విశేషము.

అనర్థ పదప్రయోగము :

*మహాబ్రాహ్మణుడు :* ఒకమాటను మంచిఅర్థంలో వాడుతున్నానని వ్రాస్తే దానికి ఒక చెడుఅర్థం ప్రాప్తించడం కూడా హాస్యహేతువే. ఉదాహరణ. గొప్పబ్రాహ్మణుడు అని అర్థంవస్తుందనుకొని మహాబ్రాహ్మణుడు అని వాడితే చెడుఅర్థం వస్తుంది.'మహాబ్రాహ్మణుడు'లో మహాచ్ఛబ్దముకు 'గొప్ప' అనే అర్థం లేకపోగా అదిదురర్థకము.'మహావృష్టి''మహాభోజ్య' అనుశబ్దాలు అటువంటివే. ఈ వాక్యాలు కావ్యాలంకార సంగ్రహము అనే గ్రంథములోనివి. నావికావు.

అస్థాన పదప్రయోగము :

*ఇంకో కామరాజు :* ఒకపదాన్ని ఉండవలసిన ప్రదేశంలో ఉంచక వేరుప్రదేశంలో ఉంచితే అర్థాంతరం స్ఫురిస్తుంది. అన్వయము కుదరక

అపార్థము సిద్ధిస్తుంది. ఒకసారి ఆంధ్రప్రభలో 'ఇంకో కామరాజు పథకం' అని పెద్ద అక్షరాలతో ఒకవ్యాసం ఉంది. మొదటిసారి నేను చూచినపుడు ఇంకోకామరాజు ఉన్నాడా ఆయన ఎప్పుడు వచ్చాడు రాజకీయరంగంలోకి అనుకొన్నాను. పథకం ఇంకొకటికాని ఇంకోకామరాజు కాదు. ఎందుకొచ్చింది ఈ విపరీతార్థం అంటే 'ఇంకో' అనే పదము ఉండవలసిన స్థానంలో లేదు. కామరాజుగారి ఇంకోపథకం అంటే ఈ తిప్పలుండేవికావు. స్థానంగాని స్థానంలో పదం ఉండడంవల్లనేగదా ఈ విపరీతార్థం వచ్చింది. అందుకని దీనిని అస్థానపదప్రయోగం అన్నాను.

*ఆమె ఊడదీయటానికి వీలున్న కాళ్లుగలది :* అస్థానపదం అంటే ఆ స్థానంలో ఉండకూడని పదం. ఈ వాక్యంచూడండి. ఇందులో ఇటువంటి పదప్రయోగంవల్ల చాలా విచిత్రమైన అర్థంవస్తుంది. "ఆమెఊడ తీయడానికి వీలుగల కాళ్లు గలది, పడుకుంటానికి పనికివచ్చేది అయిన కుర్చీ కావాలన్నది." సరీగా అర్థంచేసుకోకపోతే ఆమెకాళ్ళు ఊడదీయడానికి వీలుగలవి అనే అర్థం స్ఫురిస్తుంది. "ఆమె" అనేమాటను ఆ స్థానంనుంచి తీసి కుర్చీ తరువాత వేస్తే అటువంటికుర్చీ ఆమె కావాలన్నది అని సరియైన అర్థం వస్తుంది. అస్థాన పదప్రయోగంవల్లనే ఈ హాస్యాస్పదమైన అర్థమువచ్చింది.

పారిభాషిక పదప్రయోగము :

*వ్యాకరణశాస్త్రపరిభాష :* కొన్నిమాటలున్నవి. అవివాటికి సంబంధించిన శాస్త్రంలోనే రాణిస్తవి. వాటిని తీసుకొచ్చి వ్యుత్పత్త్యర్థంలో మామూలు సంభాషణలోవాడితే అదొకరకమైన చమత్కారం సిద్ధిస్తుంది. ఒక ఉదాహరణ. వితంతువులకు శిరోముండనము స్మార్తులలో నిత్యము. అద్వైతులలో వైకల్పికము. విశిష్టాద్వైతులలో ముండనములేదు అన్నారు మాశివశంకరశాస్త్రిగారు. ఒకరన్నారు, దూశిపాళవారు విశ్వనాథవారికి తత్సమము అని.

*వణ్ణం :* ఇంకొక ఉదాహరణ. మాఇంట్లో ఒక కుర్రవాడుఉండే వాడు. నాకు బావమరదివరస. ఎవరో అడిగారు ఎవరా అబ్బాయి అని. వాడొక బాపవిభక్తికము. అన్నాడు మా రుక్మిణీనాథుడు. విశాఖపట్నం జిల్లావారు అన్నం అనేమాటను వణ్ణం అంటారు. ఎందుకు అట్లా అంటారూ అని అడిగితే, శర్మ అది యణాదేశసంధి అన్నాడు.

*వేదాంతపరిభాష :* ఆయనకు భార్యమాట మహావాక్యం. "అహం బ్రహ్మాస్మి" లాగ. ఇవాళ వంటలో ఏమిటీ సత్పదార్థము అన్నాడు ఒక గృహస్థు. మంచి రుచిగలకూరఏది అని అతని ఉద్దేశము. కూటస్థుడు అంటే ఏమిటయ్యా అని అడిగాను రావూరును. ఆయన "ఎవ్వడైతే భార్య ఏమన్నా ఎంత నిందించినా పట్టించుకోకుండా వికారమును పొంద కుండాఉంటాడో అతడు "కూటస్థుడు". అతడే సద్గృహస్థు" అన్నాడు.

*ఆలంకారిక పరిభాష : ముఖసంధి.* భార్యాభర్తలు పోట్లాడు కొన్నారు. కొన్నాళ్ళు మాట్లాడుకోలేదు. ఇప్పుడెట్లాఉన్నారువాళ్ళు అని అడిగితే రావూరు, వారిద్దరికి రాజీకుదర్చాలని ప్రయత్నాలు జరుగు తున్నవి. నిర్వహణసంధి జరగొచ్చు. కాకపోతే ముఖసంధిలో ఆపోట్లాట అంతము అవుతుంది. చివరకు గర్భ సంధిలో ఈ వ్యవహారము పర్యవ సిస్తుంది" అని అన్నాడు. ఏమిటి ఈ మాటలకు అర్థం అని అడిగాను. ఆయన విపులంగా చెప్పాడు. మధ్యవర్తులు ఎవరికి చెప్పవలసినమాటను వాళ్లకుచెప్పి పోట్లాట సమసిపోయేలాగునచేస్తే అది నిర్వహణసంధిట! సంధికార్యము ఇతరులచే నిర్వహింపబడినది కొబట్టి దానికాపేరువచ్చింది. అట్లాకుదరకపోతే భర్తేస్వయంగా భార్యదగ్గరకువెళ్లి ముఖంమీద ముఖం పెట్టి చెవులో ఏవోమంచిమాటలు రహస్యంగాచెప్పి వీలైతేముద్దుపెట్టి రాజీచేసుకొంటే అది ముఖసంధిట.

*గర్భసంధి :* ఆ తరువాత వాళ్ళు కులాసాగా కాలంగడుపుతారనీ ఆమెకు గర్భంరావడంతోనే ఈ పోట్లాటమాట అసలే జ్ఞాపకం ఉండ దనీ పూర్తిగా సమసిపోతుందనీ దానిని గర్భసంధి అంటారని చెప్పాడు.

*అధ్యవసాయము :* ఇది అలంకారశాస్త్ర పరిభాషలో వస్తుంది. కాని ఎటువంటి అలంకారమోచెప్పను. ఎందుకంటే నాకు సరిగ్గాతెలియ లేదు. అయితే మామూలు వ్యవసాయము కాదనిమాత్రముతెలుసు. నా స్నేహితుణ్ణి ఒకరిని ఏమిటయ్యాఅదీ అంటే, ఎందుకయ్యా నీకు ఆ గొడవఅంతా, ఒకరకము వ్యవసాయాన్ని అధ్యవసాయము అంటారు, అన్నాడు. అట్లాగే వ్యభిచారీ భావముఅంటే ఏమిటీఅంటే నీకెందుకు అది అంతమంచి భావముకాదు అదొక క్షుద్రభావం అన్నాడు ఆయానే.

*ధ్వని :* ఇంకొకటుంది. ధ్వని. అలంకారశాస్త్రంలో దానిఅర్థం అందరికీ తెలిసిందే. ఒక వాక్యానికి అందరికీ తెలిసినఅర్థం ఒకటుంటే సహృదయులకుమాత్రమే స్ఫురించేఅర్థము ఇంకొకటి ఉంటుంది. దానిని ధ్వన్యర్థము అన్నారు. మావాడు ఒకడున్నాడు. వాడు ధ్వనికి క్రొత్త అర్థంచెప్పాడు. 'వాడు ధ్వనించాడు'. అంటే చాలాచప్పుడుచేశాడు అని అర్థమట. అంటే ఈ పారిభాషిక పదానికి అర్థం చప్పుడు చేయడమట.

*వస్తుధ్వని :* ఒకరింటికివెడితే అక్కడ చాలా గోలగాఉంది. పిల్లలు చెంబులను తప్పాలలను విసిరినేలకేసి బాదుతున్నారు తలుపులు కూడా బాదుతున్నారు. డబ్బాలు మ్రోగిస్తున్నారు. ఏమిటయ్యా ఈమోత అన్నాను. ఆయన అదంతా 'వస్తుధ్వని' అన్నాడు. వస్తువులచేత చేయ బడ్డధ్వని కాబట్టి వస్తుధ్వని అయింది.

*రసధ్వని :* ఆ తరువాత ఆ పిల్లలతల్లి అందరినీ తలానాలుగూ వడ్డించింది కాబోలు ఏడుస్తున్నారువాళ్లంతా. ఇదేం ధ్వనిబాబూ అన్నాను. ఇది రసధ్వని అన్నాడు. కరుణ రౌద్రము మొదలైన రసాలు ఆధ్వనిలో అభివ్యాప్తం అయిఉన్నవట. అందుకని అది రసధ్వనిట.

*అప్రతీతికము :* ఈ విధంగా పారిభాషిక పదాలకు వింతవింతయైన అర్థస్ఫూర్తి కల్పించి వాడడంవల్ల హాస్యము ఉత్పన్నం అవుతున్నది.

ఈ శాస్త్ర పారిభాషిక పదప్రయోగాన్నే అలంకారశాస్త్రంలో అప్రతీతిక పదప్రయోగం అన్నారు.

అనులాప పదప్రయోగము :

దీనినే ముహుర్భాషా అంటారు. శబ్దదోషాలన్నీ హాస్యసాధనకు వినియోగపడేవే. ఒకేఅర్థంగల రెండుమాటలను కలిపితే ఆ సంశ్లిష్ట రూపము హాస్యాస్పదము అవుతుంది. 'కిరసనాయిల్‌నూనె, హోలు మొత్తంమీద, చీకటిగుయ్యారం, మగపురుషుడు, చీకటిగాఢాంధకారము, తీపిమధురం, అగ్నినిప్పు, పేపరుకాయిదం, చేదువిషం, పులుపురొడ్డు, చచ్చినశవం, చచ్చినచావు, ఇటువంటి మాటలు వింటూఉంటే నవ్వొస్తుంది. ఒకే అర్థంగలమాటలను ఈ విధంగా కలుపడాన్ని ఇంగ్లీషులో "టాటోలజీ" (Tautology) అంటారు. "Tautology is, using two or more words to express the same meaning" దీనికి ఉదాహరణగా "Female women" అన్నమాట పేర్కొనబడింది.

బధిర సమాధాన పదప్రయోగము :

మనం ఒకమాట అంటే దానిని మరొకమాటగా అర్థం చేసుకొంటాడు చెవిటివాడు సరిగ్గా వినపడనికారణాన. ఈ వినపడకపోవడము రెండురకాలు. కొందరికి బొత్తిగా వినపడదు. అటువంటివాళ్ళను మనం ఒకప్రశ్న అడిగితే వాళ్లు ఇచ్చే సమాధానము మనప్రశ్నకు ఏమీసంబంధం లేనిదిగా ఉంటుంది. ఒక ఉదాహరణ. వీరేశలింగంగారు వ్రాసిన ఒక ప్రహసనంలో ఉంది ఈవిషయము. ఒకబధిరుడు పూటకూళ్ళమ్మ ఇంటికి వస్తాడు. అమె అంటుంది. "బాబూ ఇప్పటికే ఇల్లు నిండిపోయింది. మీరు బసచేయటానికి ఇక్కడ స్థలంలేదు"అని. ఆచెవిటివాడు "మేడమీది గదిలో అయితేనేమమ్మా నాకేమీ అభ్యంతరంలేదు. నేనేమైనా ముసలివాణ్ణా ఎక్కలేనేమో అనుకొంటానికి అంటాడు.

ఇల్లా అని ఇంకేమి వినిపించుకోకుండా గబగబ మేడమెట్లు ఎక్కి, ఆవిడ తన స్వంతఉపయోగానికై ఉంచుకొన్నగదిలో ప్రవేశిస్తాడు. భోజనసమయంలో ఆమె అందరికీ అరటిపండ్లు వడ్డిస్తూ ఈ బధిరునితో పెద్దగా అంటుంది "బాబూ మీకుకూడా రెండుపళ్లు వేయనా? అయితే అవి నాలుగుఅణాల ఖరీదు"అని. ఆయన వెయ్యమని తలఊపి పండ్లు విస్తరిలో పడ్డతరువాత "ఊరికేవేస్తానంటే ఎవరు వద్దంటారమ్మా" అని పెద్దగా నవ్వుతాడు. ఆమాటమీద ఆమెకు కొంచెము తత్తరపుట్టి. 'ఈ పండ్లు ఊరికేవేయడంలేదు. నాలుగుఅణాలు ఇవ్వాలె' అనిఅంటే నీవు అంతగా డబ్బుపుచ్చుకోను అని అంటూఉంటే, నేనుమాత్రం ఏమిచేసే దమ్మా సరే పోనీలే అంటాడు ఆ చెవిటిమొత్తుకోళ్లు పూటకూళ్లమ్మ అన్నమాటలు ఆయనకి బొత్తిగా వినపడనికారణాన. ఈ సంభాషణలో ఒకరిమాటకూ మరొకరిమాటకూ పొత్తులేదు. అదేవిపరీతంగా ఉండి నవ్వు పుట్టిస్తుంది.

ఇంకోరకం చెవిటివాళ్లు ఉన్నారు. వాళ్లకు మనం అనేమాటలు కొద్దిగా వినిపిస్తవి. అయితే మనంఅన్నమాట యథాతథంగా వినిపించదు. మనమాటకు సన్నిహితమైన ఉచ్చారణగల మరోపదంలాగ వినిపిస్తుంది. మనము అన్నమాటలాగ ధ్వనించే మరొకమాట అతని ఊహకుతోచి అదే మనము అన్నాము అనుకొని జవాబు చెపుతాడు ఆరకం చెవుడు ఉన్నవాడు. ఆ జవాబు సందర్భానికి సరిపోక నవ్వుకు కారణము అవుతుంది. సందర్భశుద్ధి లేకపోవడము హాస్యానికి లక్షణము అని ఇదివరకే చెప్పాను.

సమనులు అంటే సామానులు: ఒక యువకుడు తల్లినిఅడిగాడు "అమ్మా ఇంటిపన్నుకట్టాలె నీదగ్గరున్నపైసలు ఇస్తావా అని. ఆమె అన్నది "తొంటిపన్నుకట్టడం ఏమిత్రానాయనా? అయినా ఆమాత్రానికి నాదగ్గరున్న కాసులు ఎందుకు? డాక్టరు దగ్గరకువెళ్లి ఒకరూపాయియిస్తే

పీకేస్తాడు అని. ఆమె చెవుడు అటువంటిది. ఆమెకు ఒకమాట ఇంకొక మాటగావినిపిస్తుంది. ఒకసారి కోర్టువారు సమనులుపంపారు ఆమె కుమారునికి. బంట్రోతు "అమ్మా సమనులు తెచ్చానమ్మా అబ్బాయిగారికి" అన్నాడు. అ బధిరురాలు 'తెచ్చినసామానులన్నీ ఆ నడవాలోపెట్టిపో బాబూ అబ్బాయి ఇంట్లోలేడు' అన్నది. ఆ బంట్రోతు నవ్వుకొని వెళ్లి పోయినాడు.

*శవాన్ని మోసివచ్చాడు:* ఇంకోసారి మరీతమాషా జరిగింది. ఆ అబ్బాయి దూరపుబంధువు ఎవరోవచ్చి, ఆయన ఎక్కడ ఉంటూఉన్నదీ తెలియక ఆఫీసుకేవెళ్లి ఆయనను కలిసికొన్నాడు. ఆ కుర్రవాడు ఆ బంధువును జవానుతో తనఇంటికి పంపాడు. ముసలమ్మగారు ఆబంధు వునుగుర్తించి మర్యాదచేసి అయితే నాయినా మాయిల్లు ఎల్లాగు కను క్కొన్నావుబాబూ అనిఅడిగింది. ఆయన జవాన్ను తీసుకొనివచ్చానమ్మా అత్తా అన్నాడు. ఆవిడ ఆశ్చర్యపోయి అదేమిటినాయనా శవాన్ని మోసి వచ్చినవాడవు స్నానంచెయ్యకుండా బట్టలన్నీ తాకావు! అయ్యో! కర్మా! మేము బస్తీలోఉన్నా మాలకూళ్లు తినడంలేదు. ఇప్పుడైనా నూతిదగ్గర కెళ్లి స్నానంచేసిరా బాబూ అన్నది.

*కాగితం గోడలకు అతికిస్తావా :* మరోసారి కోర్టువారు ఆమె కుమారునికి సమనులు పంపారు. ఆయన ఇంట్లోలేడు. సమనులు అంటే సామానులు అనుకొంటుందని ఆ బంట్రోతు "అమ్మా మీరు ఈకాగితం తీసుకొని అబ్బాయిగారికి ఇయ్యండి"అన్నాడు. అదేంకాగితమో నేను ముట్టుకోను అన్నది ముసలమ్మ. మరేమీఫరవాలేదు. ఈ కాగితం తీసు కొని అబ్బాయిగారికి ఇయ్యండి అని ఎన్నిసార్లు చెప్పినా ఆమె విని పించుకోక ససేమిరా తీసుకోనన్నది. ఆబంట్రోతుకు ప్రాణం విసికి చివరకు అన్నాడు. "ఏమమ్మోయి ముసలమ్మగారూ! మీరు పుచ్చుకోనని మొండికేస్తే ఈకాయితాన్ని మీ గోడలకు అంటించివెళ్ళుతాను"అని.

ఆమాటవిని ముసలమ్మ 'ఎగిరిపడి, ఏమన్నావ్ నీనోరు కొవ్వెందా ఏమిటీ? అబ్బాయిరానీ చెప్పి నీ ఉద్యోగం ఊడపీకిస్తాను. ఏంమాటయ్యా అది ఆ వెధవకాయితం నేనుపుచ్చుకోనంటే నాకోడలుకు అంటించి వెడతా నంటావూ?' అని ముక్కచీవాట్లు పెట్టింది. ఇంతలో ఆమెగారి కుమారుడు వచ్చి సద్దిచెప్పి అవ్వగారిని శాంతింపజేశాడు. అదీకథ.*

చెవిటివాళ్లు అనేమాటలు సందర్భశుద్ధి లేనివైన కారణాన హాస్యాస్పదములైనవి. ఈమాటలవలన జుగుప్స కలగదు. ఒకరిని కష్టపెట్టేవిషయము ఏమీఉండదు ఇటువంటి వ్యాపారంలో. ఒకరిని న్యూనతపరిచే ప్రశంస ఏమీలేదు. ఆ బధిరునియందు మనకు జాలికలుగుతుంది కాని కోపంగాని అసహ్యంగాని కలుగదు. భగవంతుడు ఆమెకు బధిరత్వము ప్రసాదించాడు ఏమిచేస్తాము అనే మృదుభావము మన హృదయంలో చలితమై ఆమెయందు సానుభూతిని కలిగిస్తున్నది. ఈకథ హాస్యసాధకమవటమే కాక ఆనుషంగికంగా ఒకసిద్ధాంత ప్రతిపాదనకు సాహాయ్యకము అవుతున్నది. కరుణరసానికి హాస్యరసానికి పొత్తు కుదరదు, అనేసిద్ధాంతం సర్వత్రా అన్వయించదు అనిచెప్పటానికి ఇది ఒక ఉదాహరణంగా ఉపకరిస్తుంది. అదిసరే. బధిరసమాధాన పద ప్రయోగంవల్ల ఉత్తమమైనది అయిన హాస్యం జనింపజేయవచ్చును అనిచెప్పడమే నాఉద్దేశ్యము. అయితే ఈరకము హాస్యము ఉత్తమమైనది కాదనేవాళ్లూ ఉన్నారు. నేను ఒకసంగతి మళ్లీ మళ్లీ చెప్పటానికి సాహసిస్తున్నాను సమభిహార దోషం వస్తే వచ్చిందని. ఒకవృత్తాంతము హాస్యవంతమా కాదా అని నిర్ణయించడము నీవుదానిని సమాదరించడంలో ఉన్నది. ఒకరిదృష్టిలో పరమరమణీయమై అమృతానిధాన మనతగిన వృత్తాంతము మరొకరిదృష్టిలో పేలవము అసమాహితము అయినది కావచ్చు.

---

* పానుగంటివారు వ్రాసిన ఒక ప్రహసనము ఈ కథకు ఆధారము.

అవస్యందిత పదప్రయోగము :

పెళ్లామునెత్తినెక్కించి : సంభాషణలో ఇది ఒక చమత్కారము. ఒక * ఉదాహరణఇస్తే వివరణకు అవసరము ఉండదు. శివుడు గంగమ్మనితెచ్చి నెత్తినెక్కించుకొన్నాడు. పార్వతికి కొంచెము కష్టంగా ఉంటుందిగా అందుకని ఏమంటాడోచూద్దామని పార్వతి భర్తతో "ఏమయ్యా నీనెత్తికెక్కికూర్చున్నరమణిఎవరు అంటుంది. శివుడు పరిహాస కుతూహల మనస్కుడై అంటాడు. "ఓసి పిచ్చిదానా ఆ కూర్చున్నది మనిషికాదు గంగ. "నిండు వేసగికాలమున మనకు కావలసినంత జలము దొరుకుతుందో దొరకదో అని ఆగంగనే తీసుకొనివచ్చి శిరస్సుపైన భద్రపరచినాను" అని. అక్కడనుంచి పార్వతి ప్రశ్నలువేస్తుంది. ఆయనచేతనే నిజం ఒప్పిద్దామని. "అవునయ్యా అదిజలము అయితే నాకు ఒకముఖము కనిపిస్తుందేమీ"అనిఅడుగుతుంది. శివుడు అదిముఖము కాదు పార్వతీ అది కమలము అంటాడు. పార్వతి అదిపుష్పము అయితే ఆ మెలమెల్లాడే కళ్లేమిటయ్యా అని పరిహాసంచేస్తుంది. శంకరుడు అవి కళ్ళుకాదుభార్యా నీళ్లలో మీనములు ఉంటవి అనినీకు తెలుసుగదా ఆతళతళ్లాడేవి మీనములు అంటాడు. ఈ అబద్ధాలకు పార్వతి నవ్వుకొని ఉంటుంది. "అయితే తెల్లని కంఠము కనబడుతున్నది అదేమిటి" అంటుంది. అది శంఖము అంటాడు ఆయన. ఇల్లా ప్రశ్నలూ జవాబులూ నడుస్తవి. ఇదిఒకక్రీడ. ఆమెకు అసలుసంగతి తెలియక అల్లా అడగడములేదు. మనోహరమైన సంభాషణ నడిపింది అంతే. ముఖాన్ని కమలము అనడమూ, కంఠాన్ని శంఖము అనడమూ ప్రసిద్ధమైన సంప్రదాయమేకదా. ఇదిఅంతా గంగను వర్ణించడముకావచ్చు. పార్వతిని ఉడికించడముకావచ్చు. ఏదైనా వైచిత్రీస్ఫురితముగానూ సముత్కర్షముగానూఉంది. సహృదయునకు హృదయాహ్లాదమును కలుగజేసే వ్యాపారంగా భాసిస్తున్నది.

* డా॥ రామరాజుగారి జానపద సాహిత్యము అనుపుస్తకం నుండి సంగ్రహించినాను.

*గుర్రపుపందాలలో రెండువందలు వచ్చినవి:* అవస్యందిత పదప్రయోగానికి మరొక ఉదాహరణ ఇస్తున్నాను. భార్యాభర్తలు ఉదయం సరససల్లాపములతో కాఫీ సేవిస్తున్నారు. ఆమె అన్నది "ఏమండీ రాత్రి అంతామీరు పక్కమీద దొర్లుతూనేఉన్నారు. సరిగ్గా నిద్రపట్టినట్లులేదు. అదీగాక చాలాసార్లు కల్యాణీ! కల్యాణీ అని కలవరించారు. ఎవరా కల్యాణి! కాస్తచెప్పుదురూ నేనుకూడా విని సంతోషిస్తాను" అని. భర్త పెద్దగానవ్వి, "నిన్నసాయంత్రం గుర్రపు పందాలలో పాల్గొన్నాము. కల్యాణి అనే గుర్రంపై వందరూపాయలు కాస్తే రెండువందలు వచ్చినవి. అదీ సంతోషానికి కారణం. ఆ సంతోషంవల్లనే నేను నిద్రలో కూడా ఆపేరు అనిఉంటాను" అన్నాడు. అంతటితో ఊరుకోక నాకు వచ్చిన రెండువందలలో నీకు ఓవంద బహుమానంగా ఇస్తున్నాను తీసుకో అని వందరూపాయలనోటు ఆమెచేతికి యిచ్చాడు. ఆమె నవ్వి ఊరుకొన్నది.

*గుర్రము ఫోనుచేసింది:* ఆయన ఆఫీసుకుపోయి సాయంత్రం ఇంటికివచ్చిన తరువాత ఆమె మళ్ళీ ఆ గుర్రపుపందాల విషయమై ఎత్తి "ఏమండోయ్ చెపడము మరచిపోయినాను. మీరు ఏ గుర్రంపైన పందెంగట్టారో ఆ గుర్రం మధ్యాహ్నం ఫోనుచేసింది. మీరు ఇంట్లో ఉన్నారనుకొని" అన్నది. భర్త ఏమీఅనలేక "ఏంజేస్తాం. దేశం తెలుగు మీరిపోయింది. గుర్రాలుకూడా ఫోనుచేస్తున్నవి" అన్నాడు. ఇద్దరూ నవ్వుకొన్నారు. ఆ రెండు కథలలోనూ భార్యాభర్తలలో ఎవరోఒకరు సత్యాన్ని మరుగుపరచడానికి ప్రయత్నించడము ఉన్నది. సత్యమేమిటో ఇద్దరకూ తెలుసు. అయితే ఎందుకూ ఆ ప్రయత్నమూ అంటే అదొక క్రీడ. క్రీడాత్మకమైన వాగ్వ్యాపారము.

*అదొక క్రీడ:* ఇదిభార్యాభర్తలమధ్య జరిగిన వ్యవహారముకాబట్టి మరీ సురుచిరముగానూ సుషమంగానూ ఉన్నది. ఇటువంటి వాగ్విలసన

మును అవస్యందితము అంటారు. నోరుజారిన మాటకు వేరేఅర్థము చెప్పడాన్ని అవస్యందితమంటారని ముట్నూరువారు అన్నారు. కావాలనే ఒకమాట అని, ఒకవిధంగా అర్థంచేసుకోనిచ్చి మళ్ళీ దానికి రమణీయమైన ఇంకో అర్థంచెప్పడాన్ని అవస్యందితము అని అనకూడదా? అనొచ్చును అని అనుకొంటాను. ఈ వ్యాపారాన్ని క్రీడగానే పరామర్శించి కాంతాసమ్మితమైన మనోహర వాగ్విలసనముగా భాసింపజేయటంలోనే సాహిత్యీయమైన సొగసుఉంది. ఈ వ్యాపారంలో భావవక్రతలేదు. అర్థవైభవమూలేదు. కొన్ని శబ్దముల ప్రయోగంవల్లనే హాస్యము సాధింపబడినది. కాబట్టి దీనిని శబ్దాశ్రయ హాస్యంగానే పేర్కొన్నాను.

అపలాప పదప్రయోగము :

*ఒకరికిచెయ్యి ఇంకొకరికి కాలూనా ?* అపలాపము అంటే మోసపుచ్చుమాట. ఈ మోసపుచ్చడము తమాషాకూ చమత్కార సాధనకూ మాత్రమే. మరోదురుద్దేశంతోకాదు. హాస్యసాధనకై మనంచేసే వ్యవసాయంలో ఇదిఒక ప్రకరణము అపలాప పదప్రయోగమువలన మనకు ఉపలబ్ధమయ్యేది హాస్యస్ఫోరకమైనదీ సహృదయ సమాదరణీయమైనదీ అయిన ఒక మధురానుభూతి. ఈ రకము హాస్యానికి ఒక ఉదాహరణ. నాయికానాయకుల సంభాషణ అనుకోండి. నాయిక సామాన్య. ఆమె ప్రియునితో అంటుంది. * "ఒకరికీ చేయినిచ్చి, ఒకరికీ కాలునిచ్చి, ఒకరికి నడుమునిచ్చి, కూకున్నానోయిబావా, కూకున్నానోయ్" అని. తన ప్రియుడు ఈ మాటలువిని తాను ఎవ్వరినో పరుని ఆశ్రయించినట్లు భ్రమపడవలెనని ఆమె అభిలాష.

*ఎవరికి చెయ్యినిచ్చావే:* సరే. ఆమె కాంక్షించినట్లే అతడు భ్రమపడ్డట్లు నటించి "ఎవరికే చేయినిచ్చి, ఎవరికీ కాలునిచ్చి, ఎవరికీ

నడుమునిచ్చి కూకున్నావేపిల్లా కూకున్నావే"అంటాడు. ఆమె "గాజుల్కు చేయినిచ్చి అందెలకు కాలునిచ్చి వడ్డాణాన్కి నడుమునిచ్చి కూచున్నానోయ్ బావా కూచున్నానోయ్" అని అంటుంది. ఇట్లాగే నడుస్తుంది ఆ సంభాషణ. ఇదీ ఒకరకము క్రీడ. మాటలతో ఆట! ఇది ఇంకొకటి కావచ్చు. ఈ నాయిక వాసకసజ్జికకావచ్చు. చక్కగా అలంకరించుకొని నీకోసం సిద్ధంగాఉన్నాను అని చెప్పడముకావచ్చు ఈ ధోరణి. సర్వాలంకార భూషితనై నీకోసం వేచియున్నాను అని చెప్పక, ఆ విషయాన్నే వ్యంగ్యంగా తెలియజేస్తున్నది ఇక్కడ నాయిక అని మనము భావించవచ్చు. ఒకరికి కాలునుఇచ్చాను ఒకరికి చేయిఇచ్చాను అనిచెప్పడము వ్యంజనకావచ్చు. వ్యంజన అంటే పదములయొక్క అర్థము అనుకూలముగ పొసగిన పిమ్మట ఆ వాక్యార్థమునకు శోభాహేతువగు అర్థాంతరము స్ఫురించుట కావ్యములయందు వ్యంజన యనబడును అని ఉంది కావ్యాలంకార సంగ్రహంలో. నాయిక ఎవరినో పరుని ఆశ్రయించినట్లు తోపింపజేయడము అనుకూల విషయము. గాజులచేత అందెలచేత నన్ను నేను అలంకరించుకొన్నాను అన్న అర్థం శోభాహేతువు.

*వ్యంజన వ్యాపారం:* ఈ వ్యంజన వ్యాపారం వల్ల నాయిక "ఓయీ నేను సర్వాలంకార భూషితనై నీ సమాదరణకు సిద్ధంగా ఉన్నాను"అని చెప్పడమే. కావ్యవిలాసము అంతా వ్యంజనా వ్యాపార పరమేకదా! నాయిక రమణీయార్థ సాధక సమర్థమైన ప్రియవచనముల తోనూ కమనీయ కటాక్ష వీక్షణ దరహసితాది విలాసాలతోనూ ప్రియుని ఆహ్వానిస్తున్నది అని చెపితేనే ఈ వ్యాపారం అంతా మనోహరమూ చమత్కార గర్భితమూ అవుతుంది. అవస్యందితము అపలాపము అను శీర్షికల క్రింద ఇచ్చిన రెండు కథలలోనూ ఎక్కువగా భాసిస్తున్నది హాస్యగుణమా, కావ్యగుణమా అని సందేహం కలిగింది. ముట్నూరు వారు, డాక్టర్ డి. రామరాజుగారూ ఈ ఇద్దరూకూడా అవస్యందితమును

హాస్య విశేషంగానే పేర్కొన్నారు. ఒకరికి చేయినిచ్చి అనే గేయంలోని హాస్యము ఉద్ఘాత్యకము అనబడే హాస్యవిశేషమని రామరాజుగారు తమ జానపదసాహిత్యం అనే గ్రంథంలో వ్రాశారు.

అసంబద్ధ పదప్రయోగము :

పిచ్చివాడు, త్రాగుబోతు, తిండిబోతు వీరి అందరివిషయంలోనూ మనస్సు ఒకేవిధంగా నడుస్తుంది. వారికి వివేకముండదు. ఉచితానుచిత జ్ఞానముండదు. వారిమాటలు అసందర్భముగానూ అసంబద్ధంగానూ ఉంటవి. వైపరీత్యమును వైచిత్రిని సంతరించుకొని నవ్వుపుట్టిస్తవి. అవి జుగుప్సాకరముకాక హాస్య దృష్ట్యా రమ్యమైన చమత్కార సాధనకు సాహాయ్యకమైనవిగా ఉంటవి.

*ఉన్మత్తుడు :* ఉన్మత్తునిమాటలు హాస్యరమ్యములు అని చూపడానికి ఒక ఉదాహరణ. జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి పిచ్చి ఆసుపత్రిని చూడడానికి వెళ్లాడు. అక్కడ చాలామంది పిచ్చివాళ్లు ఉన్నారు. కొందరు పూర్తిగా పిచ్చివాళ్లు. వాళ్లతో మాట్లాడడమే కుదరదు. పిచ్చి కొంతనయమై ఇంకా పూర్తిగా నయంగానివాళ్ళు కొందరుఉంటారు. వాళ్ళుకొంత సేపు మంచి మనుష్యులవలెనే మాట్లాడుతూ చటుక్కున పిచ్చివాగుడు ప్రారంభిస్తారు. మరికొందరు చివరిదాకా బాగానేమాట్లాడుతారు. ఎక్కడో ఒకటి రెండుమాటలు మాత్రం వారిపిచ్చిని గుర్తింపజేసేవిగా ఉంటవి.

*జవహర్‌లాల్ పిచ్చిఆసుపత్రిలో:* జవహర్‌లాల్ ఒకసారి ఈ మూడోరకంవానితో మాట్లాడడం సంభవించింది. అతడు మంచిదుస్తులు ధరించి పెద్దమనిషిలాగున్నాడు. ఆసుపత్రివారే జవహర్‌కు ఆసుపత్రి అంతా చూపటానికి అతనిని నియోగించారు. వాళ్ళుకూడా వెంటఉండి అతనిచేత మాట్లాడిస్తున్నారు. అతడు అన్నిచూపించాడు. వినయంగా

సెలవుతీసుకొంటానన్నప్పుడు జవహర్‌లాల్ సంతోషంతో "ఏమయ్యా నేనెవరినో నీకు తెలుసా" అని అడిగాడు. అతడు తెలియదని అన్నాడు. జవహర్ తానెవరైంది తెలియనివారు ఉన్నారా అని ఆశ్చర్యపడి నేను జవహర్‌లాల్ నెహ్రూను అని తెలియజెప్పాడు. ఆ పిచ్చిపెద్దమనిషి నెహ్రూను వీపుపై చరచి "ఏమీ భయంలేదు. నీకు తొందరగానే నయం అవుతుంది. ఇక్కడకు క్రొత్తగా వచ్చినపుడు నేను మహాత్మాగాంధీనని చెప్పుకొనేవాణ్ణి" అని వెళ్లిపోయినాడు. అక్కడున్నవాళ్లంతా విరగబడి నవ్వారు.

*ఇంకొకథ* : ఇద్దరు పిచ్చివాళ్ళు ఆసుపత్రి ఆవరణలో ఒక చెట్టు క్రిందకూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకొంటున్నారు. అందులో ఒకడు తన పిడికిలి బిగించి నా చేతిలో ఏముంది చెప్పుకో అన్నాడు. రెండో వాడు ఆలోచించకుండానే 'ఓస్ ఈమాత్రం తెలియదనుకొన్నావా? ప్రొద్దున్న నీభార్య వచ్చిందిగా. ఆమెను గుప్పిట్లోదాచావు అన్నాడు. అవతలవాడు నవ్వి. తప్పావు. మళ్ళీ ఆలోచించమని సలహా ఇచ్చాడు. వీడుకొంచెం ఆలోచించి 'ఏనుగ' అన్నాడు. మొదటివాడు మళ్ళీతప్పావు. అన్నాడు. "అయితే నీవేచెప్పు నేను చెప్పలేను" అన్నాడువీడు. అప్పుడు ఆయన అన్నాడు నవ్వుతూ "స్టేటు బ్యాంక్ ఆఫ్ ఇండియా" అని. మొదటివాడు కోపంతో అది నీదగ్గరకు ఎట్లావచ్చింది? ప్రొద్దునేగదా నేను దానిని జాగ్రత్తగా జేబులో దాచుకొన్నాను. అదినాది. నాకు ఇచ్చేయి అన్నాడు. రెండవవాడు ఇయ్యనన్నాడు. ఇద్దరూ పోట్లాడుకొని కొట్టుకోవడందాకావచ్చింది. అధికారులువచ్చి వాళ్లను తీసికెళ్లారు.

*ఇంకొకటి* : నేనొకసారి వెళ్లాను పిచ్చి ఆసుపత్రికి. ఒక గదిలో ఒక పరిచితుణ్ణి కలిసికొని ఏంరా రామూ అన్నాను. వాడు భాభా నేను రామూను కాదు. నీవుపొరబడుతున్నావు-అన్నాడు. అయితే "ఎవరునీవు-నీపేరేమిటి" అని అడిగితే అతడు చెప్పాడూ "నేను ప్రాంసు రాజును

నెపోలియన్ నా పేరు'' అని. నేను నవ్వుకొని ఎవరుచెప్పారురానీకు ఈ సంగతి అని అడిగాను. వాడు "దేవుడు, దేవుడుచెప్పాడు" అని పెద్దగా అరిచాడు. ఈ మాటలు వినపడ్డవికామాలు పక్క గదిలోవాడికి వాడు కటకటాల దగ్గరకువచ్చి "ఓరివెధవా, నేను నీకు ఎప్పుడుచెప్పానురా? పిచ్చివెధవలాగ మాట్లాడకు'' అని కఠినంగా మందలించాడు. ఈ వాక్యాలలో ఒకరిని మనస్సు నొప్పించడములేదు. క్షుద్రభావ కలుషితములైనవికావు ఇవి. నిర్మలమూ స్పృహణీయమూ అయిన హాస్యము ఇది.

*మరుపురోగి:* మరుపుజబ్బు ఉన్నవాడుకూడా అసంబద్ధంగానే మాట్లాడుతాడు. ఒకమాటఅని ఏమన్నదీ మరిచిపోయి మొదటఅన్నదానికి విరుద్ధమైన మరోమాట అంటాడు. సూక్ష్మంగా పరిశీలిస్తే ఇతనిదికూడా అసంబద్ధ ప్రలాపమే. ఒకడు డాక్టరుదగ్గరకు వెళ్లి తనకు మరుపుజబ్బు ఏర్పడ్డదనీ ఈక్షణంలో అన్నమాట మరుక్షణానికి జ్ఞాపకం ఉండదనీ చెప్పుకొన్నాడు. "నాభార్య బజారుకువెళ్లి ఏవేవో తెమ్మంటుంది. కాస్త దూరం వెళ్లినతరువాత తనను ఆమె ఎక్కడకు వెళ్లమన్నదీ అన్న విషయముగాని ఏమితెమ్మన్నదీ అన్న విషయంగానీ జ్ఞాపకం ఉండదనీ చాలాచికాకుగా ఉన్నదనీ'' మొత్తుకున్నాడు. డాక్టరు ఎన్నాళ్లయింది నీకీ జబ్బు ఏర్పడి అనిఅడిగాడు. ఆపెద్దమనిషి ఏమిజబ్బు అని అడిగాడు. మొదట జబ్బు ఉన్నదన్నాడు తరువాత ఏంజబ్బు ఉన్నదన్నానూ అని అడుగుతున్నాడు. అతనిమాటలు పరస్పర విరుద్ధంగాఉన్నవి.

*మధుపాన మత్తుడు:* త్రాగుబోతుమాటలూ ఇల్లాగే అసంబద్ధంగా ఉంటవి. ఒకవూళ్లో ఇద్దరు స్నేహితులు బార్‌కువెళ్లి తప్పతాగి బైట బెంచీమీద కూర్చున్నారు. అందులో ఒకడు ఆకాశంవంక చూస్తూ "అరె చూశావా చంద్రుడు ఉదయిస్తున్నాడు'' అన్నాడు. రెండవవాడు అరే బేవకూఫ్ అది సంద్రుడు కాదుబే. సూర్యుడు సంద్రంలోకి దూకూ

తున్నాడు"అన్నాడు. ఇద్దరూ పోట్లాటలోకి దిగారు ఇంతలో ఆ బార్ లోంచి ఇంకొకడు వచ్చాడు. వాడు కాస్త తెలివిగానే ఉన్నాడు త్రాగి ఉన్నా. వీళ్ళిద్దరూ ఆయనను అడిగారు అది అస్తమిస్తున్న సూర్యుడా ఉదయిస్తున్న చంద్రుడా అని. ఎటుచెప్పినా చావే. వాడు "ఒరే భాయీ నాది ఈవూరుకాదు. నాకు ఈవూరుకొత్త. అందుకని నాకు తెలియదు" అని క్షమాపణ పూర్వకంగా చెప్పుకొన్నాడు. ముగ్గురూ త్రాగిఉన్నవాళ్లే. అయినా మూడోవాడు కాస్త తెలివిగా ఉండబట్టి బ్రతికిపోయినాడు.

ఒకత్రాగుబోతు మత్తుగా త్రాగి వీధివెంట నడుస్తున్నాడు. ఒక పోలీసు ఎదురై "ఏమయ్యా అట్లా నడుస్తున్నావేమి ఒకకాలు సైడు కాలువ గట్టుపైన పెట్టి మరొకకాలు సైడుకాలువలో పెట్టి" అనిఅడిగాడు. త్రాగుబోతు "బ్రతికించావు బ్రదర్ నాకాళ్ళల్లో ఒకటి పొడుగ్గానూ ఒకటి పొట్టిగానూ ఉన్నదేమబ్బా అని తలబ్రద్దలు కొట్టుకుచస్తున్నాను కారణం తెలియక, అని వెంటనే రెండుకాళ్ళమీద సక్రమంగా నడిచివెళ్లి పోయినాడు. నేనుమొదటనే చెప్పాను. ఉన్మత్తుడూ మధుపానమత్తుడూ అటువంటివారందరి మనస్సు ఒకేవిధంగా పనిచేస్తుందని. వారిమాటలు పూర్వాపర సందర్భశుద్ధిగా ఉండవు.

*మధుపానమత్తుని విషయమయ్యే ఇంకో కథ:* తాగినవాడొక బల్ల ముందుకూర్చొని ఆలోచిస్తూ ఏదో వ్రాస్తున్నాడు. ఏంచేస్తున్నావు అని అడిగాడుస్నేహితుడు ఒకడొచ్చి. జ. ఉత్తరంవ్రాస్తున్నాను. ప్ర. ఎవరికీ. జ. నాకే. ప్ర. ఏమిటిరా పిచ్చివెధవ నీకునీవే ఉత్తరంవ్రాసుకొంటున్నావా? జ. అవును. ప్ర. ఏమనివ్రాస్తున్నావు? ఆ ఉత్తరంలోనిసంగతులేమిటి? జ. ఎట్లా తెలుస్తుంది. ఈ ఉత్తరం పోస్టులోపడితే రేపుగాని నాకు అందదు. అప్పుడు చదువుకొని చెపుతాను. అసంబద్ధ ప్రలాపము ఇంతకంటే మనోహరమైనదానిని ఊహించడము కష్టము. ఈకథనుకల్పించిన రచయితహాస్యరచనలు చేయడములోవైదగ్ధ్యమును ప్రదర్శించినాడు.

అవివేకి పదప్రయోగము :

అతివక్తా వ్యాకులుడు కృపణుడు మరుపురోగండున్నవాడూ. వీరు ఏదో వ్యసనముచేత వివేకమును కోల్పోతారు. అట్టి వికలమనస్కులు ఔచిత్యానుచిత్యములను గుర్తింపక వ్యగ్రమనస్కులై అసభ్య,అనుచిత వాక్కులను పలుకుతారు. భోజనప్రియునికి ఎప్పుడూ తిండిమీదనే రంధి. మన సంస్కృత నాటకాలలోని విదూషకుడు ఈ జాతికిచెందినవాడు. అతని ఆలోచనలు అన్నీ భోజనానికి సంబంధించే ఉంటవి. ముఖం గుండ్రంగా అందంగా ఉన్నది అని చెప్పవలసివస్తే ఆమె ముఖము అరిసె ముక్కవలెఉన్నది అంటాడు.అతిభోజనప్రియునికి వివేకముకూడాపోతుం దనీ సభ్యాసభ్య విచక్షణజ్ఞానం ఉండదనీ అంటారు. ఆవిషయాన్ని ఈకథ నిరూపిస్తుంది.

*అతిభోజి :* ఒక అల్లుడు పండక్కు అత్తగారింటికి వెళ్లాడు. అత్త గారు అల్లుడితో అన్నదీ ''నాయనా మీమామగారు మధ్యాహ్నం పన్నెం డింటికిగాని ఇంటికి భోజనానికిరారు. అందాకా నీవు ఎట్లాగూ ఉండలేవు. అయితే ఇప్పుడు అరిసెలు మినపసున్నిఉండలు సిద్ధంగాఉన్నవి. అవి కాసినితిని పన్నెండుదాకాఉంటావా, లేకపోతే ఇంకో అరగంటతో పిల్లలు చద్దిఅన్నాలు తింటారుకాబట్టి వాళ్లతోకలసి భోంచేస్తావా''అని. అల్లుడు అన్నాడు, ''అత్తగారూఇప్పుడుసిద్ధంగాఉన్నవికాబట్టి మినపసున్నిఉండలు అరిసెలు పెట్టండి. ఆ తరువాత పిల్లలతో చద్దిఅన్నముతిని పన్నెండు గంటలకు మామగారి పంక్తిని కూర్చుని మామూలుగా భోజనంచేస్తా'' నన్నాడు. అత్తగారు నవ్వుతారనే జ్ఞానంలేకుండా అన్నమాటలివి. వివేక మును కోల్పోయినవాడు అన్నమాటలివి.

*మిథ్యావాది :* అబద్ధాలాడేవాడు కూడా ఈ జాతివాడే. ఏదో సాధించడానికి, ఒక తప్పిదమును దాచడానికి ఒక అబద్ధంఆడి దానిని నిలబెట్టుకుంటానికి ఇంకాకొన్ని అబద్ధాలు ఆడతాడు. ఆతడూ వ్యగ్ర

మనస్కుడే. అబద్ధాలాడడము అనే ఈ వ్యాపారంలో వివేకమును కోల్పోతాడు. అయితే వివేకశూన్యమైన ఆ ప్రలాపము హాస్యముఖంగా మనకు మనోజ్ఞమూ ఉత్కర్షాహేతువూ అవుతుంది. ఇంకోవిధంగాచూస్తే అల్పమూ నింద్యమూ అసభ్యమూ అయినవ్యాపారం సుకుమార సుందర సాహిత్య విలసనంగా భాసిస్తుంది హాస్యోన్ముఖంగా. ఈ కథ చదివితే మీరు నామాట నిజమేఅంటారు. నాకు ఒకస్నేహితుడు ఉండేవాడు. సౌందర్య పిపాసువు. లభ్యమైనస్త్రీతో కామకలపాలు జరపడము అతనికి పరిపాటి అయిపోయింది. ప్రజలతో సంబంధంఉన్నఆఫీసులో ఉద్యోగం కాబట్టి అనేకమందిస్త్రీలు ఏవోపనులమీద అక్కడికిరావడము జరుగుతూ ఉండేది. వారిలోకొంతమంది ఇతనితో సరససల్లాప గోష్ఠిలో కాలం గడపటానికి ఇష్టపడేవాళ్లు. ఈ విషయం అధికారులకుతెలిసింది. ఒక అధికారి అతనిని గట్టిగా చీవాట్లువేసి "నీవు ఈతభా వీచిదగ్గరగాని వీధిలో గాని ఎవరైనా పరాయిస్త్రీతో కనపడ్డావా ఆరోజే నిన్ను ఉద్యోగంలో నుంచి తీసివేస్తాను" అని చెప్పాడు. "పరస్త్రీ అన్నాడుగదా అదికొంత నయమే. పరాయిస్త్రీ అయినదీ స్వస్త్రీ అయినదీ ఆయనకేం తెలుస్తుంది" అనుకొని వీడు మామూలుగానే విలాస విహారాలు సాగించాడు.

*నీభార్యా! స్కాండ్రల్-ఆమె నాభార్య:* ఒకరోజున లభించిన సుందరితో సముద్రపు ఒడ్డున సంచరిస్తూఉండగా ఆ అధికారి ఎదురుగా రావడముచూచి మొదటకొంచెం తత్తరపడి వెంటనేతేరుకొని తానే ఆయనకు అభిముఖంగా నడిచివెళ్లి తన ప్రక్కనున్న సుందరినిచూపిస్తూ "అయ్యా మీకునాభార్యను పరిచయముచేయడము ఎంతోసంతోషమైన విషయముగాభావిస్తున్నాను"అన్నాడు. అధికారినిప్పులుగ్రక్కుతూ "నీభార్యా? స్కాండ్రల్-ఆమె నాభార్య పో. ఇక నీముఖంనాకుచూపించకు" అన్నాడు. దానితరువాత ఏమైనది మనకు అక్కరలేదు. ఏమైతే మనకేంగాని మనకు మాత్రం పర్యవసితార్థములో సురుచిరము సుమనోజ్ఞము సుభగము

అయిన హాస్యము లభించింది. వివేకమునుకోల్పోయి అబద్ధాలు ఆడడం అనే వ్యాపారం ఇంత హాస్యపర్యవసాయం కావడము వైహసికుని హాస్య నిర్మాణ వైదుష్యమును వెల్లడిచేస్తున్నది. ఈ విధంగా అసంబద్ధ ప్రలాపమూ అవివేకి పదప్రయోగమూ కూడా హాస్యసాధకములు అని గట్టిగా చెప్పుతున్నాను.

ఛాందస పదప్రయోగము :

పామరజన ప్రయుక్తమైన భాషవలెనే పరమఛాందసుల భాష కూడా విపరీతంగాఉండి పరిహాస ప్రహ్లాదజనితంగా ఉంటుంది. దానిని ఒక్క ఉదాహరణ ఇచ్చి ఈ ప్రకరణం ముగిస్తాను. "అస్సే సూస్తి వషే బలేచౌకషే విన్నావషే కాదషే విస్సావఝ్ఝలవారి బుర్రినష మన విస్సాయ కిస్సారషే" ఇది ఛాందస వైదికుల భాషకు హాస్యానుకరణ.

ఒక్కొక్కప్పుడు పండితులు వాడే మాటలుకూడా జనసామాన్యానికి ఎరికలో ఉన్నవి కాని కారణాన ఈరకము వాక్చమత్కృతినే సాధించి పరిహాసజనకములైనవి. ఒకపండితుడు ఎవరిని గురించో మాట్లాడుతూ ఆయన ఇప్పుడు "ప్రాడ్వివాకుడు" అన్నాడు. అంతే "ఏమిటి నాయనా ఆమాటకర్థం?" అని అడిగిందొక ముసలమ్మ. ఆయన చెప్పాడు. ఆమె అన్నది "అదా 'జర్జి' అనరాదూ! ప్రాడ్వివాకుడు ఏమిటి నా పిండాకూడు"అని.

ఛాందసుల మాటలు కొంచెం వికృతిని గలిగి హాస్యభాసితములై పరిహాస పరిపుల్లములై మనోహరంగా ఉంటవి అని చెప్పినాను. దానికి మరో ఉదాహరణ ఇస్తున్నాను. డాక్టరు బి. రామరాజుగారి జానపదగేయ సాహిత్యము అను గ్రంథమునుండి ఇది గ్రహింపబడినది. ఆండాళు చరిత్రమున గోదా రంగేశుల వివాహ సమయమున భోజనములకు సిద్ధమైన బ్రాహ్మణుల భాషణములు ఇవి. "సుబ్బంభొట్లూ విన్నా

వషరా చూడికొత్త పెళ్లిషరా అబ్బాయిని అచ్చయ్యను మరి మన అవధాన్లను కేకెయ్‌రా సంతర్పణలష సంతసమొదవగ గొంతువరకు తిందాం. ముంతమామిడి పప్పుమిషాయష ముందు మనము పోదాం.

అనుకరణ పదప్రయోగము :

శబ్దాశ్రయ హాస్యానికి ఇదియొక మార్గము. ఏదైనా ఒక పద్యాన్నిగాని పద్యభాగాన్నిగానితీసుకొని దానినిఅనుకరించవచ్చు. అంటే ఆ ధోరణిలోనే వ్రాయవచ్చు. ఆ వ్రాయడము హాస్యాన్ని సాధించాలనే ఉద్దేశంతో వ్రాస్తే అది అనుకరణహాస్యము అయింది. ఈ అనుకరణ చేయడము హేళనచేయడము అనుకోవడము పొరపాటు. పైగా అట్లా అనుకరింపబడ్డ రచనయందు అనుకరణ చేసిన కవికి ఎక్కువ గౌరవము ఉంటుంది. హాస్యశీలుడు ప్రసిద్ధమైన రచనను అనుకరిస్తాడు కాని మామూలు రచనను అనుకరించడు. ఎందుకంటే అనుకర్త యొక్క గొప్పతనము అనుకరింపబడిన రచనపై ఆధారపడి ఉంటుంది.

అనుకరణ ఒకరకమైన స్తుతివ్యాపారము. అనుకరణ ఎప్పుడూ గౌరవపురస్సరంగానే జరుగుతుందిగాని ఇంకోవిధంగా జరుగదు. అనుకరణ ప్రధాన గ్రంథకర్తకు ఉత్కర్షాహేతువు. ఈ అనుకరణ అనేక రకాలు. కవియొక్క ధోరణినీ శైలినీ అనుకరించవచ్చు. పద్యాన్నీ వచనాన్నీకూడా అనుకరించవచ్చు. ఈ అనుకరణలో ముఖ్యమైన ఉద్దేశము హాస్యమును సాధించడమే. పద్యాన్ని అనుకరించేటప్పుడు మూలంలోని పద్యం పాదాలుపాదాలుగా అనుకరణలోనికి రావచ్చు కొద్దిమార్పులతో. ఆ మార్పులవలన అర్థాంతరం సిద్ధిస్తుంది. ఆంగ్ల సాహిత్యంలో ఇది ఒకప్రసిద్ధమైన హాస్యప్రక్రియ.

*ప్రసిద్ధమైన పద్యాలకు పేరొడీ :* హాస్యానుకరణను పేరొడీ అంటారు. తెలుగులోకూడా హాస్యానుకరణలు ఉన్నవి. "లావొక్కింతయు

లేదు, ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులా తావుల్‌దప్పెను, భ్రాంతి వచ్చె, తనువున్‌డస్సెన్ శ్రమంబయ్యెడిన్, నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపందగున్ దీనునిన్, రావే ఈశ్వర, కావవే వరద సంరక్షించు భద్రాత్మకా.” అనే భక్తిరసపూరితమైన పద్యాన్ని మరొక కవి శృంగార రసాత్మకంగా ఇల్లాగచెప్పాడు. “పూవిల్కాని సరోజ బాణముల నంభో జారిమైచాయలన్, భావంబెంతయుడస్సె, మేనుబడలెన్ తాపంబురెట్టించె, నేనీవాడన్, మధురాధరంబొసగవే నిక్కంబు నన్నేలవే, రావే మానిని కావవే, తరుణి సంరక్షించు చంద్రాననా.” అనుకర్త పద్యంనడకను అనుక రించాడు. భావంమాత్రంవేరు.

ఇంకోరకం అనుకరణ ఉంది. ఇందులో మొదటి పద్యంలోని పాదాలు పాదాలుగా అనుకరణలోనికివస్తవి. “కరయుగమును చరణం బులు'' అను ప్రసిద్ధమైన పద్యానికి ఒక కవి ఈ విధంగా పేరొడీ వ్రాసినాడు. “కరయుగమును చరణంబులు ఉరము, లలాటస్థలంబు ఉన్నత భుజముల్ సరిధరణి మోపి మ్రొక్కిరి మరిమరినీ శత్రులెల్ల మల్కిభరామా!” ఇంకొక పేరొడీ. “ఎవ్వడా క్రూరకర్ముడెవరునీల। జలద నిర్ముక్త శైశిర శర్వరీప్రశాంత మలవాటుపడిన నిశాంతమందు। అకట! సట్టింటదీపంబు నార్పినాడు.'' ఇది నాయని వారి పద్యం. దీనిని ఎవరో పేరడీచేశారు. ఆ పేరొడీలో అన్నిపంక్తులూ అల్లాగేఉంచి చివరి పాదముమాత్రం “అకట నీలేకాల్‌బుడ్డి తన్నేసినాడు'' అని మార్చినాడు.

ఆయనగారిదే ఇంకోపద్యం. ''ఎవ్వడే నీగళమ్మునందు దిరవు కొనక నేను విసరిన ప్రేమ ప్రసూనమాలనడుమ నీవుచూడగబట్టి నలిపి వైచి, నీకనులయందు నెత్తురుల్ నింపినాడు.'' దీనిని ''ఎవ్వడాతుంటరి నీవు చదువుకొనగ నేను రచించుచున్న ప్రేమకావ్యమును ఫర్రున చించి వైచి పైపెచ్చు నలిపివైచె, నాకనులయందు నెత్తురుల్ నింపినాడు.'' అనిమార్చి పేరొడీగా చేసినాడు.

*పాటలు-పారొడీ:* జానపద సాహిత్యంలోనుంచి ఒక మంచి హాస్యానుకరణ డా॥ రామరాజుగారు ఎత్తిచూపినారు. "చిక్కుడుచెట్టుకూ తీగలందమ్మ।శ్రీకృష్ణుడీ తమ్ముడికి తిరుమణందమ్మ।పణతికి పదినెలల బాలుడందమ్మ।కాకరతీగకు కాయలందమ్మ । కన్నతల్లెట్టిన సొమ్ములందమ్మ." దీనికి హాస్యానుకరణ ఒక దంపుళ్లపాట. "సువ్వి సువ్వన్నా సొగసువల్లన్న। బీరపాదుకు పిందెలందమ్మ మావారిముక్కుకూ పక్కులందమ్మ।పొట్లపాదుకూ పూవులందమ్మా।కాట్లకుక్కా మొగుడు కాంత కందమ్మ।మావారిపొగచుట్ట నాకుఅందమ్మ!"

ఉదయరాజు రాఘవరంగారావుగారి మత్కుణోపాఖ్యానము దేవీప్రసాద్‌గారి భక్షేశ్వరీశతకమూ జలసూత్రంవారీ శ్రీకృష్ణశాస్త్రిగారీ పద్యాలకుహాస్యానుకరణలూ కాళోజీగారి ఏదేశమేగినా ఎందుకాలిడినా చూడరా నీబొజ్జ పూడుమార్గంబు అనునవి ప్రసిద్ధమైనపారొడీలు. అప్పగింతల సమయంలో వధువునకు తల్లితండ్రులు అత్తగారింట్లో జాగ్రత్తగా మసులుకోఅమ్మా అని నీతులు చెపుతారు. శ్రద్ధా భక్తీ నీతి పాతివ్రత్యమూ సహనమూ శాంతమూ మొదలగు గుణములను కలిగిఉండుతల్లీ అని చెపుతారు. అటువంటిపాటలకు హాస్యానుకృతి అనదగినపాట ఒకటిఉంది.

మొగుడియందు ఎట్లాప్రవర్తించాలట అంటే-నీమాట వినబడ్డ నిముషంబునందున అదలిపోయేటట్లు అతనిభయపెట్టు. పతికోపపడినపుడు పడియుండబోక అంతకు పదిరెట్లు అతని మర్దించు. ఇరుగుపొరుగు వారలేమైనఅంటే ఏడ్వక వేయిరెట్లు దుమ్మెత్తిపొయ్యి. భర్తను వంచు కోగల భార్యగౌరవమెన్న రారాజునకునైన రమణిరోలేదు. ఇవియెల్ల మరువక ఏమాత్రమలయక సుఖపడుచుండుమో సొగసుపూదీవ.

*శతకాలలోనిపద్యాలకు హాస్యానుకరణ:* ఒకయువకకవి సుమతి శతకంలోని పద్యాలకు చక్కని పారొడీలు వ్రాశాడు. వాటిలో రెండు

మూడు ఇక్కడ ఉదాహరిస్తాను. మూలం అందరికీ తెలిసినవేకాబట్టి అదివ్రాయక అనుకరణలు మాత్రమే ఇస్తున్నాను. "తినదగు నెవ్వరు పెట్టిన తినినంతనే తేన్పులిడక స్థిమితపడదగున్। తిని రుచియు నరుచియు నెరిగిన మనుజుడెవో సుఖభోజనుండు మహిలో సుమతీ!" "ఎప్పటి కెయ్యది దొరకిన అప్పటికా తిండితినుచు అన్యులతోడన్। చెప్పించక తాజెప్పక తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ!" "అప్పుచ్చులతోడ సుష్ఠుగ ఎప్పుడు భోజనముపెట్టు ఇల్లోహోటలో చొప్పడిన యూర నుండుము చొప్పడకున్నట్టి యూరుచొరకుము సుమతీ!" "అక్కరకు రానిబస్సును చక్కగ సినిమాకురాక సణిగెడు భార్యన్ ఉక్కగనుండెడు ఇంటిని గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ."

*వచనానికి హాస్యానుకరణ:* పద్యమే కానక్కరలేదు. వచనాన్ని కూడా అనుకరించి చమత్కారాన్ని సాధించవచ్చు. ఒక ఉదాహరణ. "వాడు మానిసి. కరచరణాదులున్నవి. కనులు మూసుకొని నిద్రపోవుచున్నట్లున్నది. నిద్రయనగా పంచేంద్రియ వ్యవహారోప సంహృతి. కాని నిద్రలో నాతని మనస్సు ఆడుచునేయున్నది. అది ఇంద్రియ విషయికమైన నిద్రాస్థితి. జీవుడు మేల్కొనియున్నాడు. సర్వవ్యవహార యోగ్యుడై యున్నాడు. కాని వ్యవహారమును నిర్వహించలేడు. అతడు నిద్రపోవుచున్నాడు. కనుక నిద్రపోవుచున్నట్లు అతనికి తెలియునా! తెలియదు. తెలియును. నిద్రమేల్కొనిన వెంటనే తాను నిద్రించితినన్న అభిజ్ఞ ఆతనికి కలుగుచున్నది. ఆ అభిజ్ఞ అప్పుడు కలిగినదా! అంతకు పూర్వముకూడా అతనికా విషయము తెలిసియేయుండవలెను. అనగా నిద్రపోవుచున్నట్లాతనికి నిద్రలోకూడ తెలియునా! తెలియును... తెలియదు... అది ఒకచమత్కారము." విశ్వనాథవారి రచనా విధానమునకు ఇది అనుకరణ.

ఈ అనుకరణ కేవలమూ శబ్దవ్యాపారము. అందుకని ఇది శబ్దాశ్రయహాస్యంలో అంతర్భాగము అయితే ఈ పారొడీలలో జరిగేపని

ఒక ప్రసిద్ధమైన రచనను అనుకరించడం అని తెలుసుకొన్నాము. నడకనుగాక ధ్వనిని అనుకరించడము మరోపద్ధతి. అనుకరణకు మూలమైన పద్యపాదాన్ని అనుకరణించిన పద్యపాదాన్నికలిపి చదివితే మూలంలోని పద్యంలాగే ధ్వనిస్తుంది. అనుకరణలోకి మూలంలోని శబ్దాలురావు. అనుకరణ ధ్వనికిమాత్రం పరిమితము. "సదమల మణిమయ సౌధ భాగంబుల..." అనే పద్యపాదాన్ని "సద్దల్లో మన్నువోయ, సుద్ద భాగంబుల" అని మార్చడం ఈ రకం హాస్యానికి ఒక ఉదాహరణ.

*అచ్చమ్మా ఇకతిట్టకే* : సంధ్యావందనంలో "ఉత్తమే శిఖరేజాతే" అనే వాక్యాన్ని ఒక పేరొడిస్టు "ఉత్తమేశిఖరే జాతే కోన్‌జాతే బులావురే" అని అనుక రించాడట. ఈ రెండు వాక్యాలను కలిపి సంస్కృత శ్లోకంలాగ చదివితే తమాషాగానే ఉంటుంది. "అమృతాభిదానమసి రౌరవే పుణ్యనిలయే పద్మార్బుద నివాసినాం అర్ధినాముదకంద త్తం, అక్షయ్య ముపతిష్టతు" అనే మంత్రానికి ఈక్రిందిది అనుకరణ. అయితే అన్నిశబ్దాలూ స్పష్టంగా పలకక పలుకుతున్నట్లు నటిస్తే బాగా తమాషాగా ఉంటుంది. "అమ్మితేవృధ, అదంతమసి అంబుగజము పట్టుకొన్నదే అరచిచచ్చినా నిన్ను విడువదే. అచ్చమ్మా ఇక తిట్టకే" ఇవన్నీ పేరడీలవంటివే.

ఇంతటితో శబ్దాశ్రయహాస్యము పూర్తిఅయింది. ఇంకా అనేక పదప్రయోగ జన్య హాస్య విశేషాలుచూపవచ్చునుగాని గ్రంధవిస్తర భీతిచే ఇంతటితో ఆపివేస్తున్నాను. ఇకముందు రాబోయేది భావాశ్రయ హాస్యము.

---(O)---

140B

రసాభాసము

హేత్వా భాసము

అలంకారా భాసము

భావా భాసము

బోధా భాసము

సంఘటనా భాసము

ప్రకరణా భాసము

ఆచారా భాసము

వాదా భాసము

స్తోత్రా భాసము

# భావాశ్రయ హాస్యము

*వికృతిభావగతము :* ఈ భావాశ్రయ హాస్యంలో ఒకరకమైన వికృతి ప్రదర్శింపబడుతుంది. ఈ వికృతి భావగతము. భావంలో ఒక మెలిక ఒక వైపరీత్యము ఒక వింతపోకడ విరోధభావముల సంయోగం భిన్నార్థముగల రెండుమాటల కలయిక ఒక అనౌచిత్యము భావాశ్రయ హాస్యానికిమూలము. ఒక వస్తువును చూచినప్పుడు కంటి రెటీనాపై బొమ్మ తలక్రిందుగా పడుతుంది. ఆలోచనలో ఈ మాదిరి వక్రత భావాశ్రయ హాస్యానికి మూలము.

*చమత్కారము :* భావము నడవవలసినవిధంగా సక్రమమార్గాన నడిస్తే అందులో చమత్కారం ఏమీ లేదు. మామూలు పద్ధతిలో ఉన్నది ఉన్నట్లే చెబితే అందులో విశేషము ఏమీఉండదు. మామూలు పద్ధతికి భిన్నమైనపద్ధతిలో వాక్కును రచనచేస్తే అది చమత్కారం అవుతుంది. ఆ చమత్కారం కవిత్వానికి చెందినదైనా అవుతుంది, హాస్యానికి చెందినదైనా అవుతుంది. 'ఆమెకు కోపంవచ్చింది' అని అనడం అతిసామాన్యమైన భావప్రకటన. ఆమె కనులలోన సర్పములు బుసలుకొట్టినవి' అని అనడము ప్రతిభావంతమైన భావప్రకటన. ఇల్లాగ ఏదోవిధంగా మనోహరమైన తీరున భావప్రకటనచేయడమే కవితాశక్తి.

ఈ విధంగా అక్షరబద్ధమైన వాక్యము వ్యాకరణయుక్తంగా నిరాలంకారముగా ఉంటే అది కేవలము వచనమైంది. వర్ణనలతోకూడినదైతే కావ్యం అయింది. మామూలుపద్ధతికి భిన్నమైనపద్ధతిలో వాక్యరచనచేసి అలంకారాలు కూర్చి కావ్యత్వాన్ని సాధించినట్లే వికృతినిప్రదర్శించి

హాస్యాన్నిసాధించవచ్చు. శబ్దముల కూర్పులోగాని వర్ణక్రమంలోగాని ఉచ్చారణలోగాని ఏదైనావైపరీత్యం ఉంటే అది శబ్దాశ్రయ హాస్యమని గ్రహించాము. ఏదైనా ఒకవిషయాన్ని గురించిచేసేఆలోచనలో భావనలో ఒకవైపరీత్యము అసహజత్వము అసంగతత్వము క్రమభంగం ఉన్నట్లయితేనూ అలాంటి భావనవలన హాసము జనించినట్లయితేనూ దానిని భావాశ్రయ హాస్యము అంటాము.

అల్ప విషయాలను అద్భుత విషయాలుగానూ అద్భుత విషయాలను అల్ప విషయాలనుగానూ భావించడంలోనూ ఉదాత్త విషయాలను అనుదాత్త విషయాలుగానూ అనుదాత్తాన్ని ఉదాత్తంగానూ భావించడంలోనూ భావవక్రతఉంది. సహజత్వాన్ని అసహజత్వంగానూ అసహజత్వాన్ని సహజత్వంగానూ భావించడమూ తెలివితక్కువతనము వలన చేసిన పనిని తెలివైనపనిగా వర్ణించడమూ న్యాయాన్నిఅన్యాయం అనడమూ అన్యాయాన్ని న్యాయమనడమూ భావహాస్య కల్పనలో జరిగే పనులు.

మిథ్యాభిమానమూ స్వార్థచింత అహంకారము అసూయ మొదలగు దుర్గుణాలను సుగుణాలని చెప్పడముకూడా భావవక్రతకు ఉదాహరణలే. ఇట్టివక్రతకు భావనాశక్తి అవసరము. అందుకని దీనిని "Imaginative Humour" అన్నారు. అతిగంభీరమైన విషయాన్ని పేలవముగానూ పేలవమైన విషయాన్ని గంభీరంగానూ మలచడమూ వికృతభావ ప్రదర్శనమే.

రూపలావణ్యము శబ్దాశ్రయ హాస్యలక్షణము. భావసౌందర్యము భావాశ్రయ హాస్య లక్షణము. శబ్దాశ్రయహాస్యము బాహ్యసంబంధి. భావాశ్రయహాస్యము ఆంతరంగిక విషయము. మొదటిదానిలో చమత్కారము భాషలో ఉంది. రెండవదానిలో చమత్కారము భావములోఉంది.

"Humour lies in what is suggested to the imagination and not in what is perceived." శాబ్దికహాస్యము పుష్ప రూపాన్ని మాత్ర మేచూచి ఆనందించడమువంటిది. భావాశ్రయ హాస్యము పుష్పసౌరభాన్ని చూచి ఆనందించడం వంటిది. అర్థాశ్రయ హాస్యము పుష్పహృదయాన్ని చూచి ఆనందించడం వంటిది. శబ్దాశ్రయ హాస్యము వస్తురూపంలో వికృతిని చూపుతుంది. భావాశ్రయ హాస్యము వస్తు ధర్మంలో వికృతిని చూపుతుంది. అర్థాశ్రయహాస్యము వికృతిప్రమేయం లేకుండా అర్థవైభవాన్ని కలిగి ఉంటుంది. ఈ భావాశ్రయ హాస్యము ఎన్ని ప్రకరణములద్వారా సాధించవచ్చునో చూద్దాము.

రసాభాసము :

*వీరాభాసము :* అల్పజీవులను సంహరించడము శౌర్యముకాదు. దానిని శౌర్యముగా వర్ణించడములో భావవక్రత ప్రదర్శితమవుతుంది. ఈగలు పక్కపైన వాలితే వాటిని సంహారం చేయడానికి పూను కొన్నాడు ఒకడు. తువాలును తీసుకొని ఆ ఆయుధంతో దెబ్బకు ఒకటి చొప్పున ఈగలనుచంపి వైరివీరసంహారము చేసినట్లు వర్ణనము చేయ డంలో వీరము ఆభాసరూపమును పొందినది.

భావము సహజమైనమార్గాన నడువలేదు. ఈగలతోనూ దోమల తోనూ పోట్లాడడము పెద్దయుద్ధంగా భావించడములోనే భావము వంకర నడకనడిచింది. ఆ క్షుద్రప్రాణి సంహారము లోకోపకారం నిమిత్తము జరిగిందనీ మానవజాతికి మేలు చేకూరిందనీ అతడు మహాశౌర్యవంతు డనీ కార్తవీర్యార్జున సదృశుడనీ చెపితే మరీబాగుంటుంది. భావం మెలిక పడకపోతే అది క్షుద్రకార్యంగా తోస్తుంది. దాన్ని ఘనకార్యంగా భావించడములోనే అసహజత్వము ఉన్నది. అదే భావవక్రత.

అనవసరమైన పౌరుషప్రదర్శన అసంగతమైన శౌర్యధైర్యాది గుణప్రశంస హాస్యజనక వృత్తాంతములు. ఇది వీరాభాసము. అధమ పాత్రగతముగా వీరమును చూపించుట వీరాభాసమగును. భారతంలో

ఉత్తరుడు శత్రువుపైకి వాడికివెళ్లిన ఘట్టంలోకూడా ఈ మోస్తరు హాస్యము కనబడుతుంది. విరాటరాజు గోవులను కౌరవులు తోలుక వెళ్లారు. మహారాజు మొదలైనవారంతా దక్షిణానికి వెళ్లారు. ఉత్తరాన కూడా ఇల్లాగే గోవులను ఎత్తుకుపోవడము జరిగింది. ఉత్తరానికి వెళ్ల డానికి ఎవ్వరూలేరు ఉత్తరకుమారుడు తప్ప.

*ఉత్తరకుమార ప్రజ్ఞలు :* అతడుచిన్నవాడు. అంత శౌర్యవంతుడు కూడాకాదు. అయినా ఉత్తరుడు "కౌరవుల పొగరుఅణచడానికి ఎవ్వరూ లేరని అనుకుంటారేమర్రా! నేనొక్కడినేవెళ్ళి శత్రువీరులను ప్రేటున కొక్కనిగా నరికి గోవులను మళ్ళించుకొని రాగలను. అయితే పట్టణంలో ఒక్క రథచోదకుడైనాలేడు. అంతా నాన్నగారితో వెళ్లారు. నాకు ఒక్క సారథిదొరికితే వీళ్ల సంగతి అంతుచూసేవాణ్ణి"అంటాడు. అక్కడఉన్న ఉత్తర, సైరంధ్రీవాళ్లంతా "బృహన్నల మంచిసారథ్యం చేయగలడు. ఆయనను సారథిగా తీసుకొని యుద్ధానికి పొమ్మని" ప్రోత్సహిస్తారు. పేడిమూతివాని సారథ్యం తనకు పనికిరాదని బింకాలుపలికి చివరకు అతి కష్టంమీద అర్జునుని సారథ్యాన్ని అంగీకరిస్తాడు. "బృహన్నలా! తీరా యుద్ధభూమిని చూచి భయపడి పారిపోవుగదా." అని మేలమాడుతాడు అర్జునునితో.

*రథాన్ని వెనక్కుతిప్పు బాబూ :* వారిద్దరూ యుద్ధరంగాన్ని చేరు తారు. అయితే అచ్చటి కౌరవసైన్యాలను చూచేసరికి ఉత్తరుడికి గుండె జారిపోతుంది. అయ్యబాబో! ఏమిటోఅనుకున్నాను. కౌరవసైన్యంలో శకుని, వికర్ణుడు, కర్ణుడు మొదలైన హేమాహేమీలూ, అతిరథులూ, మహారథులూ ఉన్నారు. వారితో నేను యుద్ధంచేయగలనా? "అకృతా స్త్రుడ బాలుడ గార్ముక విద్యాప్రౌఢిమై నిరూఢులయిన యీశకుని జయ ద్రథ దుర్ముఖ వికర్ణ కర్ణాదియోధవీరుల కెదురే" వీరితో నేను పోరాడ గలనా! వద్దుబాబూ వద్దు. నేను చచ్చిపోతే మాఅమ్మ ఏడుస్తుంది. రథాన్ని వెనక్కుత్రిప్పవయ్యా బృహన్నలా." అంటాడు.

*నాకు భయం వేస్తున్నది* : బృహన్నల అతని పిరికితనాన్ని చూచి నవ్వి రథాన్ని ఆపకుండా ముందుకు పోనిస్తూఉంటే ఉత్తరునికికోపమూ దుఃఖమూ, అసహాయత్వమూ ముప్పిరిగొన "బృహన్నలా! నాకుభయం వేస్తున్నది. నేను ఇక్కడ ఉండలేను. మాఅమ్మకు నేను ఒక్కణ్ణే కుమారుణ్ణి. తెలియకవచ్చాను. నన్ను దిగబెట్టుబాబూ లేకపోతే రథం మీదినుంచి దూకుతాను" అంటాడు. ఈ మాటలు ఇంతదీనంగా అన్న ప్పటికీ బృహన్నల రథాన్ని ఆపడు. చూస్తూఉండగానే ఉత్తరుడు రథం మీదినుంచి క్రిందికిదూకి పరుగెత్తుతాడు. బృహన్నల అతనివెంట పరుగెత్తి పట్టుకొని "ఉత్తరకుమారా! నీవు యుద్ధం చేయనక్కరలేదయ్యా. రథాన్నిమాత్రం నడుపు. నేను యుద్ధంచేస్తాను." అని బతిమిలాడి అట్లాచేయడానికి ఒప్పిస్తాడు.

*వాణ్ణి చంపేస్తాను* : ఈ ఘట్టంలో ఉత్తరుడు మొదట ధైర్య శౌర్యాది సుగుణములుగలవాడివలె బింకాలుపలికి యుద్ధభూమిని చూడ డంతోనే బెదరిపోవడమూ, దర్జా దర్పమూ అన్నిటినీ చివరకు సిగ్గును కూడా విడిచిపెట్టి దీనాలాపాలు పలుకడమూ ఈ రెండూ పొత్తుకుదరని విషయాలు. మొదటచూపిన ధైర్యానికీ తరువాత ప్రదర్శించిన పిరికి తనానికీ పొత్తులేదు. అందుకనే నవ్వువస్తుంది. ఇదికూడా వీరాభాసము అనిచెప్పవచ్చు. త్రాగిఉన్నవాడు తనకెవరో అపకారంచేసినవాడి సంగతి జ్ఞాపకంతెచ్చుకొని వాణ్ణి చంపేస్తాను నరికేస్తాను అని పౌరుషాన్ని ఒలకపోస్తూ తూలితూలి నడుస్తూఉంటే నవ్వువస్తుంది, వాడు మాట్లాడే మాటలకు చేసేచేష్టలకు పొత్తులేదు. ఇదీ వీరాభాసమే.

*బల్లెంతో పుల్లాకు పొడిచినాడు* : ఈక్రింది పద్యంలో వీరాభాసము చక్కగారాణిస్తున్నది. భళిభళీ మాతాత బల్లెంబుచేబూని పుల్లాకుతూటుగా పొడిచినాడు. ఎద్దుచ్చపోయంగ ఏరులై పారంగ లంఘించి లఘించి దాటినాడు! కలుగులోనూ కప్ప గఱ్ఱుగఱ్ఱుమనంగ కట్టారి తీసుక గదిమి

నాడు! నాగలాపురికాడ సక్క తమ్మకరాగ తిరువళూరూదాక తరిమినాడు. ఎలుక ఎదురుకురాగ సీజె చేతసుబూని యేడారుబారలు ఎగిరినాడు! ఔర వీని ప్రరాక్రమంబద్భుతంబు." అట్లానడుస్తుంది ఆ పద్యం. ఇదీవీరా భాసమే.

*కరుణాభాసము :* తాత్కాలికమైన ఎడబాటును భయంకరమైనట్టి దుఃఖభాజనమైనట్టి వియోగంగానూ భరింపరానిదిగానూ వర్ణించి భావ వికృతిని సాధించవచ్చు. ఒకడు మిత్రులను వదలిపెట్టి గ్రామాంతరం వెళ్లుతున్నాడు. రెండురోజులతరువాత తిరిగివస్తాడు. ఈ అల్పవిష యాన్ని భయంకరమైన విరహసంఘటనగా ఒకడు ఊహించి ఆవెళ్లు తున్నమిత్రుని ఏడ్పులతోనూ పెడబొబ్బలతోనూ సాగనంపుతాడు.

*జలధిలో దూకెదను :* అతడు విలపిస్తూ ఇల్లాగ అంటాడు. "మిత్రమా వెడుతున్నావా! మమ్మలనందరిని దుఃఖసాగరంలో ముంచి పోతున్నావా? ఇంక రెండురోజులవరకూ నీప్రసన్న మందహాస సుందర ముఖారవిందాన్ని చూడలేముగదా! ఈ వియోగబాధను మేమెట్టుల భరించ గలము. మిత్రవియోగముకంటే విషాదవృత్తాంత మింకేమున్నది? మిత్రమా! ఈ ఎడబాటును నేను సహింపలేను. అగ్నిలోనైనను జల ధిలోనైనను దూకెదను. విషమైనను పుచ్చుకొందును. ఒకత్రాడైనా దొరకదే ఉరిపోసుకొనుటకు! నేనే నిజమైన మైత్రిని నెరపినవాడనైతి నేని హృదయపూర్వకంగా ఈతని ప్రేమించినవాడనైతినేని ఈకాఫీ విషమగుగాక నాప్రాణములు ఈక్షణములోనే పోవుగాక." అని నాటకీయ పద్ధతిలో అంటాడు. అది నవ్వుపుట్టించక మానదు.

ఇక్కడ నవ్వుపుట్టించే పదార్థము ఎక్కడుంది? శబ్దములకూర్పులో ఉండే వైచిత్రిగాదు నవ్వుకుకారణం. ఈ కథలో అర్థవైభవముగాని ధ్వని వ్యంజకత్వముగాని ఏమీలేదు. అతిసామాన్యమూ అల్పమూ

అయిన విషయాన్ని అసాధారణమూ అనల్పమూ విషాదగర్భితమూ అన్నవిషయంగా భావించడములో ఉన్నది హాస్యజనక వృత్తాంతము. ఆ భావవికృతి ఒకసారి మనస్సుకు తట్టినతరువాత దాన్ని ప్రదర్శించడములో అభివ్యక్తముచేయడంలో హాస్యశీలుని భావనాశక్తి విజృంభించి విపరీతపుపోకడలు పోతుంది. ఇది కరుణాభాసము.

*శృంగారాభాసము* : ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకొంటున్న దంపతులు. ఒకరినొకరు మెచ్చుకొనడంలో సంభాషణ ప్రారంభిస్తారు. కొంతసేపటికి ఈ వ్యాపారము పోట్లాటలో పర్యవసిస్తుంది, ఈవిషయం శృంగారాభాసకు ఉదాహరణ. ఇల్లాగ ఏరసమైనా ఆభాసరూపమును పొందినపుడు హాస్యజనకం అవుతుంది.

*భీభత్సాభాసము* : ఈ రచన చూడండి. "మాయింట్లో ఆమూల ఏర్పడ్డ ఒక భీభత్సదృశ్యం చూడండి. అదొక మహారణ్యము. ఏనుగులు సింహాలు పెద్దపులులు అడవిపందులు చిరుతపులులు ఉన్నాయి అక్కడ. అయితే ఒకరోజున అవి ఒకదానితోఒకటి పోట్లాడుకొన్నవి. ఒకభయంకరమైన యుద్ధంజరిగింది. తెగిపడియున్న ఏనుగతొండాలు నరకబడిన తలలు, గాయాలనుండి రక్తంకారుతున్న శరీరాలతో హృదయ విదారకంగా ఏడుస్తున్న లేళ్లూ, పందులూ బాధతో గీపెడుతున్న ఏనుగులు తెగిపోయిన తలలుగల వ్యాఘ్రములూ, చిరుతలూ ఆ మహా రణ్యంలో ఉన్నాయి. మా జయ రాధలు కొన్నిటికి చికిత్సచేశారు. తెగి పోయిన తలలను శరీరానికి గుడ్డపేలికలతో అంటగట్టారు. సింహాలు గాండ్రుగాండ్రుమంటున్నా లెక్కజేయక వాటిని గుడ్డపేలికలతో కట్టి లాగుతున్నారు. అవి ఏడుస్తున్నవి." ఇది భీభత్సాభాసము.

*భక్తిరసము-ఆభాసరూపము* : అన్నిరసములకు ఏవిధంగా రసాభాసము కల్పించినామో అల్లాగే భక్తిని హేళనచేస్తే ఆ రసము ఆ భాస

రూపము పొందుతుంది. అప్పుడు హాస్యము ఉదయిస్తుంది. ఈ క్రింది కథచూడండి. "మాఆవిడ కొన్నాళ్ల హరినాథభజనలు చేశేది. ఆరోజులలో ఆభజనలు ఎక్కువగా జరుగుతూఉండేవి. ఆ భజనలలో ఒక విశేషంఉంది.

*హరినాథబాబా భజన* : అమ్మలక్కలు అంతాజేరి భజన ప్రారంభిస్తారు. భజన మంచిపట్టులో ఉన్నప్పుడు అంతాతన్మయులై హరినాథబాబు సంకీర్తనలో మునిగిపోయి కళ్లుమూసుకొని పాడతారు. కళ్లు తెరిచి చూసేసరికి దేవతా నైవేద్యానికై ఉంచిన ఫలహారాలలో ఏదో ఒకటి ఆరగింపుఅయిపోయేది. బాబాకైంకర్యానికి వెండిగిన్నెలలోపాలూ, పరమాన్నమూ లడ్డూలూపెట్టి ఉంచేవారు. బాబాగారు ఎప్పుడో ఒక సమయాన భక్తులను ఆదరించి తానే స్వయంగావచ్చి ఆ పదార్థాలలో దేనినో ఒకదానిని ఆరగింపుజేసి వెళ్ళిపోయేవారు. అయితే ఆ స్వామి రావడముకాని పోవడముకాని ఎవ్వరికి కనిపించేదికాదు. భక్తులు కళ్లు తెరిచి చూచేసరికి అక్కడఉంచిన పదార్థాలలో ఏదోఒకటి లేకపోవడమే ఆయన ఆరగింపు చేశారన్నదానికి గుర్తు.

*బాబా వెండిగిన్నెను ఆరగించాడు* : మా ఇంట్లోకూడా మా ఆవిడ భజనలు ప్రారంభించింది. కొన్నిరోజులపాటు ఆరగింపు జరక్కపోయేసరికి ఆవిడకు చాలావిచారంకలిగి బాబా అనుగ్రహంకోసం ఇంకా తీవ్రంగా భజనలు సాగించింది. ఒకరోజున బాబాకు మా ఆవిడపై కూడా కరుణ కలిగింది. అందరిళ్లల్లోనూ పదార్థాలు మాత్రమే మాయమవుతూఉంటే మాఇంట్లో పదార్థంతోపాటు వెండిగిన్నె కూడా మాయమైంది. అంటే ప్రభువు ఫలహారంతోపాటు వెండిగిన్నెనుకూడా ఆరగింపుచేశాడు.

*వెండిగిన్నెలను ఆరగించవద్దు ప్రభూ* : బాబా ఆరగిస్తే ఏంజేస్తాం? నేను ఈ విధంగా ప్రార్థనచేశాను. "ప్రభూ! నేను నీభక్తుడను.

ఇంట్లోకూడా ఆరగింపు జరగడమువలన మేము ధన్యులమైనాము. కాని ప్రభూ అందరిఇళ్ళల్లోవలెనే మాఇంట్లోకూడా నీకు ప్రీతియైన వస్తువును ఆరగించు. అక్కడపెట్టినవాటిలో నీకుఇష్టమైన పదార్థం లేకపోతే కలలోకనపడి చెప్పిచేయించుకో. కాని ప్రభూ వెండిగిన్నెలను గుండు చెంబులను ఆరగిస్తే మేము అరిపోతాము. ఏపదార్థాన్నిఅయినా మాయం చేయిగాని వెండిగిన్నెలను గుండుచెంబులను మాయంచేసి నీ మాహాత్మ్యమును చూపవలసిన అవసరంలేదు. మేము నీభక్తులము.

*బంగారపు కడ్డీలను వర్షించు:* "స్వామీ! నీ మహత్తును మేమెరుగుదుము. ఇప్పుడు వెండిగిన్నెమాత్రమే మాయమైనది. ముందుముందు నీమహత్తు ప్రదర్శించవలయుననెడి అభిలాషతో మా ఆవిడ మెడలోని బంగారపుగొలుసూఅవీ మాయంచేస్తావేమో. వద్దుస్వామీ వద్దు! ప్రభూ నీ భక్తులు తరించడానికి భజనసమయమున ఏదో ఒకటి ప్రసాదంగా ఇస్తున్నావు. కొబ్బరిముక్కలు పటికబెల్లంముక్కలూ, లడ్డూలూ అల్లాంటివి పైనుంచి వర్షిస్తున్నావు. ఆ కొబ్బరిముక్కలబదులు బంగారపుకడ్డీ ముక్కలు పడేస్తివా నీమాహాత్మ్యము ఎక్కువగా వెల్లడిఅవుతుంది. అల్లాటి అద్భుతకార్యాలు చెయ్యిప్రభూ! ఖరీదుగల వెండిబంగారాలు పడేయి."అని మరీమరీ ప్రార్థించినాను. ఈ కథలో భక్తినే హేళన పాలుచేయడంవలన భక్తిరసం అభాసుఅయింది. అయితే హాస్యం సిద్ధించింది.

హేత్వాభాసము :

హేతువుగానిదానిని హేతువుగా చెప్పడంలో ప్రదర్శితమయ్యే వికృతినే హేత్వాభాసము అంటారు. దీనికొక ఉదాహరణఇస్తాను. గుంటూరులో జట్కాబండి ఎక్కాను. ఆ గుఱ్ఱం వేగంగాపోక పెళ్లి నడకలు నడుస్తున్నది. "ఏమయ్యా గుఱ్ఱం హుషారుగా నడవడము లేదేమి?" అని అడిగితే ఆ బండితోలేమనిషి అంటాడూ, "బండిలో

మీరొక్కరేగదండీ ఎక్కిందీ. బరువులేవండి. బరువుఉంటేనేగాని గుఱ్ఱానికి హుషారురాదు.'' అని.

*ఎండలకు దీపాలు ఆర్చుకుపోయినవి :* సరే. ఎట్లాగో బండినడుస్తున్నది. రోడ్డువెంటనున్న ఎలక్ట్రిక్ దీపాలు కాంతిమంతముగాలేవు. ''ఏమయ్యా! దీపాలు ఇల్లాగ ఏడ్పుముఖం పెట్టినవేం?'' అని జట్కామనిషినే అడిగితే అతడుఅంటాడూ, ''ఎండాకాలంగదండీ ఈ మండుటెండలకు మనుష్యులే ఆర్చుకుపోతున్నారు. మనుష్యులే ఏడ్పుముఖం పెడుతున్నారుగదా! ఇక దీపాలు ఏడుస్తూఉండడంలో విచిత్రంఏముందీ?'' అని. కుంపటిరాజేయడానికి పాతకాగితాలు ఉపయోగిస్తున్నాను. పాత రైల్వేగైడ్ ఒకటిఉంటే అందులోనుంచి కాగితాలను చింపి మంటజేయాలని చూస్తుంటే అవి మండడములేదు. ''ఎందుచేత ఈ కాగితాలు మండడములేదు?'' అని కాంతాన్ని అడిగాను. ఆవిడ అంటుందీ, ''అవి రైల్వే గైడ్‌లోని కాగితాలుగదండీ అందుకని మండడములేదు.'' అని. రైల్వే గైడ్‌లోని కాగితాలు మండవట.

*బర్మా వెళ్లివచ్చినవాడికి పిల్లనివ్వరు :* మాకు ఒక స్నేహితుడు ఉన్నాడు. ఆయనకుమారుడు బాగా చదువుకొన్నవాడే. బర్మా మొదలైన దేశాలుకూడా వర్తక సందర్భంగా వెళ్లివచ్చి ధనముబాగా ఆర్జించాడు. ఆ అబ్బాయికి ఇంకాపెళ్లికాలేదు. నేను కాంతంతోఅన్నానూ, ''కాంతం! ఆ అబ్బాయికి ఇంకాపెళ్లికాలేదు కారణంఏమిటీ?'' అని. ''చూస్తూ చూస్తూ ఆ అబ్బాయికి పిల్లను ఎవరుఇస్తారండీ!'' అన్నది ఈసడింపుగా. ''ఏమి ఆ అబ్బాయికి పిల్లను ఎందుకివ్వరూ? ఏం తక్కువని?'' అని అడిగాను. ఆమె తల విసురుగా అటూఇటూ త్రిప్పుతూ అన్నదీ ''చూస్తూచూస్తూ బర్మావెళ్లివచ్చినవాడికి పిల్లనెవరు ఇస్తారండీ.'' 'ఏం ఇస్తే? ఎందుకు ఇవ్వకూడదు?'' అన్నాను. 'ఇవ్వరండీ. బర్మావెళ్లివచ్చినవాళ్ళకు పిల్లనిస్తారుటండీ ఎవరైనా?' అని తెగేసిచెప్పింది ఆవిడ.

*పెద్ద పెద్ద అంగలువేయడము బర్మావెళ్ళివచ్చినట్లు గుర్తు:* నేనుమళ్లీ అన్నానూ, "అయినా ఆ పిల్లవాడు బర్మావెళ్లి వచ్చాడన్న సంగతి ఎవరికైనా ఎట్లాతెలుస్తుంది. నిజంగా వెళ్లాడోలేదో!" ఆమె "బర్మావెళ్ళి రాకపోవడం ఏమిటండీ? బర్మాయేకాక ఇంకా పాడుదేశాలకు వెళ్ళివచ్చి ఉంటాడు. అందుకు సందేహంలేదు." అన్నది. "నీకు ఎట్లాతెలుసునూ అంటు?" అన్నాను నేను. "ఆమాత్రంతెలియదుటండీ. అల్లాగ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూనడిచేవాడు బర్మావెళ్లి వచ్చినవాడే అయివుంటాడు." అన్నది. బర్మావెళ్లిరావడం ఏమితప్పో! పిల్లనివ్వకపోవడానికి అది కారణమా? పెద్దపెద్ద అంగలువేస్తూ నడవడము బర్మావెళ్లివచ్చినట్లు గుర్తా!

*పెద్ద సంతకం చేస్తాడు:* ఈ విధంగా కారణంకానివి కారణాలుగా ఊహించడములో భావవక్రత కనపడుతూఉంది. రాఘవయ్యచౌదరిగారు ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడు. ఒక సంవత్సరం పనిచేశాడు. మరుసటి సంవత్సరం మళ్ళీఉద్యోగం ఇవ్వాలావద్దా అన్న ప్రశ్న వచ్చింది. ఆయనకు మళ్ళీ ఉద్యోగం ఇవ్వకూడదని కమిటీ మెంబర్లలో ఒకరు గట్టి పట్టు పట్టారు. "ఏమండీ ఆయనకు ఉద్యోగం ఎందుకివ్వకూడదు? సమర్థుడైన ఉపాధ్యాయుడుకాడా" అని అడిగితే ఆ మెంబరు ఇల్లాఅన్నాడు. "ఆయన సామర్థ్యంసంగతి నేను ఆలోచించడములేదండీ. హెడ్‌మాస్టరుకంటే ఎత్తరి అయినవాడికి ఎట్లాఇస్తామండీ ఉద్యోగము! తనకంటే ఎత్తరిఅయిన ఉపాధ్యాయునిచేత హెడ్‌మాస్టరు ఏమిపని చేయించగలడండీ? అదీగాక ఆయన సంతకం హెడ్‌మాస్టరుగారి సంతకం కంటే పొడుగు. పొడుగుసంతకం చేసేవాడితో పనిచేయించడము ఆయనకేకాదు ఎవ్వరికైనా కష్టమే.

*చాకలితో బాధలు:* ఇటువంటి వాదనను ఆంగ్లతర్కంలో "నాన్ సెక్విటూర్" అంటారు. ఇక్కడ కారణంగాని విషయాన్ని కారణంగా

గ్రహించడంలో ఉన్నది చమత్కారము. పూర్వకవులు వ్రాసిన చాటువు లలోకూడా ఈరకము భావాశ్రయహాస్యము కనపడుతుంది. ఒకటిరెండు ఉదాహరణలు ఇస్తాను. విష్ణుమూర్తి పీతాంబరధారి. "నూలుబట్టలు కట్టక పట్టుబట్టలే ఆయన ఎందుకుకడతాడూ?" అంటే కారణం నూలుబట్టలు అయితే మాటిమాటికి చాకలికివేసి ఉతికించాలె. వాడు అనుకొన్నరోజుకు బట్టలు ఉతికి తీసుకొనిరాడు. వాడితోపోట్లాడాలె. వాడితో బాధలుపడలేక పట్టుబట్టలు కడతాడట విష్ణువు. శివుడు తోలుకప్పుకొంటానికి భైరవుడు దిగంబరుడుగా ఉండటానికికూడా ఇదేకారణమట.

ఇంతవరకు ఇచ్చిన ఉదాహరణలు అన్నీ ఒకేరకానికి చెందినవి. అది ఏమిటంటే తగినకారణము కానిదానిని కారణముగా చెప్పడము. పుస్తకములోని కాయితాలు మండకపోవడానికి ఆ పుస్తకము రైల్వే గైడుకావడమూ. అల్లాగే పిల్లవానికి పెళ్లికాకపోవడానికి కారణం అతను బర్మావెళ్లిరావడమూ అతడు పెద్దపెద్ద అంగలువేస్తూ నడవడము బర్మా వెళ్ళినట్లు గుర్తుగా భావించడమూ వీటిఅన్నిటిలోనూ కారణంగాని విష యాన్ని కారణంగా గ్రహించడమే కనబడుతుంది. ఇటువంటి వ్యాపా రాన్ని తర్కశాస్త్రంలో 'హేతువిపర్యాస హేత్వాభాసము' అనికూడా అంటారు. The fallacy of the false cause.

అలంకారాభాసము :

శరీరానికైనా, కావ్యానికైనా అలంకారాలు అందంకోసమే. ఆమెముఖము చంద్రునివలె ఉన్నది. అంటే అది ఉపమ. ఆమెముఖము సిబ్బివలెఉన్నది అంటే అది ఆ అలంకారముయొక్క ఆభాసరూపము. అలంకారమైనాసరే ఉచితమైన ఉదాత్తతను గాంభీర్యమును గోల్పోయి నప్పుడు అల్పవస్తుపరమైనపుడు వికృత భావగర్భితమైనప్పుడు అది ఆభాసరూపమును పొందినదిఅని అనవచ్చు. ఏ అలంకారమైనా ఆభాస రూపములో ఉన్నప్పుడే అది హాస్యస్ఫోరకం అవుతుంది. ఆభాసరూపా

నికి నేనుఇచ్చిన నిర్వచనము లక్షణగ్రంథాలలో ఇచ్చినదానికి భిన్నంగా ఉంటుంది.

*ఆభాసరూపము :* కొన్నిపదాలకు లాక్షిణికులు కావ్యపరంగా నిర్వచనంచేశారు. వాటికి హాస్యపరంగా క్రొత్త అర్థాలను కల్పించుకొని ఈ రసానికి సంబంధించిన హాస్యభేద ప్రభేదాలను సూచించడానికి అర్హమైన పారిభాషిక పదజాలమును సృష్టించుకోవలసిన అగత్యం కలిగింది నాకు. ప్రసిద్ధమైన అలంకారాలు ఉపమ ఉత్ప్రేక్ష మొదలైనవి ఆభాస రూపంలో హాస్యసాధనకై ఉపయోగపడినపుడు వాటికి సహజమైన గాంభీర్యాన్ని ఔచిత్యాన్ని ఉదాత్తతను కోల్పోక తప్పదు. దాన్నే నేను 'ఆభాసరూపమునుపొందుట' అంటున్నాను. ఇక ఆ అలంకారాలు హాస్య సాధనకు ఎల్లాగ వినియోగపడతయ్యో చూద్దాము.

*ఉపమ :* ఆమె ముఖము చంద్రునివలె ఉన్నది అంటే ఈ అలంకారము సహజరూపంలో భాసిస్తున్నది. ఆమెముఖము సిబ్బివలె ఉన్నది అన్నప్పుడు ఉపమాలంకారము ఆభాసరూపమును పొందినది. అల్లే ఈ క్రిందివికూడాను. 'ఆమెజడ గరిటెకాడవలె నున్నది.' కీర్తిని శరశ్చంద్ర చంద్రికలతో పోలుస్తారు ప్రసిద్ధంగా. అల్లాకాక ఆ కీర్తినే కొబ్బరిముక్కలతోనూ లేక కర్పూరముతోనూ పోలిస్తే ఆ అలంకారము ఆభాసరూపంలో హాస్యజనకం అయింది. చీకటిని నల్లసిరాతోనూ మేఘాలను సిగరెట్టుపొగతోనూ పోలిస్తే జరిగేపనికూడా అంతే.

*ముఖము ఇత్తడిసిబ్బివలెనున్నది :* చిలుకమర్తివారి నరకాసుర వధలో మందపాలుడు రంభను ఈ విధంగా వర్ణిస్తాడు. "ఆమె చక్కని చుక్క. దాని శరీరకాంతి తాటిపేశమువలె ఉంటుంది. దాని వెంట్రుకలు మసిబొగ్గునలుపు. దానికొప్పు మాలకాకివలె, మట్టిపిడతవలె ఉంటుంది. దానికన్నులు ఆలుచిప్పలవలెనూ మొగము ఇత్తడి సిబ్బివలె గుండ్ర

ముగా ఉంటుంది." ఈ రకముహాస్యమువలన కొంత జుగుప్స కలుగక మానదు. ఏంజేస్తాం: అదేమనకు మనవాళ్లు ఇచ్చిపోయిన హాస్యసంపద.

విరోధము : పైకిమాత్రము విరోధము కనబడుతూ పరమార్థమున విరోధములేకపోతే దానిని విరోధాలంకారము అన్నారు లాక్షణికులు. హాస్యపరంగా విరుద్ధభావములు గల పదాల సంయోగము విరుద్ధము అంటాను. "అతడు ప్రకాశవంతమైన చీకటిలో సంచరిస్తున్నాడు." "అతడు మందగమనంతో పరుగెత్తెను." "చీకటివెలుగులో అతనికి ఆ వస్తువు కనబడ్డది." పై వాక్యాలలో భిన్నార్థముగల పదాలను ఒకదాని కొకటి విరుద్ధమైనవాటిని కలపడము జరిగింది. ఇదొక వాక్చమత్కృతి. "ప్రొఫెసరుగారు ఏంజేస్తున్నారూ?" అంటే విద్యార్థిచెప్పిన సమాధానము "వారు మరచిపోయిన విషయాలను జ్ఞాపకంతెచ్చుకొంటున్నారు." అని. మరచిపోవడం అంటే జ్ఞాపకంలేకపోవడము. అవి ఎల్లా జ్ఞాపకం వస్తవి? ఇది విరుద్ధభావ సంకలనము.

మృచ్ఛకటిక : ఇంకోరకం విరుద్ధంఉంది. ప్రసిద్ధమైన విషయములకు విరుద్ధముగా మాట్లాడడము. "ఇటలీలోని హిమాలయపర్వతపు గుహలలో ఋషులు తపస్సుచేస్తూఉంటారు అనడంలో ఇట్టి విరుద్ధం ఉంది. మృచ్ఛకటికలో శకారుడు అంటాడు. 'ఏను దుశ్శాసనునివలె ఇపుడు నీదుకొప్పు దొరకొందు, జమదగ్ని కొడుకు భీమసేనుడేతెంచి ఆపునో చాన కుంతికి ఆత్మజుండగు శంకరుడు ఆపగలడో' అని. ఇది ప్రసిద్ధవిరుద్ధము. కవి సమయములున్నవి. అనగా కవులు పాటించు సంప్రదాయములు. కోకిల మామిడిచెట్టుపైనుండే కూస్తుంది. వేపచెట్టుపై కూర్చుని కూసింది అంటే తప్పేమీకాదు. అసంభవమూకాదు. కాని అది సమయవిరుద్ధము. కోకిల లేతమామిడి చిగుళ్లను తిని సంతోషంతో కూస్తుంది అనడము సమయసిద్ధము. అవి తిని కడుపునొప్పితోకూస్తుంది అంటే ఎందుకు నవ్వొస్తుంది? అది సమయవిరుద్ధము కాబట్టి.

*ఒకనిమిషంలో వస్తానని అరగంటక్రింద చెప్పాను :* మరొక ఉదాహరణ. భర్త భార్యను సినిమాకురమ్మని పిలుస్తున్నాడు. ఎన్నిసార్లు పిలిచినా ఆమె మాట్లాడలేదు. విసుగెత్తి 'సినిమాకు వస్తావా రావా?' అనిగట్టిగా అరిచాడు ఆయన. ఆమె 'వస్తానండీ' అన్నది. 'మరి ఆ మాటచెప్పవేం?' 'చెప్పానండీ చెప్పిచాలాసేపైంది పైగా నన్నుఅంటారు చెప్పలేదని' అన్నది. 'ఏమనిచెప్పావు?' అని భర్తఅడిగాడు. 'ఒకనిముషంలో వస్తానని అరగంటక్రితమే చెప్పాను'అన్నది ఆవిడ. ఈ కథలో కాలానికి సంబంధించిన వైరుధ్యము ఉన్నది. ఈవిధంగా విరుద్ధాలంకారము హాస్యసాధనకు ఉపయోగపడ్డది. అట్లాగే ఇంకోమాట. శ్రీ కృష్ణశాస్త్రిగారికి 49 వ సంవత్సరం వెళ్ళడానికి రెండుమూడు సంవత్సరాలు పట్టిందట పాపం! ఎంతబాధపడ్డాడో!! ఇవన్నీ విరుద్ధాలంకార ఆభాస రూపాలు.

*సందేహము :* సందేహము అనే అలంకారము ఒకటి ఉన్నది. కావ్యాలంకార సంగ్రహకర్త ఏంజెప్పిందీ మనకక్కరలేదు. ఇంద్రుడో ఉపేంద్రుడో బలీంద్రుడో అన్నపద్యం ఉదాహరణగా ఇచ్చాడు ఆ గ్రంథకర్త. సందేహము అనే హాస్యప్రక్రియకూడా కొంచెం హెచ్చుతగ్గుగా అదేమోస్తరు నడుస్తుంది. నరసభూపాలుణ్ణి చూచి ఇతడు ఇంద్రుడా ఉపేంద్రుడా అన్నట్లే ఈక్రింది కథలో ఉపాధ్యాయుడు ఎప్పుడో తనదగ్గర చదువుకొన్న శిష్యపరమాణువునుజూచి 'ఇతడు నా దగ్గర చదువుకొన్నవాడేనా లేక అతనితమ్ముడా'అని సందేహిస్తాడు. కథ పూర్తిగా చెబితేనేగాని అది హాస్యస్ఫోరకం అన్నసంగతితెలియదు.

*నీవు నీవా, మీఅన్నయ్యవా :* నాదగ్గర ఎంతోమంది చదువుకొన్నారు. ఒక్కొక్క కుటుంబంలో నలుగురుఅన్నదమ్ములు ఉంటారు. ఆ నలుగురూ నాదగ్గరే చదువుకొనడం సంభవిస్తుంది. వాళ్ళు పెద్దవాళ్ళు అయినతరువాత అందులో ఎవరో ఒకరు నన్నుకలుసుకొని 'నమస్కారం

మేస్తారూ!' అంటాడు. ఆ నలుగురిలో వీడు ఎన్నోవాడైందీ జ్ఞాపకం ఉండదు. ఒకసారి అటువంటి సన్నివేశంలో నేను నమస్కరించిన కుర్ర వాడితో అన్నాను. 'అయితే అబ్బాయీ! నీవూ...నీవేనా? లేక...మీ అన్నయ్యవా?' అని. ఇది సందేహమేకదా! ఒకప్పుడు ఆ చదువుకొన్న వాళ్లుఇద్దరూ కవలలు అయిఉంటే తీవ్రమైన సందేహము కలుగుతుంది. ఒకసారి అట్లాగేఅయింది. అల్లాగ చదువుకొన్న కవలలలో ఒకడు మరణించాడు. అప్పుడు నేను 'బాబూ మీఇద్దరిలో చనిపోయింది నీవా మీఅన్నయ్యా?' అన్నాను. సందేహము అన్న అలంకారము హాస్యోత్ప త్తికై వినియోగిస్తే ఇటువంటి పలుకుబళ్లు తయారుఅవుతవి. ఇదీ సందే హాలంకారమే. అయితే కావ్యంలో దానికుండే ధీరత్వము హాస్యపుపలుకు బడి అయినపుడు ఉండదు. అందుకని దీనిని సందేహాలంకార ఆభాసము అనడంలో విప్రతిపత్తి ఏముంది?

వంకాయకూరా దోసకాయకూరా : నరసభూపాలుణ్ణిజూచి ఇతడు ఇంద్రుడో చంద్రుడో అంటే అది సందేహము అనే అలంకారము అన్నా రుకదా! విస్తట్లోఉన్న ఒకకూరనుజూచి "ఇది వంకాయకూరా దోసకాయ కూరా?" అంటే అది సందేహాలంకారము ఎందుకుకాలేదు? అయితే ఈ అలంకారము అల్పవస్తుపరంగా ఉన్నది. కాబట్టి సందేహాలంకారా భాసము అందాము.

ఉత్ప్రేక్ష : కొంచెము హెచ్చు తగ్గుగా అతిశయోక్తి వంటిదే ఇది. మా ఇంటిముందు నాగపోతరావు అని ధనికుని ఇల్లుఉంది. ఆయన భార్యకూ మాకాంతానికిస్నేహము. ఆవిడ రత్నాలు వజ్రాలు మొదలైన ఖరీదైన రాళ్ళతో పొదిగిన ఆభరణాలను ధరించేది. మా ఆవిడకు ఆ తాహతు ఎక్కడిది. ఇమిటేషన్ రాళ్ళనొమ్ములు పెట్టుకొనేది. ఆవిడ మా ఆవిడనుఅడిగేది "ఏమమ్మా అవి రవ్వదిద్దులేనా?" అని. "నీవు వేసుకొన్న ముత్యాలహారంలోనివి మంచి ముత్యాలేకదూ" అనీ.

ఆవిడకు 'కాదని' తెలియదా! ఏదో హేళనచేద్దామని అల్లాఅడిగేది. ఆ సంగతిగ్రహించి కాంతం "ఆఁ. ఇవి మంచిముత్యాలేనమ్మా. నాలుగు వేలుపెట్టి కొన్న హారం మంచిముత్యాలదికాక మాయముత్యాలది అవుతుందా!" అని నవ్వేది. ఇదిచూశారూ ఇది డైమండ్ నెక్‌లెస్ అంటే మరీ లక్షలఖరీదు చేసేదికాదు. ఏదో పదివేలకు చౌకగావస్తే మా అన్నయ్య కొనిపెట్టాడు" అనేది. నాగపోతరావుగారి భార్యకూతెలుసు ఇవికోతలని. మా ఆవిడకూ తెలుసు.

*నీరు బట్టిన ముత్యాలను గోడ అవతల పారేస్తాం :* ఆ నాగపోతరావుగారి భార్య నా భార్యను అవమానం చేద్దామని అడిగింది ఒకరోజు. "ఏమమ్మా రత్నాలు నీరు బడితే మేము ఈ కెమికల్‌తో శుద్ధిచేస్తాము. కెంపులు మాసిపోతే ఈ విధంగా శుభ్రం చేస్తాము. మరి మీరు ఏం జేస్తారూ ?" అని. ఈవిడకు ఒళ్లు మండింది. తను అబద్ధాలు ఆడింది. ఆ సంగతి బైటపెట్టాలనే ఆమె ప్రయత్నం అని గ్రహించి అన్నది. "చూడండీ ఇవి ఖరీదైన రాళ్లే అయినా, నీరుబట్టినా, మాసినా, వాటిని బాగుచేస్తూ కూర్చోము. అటువంటివాటిని గోడ అవతలకు విసిరిపారేసి, క్రొత్తవి కొనుక్కుంటాము" అని.

*కోతలు :* ఇవి మళ్లీ కోతలే. అయితే ఈ మాటలు విని నవ్వకుండా ఉండలేము. అయితే ఇది ఉత్ప్రేక్ష ? అని సందేహించవచ్చు. దీనిని ఉత్ప్రేక్షగా నేను రూపొందించి, మీకు సమర్పిస్తున్నాను. నరస భూపాలుడు శత్రువులను హతము చేస్తే వాళ్ల భార్యలు ఏడ్చారట. ఆ భాష్పోదకములచే సముద్రములు నిండి పొంగినవట. ఇది ఉత్ప్రేక్ష. మన వాడుకభాషలో అదొక కోత. నేను చెప్పిందీ మరొక రకమైన కోత. ఈ రెండు కథలలోనూ కోతకొయ్యడమే ఉత్ప్రేక్షగా భాసిస్తూ ఉంది. మొదటి కోత కావ్యగాంభీర్యమును కలిగిఉన్నది. రెండోది హాస్యవిషయికంగా రమణీయమైంది. రెండింటిలోనూ జరిగిన వాగ్వ్యాపారము ఒకటే.

సౌకుమార్యము : * ఈ అలంకారము కూడా, హాస్యసాధనకు ఉపయోగపడుతుంది. అర్థమున పారుష్యము లేకపోవుట దీని లక్షణము. "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" అనే గ్రంథంలో, వికార్ తాను అందవిహీన మైన స్త్రీని పెళ్లాడినాడన్న విషయం ఎంతమృదువుగా చెప్పాడో చూడండి. "నా భార్య తన పెండ్లికి గౌనును ఎంచుకొనుటలో పై మెరుగులను చూడలేదు. కాస్త నాలుగు కాలాలపాటు ఉండేది ఏరుకుంది. నా భార్యను ఎన్నుకునే విషయంలో కూడా నేనూ అటువంటి వివేకాన్నే ప్రదర్శించాను." ఆమె ముతక గుడ్డతో గౌను కుట్టించుకొంది. నేను పెళ్లి చేసుకోబొయ్యే పిల్లలో తళుకుబెళుకులను చూడలేదు. అని అర్థం.

భ్రాంతిమంతము : ఈ అలంకారము కూడా హాస్యాన్ని సాధించ డానికి ఉపయుక్తమే. లక్షణ గ్రంథంలో ఇచ్చిన ఉదాహరణ ఇది. ఒక జవరాలు ముఖాన్ని చూచి, అది నల్లకలువ అనుకొని తుమ్మెద ఆమె ముఖంపై వ్రాలిందట. ఆమె విదిలించివేసింది. తుమ్మెద ఆమె చేయిమీద పడి, ఆ చేయి తామరపువ్వు అనుకొందట. పల్చగా ఉన్న పప్పును జూచి, అది పరమాన్నం అనుకోవచ్చు. అదీ భ్రాంతే. చీకట్లో నడుస్తూ ఉన్నప్పుడు దూరాన ఒక చెట్టుపైన తెల్లని బట్ట ఒకటి వ్రేలాడుతున్నది. దాన్ని జూచి దయ్యము అనుకొని హడలిపోతాము. ఇదీ భ్రాంతే.

డాన్ క్విక్ సాట్ : ఇవన్నీ మామూలు ఉదాహరణలు. వీటిలో నవ్వించే పదార్థము ఏమీలేదు. "డాన్‌క్విక్‌సాట్" అనే పుస్తకంలో ఈ భ్రాంతిమంతము ఆలంబనగా చక్కని ఉపాఖ్యానంవెలసింది. డాన్ మధ్యయుగపు వీర రసప్రధానమైన గ్రంథాలను చదివినాడు. ఆ రోజులలో స్వచ్ఛందవీరులు ఉండేవారు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ వారిపని. అయితే ఆ రోజులు పోయినాయి. ఆ వీరశిఖామణులూ పోయినారు.

* మన లాక్షణికులు, దీనిని అలంకారం అనరు. ఇంగ్లీషు అలంకారికులు దీనిని అలంకారంగా వాడుతారు.

అయితే మన డాన్ వారికథలు చదివి వారివలెనే తానుగూడ వీరాధి వీరుడు కావలయునని కోరినాడు. ఆకాలపు వీరులకు ఒక ప్రధానలక్షణం ఉండేది. అదేమిటీఅంటే రాక్షసులు అనబడేవారితో యుద్ధంచేసి అఖండ యశమును ఆర్జించడము.

*గాలిమరలతో యుద్ధము :* ఆ రాక్షసులు డాన్ కాలమునాటికిలేరు. అయినా అతడు నిరుత్సాహపడక వారికోసం అన్వేషణ సాగించాడు. ఒక గుఱ్ఱాన్ని సంపాదించాలె. ప్రతివీరునికి మంచిగుఱ్ఱం ఒకటి ఉండాలె. డాన్‌కు గుర్రాన్నికొనేశక్తి లేదు. ఒక ముసలి కంచరగాడిదను సంపాదించి దానిపై నెక్కి రాక్షసశిక్షణకై బయలుదేరాడు. ఒక గ్రామంలో పెద్దపెద్ద గాలిమరలు ఉన్నవి. బ్రహ్మాండమైన చక్రాలు గాలికి గిరగిరా తిరుగుతవి. ఆ విధంగా తిరిగే పెద్ద చక్రాలకు చిన్న చక్రాలు తగిలించి నీళ్లు తోడడం మోట లాగడము మొదలైన పనులు చేయించేవారు. డాన్ ఆ బ్రహ్మాండమైన గాలిమరలను చూచి, వానిని రాక్షసులనుగా భ్రమిస్తాడు. దగ్గరున్నవాళ్లు "అవి రాక్షసులు కాదయ్యా, గాలిమరలు, వాటిమీద పడితే నీ ఒళ్లు హూణం హూణం అవుతుంది" అని ఎంత చెప్పినా వినక తన గుర్రాన్ని అదిలించి ఆ చక్రాలపై బడతాడు. ఆ చక్రాల ఆకులచే తాడితుడై డాన్ స్పృహతప్పి పడిపోతాడు. ఈ ప్రకరణానికి "Fighting with the Wind Mills" అని పేరు. అతనికి కలిగిన భ్రాంతివలన శరీరం పచ్చడిపచ్చడి అయింది. భ్రాంతిని ఆధారంగా చేసుకొని కల్పించబడిన హాస్యవృత్తాంతము ఇది.

ఇప్పుడు చూపిన అలంకారాలు పూర్వకవులు వాడినవే. అయితే అవి ఆభాసరూపమును పొందినపుడు, "Poetic dignity" ని కోల్పోయినపుడు మాత్రమే మందహాస పర్యవసానమైన భావాశ్రయ హాస్యంగా భాసిస్తవి. ఇటువంటి రచనలలో నవ్వించే పదార్థము పరిమితంగా ఉంటుంది. ఈ రచనలలో భావము ఎక్కడో మెలికపడ్డది.

వికృతికి ఆశ్రయం ఇచ్చే వంకరతనం ఎక్కడో ఉన్నది. హాసజనక సమర్థమైన వికృతి సాధించడములో ప్రతిభా ప్రదర్శనము ఉన్నది. ఈ వికృతి వేషమునకు, చేతలకు చెందనిదై భావగతమై, ప్రతిభావంతమై ద్యోతమానమగుచున్నది.

*అతిశయోక్తి :* అతిశయోక్తి అనేది కూడా అలంకారమే. కవులు ప్రాచుర్యంగా వాడేదే. అల్పవస్తుపరంగా ఈఅతిశయోక్తిని ప్రయోగిస్తే అది ఆభాసరూపము. నరసభూపాలుని ప్రతాపాగ్నికి సముద్రాలు ఎండిపోయినవట! ఆ రాజు శత్రువులను చంపగా వారి భార్యలు ఏడ్చారట. ఏడిస్తే ఆ కన్నీటిచేత ఆ ఎండిపోయిన సముద్రాలు నిండిపోయినవట. ఉదాత్తంగా ఉంది. అయితే ఈ అతిశయోక్తిలో హాస్యము ఏమీలేదు. అయితే ఈ క్రింది కథలో అతిశయోక్తి హాస్యజనకంగా ఉన్నది.

*అరగంటలో వెంట్రుకలు మొలచినవి :* బట్టతల పోయి వెంట్రుకలు మొలిచే మందును గురించి పత్రికలలో కంపెనీవారు ప్రకటించారు. ఒకాయనకు నడినెత్తిని, వెంట్రుకలు లేవు. ఆ మందును కొన్నాడు ఆ మందుతోపాటు ఇచ్చిన కాగితంలో ఏమి ఉందంటే, 'ఆ మందును బట్ట తలపై రాచి ఒక అరగంట అయిన తరువాత స్నానం చేయవలె' అని ఆ మందును కొన్న ఆసామీ, అరగంటకే కడిగివేయకపోతే ఏమి మునిగిపోయిందిలే అనుకొని తెల్లవార్లూ అట్లాగే పడుకొన్నాడట. ఉదయాన్నే నిద్రలేచి అద్దంలో చూచుకొనేసరికి తన్నుతానే గుర్తించలేనంత మార్పు వచ్చింది. తలపైనుంచి వెంట్రుకలు క్రిందికి బారెడు పొడుగున జారి ఉన్నవి. ఈ అతిశయోక్తి చాలా రమణీయంగా ఉన్నది.

*రెండు మాత్రలు వేసుకొంటే ఒక పిల్ల పుడుతుంది :* సంతానం కలుగడానికి మందులున్నవి. ఆ మందు రెండు మాత్రలు వేసుకొని కాసేపు పడుకొని లేచేసరికి అప్పుడే బిడ్డ కడుపులో కదులుతూ ఉంటుం

దట. ఇది రమణీయంగానే ఉందని అనుకొంటాను. భావాశ్రయ హాస్యంలో అలంకారాలయొక్క ఆభాసరూపము ఏవిధంగా హాస్యోత్పత్తికి కారణం అవుతున్నదో చూశాము.

అనన్వయాలంకారము : అంటే ఒకే వస్తువును ఉపమానంగానూ, ఉపమేయంగానూ చెప్పడము. "గగనం గగనంలాగుంది". "సాగరం అచ్చం సాగరంలాగుంది"-ఇవి ఉదాహరణములు ఈపద్ధతిని పరిహాసం సాధించవచ్చు, ఫాక్‌స్టాఫ్ (Shakespear) తిమింగలాన్ని చూచి దాన్ని గురించి చెపుతున్నాడు. ఒకరు అడిగారు, "ఎంత పొడుగు ఉంది అది" అని అతడు అంటాడూ "తిమింగలాలు సాధారణంగా ఎంత పొడుగో సరిగ్గా అంతేపొడుగు" అని. జవహర్‌లాల్ నెహ్రూ బిహారులో వరదలను చూచివచ్చినతరువాత అందరూఅడిగారు ఆయన్ను. "ఎట్లా ఉంది దేశం" అని. "దేశం అంతా జలమయంగా ఉంద"న్నాడు. ఈ మాట అలంకారంగా రూపొందకపోయినా మొత్తంమీద దానికి సన్నిహితమైన వాగ్వ్యాపారమే.

భావాభాసము : సింహావలోకనము :

ఆభాసము : రసముగాని హేతువుగాని అలంకారముగాని ఉండవలసినరీతిగా ఉండక వేరువిధంగా ఉంటే ఆ స్థితిని ఆభాసరూపము అన్నాను. రసములూ హేతువులూ అలంకారాలూ ఈ స్థితిలో ఎట్లు హాసపరిజనక సమర్థములో వివరించడము జరిగింది. రసంగా పరిపుష్టి నొందవలసిన విషయము ఆ విధంగా పరిణమించక భ్రష్టమైతే దానిని ఆభాసరూపము అన్నాను. శృంగారము రస నిష్పత్తికి కారణంకాక చెడిపోతే దానిని 'శృంగారాభాస' అన్నాను.

అల్లాగే వీరాభాసము ప్రబల శత్రువులను సంహరించుటయందు భాసించవలసిన వీరముఅధమపాత్రగతముగా ప్రసక్తమగు టవీరాభాసము.

అని చెప్పబడ్డది. అల్లాగే తగినంత కారణములేకుండా దుఃఖించడము కరుణాభాసము అన్నాను. చూపకూడనిచోట అనుచితమైన కోపం ప్రదర్శిస్తే వీరాభాసము అయింది. అతిసామాన్య విషయాన్నిచూచి ఆశ్చర్యపడడము అద్భుతాభాసము. ఒక్కసంగతి. ఏ రసంఅయినా ఆభాసరూపంలో 'హాసహేతువు' అవుతుంది.

ఈగలను చంపి తాను వీరవైరిసంహారము చేసినట్లు భావించడమూ, స్నేహితునితో తాత్కాలికమైన ఎడబాటును పెద్ద విపత్కరసంఘటనగా భావించడమూ, భావన వింతపోకడలు పోవడం వలననే జరిగింది. ఇక్కడ హాస్యము, భావంలో గల వైపరీత్యానుగతంగా ఉన్నది కాబట్టి దానిని భావాశ్రయ హాస్యము అనడంలో విప్రతిపత్తి ఏమీలేదనుకొంటాను. రసముగా పర్యవసించినది ఏ విధంగా రసాభాసము అయిందో అల్లాగే హేతువు కానిది హేతువుగా చెప్పబడడము 'హేత్వాభాసము' అన్నాను.

*ముఖము తోమిన ఇత్తడి సిబ్బి* : హేత్వాభాసాలన్నీ ఇల్లాంటి భావవైచిత్ర్యాన్ని కలిగియుండి హాసజనకములైనవి. ఇక అలంకారాల సంగతి. అలంకారము ఉండవలసిన రీతిగా ఉంటే నవ్వడానికి ఆస్కారం ఏమీ ఉండదు. "ఆమె ముఖము చంద్రునివలె ఉన్నది" అంటే నవ్వవలసిన పనిలేదు. "ఆమె ముఖము తోమిన ఇత్తడి సిబ్బివలె ఉన్నది" అంటేనే నవ్వు వస్తుంది. ఇక్కడ అలంకారము ఆభాస అయింది. దాని స్వధర్మాన్ని స్వస్వరూపాన్ని విడనాడింది. ఆ స్థితినే నేను ఆభాసరూపము అంటున్నాను.

*ఆభాసము నేనిచ్చిన అర్థము* : ఆలంకారికులు దానిని ఆభాస అనరు. "నీచోపమ" అంటారు. పరమరమణీయంగా ఉండవలసిన అలంకారము ఏమైంది ? ఆలంకారికులు ఏది రామణీయకతఅనుకొంటున్నారో,

దేనిని సౌందర్యము అనుకొంటున్నారో, ఆ గుణమును కోల్పోయి వికార రూపమును పొందడాన్నే నేను ఆభాస అంటున్నాను. ఏ అలంకారమైనా సరే ఆ రూపంలో హాసజనకము హాస్యం పుట్టడానికి హేతువుకూడాను. హాస్యశాస్త్రంలో ఆభాస అనే మాటను నేనిచ్చిన ధర్మార్థంలోనే గ్రహించవలె. ఆ అర్థంలో అది రూఢము అయింది.

*భావాభాస లక్షణం :* ఇంతవరకు రసాభాస, హేత్వాభాస, అలంకారాభాసములు ఏ విధంగా హాస్యాత్మకము అయినవో తెలుసుకొన్నాము. ఇక భావాభాసము అని ఒకటుంది. భావాభాస సముద్భూతమైన చమత్కారము భావాశ్రయ హాస్యములోనిదే! దానిని గురించి కొద్దిగా తెలుసు కొందాము. ఇంతవరకు చెప్పిన ఆభాసలను గురించి ఇంకా ఒకటి రెండు మాటలు చెప్పవలె. ఈ చెప్పడంలో పునరుక్తి దోషం లేకపోలేదు. అయినా చెపుతున్నాను. ఈ మాటను క్రొత్త అర్థంలో ఉపయోగించి నందులకు విమర్శకులు తప్పు పట్టుకొంటారనే భయంతో. ఆభాసము అనే మాటకు శాస్త్రసమ్మతమైన అర్థం ఏమిటీ అంటే అనౌచిత్యము వలనా, లోకమర్యాదాతిక్రమణ వలనా, ఏర్పడిన స్థితి. నేను ఆ మాటను కాస్త విస్తృతమైన అర్థంలో వాడుతున్నాను.

*ఆభాసు అయిపోయింది :* ఒకస్థితి సహజమైన ఔచిత్యాన్ని గాంభీర్యాన్ని ఉదాత్తతను కోల్పోయినపుడు ఆ స్థితికి ఆభాసరూపం సిద్ధించిందీ అనవచ్చు. ఇంకోవిషయంకూడాఉంది. వాడుకలో 'ఆ వ్యవహారం అంతా ఆభాసుఅయిపోయింది' అంటాము. అంటే చెడిపోయిందనిగాని జరుగ వలసినవిధంగా జరుగలేదనిగాని అర్థం. ఏ విషయమునుగురించి అయినా భావనచేయడంలో ఏదైనా వికారము వైచిత్రి అనుచితము వైపరీత్యము ప్రవేశిస్తే అట్టి వికారముతో కూడిన భావమును 'భావాభాసము' అంటున్నాను.

*భావాభాసము :* ఇంతవరకు తెలుసుకొన్న ఆభాసాలకు ఏదోఒక ఆలంబన ఉంది. రసము, హేతువు, అలంకారము ఇవి వింతరూపాలను సంతరించుకొని రసాభాసము హేత్వాభాసము అలంకారాభాసములుగా రూపొందినవి. అటువంటి ఆధారము ఏమీలేకుండా భావం స్వతంత్రంగా వింతనడకలు నడిస్తే దానిని భావాభాస అంటున్నాను. అంటే ఇదివరకు చెప్పిన ఆభాసరూపాలన్నిటిలోనూ భావం రసమునో హేతువునో అలంకారాన్నో పట్టుకొని దాని సంబధంగానే పోకడలు పోయింది. అటువంటి సాంగత్యము ఏమీలేకుండా స్వేచ్ఛగా వింతవింతగా భావం సంచరిస్తే దానినే భావాభాస అనేది. ఈ భావాభాసంలో భావం ఒక పరిధిలోఉండక ఒక ధర్మానికి కట్టుబడక ఇష్టంవచ్చినట్లు డొంకతిరుగుళ్ళు తిరుగుతుంది. ఎట్లాతిరిగినా విచిత్రభావ ప్రతిపాదనే భావాభాసమునకు లక్ష్యము. ఇక ఈ తిరుగుళ్ళ స్వరూపనిర్ణయం చేద్దాము.

*ప్రహేళికలు :* అంటే పొడుపుకథలలాంటివి. వీటిలోకూడా కొంత వికృతి ప్రదర్శనండుంది. ఆలోచనలో వక్రత ఏర్పడితేనేగాని ప్రహేళిక నిర్మాణంకాదు. "భూమిలో పుట్టిందిఒకతె చెట్టునబుట్టిందొకతె తీగన బుట్టిందొకతె ఈ ముగ్గురూ తలవాకిట ఆడుకొంటున్నారు". ఎవరు? ఇదొక పొడుపుకథ. అవి సున్నమూ, వక్క, ఆకు. ఇదేమంత సొగసైన ప్రహేళికకాదు. "మా తాతగారి కుమారుడి వియ్యంకుని సుతుని సోదరి ఎవరు ? భార్యఅంటానికి ఇది డొంకతిరుగుడు ప్రవచనము. ఇందులో వాక్యగతమైన వక్రతఉంది. భావం వంకర నడకలు నడవడమే ఈ వక్రతకు కారణం.

*లిమరిక్సు :* ఇవి హాస్యగేయాలు. ఇంగ్లీషుభాషలో వాటి నడకను గమనించండి :

"There was a young girl from Madras,
Who had a most beautiful ass,

Not round and pink,
As you probably think
But gray, had long ears, and ate grass''.

ఇల్లాంటిదే ఇంకొకటి.

"There was a young fellow from wheeling
Endowed with such delicate feeling
When he read on the door
Please don't spit on the floor,
He jumped and spat on the ceiling."

మరొకటి.

"There was once an actress named Hucer
Whose agents all wished to seduce her
The public went wild
When she had her first child
And now she's become a producer."

తలుపులు నలుపులు సలుపులు : నవ్వులాటకు వ్రాసిన గేయాలివి. ఇవి హాస్యానుకరణలు కావు. అనుకరణ వృత్తి ఇందులో ఏమీఉండదు. ఇంగ్లీషులో వీటిని "లిమరిక్స్" అంటారు. ఆ భాషలో లిమరిక్ రచన ఒకప్రసిద్ధమైన హాస్యప్రక్రియ. మనతెలుగులో ఇల్లాంటి లిమరుక్సు ఎవరూ వ్రాసినట్టులేదు. శ్రీకృష్ణశాస్త్రిగారూ, మల్లాది శివరాంగారూ హాస్యగేయాలూ పద్యాలూ వ్రాశారుగాని అవి లిమరిక్సుకావు. ఇంగ్లీషు గేయనడకను అనుసరించి నడచిన తెలుగుగేయాలు రెండుమూడు చూపిస్తాను ఉదాహరణకు.

"ఉన్నాడొక ఊళ్లో తలుపులు, వాడిపెళ్లాంపేరు నలుపులు,
వాడుండే ఇల్లంతా బహుతేమ, అయితేనేం పెళ్లాంఅంటే బహుప్రేమ."
"మాస్కోలో ఉన్నాడొక తస్కరి,
తస్కోడెవిస్కీ చెకోవ్నాస్కీ రక్షకభటులు

చూసోక్కాపట్టిస్తామంటే "ఎస్కావు" అన్నాడట
తస్కరి రస్కో డెవిస్కి చెకోవ్‌నాస్కి"

తల్లో పేలున్నాయి: ఈ క్రింది రెండు లిమరిక్కు పైవానికంటే రమణీయమైన నడక నడిచినవి. "చల్లపల్లిలో ఉండేదట పాపం చుక్కమ్మ. పల్లెటూరులో పెరిగింది. కల్లెరుగని సన్యాసి. నల్లనిదని తల్లోపేలున్నాయని మొగుడు వల్లసు నేనిసు ఇల్లువిడచి పోపొమ్మన్నాడట!" ఇంకొకటిచూడండి. "ఉన్నాడొకచిన్నవాడు ఫా చీ-అనుకొన్నాడు పెండ్లాడాలనిబీచిన్ విన్నారాపాపం జరిగించన్యాయం - తన్నిందటబీచీ ఆ చిన్నవాణ్ణిఫో చీన్."

కోడెగాలు కొంటెమాటలు: కోడెగాలు అంటే మరేంగాదు. భావాభాసజనిత హాస్యాత్మక వాక్య సందోహము. ఈ కొంటెమాటలు అనడానికి బుద్ధి కొంటెతనంలో అభివ్యాపమై ఉండవలె. ప్రేమ అంటే ఒక రకం జబ్బు అనేవాడి మనస్సులో భావంఎంతో అభాసు అయి ఉండవలె. భావాభాసమును సముద్రమును మధించగా ఉద్భవించిన అమృత భాండమునుండి చెదరిపడిన బిందువులు ఈ కోడిగాలు.

కొంటెమాటలు మరికొన్ని: "నిత్యసంతోషి". తనకుగాక ఇంకెవ్వరికి ఆపదవచ్చినా నవ్వేశేవాడు. "అభ్యుదయకవి" ప్రొద్దున్నే పెందలకడే చద్దన్నంతిని తీరికగాకూర్చుని ఆకలినిగూర్చి పద్యాలువ్రాశేవాడు. "భర్త" భార్యపెట్టే బాధలను భరించువాడు. "దయ్యం" బ్రతికిఉండగానే చచ్చి చచ్చినతరువాత బ్రతికున్నవాళ్ళను చంపుకుతినే కనపడని ఆకారము. "ఆంధ్రకవి". బ్రతికిఉన్నన్నాళ్ళు చచ్చినట్లుండి చచ్చినతరువాత మెల్ల మెల్లగా బ్రతకడము మొదలుపెట్టేవాడు.

కథలు: భావగతమైన వికృతి కథలలోకూడా భాసిస్తుంది. ఒకడు చాలా అవసరమైన పనిమీద బయలుదేరి రైలుకు వెడుతున్నాడు. కావల

సిన వస్తువులు అన్నీ తీసుకొని గబగబా పరుగెత్తుతున్నాడు. అయితే ఏవో కొన్ని వస్తువులను మరచిపోయిఉంటానని అతనికి అనుమానం వేసింది. కొంతదూరం పోయినతరువాత అతనికి తనచేతి గడియారం మరిచిపోయినట్టు తోచింది. మళ్ళీ ఇంటికివెళ్ళి తెచ్చుకొంటానికి వ్యవధి ఉన్నదా అని సందేహం కలిగి అలవాటుప్రకారం చేయి యెత్తి గడియారంవంక చూచి 'ఆఁహాఁ! టైములేదు' అని గ్రహించి గబగబ నడిచి స్టేషనుకు వెళ్ళిపోయినాడు. ఈ కథలో భావము సరియైన మార్గానపోక మెలికపడి చమత్కార భాసితమైనది.

*దేవుడులేడని దేవాలయంలో ఎట్లాచెప్పేది:* ఇంకోకథ. "ఏమయ్యా! నిజంచెప్పు. నీనమ్మకం ఏమిటీ? దేవుడు ఉన్నాడనా లేడనా?" అని అడిగాడు ఒకడు తనస్నేహితుణ్ణి. "దేవుడులేడని నాకు గట్టినమ్మకము." అన్నాడు స్నేహితుడు. మొదటివ్యక్తి ఆశ్చర్యపోయి "అయితే నిన్న అడిగితే మాట్లాడక ఊరుకొన్నావేం ఈ సంగతిచెప్పక!" అని అడిగాడు. ఆయన స్నేహితుడు అన్నాడూ "నిన్న నీవు నేనెక్కడుండగా అడిగావూ? దేవాలయంలో ఉండగా, అవునా? అవ్వ! దేవాలయంలో ఎట్లా చెప్పేది దేవుడులేడనీ అందులో శివరాత్రిపూట'' అని. ఈ జవాబులో ఉండే చమత్కారము ఊహించుకోవలసిందేగాని వివరించడానికి వీల్లేదు. భావస్రవంతి ఎన్ని తమాషా అయిన సుళ్లుతిరిగిందో గుర్తించుకొన వలసినదని ప్రార్థన. భావాభాస సముద్దీపితమైన చమత్కారం ఈ కథలో బ రమణీయంగా ఉంది.

బోధాభాసము :

*ఆటకోరుతనం:* భావాభాస జనిత హాస్యానికి ఇంకో ఉదాహరణ ఇస్తున్నాను. అది 'నాన్‌సెన్సు' మాట్లాడడము. ఈ ప్రయోగంవల్ల నవ్వురావడానికి కర్తా భోక్తా కూడా ఆటకోరుతనంగా ఉండవలె. అప్పుడే నాన్‌సెన్సులో ఉండే చమత్కారము భాసిస్తుంది. హాసజనకమూ అవుతుంది. ఇద్దరూ నవ్వుకొంటారు.

*అర్థంలో అర్థంలేదు*: ఇదివరలో అర్థంలేనిమాటలు ప్రయోగించడం వల్ల హాస్యము ఉత్పన్నమవుతుంది అని చెప్పినాను. ప్రతిమాటకు అర్థం ఉన్నా మొత్తంమీద చెప్పుకోతగిన అర్థంలేని ప్రసంగంకూడా నిరర్థక పదప్రయోగం క్రిందనే చెప్పాను. అయితే ఇది **Nansense pure and simple.** అంటే ఇందులో అర్థంలేని పదం ఉండదు. అన్నీ అర్థవంతమైన పదాలే. మొత్తంమీద చూచినా ఏదోఅర్థంఉండనేఉంటుంది. కాని ఆ అర్థంలో అర్థంలేదు. ఆ స్ఫురించేఅర్థమే నాన్‌సెన్సు. రచన అంతా అర్థంగానిగోల అనిపిస్తుంది. అంటే ఏదో తికమకపెడుతుంది. మనలను ఏదో అయోమయస్థితిలో పడేస్తుంది. నవ్వుపుట్టిస్తుంది. అంత కంటే విపులంగా చెప్పలేకపోతున్నాను. నేను యిప్పుడు ఇల్లాగ చెపుతున్నది నాన్‌సెన్సు అనితోస్తే ఈ నాలుగుపేజీలు తిరగేసి ఆ పైన చదవండి. అయినా ఈ ఉదాహరణవల్ల మీకు నా అభిప్రాయం తెలుస్తుందేమో ప్రయత్నించిచూడండి.

*కలుసుకొన్నదిఎవరో ఇంకోయిద్దరు*: మొదటి ఉదాహరణ. ఇద్దరు వీథిలో కలిశారు. మొదటివాడు బట్టతల ఆయన, రెండోఆయన గిరజాల ఆయన. రెండవపెద్దమనిషినిజూచి మొదటిఆయన తనబట్టతలనుఅరచేత్తో రుద్దుకొంటూ "ఏమండీ మిమ్మలను మద్రాసులో కలుసుకున్నానుకదూ!" అన్నాడు. రెండవఆయన గిరజాలుపీక్కొని "నేనెప్పుడూ మద్రాసులో లేనే" అన్నాడు. అప్పుడు బట్టతలపెద్దమనిషి మళ్ళీ తల అంటుకుంటూ "నేనూ మద్రాసు ఎప్పుడూ వెళ్ళలేదు. అల్లా కలుసుకొన్నది మరో ఇద్దరు అయిఉంటారు." అన్నాడు.

*నేను చచ్చిపోయాను*: అట్లాంటిదే మరో నాన్‌సెన్సు. ఇద్దరు మేధావులు బార్‌లో మాట్లాడుతున్నారు. నేనుపుట్టినప్పుడే ఇరవై పౌనుల బరువు ఉన్నాను." అన్నాడు ఒకడు. రెండవవాడు ఆశ్చర్యంగాచూచి "మరి బ్రతికావా?" అని అడిగాడు. మొదటిఆయన విచారంగా చప్పరించి "ఎబ్బే! అప్పుడే చచ్చిపోయాను" అన్నాడు.

*నాతల నేనే కొరుక్కొన్నాను:* మనిషిని అయోమయ స్థితిలో పడేసి అతడు గగ్గోలుపడుతూఉంటే చూచి ఆనందించాలని ఉంటుంది హాస్యశీలునికి. ఆ అయోమయస్థితే నవ్వుకుకారణం. అవతలమనిషియొక్క అజ్ఞానమునుచూసి ఎట్లానవ్వుతామో అతని అయోమయస్థితిలో పడడం చూసికూడా అలాగేనవ్వుతాం. ఒకడు డాక్టరుదగ్గరికి వెళ్ళాడు. తలపై గాయాలున్నాయి. పళ్ళతోకొరికితే ఏర్పడ్డ గాయాలవి. "ఎవరు కొరికారు నీతలనూ?" అనిఅడిగాడు ఆ డాక్టరు. "నేనే కొరుక్కున్నానన్నాడు" 'నీతల నీవే ఎట్లుకొరుక్కుంటావయ్యా? నీపళ్ళకు నీతలఅందదుకదా!' అన్నాడు డాక్టరు. 'కుర్చీపై కెక్కి అందుకొన్నాను.' అన్నాడాయన. ఈ కథను అర్థంచేసుకొంటానికి పఠిత చాలాతికమకలు పడవలసివస్తుంది. మనిషి తికమకలుపడుతుంటేనే హాస్యవేత్త నవ్వుతాడు. ఇది ఒక సిద్ధాంతము. దీనికి ఇంకొక రెండుఉదాహరణలిస్తాను.

*మాఆయన వయస్సు రెట్టింపుఅయితే నాదీ రెట్టింపు అయినట్లేగా:* ఒకావిడను 'నీవయస్సెంతమ్మా!' అని అడిగిందొక స్నేహితురాలు. ఆవిడన్నదీ 'నాపెళ్ళినాటికి నాకు ఇరవై ఏళ్లు. మాఆయనకు ముప్పైఏళ్లు. ఇప్పుడు మాఆయనకు అరవై ఏళ్లు. అంటే ఆయనవయస్సు రెట్టింపు అయిందన్నమాట. నావయిస్సు రెట్టింపుకావలసిందేగా! అట్లాగయితే నాకు ఇప్పుడు 'నలభై ఏళ్ళు' అన్నది. ఇక్కడ ఆమె పడ్డ తికమకలే నవ్వుకుకారణం. మరొక ఉదాహరణ.

*కొత్తటైము, పాతటైము:* ఆమధ్య క్రొత్తటైమూ, పాతటైము అని ఉండేవి. పాతటైముకు ఒకగంట కలిపితే క్రొత్తటైము అయింది. ప్రభుత్వమువారెందుకో ఆ ఏర్పాటుచేశారు. గడియారాన్ని ఒకగంట ముందుకు త్రిప్పమన్నారు. 9 గంటల సమయాన్ని 10 గంటలని వ్యవహరించేవాళ్లము. ఆరోజులలో సంగతి.

*తొమ్మిదిఅయితే పదికొట్టారు :* రాత్రి మంచాలమీద పడుకొని పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నాము. తాలూకాకచేరీలో 10 గంటలు కొట్టారు. ఇప్పుడు పైమెంతఅయిందని అడిగింది మాఆవిడ. పదిగంట లయిందన్నాను. పదిగంటలయితే పదకొండు కొట్టాలిగదా పదేకొట్టారేం? అన్నది. తొమ్మిదయింది పదికొట్టారన్నాను. తొమ్మిదయితే పదికొట్ట డమేమిటండీ అని విసుక్కుందావిడ. ఇటువంటి కథలలో ప్రదర్శితమైన (confusion) తికమక నవ్వుకు కారణమయింది. నవ్వుకుకారణంఏమిటీ అంటే ఆ అయోమయపరిస్థితే అంటారు కొందరు విమర్శకులు. ఇదీ నాన్‌సెన్సువంటి వ్యాపారమే.

*టికెట్టులేకపోతే ఏవూరుపోవాల్సింది ఎట్లా తెలుస్తుంది :* ఒకడు రైలులో ప్రయాణంచేస్తున్నాడు. టికెట్‌కలెక్టరు వచ్చి టికెట్ చూప మనిఅడిగాడు. ప్రయాణీకుడు జేబులువెతుక్కొని టికెట్ కనపడని కారణాన తెల్లముఖం వేయడంచూచి టికెట్‌కలెక్టర్ పోనీలెండీ ఆటికెట్ ఇంకోసారి ఇవ్వవచ్చు అన్నాడు. ప్రయాణీకుడు "అదిసరేనండీ అయితే నేను ఏవూరుపోవాల్సింది నాకెట్లా తెలుస్తుంది? అదీచిక్కు'' అన్నాడు. ఇట్లా ఖంగారుపడడంలోనే బోధాభాస రాణిస్తుంది. మనహాస్యపరంగా ఖంగారు అంటే బంగారమే.

*ఒక్కరోజులో అయిదు పగళ్లు :* అయిస్‌లాండ్ నివాసి చెపు తున్నాడు ఇంగ్లండు నివాసితో ప్ర: 'మీ దేశంలో ఒకరోజుఅంటే ఒక పగలు ఒకరాత్రి, అంతేగా?' జ: 'అవును.' "మాదేశంలో ఒక్కొక్క రోజులో రెండూ మూడూ పగళ్ళూ, రెండు మూడు రాత్రులూ ఉంటవి. చలికాలంలో ఒకరోజులో అయిదుపగళ్ళుకూడా ఉంటాయి. "రాత్రిళ్ళు అయిదుండవుమరీ?" 'ఉండవు.' 'ఎందుచేత?' 'రోజులో ఒకరాత్రి ఉంటుందిగాని రెండు ఎట్లాఉంటాయయ్యా? నీకు పిచ్చికాకపోతే!' ఏదో అర్థంలేకపోలేదు ఈ ప్రసంగంలో. అయితే అంతానాన్‌సెన్సు.

*ములగచెట్టున నేరేడుపండ్లు* : "ములగచెట్టుపైన ముళ్లున్నవి. వానిపై ముళ్లమధ్యనూ నేరేడుపళ్లున్నవి. మావాడి కెట్టిటిగోళ్ళున్నవి. పూలబావిలోన మంచినీళ్లున్నవి." "కొమ్మపై కొసాన కూర్చున్నకాకులు దిమ్మతో గోడలో దిగ్గొట్ని మేకులు, హూష్ హూష్ బొమ్మంటే బోక కూష్బోష్ అంపై ఆడిస్తూ తోక." ప్రతిమాటకు అర్థం ఉంది. మొత్తం మీదకూడా ఏదోఅర్థం లేకపోలేదు. కాని ఆ అర్థంలో అర్థంలేదు. అదీ ఇందులో తమాషా.

*నేను చస్తే మాఅన్నను పాతేశారు*: ఇంకొక నాన్సెన్సువృత్తాంతం చెప్పి ఈ ప్రసంగం ముగిస్తాను. దీనిని మార్క్ట్వెయిన్అనే అమెరికన్ హాస్యవేత్త వ్రాశాడు. ఈ వృత్తాంతము ప్రశ్న జవాబురూపంలో నడిపినాడు: ఇద్దరిమధ్య సంభాషణ.

ప్ర. నీకు ఒకసోదరుడు ఉన్నాడుకదూ!

జ అవును అవును. నీవుచెపితే జ్ఞాపకంవస్తున్నది. నాకు ఓసోదరుడు ఉండేవాడు విలియం. వాణ్ణే 'బిల్' అనేవాళ్లం పాపం.

ప్ర. ఏం పాపం అంటున్నావు. అయితే చచ్చిపోయినాడా?

జ. ఆఁ ఆఁ మరి అల్లాగే అనుకొన్నాము. ఏసంగతీ గట్టిగాచెప్పలేము. అదిఎవరికీ అర్థంకాని విషయము.

ప్ర. అయ్యో! విషాదవార్త అన్నమాట. అయితే కనబడకుండా పోయినాడా?

జ. ఆఁ మరీ ఒకవిధంగాచూస్తే అంతే. వాణ్ణిపాతేశాము.

ప్ర. పాతేశారూ! గుంటలోనే!

జ. ఆ. గుంటలో అంటే అదే భూమిలో గోయిత్రవ్వి అందులో పడేశాము.

ప్ర. పైన మన్నుపోసి కప్పారా?

జ. ఆ... మట్టితో కప్పెట్టాము.

ప్ర. అరె! పాతేశారన్నమాట! వాడు పూర్తిగా చనిపోయిందీ లేనిదీ తెలియకుండానే పాతేశారూ?

జ. ఎబ్బే! అదేంకాదు. పాతేయడానికి కావలసిన చావుచచ్చాడు. తక్కువేం చావలేదు.

ప్ర. సరే అర్థంఅయింది ఇప్పుడు! చచ్చాడని గట్టిగా తెలిసే పాతేశారన్నమాట.

జ. ఆఁహాఁహ. చచ్చాడని అనుకొన్నాము.

ప్ర. అదాసంగతి! అనుకొన్నారూ? అయితే ఆచచ్చినోడు బ్రతికాడన్నమాట.

జ. నో నో! బ్రతకలేదని పందెంవేయగలను.

ప్ర. సరే సరే భలేతమాషాగా ఉందే! ఇటువంటికథ నేనెప్పుడూ వినలేదు. ఎవరో చచ్చాడు ఎవరినో పాతేశారు! అయితే ఇందులోఎవరికీ అర్థంకాని సంగతి ఉందన్నావు అదేమిటీ?

జ. అసలుసంగతికి వచ్చాము. ఇక్కడేఉంది ఎవ్వరికీ తెలియని సంగతి. సంగతేమిటీఅంటే మేము కవలపిల్లలము. మేమూ అంటే ఆ చచ్చిపోయినవాడూ నేనూను.

ప్ర. కవలపిల్లలా! ఒకేతల్లికి ఒకేసారి పుట్టార్నమాట.

జ. అంతే. అయితే ఏమైందీఅంటే మేమిద్దరమూ రెండువారాల వయస్సులో నున్నప్పుడు స్నానాలతొట్టిలో మాకు ఇద్దరికీ ఒళ్లు కడుగుతున్నపుడు మారుపడ్డాము. అంటే వాడినిచూచి నేనుఅనుకొన్నారు నన్నుజూచి వాడుఅనుకొన్నారు. మాలో ఒకరము ఆ తొట్టిలో మునిగి చనిపోయినాము. ఎవరు చచ్చిందీ కనుక్కోలేకపోయినారు. కొంతమంది

అన్నారు ఆ చచ్చిపోయింది నేనూ అని. మరికొంతమంది చచ్చిపో యింది 'బిల్' అన్నారు.

ప్ర. చాలావిచిత్రంగాఉంది. అందరూ తలోవిధంగా అనుకొన్నారు గదా! మరి నీ అభిప్రాయం ఏమిటి ఇంతకూ?

జ. చాలారోజులవరకూ నాకూతెలియలేదు. చచ్చిపోయింది ఎవరైందీనీ!

ప్ర. నీకూ సందేహమేనన్నమాట చచ్చింది ఎవరా అని!

జ. ఆ. ఈ విషాదవృత్తాంతమువల్ల నాజీవితమే కొంతకాలం దుఃఖభాజనం అయింది.

ప్ర. ఇప్పుడూ?

జ. ఇప్పుడు తెలిసింది. అయితే అది రహస్యం. ఎవ్వరికీ తెలి యనూతెలియదు. నేను చెప్పనూలేదు. ఇకముందు చెప్పనుకూడా... అయితే ఒక్కరహస్యం. మాలో ఒకరికి ఎడమచెవి వెనుక ఒకపెద్ద పుట్టుమచ్చఉంది. అదీనేను. ఆ పుట్టుమచ్చ నాచెవివెనకాలే ఉంది. కాబట్టి చచ్చిపోయింది వాడుఅన్నమాట.

ప్ర. అయితే వాడికికూడా అల్లాంటిపుట్టుమచ్చ ఉందేమో.

జ. లేదు. అందుకనే ఈవిషయం ఎవ్వరికీ చెప్పకుండాఉంచాను. అయితే పుట్టుమచ్చఉన్నవాడే చచ్చిపోయినాడని వారంతా అనుకొన్నారు.

నేను నేనుకాదు: ఒక ఐర్లండు దేశస్థుడు చాలారోజులు రైలు ప్రయాణంలో గడిపాడు. గడ్డం చేసుకొంటానికిగాని, బట్టలు మార్చు కొంటానికిగాని వ్యవధి చిక్కకపోయింది. లండన్ వచ్చాడు. అతడు లండన్ చేరేసరికి చాలా ప్రొద్దుపోయింది. ఒక హోటలుకు పోయి, ఏదో భోజనము చేసి, వెంటనే పడుకొని నిద్రపోయినాడు. అతని పేరు

ఓ కానెల్. అర్థరాత్రివేళ ఎవరో వచ్చి, ఓ కానెల్‌ను అర్జంటుగా కలుసుకోవాలె. అతన్ని క్రిందికి పిలిపించండి అని హోటల్‌మేనేజరును కోరాడు.

ఆ మేనేజరు వెళ్లి ఓకానెల్‌ను నిద్రలేపి "మీకోసం ఎవరో వచ్చారు. మిమ్మలను వెంటనే కలుసుకోవాలట. క్రిందికి రండి" అని చెప్పి వెళ్లిపోయినాడు. కానెల్ విసుక్కుంటూ నిద్రలేచి, మేడమెట్లు దిగుతూ, అక్కడ గోడకు ఒక అద్దం ఉంటే అందులో చూచుకొన్నాడు. తననుతాను గుర్తించలేకపోయినాడట! వెంటనే మేనేజరును ఉద్దేశించి, ఒక కేక పెట్టాడట. "ఓయీ! మందమతీ నీవు ఎవరినో లేపావు. నన్ను కాదు అని గబగబా పైకి వెళ్లి పడుకొని నిద్రపోయినాడట! "You woke up the wrong man" ఇదీ కథ. తను ఎవరో తనకు తెలుసు. తాను అద్దంలో తన్ను చూచుకొని, ఇది నేనుగాదు అనుకొంటాడు. ఇందులో చమత్కారం ఎక్కడుందో గ్రహించవలె గాని విప్పిచెప్పాలని చూస్తే అయ్యేపనిగాదు. అది చెప్పలేముకూడాను. "Nothing kills a laugh quicker than the explanation of a joke".

సంఘటనాభాసము :

భావాశ్రయహాస్యంలో ఇంకో ప్రకరణ ఉంది. అది నవ్వుపుట్టించే సంఘటనలను సృష్టించడము. అటువంటి సంఘటనలు, ఊహించడానికి భావవక్రత అవసరము. ఈ రకం హాస్యంలో నవ్వు పుట్టించేది ఒక వ్యక్తి అనే మాటలూ కాదు, అతని చేష్టలూకాదు. ఆ వ్యక్తి స్థితి హాస్యసముద్భూత సమర్థము.

*మధురవాణి :* ఈ సంఘటన చూడండి. కన్యాశుల్కం నాటకం లోనిది. మధురవాణి ఇల్లు... అప్పుడు మధురవాణి గిరీశం అధీనంలో ఉంది. గిరీశం ఆమెను వదిలించుకోవలెనని చూస్తుంటాడు. మధురవాణీ కూడా ఇంకొకరినిఆశ్రయించాలని అనుకొంటూఉంటుంది. రామప్పంతులు

మధురవాణిని తనదానినిగా చేసుకోవలెనని ప్రయత్నిస్తూ ఉంటాడు. ఒక రోజున మధురవాణీ రామప్పంతులూ సరసాభిరామసంభాషణానిమగ్నులై ఉండగా, హఠాత్తుగా గిరీశం ప్రవేశిస్తాడు.

*రామప్పంతులు మంచంక్రింద :* ఇంకా తనవశం గానట్టీ, గిరీశం పాలనలో ఉన్నట్టీ మధురవాణితో తాను రహస్య ప్రసంగం చేయడము తప్పుగదా ! ఆ సంగతి రామప్పంతులుకు తెలుసు. అంతేకాదు. ఆ సంగతి గిరీశానికి తెలిస్తే తనను తంతాడని భయం కూడా ఉంది. గిరీశం వచ్చాడు. తను ఏంచెయ్యాలె ? ఆ ధూర్తుని కంటబడితే ప్రమాదం. అప్పుడు మధురవాణి కనుసన్నను గ్రహించి పంతులు ఆపద్ధర్మంగా మంచంక్రిందికి దూరుతాడు గిరీశం మామూలు ధోరణిలో మధురవాణితో సరససల్లాపానురక్తుడై ఉంటాడు. ఇంతలో గిరీశం దగ్గరనుండి పాత బాకీలు వసూలు చేయడానికి పూటకూళ్లమ్మ వెతుక్కుంటూవచ్చి మధుర వాణి ఇంట్లోకి ప్రవేశిస్తుంది.

*గిరీశం కూడా మంచం క్రిందికే :* పూటకూళ్లమ్మ అంటే గిరీశానికి హడలు. పూటకూళ్లమ్మనుండి తప్పించుకొంటానికి గిరీశం కూడా ఆ మంచం క్రిందికే దూరుతాడు. మధురవాణి పాత ప్రియుడూ క్రొత్త ప్రియుడూ ఇద్దరూ మంచం క్రిందికే చేరుతారు. ఇది విచిత్రమైన సంఘటన. గిరీశం రామప్పంతులు దుస్థితిని జూచి, ప్రేక్షకులు విరగబడి నవ్వుతారు. పూటకూళ్లమ్మ గిరీశం మంచం క్రింద ఉన్న సంగతి గ్రహించి చీపురుకట్ట విసరడంతో ఈ సంఘటన వికృతిపరిపుష్టమైనది అయింది. గిరీశం పూటకూళ్లమ్మ చీపురు దెబ్బను, తెలివిగా తప్పించు కొని ఆ దెబ్బ పంతులుకు తగిలేలాగున చేయడంతో ఈ సంఘటనా వికృతి పరాకాష్ఠను అందుకొన్నది.

ఈ కథలో చమత్కారం ఎక్కడున్నది ? వాళ్లు మాట్లాడిన మాటలలో లేదు. అసలు వాళ్లు మాట్లాడనేలేదు. మాట్లాడనేలేదు కాబట్టి

అర్థప్రసక్తి లేదు. అందుచేత ఇది అర్థాశ్రయమూ కాదు, శబ్దాశ్రయమూ కాదు. చమత్కారం ఆ సంఘటనలో ఉంది. హాసజనకసమర్థములైన పరిస్థితులు అటువంటి సంఘటనను సృష్టించినవి. అవికూడా హఠాత్సంభవాలు. చమత్కారం అంతా ఆ సంఘటనను ఆశ్రయించుకొనిఉంది. ఇటువంటి సంఘటనను ఊహించడం కవి ప్రతిభను దీపింపజేస్తున్నది.

*బారిస్టరు పార్వతీశం :* బారిస్టరు పార్వతీశం అనే గ్రంథంలో కూడా కడుపుబ్బ నవ్వించే సంఘటన ఒకటుంది. పార్వతీశం రైలు ఎక్కాడు. రైలుపెట్టెనిండా, జనం క్రిక్కిరిసిఉన్నారు. పార్వతీశం ఒక ముసలమ్మ ప్రక్కన కూర్చుంటాడు. రైలు హఠాత్తుగా కదులుతుంది. ఆ కుదుపుకు పార్వతీశం ఆ ముసలమ్మ మీద పడతాడు. ఆమె అసహ్యించుకొని ఆ కుర్రవాణ్ణి ఒక తోపుతోస్తుంది. ఆ తోపుకు పార్వతీశం ఇటుప్రక్కన ఉన్న యువతిపై పడి ఆమె కూడా తనను ఎక్కడ నెట్టేస్తుందో అన్న భయంతో ఆమెను గట్టిగా కౌగలించుకొంటాడు. ఆ కుర్రవాడి పాట్లు చూచి, అందరూ విరగబడి నవ్వుతారు. అంతా నవ్వడానికి కారణం అతను అల్లాగ పడడమే. ఆ స్థితి రావడానికి ఆ కుర్రవాడు కారణం కాదు. ఆ పరిస్థితులు అల్లాంటివి. ఇక్కడ కూడా ఆ సంఘటనే నవ్వుకు కారణం.

*నైషధం :* ఈ కథలోని హాస్యం సంఘటనాశ్రయం. ఈ మూడవ ఉదాహరణ శ్రీనాథుని నైషధంలోని కథ. నలుడు దమయంతిని పెళ్లాడాలని వచ్చాడు. దేవతలు అతనిని తమ దూతగా దమయంతి వద్దకు పంపిస్తారు. తిరస్కరణీ ప్రభావంతో నలుడు అంతఃపురంలోకి ప్రవేశిస్తాడు. తాను ఇతరులకు కనపడడు. కాని ఇతరులంతా తనకు కనపడుతారు. అంతఃపురంలో ఉన్నవాళ్లంతా ఆడవాళ్లు. వాళ్లు తనను డీకొంటారని నలుడు ఎంత తప్పుకు తిరిగినా వాళ్లు తనపైన పడడము తప్పనిసరి

అయింది. ఒక ఆమెను తప్పుకొంటే వేరొకర్తె వెనుకనుంచి, ప్రక్క నుంచి వచ్చి ఆయన మీద పడి మనిషి కనపడని కారణాన ఏదో తగిలిందని గాభరాపడి పరుగెత్తడం సాగించేది.

గొడవగొడవ అయిపోయింది. ఒకర్తె రావడమూ ఆయనను ఢీకొని ఏమైందీ తెలియక పరుగెత్తడమూ, మరొకతెవచ్చి ఆయనమీద పడి అల్లాగే పరుగెత్తడమూనూ. ఇంతకూ తమకు తగిలింది ఏమిటో తెలియక అంతా కలవరపడడమూ జరిగింది. ఆ దృశ్యము ఊహించుకొంటే వద్దన్నకొద్దీ నవ్వువస్తుంది. ఇటువంటి రమ్యమైన హాస్యప్రోద్బలకమైన విచిత్రభావపరిపుష్టమైన రమణీయమైన దృశ్యములతో కూడిన సంఘటనను సృష్టించుటలో కవి భావము ఎంతో వైచిత్రిని సంతరించుకొన్నది. ఇచ్చటి చమత్కారము సంఘటనాశ్రయము. వర్ణన భావాశ్రయ హాస్యపరిపూర్ణము.

ప్రకరణాభాసము :

*భోజనం తర్వాత క్షౌరం :* ప్రకరణ అనే మాట నేను ఒక రూఢార్థంలో ఉపయోగిస్తున్నాను. ప్రకరణము అంటే ఒక క్రమము అనే అర్థము సాధ్యమే. ఏ పని అయినా జరుగవలసిన క్రమంలో జరుగకపోతే అప్పుడు ఆ ప్రకరణము ఆభాసు అయిందన్నమాట. క్రమభంగము జరిగితే ప్రకరణాభాస జరిగినట్లే. దీనినే లాక్షిణికులు అపక్రమ దోషము అన్నారు. ఎవరైనా తిథివారనక్షత్రములు తెలిసికొని తరువాత క్షౌరము చేయించుకొని స్నానంచేసి భోజనం చేస్తారు. కాని అల్లాగాక ఒకడు ముందు భోజనం చేసి తరువాత స్నానం చేసి తదుపరి క్షౌరం చేయించుకొని అప్పుడు తిథివారనక్షత్రములు తెలిసికొంటానికి జ్యోతిషికుని వద్దకు వెళ్లాడట. క్రమభంగం జరిగి ప్రకరణం ఆభాసరూపమును పొందినదన్నమాట.

ప్రణయకలహం : ఇట్లాగే ఏదైనాసరే జరుగవలసిన క్రమవిధానంలో జరుగక ఇంకొక విధంగా జరిగితే ఆ ప్రకరణము ఆభాసు అయింది అంటానికి విప్రతిపత్తి ఏమీలేదు. శృంగార కామకలాపాలలో ప్రణయకలహం అని ఒక కామక్రీడ ఉన్నది. ప్రణయకలహం ఒక కలహం కాదు. అది ఒక వ్రతం. ప్రణయకలహం అనేమాట శృంగార కావ్యభాషారమ్య పదబంధము. అంతేకాని నాయకుడు "...కోపవేగమున కన్నుల నిప్పులురాల అంగముల్ దనరక సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంతవంతపీ। డన రటదాస్యరంగ వికటభ్రుకుటీచటుల ప్రవృత్తన। ర్తన ఘటనాప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై సలిపే వాగ్వ్యాపారముకాదు...

ప్రణయకోపం : దానికి బోలెడంత తంతు ఉంది. ప్రొద్దున మొదలుపెట్టి సాయంత్రం అయ్యేదాకా చేయవలసిన కార్యక్రమం ఒకటి ఉంది. ఉదయాన్నే అభ్యంగనస్నానం చేయవలె. తరువాత నూతన వస్త్రధారణ, మృష్టాన్నభోజనము, విశ్రాంతి, సాయంత్రం మళ్ళీ వనవిహారము, నృత్యసందర్శనమూ ఇవన్నీ జరగవలె. రాత్రి ప్రియురాలు శయ్యాగృహాలంకరణము మృదుశయ్యారచన చేసిన తరువాత ప్రియాగమనము, గోత్రస్ఖలనము జరుగుతవి. అప్పుడు ప్రియురాలు ప్రణయకోపం పడుతుంది. భర్త బ్రతిమిలాడినా వినక ఆమె విరహవేదనను ప్రదర్శించి మెళ్లోనున్న ముత్యాల హారాన్ని త్రెంపివేసి చంద్రదూషణ మొదలైన హంగామా అంతా చేస్తుంది. మళ్ళీ ఒకసారి ఉపలాలనము జరుగుతుంది. ప్రియుడు మాతికలచే ప్రియురాలును ప్రసన్నురాలునుగా చేసికొన ప్రయత్నించి విఫలమనోరథుడై చివరకు పాదాభివందనము చేయడమూ ఆమె ఎడమకాలుతో ప్రియుణ్ణి తన్నడమూ జరగవలె. ఇంకా బోలెడంత కార్యక్రమము ఉంది. ప్రణయకలహం అనే పుస్తకంలో అదంతా వివరించాను.

ఇంతకూ నేనుఅనుకొన్నవిషయం ఏమిటీఅంటే ఇట్లాజరిగితేనే అది శాస్త్రీయమైన ప్రణయకలహం అవుతుందనీ ముత్యాలహారాలు తెంపకపోయినా దూత్యము జరగకపోయినా పాదతాడనం లోపించినా క్రమభంగం జరిగి ఈ వ్యాపారంఅంతా అశాస్త్రీయమై అనుచితవ్యాపారం అవుతుందని చెప్పడమే. క్రమభంగం జరిగి ప్రణయకలహ ప్రకరణ భంగం జరిగిన వృత్తాంతం ఒకటి చెపుతాను.

*ఒక్క భార్యతో కాపురం* : ఉదయం మృష్టాన్నభోజనము సాయంత్రం నృత్యగాన వాద్యాదులచే సంప్రీతి, ఇవన్నీ సక్రమంగా జరిగినవి. గోత్రస్ఖలనం ఎట్లా? గోత్రస్ఖలనంఅంటే ప్రియురాలిఎదుట సవతిపేరు ఉచ్చరించటము. రాజులకు బహుమంది భార్యలు ఉంటారు కాబట్టి గోత్రస్ఖలనం సాధ్యమౌతుంది. ఒక్కగాని ఒక్కభార్యతో ఏదోగుట్టుచక్కంగా కాపరంచేస్తున్న మనబోటివారికి అదెట్లాసాధ్యము? అందుకని ఆ సాయంత్రం ఎవరోస్త్రీని కలుసుకొని మాట్లాడినట్లుచెప్పి ఆమెకు లఘుకోపం తెప్పించాను.

*దూత చాకలిది* : దానితరువాత కొంతవరకు వ్యవహారం క్రమ విధేయంగానే జరిగింది. కాని దూతకార్యం జరగలేదు. ఎవరొస్తారు ఆమెకూ నాకూ మధ్య రాయబారం నడిపేందుకు? చాకలిదానిని రమ్మంటే ఆ అర్ధరాత్రి రాదని పిలువలేదు. అదీగాక ఆమె ముత్యాలహారాలు త్రెంపి పోయడానికి వీలులేకపోయింది. నేనే వద్దన్నాను. ఎందుకంటే ఆమె మెళ్లో ఉన్నది ఒక్కటే గొలుసు. అదికాస్తా త్రెంపితే మళ్ళీ బాగు చేయించడానికి బోలెడవుతుంది. పాదతాడనముకూడా సక్రమంగా జరగ లేదు. ఆమె తీరా ఎడమకాలితో తన్నబోయేసరికి నేను ప్రక్కకు తప్పుకొన్నాను.

*నిఘంటువు నాపై విసిరింది* : ఆమె విధివిధేయంగా మృదువుగానే తంతుందని నమ్మకమేమిటి? ఇంకాఎన్నో విషయాల్లో క్రమభంగం

జరిగింది. ఒకస్థితిలో అంటే హారమును త్రెంచవలసిన సమయం వచ్చే సరికి నేను ఆమెకు ఆభరణాలు ఏమీచేయించి పెట్టలేదని ఆమెకు నిజంగా కోపంవచ్చింది. ప్రియురాలు ప్రియుణ్ణి కోరకంతోకొట్టవలెను అన్న పట్టులో ఆమె ఆకోపంలో నిఘంటువు తీసుకొని నాపైకివిసిరింది. ఆతరువాత ఉపలాలనములేదు, ఉప్పులాలనమూలేదు. చందసచర్చ జరగవలసింది. అదీజరగలేదు. ఇద్దరం పోట్లాడుకున్నాం. మాటామాటా అనుకున్నాము.

*రోదనము:* శృంగారభావముల ప్రసక్తి అసలే లేదు. ఒక్క మోట్టాయిత భావము మటుకు ప్రదర్శితమయినది. మోట్టాయితము అంటే మొండిగా మాట్లాడడము అని అర్థం చేసుకోవలె. హావభావ, హేలావిలాస, మాధుర్యలీలా కిలికించితాది శృంగార చేష్టాదులు లేక విభావ, అనుభావ సంచారీ భావములచే పరిపుష్టినొంది, రతి స్థాయి భావంలో పర్యవసించవలసిన కార్యకలాపము చీదుట, చీదరించుట, పిడి కిలి బిగబట్టుట చేతికందిన వస్తువులను నేలకేసి కొట్టుట అను అనుభావ సంయోజనమై చివరకు పెద్దగా రోదనము చేయుటతో అంతమైనది ఆ కార్యకలాపము.

ఇది ప్రకరణాభాసము. ఇట్లు ఆభాసరూపములన్నియు భావితమైన రసగుళికలు. భావాభాసహాస్యమహోదధినుండి వెదకివెదకి తీసిన రత్న రాజములు ఇవి. ఇట్లు నర్మగర్భముగ హాసకుశలముగ, పరీహాసపేశల ముగ వ్రాసి నిత్యజీవన నిక్షిప్త రామణీయకమును దర్శించుటకు సము జ్వల రసాభావనాసంవేదన సామర్థ్య ముండవలెను. ఇట్లు సంభావించుట భావతీవ్రతకు సత్ఫలితము.

ఆచారాభాసము :

*మడి ఉరిత్రాడు:* మనపూర్వులు మనలను శుచిగా ఉండమన్నారు. వీథిలో తిరిగివచ్చిన బట్టలతో వంట చేయకూడదనీ, భోజనం చేయ

కూడదనీ నియమం ఏర్పరిచినారు. అది బాగానే ఉన్నది. కాని క్రమేణ అదొక బలమైన ఆచారమైనది. ఇటువంటి ఆచారాలు ఇంకాచాలాఉన్నవి. ఈ ఆచారవృక్షము పెరిగి పెద్దదై శాఖోపశాఖలైంది. చివరకు విష ఫలాలను ప్రసాదించింది. మడికట్టుకోవడము అనే ఆచారము మెడకు ఒక ఉరిత్రాడుఅయి అంతకంతకు బిగుసుకుపోవడము సాగించింది.

*అనేకరకాల మడి :* మడికట్టుకోవడము అనేక రకాలు. నిన్న సాయంత్రం తడిపి ఆరవేసిన బట్టలు మరునాడు మడిబట్టలుగా పనికి వస్తవి కొందరికి. కొందరికి అవిపనికిరావు. ప్రొద్దున్నే స్నానంచేసి ఆరవేసినబట్టలే కావాలె. కొందరికి అవీపనికిరావు. తడిబట్టలతో వంట చేయాలె. తడిబట్టలతోనే భోజనంచెయ్యాలె. కొరుక్కుతినే చలిలో బాధ పడుతూఉన్నా 103 డిగ్రీలు జ్వరంతోఉన్నా భోజనసమయంలో మటుకు చచ్చినట్లు బట్టలు తడిపి కట్టుకోవలసిందే. అల్లాగ తయారైంది ఆ ఆచారము.

*మడిచేద:* వంటయింట్లో ఉండేవి కొన్ని మైలసామానులు,కొన్ని మడిసామానులు. తడిబట్టలతో ఉన్నా, మైలచెంబు తాకాడా చచ్చినట్లు మళ్ళీ స్నానం చెయ్యాలిసిందే. బావిలోనుంచి నీళ్ళు తోడుకొంటానికి కూడా మడిచేదలుఅనీ మైలచేదలనీ ఉంటవి. మైలచేదను తాకాడా మళ్ళీ స్నానం చెయ్యాలె. స్నానంచేసి ఇంట్లోకి వస్తున్నపుడు దారిలో ఏచిల్ల పెంకో కాలికితగిలితే మళ్లీ మరోసారి స్నానం తప్పదు.

కొందరు మరీ చాదస్తంగా ప్రవర్తిస్తారు. భార్యకు జ్వరం వచ్చి వంటింటికి పక్కనున్నగదిలో పడుకొన్నది. ఆపూటకు భర్తే ఇంత ఉడకేసి పెట్టవలసివచ్చింది. ఇక ఆయన తిప్పలు చూడండి.

స్నానంచేశారా? ఏ చేదతో నీళ్ళు తోడుకున్నారూ?

ఇత్తడిచేదతో!

అయ్యో! అయ్యో! మడి తగులడిపోయింది. దాన్ని ఇందాక కుక్కముట్టుకొన్నది. కుక్కముట్టుకొన్న చేదతో స్నానంచేస్తే ఎట్లా

పనికొస్తుందండీ! మళ్ళీ స్నానం చేసిరండి. నీళ్ళకొట్లో మడిచేద ఉంది. తీసుకెళ్ళండి.

ఆ. స్నానం చేసివచ్చాను.

ఏదారినవచ్చారు? బావికి కుడివైపుగా వచ్చారా? ఎడంవైపుగానా?

కుడివైపుగా వచ్చాను.

కుడివైపుగా వచ్చారూ? నేననుకొంటూనే ఉన్నా! ఆవైపు ఎందు కొచ్చారండి? ఇందాక పనిచేసేమనిషి ఆదారినే నడిచింది. పేడనీళ్ళు అయినా చల్లలేదు ఎవరూ. ఎట్లా?

మళ్ళీ స్నానం చేయాల్సిందేనా?

ఏంజేస్తాము. జాగ్రత్తగా వెళ్ళండి. ఎడంవైపు అంతా బురద. ఆబురదలో గుడ్డపీలికలుండగలవు జాగ్రత్తసుమండీ.

ఆ ఇకచెప్పు.

ఆగిన్నె కాస్తకడిగి అందులో బియ్యంపోసి పొయిమీదపెట్టండి.

ఈ గిన్నెనా?

ఆగిన్నె కాని దానిపైన కాసినినీళ్లు తగలెయ్యకుండా ముట్టు కొన్నారేమండీ... మైలపడ్డారు.

మళ్ళీ స్నానం చెయ్యాలిసిందేనా?

వద్దులెండి. బావిదగ్గరకెళ్లి మడిచేదతో తోడుకొని చెంబెడు నీళ్ళతో ఒళ్లుతడుపుకురండి.

వళ్లు తడిగానే ఉన్నది.

అయినా కాస్త వెళ్లివద్దురూ?

సరే! అన్నం కుంపటిమీద పెట్టేదా?

కుంపటి నీళ్లతో కడిగారా?

ఆఁఆ కడిగాను. నిప్పులుకూడా కడిగాను.

సరే. వేళాకోళాలకేంగాని ఇటుచూడండీ!

చూశాను.

ఈపూటకు కాస్త ఆవకాయ తీయండి. దానితోసరిపుచ్చుకుందాం.

అల్లాగే.

మడిగా ఉన్నారుగా?

ఉన్నాను.

అయితే ఆ రెండోఅరలో కుడివైపున ఉన్న కుండలో ఉంది మాగాయి. అది కొంచెంతీయండి ఈపూటకు.

ఇందులో మాగాయిలేదే. ఆవకాయఉంది.

అయ్యో! అయ్యో! అదెందుకు ముట్టుకొన్నారండి!

ఏమైంది?

ఏమైంది నాబొంద! ఆవకాయ అంతా మైలపడి తగులడింది.

ఏం? కుడివైపు దేగా నీవు ముట్టుకోమంది?

నాకు కుడివైపునున్నది ముట్టుకోమంటే, మీరు మీకు కుడివైపుననున్నదాన్ని ముట్టుకొన్నారండీ!

ముట్టుకొంటే ఏమీ! నేను మడిగాఉన్నానుగా?

నాతలకాయ మడి. అది మనమడి గాదండీ!

మనిషికో మడా?

కాదండీ, అది విధవరాండ్ర మడి. ఎట్లాగూ తగులడ్డది కాబట్టి ఆకుండ ఈ అలమరలో పెట్టండి. పిల్లలేసుకొంటారు.

కాస్త ఆవకాయ అందులోది తియ్యమంటావా?

అది ఎట్లా పనికొస్తుందండీ.

మనము వెధవలము కాముగా!

పనికిరాదు గాని, ఆమూలనున్న జాడీలోనుండి కాస్త దబ్బకాయ తీయండి, ఉండండి ఉండండి. జాడీ ముట్టుకోకుండా దబ్బకాయ తీయగలరా?

జాడీ ముట్టుకోకుండా దబ్బకాయ ఎట్లా తీస్తాను?

మరి జాడీ మైలదికదండీ!

జాడీ మైలదిన్నీ అందులోఉండే దబ్బకాయ మడిదీనా? ఏమి చిత్రమే?

అట్లా తగులడ్డది శాస్త్రం.

అయితే ఏమిచేయమంటావు?

ఏంచేస్తారూ. మీరు జాడీముట్టుకోకుండా తీయలేరు. పోనీ ఇటు చూడండి అలమరక్రిందుగా ఉన్న రాచ్చిప్పలో ఉసిరికాయ ఉంది. అది కాస్త ఆకులోకి తీయండి.

రాచ్చిప్ప ముట్టుకోకుండా తీయాలా?

అక్కరలేదులెండి. అయ్యో! అయ్యో! ఆగోడదగ్గరకు వెళ్ళారెందుకండీ? గోడ తగిలిందా? తగిలేఉంటుంది. ఆవళంగా ఇవతలకు రండి ఏమీతాకకుండా.

ఏమి మైలపడ్డానా?

మైలపడలేదుటండీ? ఇంకా అడుగుతారూ?

ఏంముట్టుకొన్నానూ?

గోడ.

గోడముట్టుకొంటే ఏమి? గోడకు ఏమిమైల?

గోడకు ఈవైపున నేనుతగలడ్డాగా! నేను స్నానమైనా చేయ లేదాయె!

అయితే నీవు అనడము ఆమైల గోడలోనుంచిదూరి ఇవతల కొచ్చి నాకు సోకిందన్నమాట.

ఏమోనండి నేనుచెప్పలేను సమాధానం మీకు!

మళ్ళీ స్నానంచేసి అన్నం దించండి. ఆకలవుతున్నది.

ఇప్పటికి ఆరు స్నానాలైనవి మృత్తికా స్నానాలలాగ.

ఏంజేస్తాం. మైలకూడు తినలేంగా చూస్తూచూస్తూ!

మడిఅనే ఆచారం వెర్రితలలువేసి ఇల్లాగ తయారుఅయింది. ఆ సదాచారముయొక్క ఆభాసరూపము ఇది. ఇటువంటి మడికోసం తాప త్రయపడేవాళ్ల తాడుతెగుతుంది కాని పైనుండేవాళ్లకు ఈచాదస్తం అంతా చూస్తుంటే నవ్వురాక మానదు. *

వాదాభాసము :

*కుతర్కము* : వాదము నడువవలసిన విధానము ఒకటి ఉంటుంది. కారణము చూపించి దానివలన ఈకార్యము సిద్ధించింది అని చెప్పడము తర్కాహితము. కారణము కాని దాన్ని కారణంగా పేర్కొనడము కుతర్కము. ఈవిషయమై హేత్వాభాసాలక్రింద కొంత చర్చజరిగింది. కుతర్కము ప్రదర్శించ డానికి ఇంకా అనేక మార్గాలు ఉన్నవి. అవన్నీ వాద దోషములు. వాదము సరియైన మార్గాన నడవక వంకర మార్గాలలో నడిస్తే దానిని వాదనయొక్క ఆభాసరూపం అనవచ్చు. ఈ ఆభాస రూపంలో వాదము హాస్య సంపాదకమవుతుంది. ఒకటి రెండు ఉదాహర ణలతో ఈవిషయము స్పష్టంగా తెలుస్తుంది.

---

* పానుగంటి ప్రహసనమునుండి గ్రహించాను.

*నాన్ సెక్విటూర్*: ఈవాదన చూడండి గోపాలరెడ్డిగారు ఎన్నికలలో తప్పక గెలుస్తారట! ఎందుచేతఅంటే క్లైవు ప్లాసీయుద్ధం గెలిచినాడాలేదా? తళ్లికోటయుద్ధంలో తురకలు గెల్చారాలేదా? మరి ఇంకేం రెడ్డిగారు ఎన్నికలలో ఎందుకు గెలువరు? ఇది సరియైనవాదము కాదు. కుతర్కము! దానినే నేను వాదాభాసము అంటున్నాను.

*అసంబద్ధవాదము*: వాదాభాసానికి ఇంకొక ఉదాహరణ. ధూమపానం చేయగలవాడే ధూమపదార్థంయొక్క తత్వనిర్ణయం చేయగలడు. కాళిదాస మహాకవి ధూమజ్యోతిస్సలిల మరుతాం అని అనడములో ధూమతత్వ నిరూపణ చేసినట్లు ఊహ్యము. ధూమమునూ జ్యోతినీ కలిపాడు. అంటే ధూమమూ అగ్నీ ఎప్పుడూ కలిసిఉంటాయని చెప్పినాడు అన్నమాట. లేకపోతే ధూమజ్యోతి అనడు. కాళిదాసు ధూమపానాసక్తుడు కాకపోయినట్లయితే ధూమానికి జ్యోతికి అంటే అగ్నికి గల నియత సంబంధాన్ని సూచింపగల సమాసాన్ని సృష్టించగలిగి ఉండేవాడుకాడు. ఇది అసంబద్ధవాదము ఒక కుతర్కవిశేషము. దానినే నేను వాదముయొక్క ఆభాసరూపము అంటున్నాను.

*చక్రవాదము*: ఇంకొక ఉదాహరణ ఇస్తున్నాను ఈ వాదాభాసానికి. చక్రవాదము అనివాదము ఒకటుంది. అదికూడా వంకరటింకర నడకలు నడవడమువల్లనే ఏర్పడ్డ వాదాభాసము. అది ఇది. శాస్త్రిగారు ఆంధ్రులంతా అబద్ధాలాడేవారు అన్నారు. దానిమీద వాదప్రతివాదాలు ఇట్లా నడిచినవి. "శాస్త్రిగారు ఆంధ్రుడు. కాబట్టి ఆయనకు ఆంధ్రుల విషయము బాగా తెలుసు. అందుకని ఆయన ఉన్నది ఉన్నట్టు చెప్పారు కాబట్టి ఆయన చెప్పినది నిజము."

"ఆయనచెప్పింది నిజము అంటే ఆంధ్రులంతా అబద్ధాలాడుతారు అన్నమాట నిజము. ఆయనా ఆంధ్రుడే కాబట్టి ఆయనాఅబద్ధాలాడేవాడే. అయినప్పుడు ఆంధ్రులంతా అబద్ధాలాడుతారు అన్నమాట అబద్ధము."

అయితే ఆంధ్రులంతా నిజము మాట్లాడేవారు అన్నమాట. ఆంధ్రులంతా నిజముమాట్లాడేవారయితే ఆయనచెప్పింది నిజంకావాలె. ఆంధ్రులందరు అబద్ధాలాడుతారు అన్నది నిజం.

ఇట్లా సాగుతునేఉంటుంది వాదన. ఇది ఒక చమత్కారమైన కుతర్కము. ఇల్లాగ వాదాభాసము హాసజనకము అయింది. ఈ కుతర్క విశేషాలనుగురించి వితండవాదాలు అనేపుస్తకంలో వ్రాశాను. అందుకని ఇక్కడ సూచించి ఊరుకొంటున్నాను.

*అసంగత వాదము :* వితంతువివాహము చేయడంవలన ఏమీ ప్రయోజనంలేదని ఒకముసలమ్మ ఎట్లా వాదిస్తుందో చూడండి "భర్త పోతే మళ్ళీ పెళ్లిచేస్తే ఏమి లాభమయ్యా! దానిరాత అల్లాగుంది. అది వెధవ కావలసిఉంది. మళ్ళీ పెళ్లిచేస్తే మటుకు వాడు బ్రతికిఉంటాడని నమ్మకం ఎక్కడుంది. వాడూ చస్తాడు.

*వాడూ చస్తే :* 'వాడూ చస్తాడుటమ్మా! ఒకసారి జరిగిందే మళ్ళీ మళ్ళీ ఎప్పుడూ జరుగుతుందని ఎందుకు అనుకోవాలె. కర్మం చాలక రెండోసారికూడా చస్తే మళ్ళీ చేసుకొంటుంది' అన్నాడు ఆయన. మళ్ళీ చస్తే? అని ప్రశ్నించింది ఆ ముసలమ్మ. ముసలమ్మ అనడము ఏమిటీ అంటే ఆపిల్లకు ఎన్నిసార్లు పెళ్లిచేసినా వాడు చస్తూనే ఉంటాడు అని. వాదనను హాస్యాస్పదస్థితికి లాక్కురావడము ఇది. ఇల్లాచేయడమువలన వాది తికమకలుపడి తెల్లపోయి ఊరుకొంటాడు. దీన్నే నేను వాదాభాసము అంటున్నాను.

*పెళ్ళి ఎన్నిసార్లు చేస్తే అంత మంచిది:* కన్యాశుల్కంలో గిరీశం ఇల్లాగ ఒకవాదాన్ని ఆభాసరూపంలో ప్రదర్శిస్తాడు. 'పెళ్లి అనేవస్తువ శుభప్రదమైనది. పెళ్లిఅనేది మంచివిషయం అయితే అది ఎంతఎక్కువైతే అంత శుభము. కనుక చిన్నపిల్లను ఒకముసలాడికిచ్చి పెళ్లిచేసి

వాడుచస్తే మరొకడికి ఇచ్చి, వాడూచస్తే ఇంకొకడికిఇచ్చి ఇల్లాగ పెళ్లి మీద పెళ్లి, పెళ్లిమీద పెళ్లి చేయడము మంచిది. శుభకార్యాలు ఎన్ని అయితే అంతమంచిదిగదా!

*అన్నం అసలు తినకపోతే ఆరోగ్యం బాగుంటుంది :* ఇంకోవాదా భాసము. అన్నంతినేవిషయంలో ఎక్కువగాతినడంవలన ఏమీప్రయోజనం లేదనీ తక్కువగాతింటే మంచిదిఅని ఒకడాక్టరు సలహాయిస్తే, అదివిన్న ఒకవిద్యార్థి యిల్లాగ కుతర్కాన్ని ప్రదర్శించినాడు.

"అవును! మీరన్నమాట నిజమే. కాస్తతక్కువతింటే ఆరోగ్యం వృద్ధిఅవుతుంది. ఇంకా కాస్త తక్కువతింటే ఆరోగ్యం ఇంకాకాస్త వృద్ధిఅవుతుంది. అసలు తినడమే మానేస్తే సంపూర్ణమైన ఆరోగ్యం కలుగుతుంది. ఇల్లాగ వాదించి హేళనచేశాడు. ఇదీ వాదాభాసమే.

*రోశయ్యా ఋష్యశృంగుడు :* యూరోపియనులుకూడా ఆర్యజాతి వారేనని ఒకరు ప్రతిపాదిస్తే, ఆ ప్రతిపాదనను ప్రతిపక్షి ఏవిధంగా హేళనచేసి హాస్యాస్పదము చేసినాడో చూడండి. ఆ వాదాభాసము ఇట్లా నడిచింది. 'యూరోపియనులు మనమోస్తరు ఆర్యులా? అంటే ఆ పరాసువాళ్ళూ, బుడతకీచులూ, స్విచ్చులూ వీళ్లంతా ఆర్యజాతివారే నన్నమాట! భలేసంగతి చెప్పావు. ఋష్యశృంగుడూ రోశయ్యా ఒకటే నంటావు? అంతేగా? ఇంతఎందుకూ అగస్త్యమహాఋషి ఆర్మగంశెట్టి ఒకటేనంటావు! బాగుందిరా అబ్బాయి. ఈవాదన బాగుంది' అన్నాడు ఒకాయన. ఆభాసరూపంలో ఈవాదనకు ఆర్గ్యుమెంటం యాడ్ ఆబ్ సర్డెమ్ అంటారు.

*ద్వాశృంగావాదము :* ఇదికూడా వాదాభాసమే. ఒకడు ఒకప్రసిద్ధ న్యాయవాదియొద్ద న్యాయశాస్త్రంఅంతా అభ్యసించి తాను మొదటి కేసు గెలిస్తే కొంతడబ్బు గురుకట్నంగా ఇయ్యటానికి అంగీకరించాడు. ఈ

ఏర్పాటుకు గురువు అంగీకరించాడు. శిష్యుడికి ఎన్నాళ్లకు కేసురాలేదు. గురువుగారు విసుగుచెంది తనకు న్యాయంగా రావలసిన డబ్బుకోసమై కోర్టులో శిష్యునిపై దావా వేశాడు.

*గురువుగారికి ఏమీ ఇయ్యనక్కరలేదు:* శిష్యుడికి అదే మొదటి కేసు అయింది. అప్పుడు అతడు ఈవిధంగా వాదించాడు. "నేను ఈ కేసులో గెలిచినా ఓడినా గురువుగారికి ఏమీ ఇవ్వనక్కరలేదు. ఎట్లా గంటే. ఇది నా మొదటికేసు. నేనివ్వనక్కరలేదని వాదిస్తాను. నేను గెలిస్తే కోర్టుతీర్పుప్రకారం ఏమీ ఇవ్వవలసి ఉండదు. నేను ఓడితే గురువుగారితో చేసికొన్న ఒడంబడికప్రకారం నేను ఇవ్వనక్కరలేదు మొదటికేసు ఓడిపోయినాను కాబట్టి." ఇట్లా వాదించాడు.

*గురువుగారి కుతర్కము :* గురువుకూడా సరిగ్గా అటువంటి కుతర్కాన్నే ప్రదర్శించి ఇల్లాఅన్నాడు. "నేను గెలిచినా, ఓడినా శిష్యుడు నాకు డబ్బు ఇవ్వవలసివస్తాడు. నేను ఓడిపోతే మా ఇద్దరిమధ్య జరిగిన ఒడంబడికను అనుసరించి అతడు నాకు డబ్బుఇస్తాడు. నేనుగెలిస్తే కోర్టువారి తీర్పును అనుసరించి అతడు నాకు సొమ్మును ఇస్తాడు." ఇద్దరూ కుతర్కాన్నే ప్రదర్శించినారు. వాదము ఆభాసరూపంలోఎల్లాగ ఉంటుందో చూశాము. ఈవిధంగా వాదాభాసముఖంగా స్పృహణీయమైన హాస్యము లభ్యమైనది. ఇల్లాగ వాదనను ఆభాసచేసి వంకరనడకలు నడిపించడము అంతతేలికయైన పనిగాదు. ఇది చతుర వచన రచన ప్రతిభా జన్యమూ మేధాసంజనితమూనూ! అందుకు సందేహములేదు.

స్తోత్రాభాసము :

*ఎవరిని స్తుతిస్తాము :* ఎవరు ఆదర్శపురుషులో వారిని స్తోత్రము చేస్తాము. భగవంతుని స్తుతిస్తాము. దేశభక్తులను స్తుతిస్తాము. దైవ భక్తులను స్తుతిస్తాము. స్తుతి అనుపూర్విక విద్వత్సాంప్రదాయము.

పెద్దలయందు గౌరవమూ, భక్తీ, ఔదార్యమూ భూతదయా ధైర్య శౌర్యాదిగుణములుగలవాడు స్తుతికి అర్హుడు. పాండిత్యమును, పరాక్రమమును మనము స్తుతిస్తాము. దానశీలుని స్తుతిస్తాము. అట్టి సుగుణములు ఏమియులేనివానిని, స్తుతింపము. అయితే అల్పప్రాణులను మహాప్రాణులుగా ఎంచటములోనూ అవగుణములను సద్గుణములుగా పేర్కొనడంలోనూ, స్తుతికార్యము, నీచప్రాణిపరమై పరిహాసజనకమై హాస్యగర్భితమై హాసమునకు ఆలంబన అవుతుంది. అదే స్తుతియొక్క ఆభాసరూపము. ఈ ఆభాసరూపముకూడా రమణీయమైన వృత్తాంతముగా భాసించునట్లు చేయవచ్చును.

పరిపుల్ల భావనా సౌభాగ్యముండి చతురవచో వాల్లభ్యము కలిగి సరససాహిత్యములో ఉపలబ్ధమయ్యే ఉదాత్తభావ సముపార్జనచేసినవాడే, ఈ స్తోత్రాభాసమును రమణీయము, మనోజ్ఞము మధురము చేయగలడు. స్తుతికి అర్హతలేని విషయాలను స్తుతించడంవలన స్తోత్రాభాసము సిద్ధిస్తుంది. పిల్లిని, దోమను, ఈగను నల్లిని స్తుతించడమువలన ఆ స్తుతి ఆభాసరూపమును పొందుతుంది. ఆ రూపంలోనే అదిచమత్కార విశేషంగా భాసిస్తుంది. కొన్నిఉదాహరణలు ఇస్తాను.

*అల్పప్రాణులు :* ఈ అల్పప్రాణుల నన్నిటినిగురించి ఒక హాస్యశీలుడు ఇట్లాఅన్నాడు. "అవి అల్పప్రాణులుకావు. మహాప్రాణులు. వారందరును మహామహులు వీరిలో కొందరు వేదవేదాంగసంపన్నులు. కొందరు ప్రకృతిశాస్త్ర పాండితీమండితులు. రాజకీయతంత్ర పారగులు. బ్రహ్మవాదులు, భర్తాగ్రగణ్యులు,గాయకోత్తములు, వ్యోమయాన శక్తిమంతులు, మృదుల శరీరాంతరంగ సౌష్టవముగలవారు, ధీరులు, శౌర్యవంతులు. ఇంతను గొప్పగుణములున్నవి వీరిదగ్గర.

*వీని ధైర్యశౌర్యాది గుణములు :* మనుష్యునికి ఎంతభయము! తేలునుజూచి భయపడతాడు. పామునుజూచి పారిపోతాడు. దోమకాటుకు

ఓర్వలేడు. పెద్దగాలికి తట్టుకోలేడు. వర్షంలో తడిస్తే జ్వరంవస్తుందని భయము. ఎండలోకివెడితే తలనొప్పి వస్తుందనిభయము. చలివేస్తే ఉన్నిదుస్తులు, కంబళ్లు, దుప్పట్లు బొంతలు ఎన్నోఉండాలె. దోమలు, ఈగలు నల్లులు మొదలైనవి ఏవిధమైన ఆచ్ఛాదనలేకుండా తిరుగుతున్నవే! అవిగొప్పా నరుడుగొప్పా! చివరకు పిల్లులు కుక్కలుకూడా చలికీ ఎండకూ భయపడవే. తుపానుపట్టనీ, అగ్నిపర్వతములు ప్రేలనీ, భూకంపములురానీ, మంచుగడ్డలు వర్షింపనీ జంతుసమూహము దిగంబరమై ఒక్క వెంట్రుక మాడకుండ ఒక్కరెక్కయైన జారకుండ పంచ భూత మహాసంక్షోభమును ఎక్కువైన ధైర్యముతో ఎదుర్కొనగలవు.

*దోమ విశ్వాసము* : విశ్వాసము అను సుగుణము గలిగిన ప్రాణి ఏది? నరుడుకాదు. నరునికి విశ్వాసమన్నదిలేదు. దోమను తీసికొనుడు. ఒకసారి అది ఒకనరుని ఆశ్రయించినతరువాత ఆతనిని వదలదు. మంచో చెడ్డో కష్టమో సుఖమో అతనినే అంటిపెట్టుకొని ఉంటుంది. బట్టతో త్రోసివేసినా, చేతితోవిదలించినా అతనినే అంటిఉంటుందిగాని వెళ్లిపోదే! ఎటువంటి సుగుణము అది!

*నల్లివిశ్వాసము* : మత్కుణముకూడా అటువంటిదే. తుంగచాపనో బల్లనో, కుర్చీనో మంచాన్నో ఏదిదొరికితే దాన్నే మహాభాగ్యంగా భావిస్తుంది. నరుడు కొట్టినా తిట్టినా చివరకు చంపటానికిప్రయత్నించినా, క్రోధముపెట్టుకోక, భర్త కుష్ఠువాడైనా, కుంటివాడైనా, గుడ్డివాడైనా అతనినే దైవంగా ఎంచి, జీవితంఅంతా అతనితోనే గడిపే సుగుణ శీలయైన భార్యవలె ఆనల్లి ఇల్లువదలక యజమానిని విడువక అక్కడే ఉంటుంది. ఒక్కసారి ఒకనరుని రక్తము దబ్బలపుమొనయంత త్రాగిన ఎడల ఆ త్రాగిన విశ్వాసం దానికి హరి అనేంతవరకు ఉంటుంది. ఏమి విశ్వాసము! ఏమానవునికైనా అటువంటి విశ్వాసం ఉంటుందా? పైగా దానికి కోపంలేదు. ద్వేషంలేదు. ఎంతఔదార్యము! ఆనల్లి ఉన్న ప్రదే

శంపై మండుటెండ పడేట్లుచేసినా ఉడుకునీళ్ళు పోసినా ఏమిచేసినా తాత్కాలికమైన బాధను ఓర్చుకొని చచ్చినట్లు కాసేపుపడిఉండి మరునాటికి తెప్పరిల్లి యథావిధిగా తనకార్యక్రమము కొనసాగించుకొంటుందిగాని అవినీతికి పాల్పడి లేచిపోదే!

*మూషకము :* ఇక మూషికజాతి విశ్వాసము అందరు ఎరిగినదే. గృహస్థుకు ఏ ఇబ్బందీ కలుగకుండా ఏ కలుగులోనో గాదెలోనో నివాసము ఏర్పరచుకొంటుంది. కాని వాళ్ల కుర్చీలూ, సోఫాలూ, పట్టు పరుపులూ మొదలగు సామానులను ఆశ్రయించదే. రెండు అంగుళాల బొరియలో కాపరం చేస్తుంది. ఆ కాస్త స్థలంలోనే స్నానపానాదులు, భోజనాలు జరగాలే పాపము. పురుళ్లు పుణ్యాలు కూడా అక్కడే జరుపుకొంటయ్యి ఎలుకలు. నరుడు వాటిని ఆదరించక చంపాలని చూస్తాడు. ఎంత దయాహీనుడు, ఎంత క్రూరుడు! పగలు బైటకొస్తే మర్యాదగాదని ఎంచి అవి రాత్రిళ్లే వచ్చి ఏది దొరికితే అది పండో, ఫలమో, అన్నపు మెతుకులో, కూరముక్కలో, ధాన్యపుగింజలో ఏదో ఒకటి తిని సంతోషిస్తవి. మూషకము అల్పసంతోషి. అది ఆ జాతి లక్షణము. అటువంటి ఋషిజీవితాన్ని జీవించే మూషకాలను మానవుడు చంపాలని చూస్తాడు. ఎంత విశ్వాసఘాతకుడు. మానమర్యాదలు చూడకుండా చీపురు కట్టతో కొడతాడు. కర్రముక్కలను వాటిపై విసరుతాడు. పాపం, అవి కళ్లనీళ్లు తుడుచుకొని, యమయాతనలను సహించి ఆ జానెడు బొరియలోనే భార్యాబిడ్డలతో, మనవలుమనవరాళ్లతో, మునిమనవలతో కాపరం దిద్దుకొంటవి. కలిసికట్టుతనం వాటిలో ఉన్నంతగా మానవులలో లేదు. అన్నదమ్ములు, తల్లిదండ్రులు, ఆడబడుచులు, అల్లుళ్లు, అత్తమామలు, తోడి అల్లుండ్రు, తోడికోడండ్రు, తాతలు, తాతల తండ్రులు, వారితాతలు వీరంతా కలిసి కాపరం చేస్తారు. తగాదాలు ఉండవు. అల్లరులు ఉండవు. ఎంత గుట్టుగా కాపరంచేస్తవి అవి! మనుష్యులు అల్లాగ జీవించగలరా?

కలసి ఉండలేరు. మూషక సమాజమునుండి మానవుడు ఎన్నియో విషయములు నేర్చుకొనవలసి ఉన్నది.

*మూషక స్తుతి :* అందుకనే కవులు మూషకాన్ని గూర్చి పద్యాలు వ్రాశారు.

సీ. నిర్ణిద్ర విషయుక్త నిశిత దంష్ట్రలఁ బూని
  భేదించు నెటువంటి గాదెలైన
దారుణోద్యద్దంతతతిచేత ఖండించు
  గురుతుగా నెటువంటికోకలైన
పటుసురంగాగార భరితంబుగా ద్రవ్వ
  బొంకాన నెటువంటి భూమినైన
కీచుకీచుధ్వని ప్రాచుర్య మహిమచే
  వర్ణించు నెటువంటి వారినైన
గీ. అతడు సామాన్యుడే నరేంద్రాలయాంత
రంతరానేక పేటికా క్రాంత వస్తు
హరణ సురధాణి యవ్వినాయకు పతాణిఁ
చారుతరమూర్తి మూషకచక్రవర్తి,

అని పొగడ్తలను కురిపించారు కవులు. మనుష్యజాతి మూషక జాతి నుండి ఎన్నివిషయాలు నేర్చినది : భూమిని త్రవ్వుట, వానిలోని లోహములను వెలికితీయుట మొదలగు విషయములతో కూడిన జియాలజీ శాస్త్రమును ఎలుకలనుండియే నరుడు నేర్చినాడు. ధాన్యపు మరలు, మరి కొన్ని యితర యంత్రములూ మూషకముల పండ్లను బట్టి నరుడు కల్పించుకొనినాడు. పందికొక్కుల ఒడలిపై బొచ్చును చూచి తాను ఉన్నిబట్టలు ధరించుట నేర్చినాడు.

*దోమలు — సంగీతశాస్త్రము :* మానవుడు నేర్చిన సకల విద్యలూ దోమలవద్దనుండియే సంగ్రహించెను. కవిత్వము తీసుకొందాము. మశక

మహాశయులు పాడు గీరమునుండియే నరుడు కవిత్వము వ్రాయుట నేర్చికొన్నాడు. మనుష్య రక్తమును కొద్దిగా త్రాగుతవి దోమలు. ఏ వస్తువునైనను మితముగా, జాగ్రత్తగా వాడవలయునసెడి ఆర్థిక శాస్త్ర సూత్రమును మశకములే నేర్పినవి.

నొప్పి లేకుండ రాజు ప్రజల వద్దనుండి పన్నులు గ్రహింపవలయును అనే ఆర్థికశాస్త్ర రహస్యము కౌటిల్యునికి ఎట్లా తెలిసింది? దోమలు మనుష్యరక్తమునుగ్రహించు విధానమును చూచియే! దోమలు సాయంసమయమున మధురగానం జేస్తవి. దానిని విసే నరుడు సంగీత విద్యను రూపొందించినాడు. బృందగానములో ఉండే సౌందర్యమును నరునికి తెలియజెప్పినవి మశకములే.

దోమలపై అపవాదులు: దోమకాటు వలన మలేరియా జ్వరము వస్తుందనే అపప్రథ ఒకటి పుట్టించినారు నరులు. దోమకాటు వలన జ్వరం వచ్చేటట్లయితే వాటికి ఆ విషం ఎట్లా సంక్రమించింది. మలేరియా విషము దోమల కెట్లో మానవునికీ అట్లే వచ్చినది అని ఎందుకు అన కూడదు. దోమకాటు వలస జ్వరము వస్తున్నదనీ, బోదకాలు వస్తున్నది అనే సిద్ధాంతాలు లేవదీసి, వాటిని చంపుతున్నారు. దోమలకే నోరుంటే, అవి "మనిషి రక్తం తాగడం వలస మాకు మలేరియాకంటే భయంకరమైన "జలేరియా" వస్తున్నదనీ, ఫైలేరియాకంటే భయంకరమైన "కైలేరియా" వస్తున్నదని గోలపెట్టేవి!

ఈ విధంగా అపకారము చేసేవాణ్ణి ఉపకారము చేసేవాణ్ణిగానూ, నీచుణ్ణి గొప్పవాణ్ణిగానూ భావించి స్తుతించడంలో మంచిచమత్కారమున్నది. ఇటువంటి స్తోత్రాభాస రచన చేయడము అంతసులభమైన పనికాదు. సాహిత్యోపాసనా వాసనచేతనో సహృదయ సాంగత్యఫలితంగానో ప్రతిభావ్యుత్పత్తుల పరమ పరిపాకంగానో ఇట్టిరచన చేసే నేర్పు

లభిస్తుంది. ఇది స్తుతికి ఆభాసరూపమే. ఆరూపంలోనే ఇది మనోహరంగా ఉంటుంది. స్తుతికి లేని రామణీయకము స్తోత్రాభాసానికి ఉన్నది. దీనివైశిష్ట్యమువేరు, దీనివైలక్షణ్యమువేరు, దీని వికాసమువేరు. స్తుతికి లేని మధురత్వ, రసవత్వ రమణీయత్వాలు ఈ స్తోత్రాభాసానికి ఉన్నవి. స్తుతి కావ్యగుణము. స్తోత్రాభాసము హాస్యము. అందులో అది మనోజ్ఞమైన హాస్యము.

*ఫలశ్రుతి :* ఏదైనా పుణ్యకథ చెప్పినతరువాత ఫలశ్రుతి చెపుతారు. నోములకూ వ్రతములకూ ఫలశ్రుతి చెబుతారు. భక్తిరసప్రధానమైనకథలు చెప్పి, ఈకథ విన్నవారికి ఈ శుభం కలుగుతుంది అని చెపుతారు. అదీ ఫలశ్రుతిఅంటే. ఏదో కాకమ్మ పిచ్చికమ్మ కథకో అచ్చమ్మ బుచ్చమ్మకథకో ఫలశ్రుతి చెప్పడము ఔచిత్యములేనిదై సంప్రదాయవిరుద్ధమై అసమంజసమై, ఆకారణంచేతనే వైచిత్రీస్ఫురితమై ప్రహ్లాదజనకము అవుతుంది. దీనికి ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను. ఫలశ్రుతిలో కూడా స్తుతి వ్యాపారము ఉంది. అది ఆ చెప్పిన కథను పొగడడము వంటిది. అనుచితమూ అసంగతమూ అయిన ఫలశ్రుతి స్తోత్రాభాసమే. అందుకనే దానిని ఈ ప్రకరణంలో చేర్చవలసివచ్చింది.

*బ్రాహ్మణ విజయ ఫలశ్రుతి :* సత్యరాజాచార్యుల పూర్వదేశయాత్రలు అనేకథలో సత్యరాజా లంకా ద్వీపంలో రాక్షసులఇంట్లో ఉంటాడు. వారింట్లో మేకపిల్ల ఒకటి, అతిభయంకరమైనది ఉన్నది. సత్యరాజా దానితోపోట్లాడుతాడు. సత్యరాజాకే జయము కలుగుతుంది. దివినున్న దేవతలు సంతోషముతో పుష్పవర్షము కురిపిస్తారు. ఆయనకు కలిగిన జయము వలన బ్రాహ్మణులు భీరువులు అన్న అపకీర్తి పోయినది. దీనికి గ్రంథకర్త ఛాగశాబక బ్రాహ్మణకుమార సమరోపాఖ్యానం అని పేరు పెడతాడు. బ్రాహ్మణునకు విజయం కలిగింది కాబట్టి, దానిని పుణ్యకథగా ఎంచి ఫలశ్రుతి చెబుతాడు. "ఈ పుణ్యకథను విన్నవారును,

భక్తితో చదివినవారును స్థలజల గండములనుండి విముక్తులై సర్వ కార్యముల యందును విజయమునుపొందుదురు అని. దానిని సందేహిం చినవారు అధోగతులగుదురు!

*మరో ఫలస్తుతి :* ఆ రాక్షస దేశంలోనే సత్యరాజా ఒక రోజున ఒక నల్లితో పోట్లాడవలసివచ్చింది నల్లి అంటే మనదేశంలో నల్లి వంటిదా అది! అది మన మూషకమంత. రాక్షసుల రక్తము తాగి బలిసి యున్నది. దానితో సత్యరాజా దంతాదంతిని, నఖానఖిని యుద్ధము చేయవలసివచ్చింది. చివరకు ఎట్లాగయితేనేమి ఈ బ్రాహ్మణుడు దాని బాహువులను నరకగలిగినాడు. ఆ మత్కుణము సంహరింపబడింది. అని కథ చెప్పి గ్రంథకర్త ఫలశ్రుతి చెపుతాడు. "ఈ మత్కుణాసుర విజయకథను శ్రద్ధతో చదివినవారును, భక్తితో విన్నవారును, పద్య కావ్యముగా రచించి లోకమున ప్రసిద్ధిపరచినవారును మూడులోకముల యందును మత్కుణ బాధనుండి విముక్తులగుదురు. పరమగోప్యమైన మత్కుణ మహామంత్రమును సంపాదించి దానిని పరమవిశ్వాసముతో జపించువారికి సమస్త విషబాధలును తొలుగును."

*మార్జాల స్తుతి :* పిల్లి అల్పప్రాణి. అంతేగాక దానివి దొంగ బుద్ధులు. అటువంటి జంతువును సుగుణముల సురభిగా పొగడడము హాస్యాస్పదము. దానిని పొగడడములోనే స్తుతి ఆభాసరూపకమును పొందుతుంది. ఆ రూపంలో ఆ స్తుతి వ్యాపారము ఒకవైశిష్ట్యమును వైచిత్రిని సంతరించుకొని రమణీయమైన హాస్యంగా దీపిస్తుంది. ఈ క్రిందిరచన చూడండి.

*సకల గృహవర్తి-మార్జాల చక్రవర్తి :* పిల్లి అందమైన జంతువు. దానివి జమీందారీపోకడలు. పట్టుపరుపులపై గాని పడుకోదు. వెండి గిన్నెలో ఉన్నపాలనే గాని త్రాగదు. పెరుగన్నమేగాని తినదు.

మనుష్యునికి హానికలుగజేసే ఎలుకలను చంపి ఉపకారంచేస్తుంది. దానిది రాణివాసము. ఇల్లువిడిచి బయటికి వెళ్లదు. అంతఃపురకాంతలాగ సంచరిస్తుంది. ఇల్లాగ దానిని స్తుతించడము ఎంతహాస్యాస్పదము.

బోయి భీమకవి రమణీయమైన పద్ధతిలో పిల్లినిగూర్చి స్తుతి వాక్యాలు పలికినాడు. పిల్లి మనసులో వర్తించు ఇల్లాలువలె ప్రవర్తిస్తుందట! సుందరమైన నడకలు నడుస్తుందట.

అల్లన తక్కుచు, తారుచు,
మెల్లన మ్యా వనుచు నను సమీపించుటకున్
చెల్లునె యెవ్వరికిని ? నా
ఇల్లాలికి నీకు తప్ప ఇలలో ? పిల్లీ !

అంటాడు కవి. *

*గమ్మత్తు చేస్తుందట :*

నను గమ్మతు చేయగ మ్యా
వనుచున్ మా పాప రాగ, అట తన కంచ
మ్మును సొమ్ము చేసుకొను నీ
ఘనతన్ కనగలరె యెంత ఘనులున్ ? పిల్లీ !

*బాలకృష్ణునివంటిది పిల్లి :* పిల్లి బాలకృష్ణునివంటిదట. ఎందుకంటే

మన బాల కృష్ణునకు రే
లును పవలులు లేవు; వెన్నలును జున్నులు నే
మనుగడ; నీకును నటులే;
నిను తెలియుట బాలకృష్ణు నెరుగుటః పిల్లీ !

అంటాడు. పిల్లి చీకటిలో చూడగలదు. చీకటిలో చూడగలగడమే ఋషులు తపస్సువలన సాధించేది. ఆ శక్తి నీవు జన్మతః పొందినావు. ఎంత గొప్పదానవే పిల్లీ అనవచ్చు.

---

* బోయి భీమకవి

దానము, ధర్మము కుక్కకె;
మానము గల నీకు కాదు; మర్యాదగ నీ
ప్రాణములు నిల్పుకొందువు!
మానముగల వారికెల్ల మాన్యవు! పిల్లీ!

అని మళ్ళీ అంటాడు కవి. ఈ విధంగా నడుస్తుంది ఆ పిల్లి శతకము. క్షుద్రజీవిని అంతగా స్తుతించడంలో ఆ వ్యాపారము ఆభాసరూపమును పొంది సుందరము సురుచిరము అయిన హాస్యము అయింది.

*అత్తింటి కోడలును పొరుగమ్మ స్తుతిస్తున్నది :* ఆమెకేమమ్మా జమీందారుబిడ్డ. ఒకపూట గట్టినచీర మరోపూట కట్టదు. కాస్త పాత బడితేచాలు అపతలపారేస్తుంది. నీలాటిరేవులో గంటలకొద్దీ నిలబడి అమ్మలక్కలతో మాట్లాడుతుంది. మాఆయన కాస్త ఆలస్యం అయితే కస్సుబుస్సు మంటాడు. ఆవిడ అదృష్టం ఎవరికొస్తుంది. భోజనాలయిన తరువాత ఒక్కక్షణం ఇంట్లోఉండదు. ఇరుగుపొరుగువారి ఇళ్ళల్లో కబుర్లుచెపుతూ కాలం గడుపుతుంది. పసిబిడ్డలను ఎత్తుకొంటానికి నౌక ర్లున్నారు. అత్తగారు అన్నీ చూచుకుపోతుంది. ఆ కోడలు ఒక్కపని ముట్టుకోదు. ఆవిడ ఉదయం అంతా మాగ్గుతూ పడుకొంటుంది. ఏదో కారణంచెప్పి, సంవత్సరానికి ఆరునెలలు పుట్టింట్లో ఉంటుంది. ఆమె అదృష్టం ఎవరికొస్తుందమ్మా! ఇల్లాంటి పొగడ్త స్తుతికాదు. దాని ఆభాస రూపము.

*త్రాగుబోతుతనాన్ని స్తుతించడము :* త్రాగడము చాలామంచిది. దానివలన ఆరోగ్యం బాగుపడుతుంది. నిద్ర బాగాపడుతుంది. బాగానిద్ర పోయేవాడికి ఏ రోగాలూరావు. సారాయి, కల్లూ, విస్కీ మొదలైన ద్రవ్యములను త్రాగితే అన్నము బాగాజీర్ణముఅవుతుంది. మన పూర్వులు సోమరసము త్రాగేవారు. మనఆర్యులు అనేకరకాల సురలను తయారు చేసి సేవించేవారు. మనదేవతలు అంతా తాగేవాళ్ళే. కొందరుమాత్రం

త్రాగకూడదని వాదించారు. సుర త్రాగవచ్చును అని అనేవాళ్ళకూ త్రాగ కూడదు అని అనేవాళ్లకు పెద్దయుద్ధం వచ్చింది. దానినే దేవదానవ యుద్ధం అన్నారు. అందులో దేవతలపార్టీ గెలిచింది. అందుకని వారికి సురలు అనే పేరు వచ్చింది. అంటే మద్యము త్రాగేవారు అన్నమాట. సురత్రాగకూడదు అనివాదించిన దానవులు ఓడిపోయినారు. అందుకనే వారిని అసురులు అన్నారు. ఇది సురాపానాన్ని పొగడడము.

*పొగచుట్ట, భీముడు చుట్టత్రాగేవాడు:* చుట్ట త్రాగడము మంచి దనీ, దానివలన ఎన్నోసుగుణాలు అలవడుతవనీ, అది విద్వత్సంప్ర దాయమనీ చెప్పడము దాన్ని స్తుతించడమేకదా! ఈ రచన చూడండి.

చుట్టత్రాగడము చాలా ప్రాచీనమైన ఆచారము. మన ప్రాచీన గ్రంథాలలో ఈచుట్ట ప్రశంసఉంది. భీముడు చుట్టత్రాగేవాడని ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పవచ్చును. దీనికి భారతములోనే కావలసినంత సాక్ష్యము దొరుకుతుంది. విరాట్ పర్వంలో భీముని విషయమై చెపుతూ "మొలమోపి పెక్కుచుట్టల్ పలుత్రాటంజుట్టి కోపభావం బమరన్" అని అన్నాడు తిక్కన. భీముడు మాటిమాటికి చుట్టలు చుట్టుకోలేక చాలా పెద్దవైనవీన్నీ బరువైనవిన్నీ అయినచుట్టలు ఎక్కువగా ఒకేసారి చుట్టు కొనేవాడు. కావలసినప్పుడల్లా ఒకటో రెండో తీసుకొనేవాడు. కోప భావం బమరన్ అని ఎందుకు అనవలసివచ్చిందీఅంటే వెధవచుట్టలు చుట్టీచుట్టీ ప్రాణం విసిగిపోయి చివరకు తనమీదతనకే కోపంవచ్చింది ఆయనకు అని చెప్పవచ్చు. లేకపోతే మహారాజునై ఉండికూడా ఎంత గతి పట్టిందినాకు! చుట్టలు చుట్టిఇచ్చేందుకు ఒక సేవకుడు అయినా లేక పోయెనే అనివిసుగుతో అల్లాగ అని ఉంటాడూ అనీ చెప్పవచ్చు. "ఎంచక నా గమనమునకు ఇంచుక చుట్టయిన కానిమ్ము" అని కళా పూర్ణోదయంలోఉంది. ఆ కళాపూర్ణుడు ఈ ప్రయాణంలో నాకు ఒక చుట్టయినాసరే ఇవ్వవలసిందీ అని అన్నాడు అన్నమాట. ఆరోజులలో చుట్టలకుగల ప్రాధాన్యం అటువంటిది.

*ధర్మరాజు చుట్టను ప్రశంసిస్తాడు :* ధర్మరాజు ఒకసారి ఏదో ప్రసంగంలో చుట్టఅంటే ఎవరికీ కోపంరాకూడదని చెపుతూ చుట్ట యును పగయును భేదంబెట్టి జనులకు తగదు అన్నాడు. విష్ణుమూర్తికి చుట్టవాలుజోదు అనిపేరు ఎందుకుఉన్నది? ఆయన చుట్టలు త్రాగేవాడు కాబట్టే.

*పాండురంగమహాత్మ్యంలో చుట్ట ప్రశంస :* ఇంకో విషయం. స్త్రీల సమక్షంలో చుట్ట తాగడము కూడనిపనే అయినా, ప్రియురాలుతో ఏకాంతంగా ఉన్న సమయంలో చుట్ట తాగడము ఆనుపూర్వీక సద్సంప్ర దాయంగా కనిపిస్తుంది. భార్య ప్రియుని దగ్గరకు చేరి తమలపాకులు చుట్టలు ఇచ్చినట్లు అనేకచోట్ల వర్ణితము. పాండురంగమహాత్మ్యంలో ఈ విషయం స్పష్టంగా చెప్పాడు 'తనదు తొయ్యలి వీడ్యము చుట్టయాన్' అని ఉన్నది. భార్య భర్తకు తమలపాకులూ చుట్టలూ కూడా ఇచ్చినట్లు చెప్పబడి ఉన్నది.

*శ్రీకృష్ణుడు చుట్ట త్రాగేవాడు :* బంధువులు, స్నేహితులు వచ్చి నపుడు, భోజనానంతరం అందరికీ తలొక చుట్ట ఇయ్యటమనే ఆచారం భారతకాలంనాటికే ఉన్నది. శ్రీకృష్ణభగవానులవారి ఇంటికి బంధువులంతా వచ్చినారు. ఆ వచ్చినవారిలో పాండురాజు తనయులూ, ధృతరాష్ట్రుని కుమారులూ ఉన్నారు. కృష్ణుడు మొదటినుంచీ పాండవులయందు స్నేహ భావంతో ఉంటూ వారియందు పక్షపాతం ప్రకటిస్తూ ఉండేవాడు. ఒక సందర్భంలో చుట్టలు ఇయ్యడములో కూడా ఈ పక్షపాతమే ప్రదర్శించి పాండు తనయులకు తలొక చుట్టా ఇచ్చి ధార్తరాష్ట్రులకు ఇయ్యలేదు అలాగ పక్షపాతం ప్రదర్శించటానికి కారణం కూడా ఉంది. పొగాకు ఆ రోజులలో చాలా ప్రియంగా ఉండి సర్వజన లభ్యంగా ఉండేదికాదు. మహారాజులు మాత్రమే చుట్ట త్రాగేవారు. పాండవులు అయిదుగురు. అయిదుగురికీ అయిదు చుట్టలు ఇయ్యడం అంత కష్టం కాదు. ధార్త రాష్ట్రులు నూర్గురు. అంతమందికి చుట్టలు ఇయ్యడము కష్టము. అందుకని

శ్రీకృష్ణుడు పాండవులకు తలొక చుట్టా ఇచ్చి ధార్తరాష్ట్రులకు ఇయ్య లేదు. అప్పుడు భీష్మాచార్యులవారు కృష్ణున్ని మందలిస్తారు. నాయనా, "పాండవులు, ధార్తరాష్ట్రులు పుండరీకనేత్ర చుట్టరికంబున నొక్కరూప" అని. పాండవులు, ధార్తరాష్ట్రులు అనే భేదం చూపకూడదు. చుట్టరికం బున అంతే. చుట్టలు పంచిఇచ్చే విషయంలో నీకు అందరూ సమానులే సుమా అని! ఆయన అన్నాడన్నమాట.

*రాజులు చుట్టలు త్రాగేవారు :* ధర్మరాజు నిర్మించిన మయసభ సంగతి చెప్పే సమయంలో సామంతరాజులు చుట్టుకొనిరి అని ఉంది. ఏమి చుట్టుకొని ఉంటారు? చుట్టనే చుట్టుకొని ఉంటారని ప్రాకరణికార్థము. విష్ణుమూర్తికి చుట్టు వాలుజోదు అనే పేరు ఉన్నది. చుట్టకే రూపాంతరము చుట్టు. చుట్టబడినది చుట్టు. పెట్టు, తిట్టు, కుట్టు మొదలగు శబ్దములవలె.

*చుట్టరికము :* చుట్ట సంబంధంగా ఇద్దరు మనుష్యుల మధ్య ఏర్పడిన సంబంధమే చుట్టరికము. చుట్టలు ఇయ్యటమూపుచ్చుకోవటమూ అనే వ్యాపారము ప్రాచుర్యంగా బంధువుల మధ్యనే జరుగుతూ వచ్చిన కారణాన చుట్టరికము అంటే బంధుత్వము అనే అర్థము స్థిరపడిపోయి రూఢము అయింది.

*తర్కశాస్త్రములో చుట్ట ప్రశంస:* ఇక తర్కశాస్త్ర విషయానికి వద్దాము. తార్కికులు అగ్నికి, ధూమానికి నియత సంబంధం ఉన్నది అంటారు. అంటే ఆ రెండూ ఎప్పుడూ కలసిఉంటవి అన్నమాట. పొగ ఉన్నదీ అంటే, అక్కడ అగ్ని ఉన్నదన్నమాటే! 'యత్రధూమః తత్రవహ్నిః' అని చెప్పాడు సూత్రకారుడు. ఈ సత్యాన్ని తార్కికుడు ఎట్లా కనుక్కొన్నాడు! చుట్టతాగడాన్ని చూచి! ఎందుకంటే ఆ నియత సంబంధం ఒక్క ఈ చుట్ట విషయములోనే అనుమానానికి అవకాశంలేని పద్ధతిలో కనిపిస్తుంది. చుట్టలో అగ్ని ఉంటేనే నోట్లోనుంచి పొగ

వస్తుంది. అగ్ని లేకపోతే ధూమం రాదు. యత్రయత్ర వహ్నిర్నాస్తి తత్రతత్ర ధూమోపినాస్తి.

చుట్ట కాలుస్తూ ఉండంగా ధూమము వచ్చుటయూ, అగ్నియూ, ధూమమునూ కలిసియుండుటయూ చూచితిమి అని ఒప్పుకోరు తార్కికులు. ఒప్పుకోక యత్రధూమస్తత్రాగ్నిః యథా మహానసః అంటారు. ధూమమూ అగ్ని వంటయింటియందు నియత సంబంధంలో ఉన్నవి అని అన్వయ దృష్టాంతము ఇస్తారు. అది నిజంకాదు. ఇట్టి సంబంధం మహానసంలో చస్తేకుదరదు అక్కడ సంగతి కాంతం చెప్పింది. వంటయింట్లో పొగ రాజుతూ ఉంటే నిప్పు రాజదు. ఎప్పుడైతే నిప్పు రాజి అగ్ని ఏర్పడుతుందో అప్పుడు పొగ ఉండదు. మహానసంలో ధూమాగ్నుల మధ్య నియత సంబంధం లేదు. చుట్ట కాలుస్తున్నప్పుడే ఎఱ్ఱని నిప్పూ పొగా కలిసిఉంటవి. కాబట్టి యత్రయత్ర ధూమః తత్రతత్ర అగ్నిః అన్న వాక్యం చుట్టదహన సంస్కారాన్ని చూచే అనబడ్డది. కాబట్టి చుట్ట పంఫిస్ మీదే తర్కశాస్త్రం పుట్టింది. వాక్యం ఎల్లాగుండవలసిందీ అంటే యత్రయత్రధూమస్తత్రాగ్నిః యథా చుట్టదహన సంస్కారవైఖరీః అని.

*చర్చిల్—కృష్ణశాస్త్రి—కాటూరు :* చుట్టకు రావలసిన గౌరవం రాకుండా చేశారు తార్కికులు. అందుకనే తార్కికుల చేతిలో చుట్ట కాలదు. చుట్ట త్రాగటం వలన అనేక ప్రయోజనాలు సిద్ధిస్తూ ఉన్నవి. రాజకీయాలలో శేముషీదురంధరుడైన చర్చిల్ చుట్ట త్రాగడము వల్లనే అసమానమైన ప్రజ్ఞను సంపాదించాడు. దేవులపల్లి వారు, కాటూరువారు చుట్ట తాగిన కారణంచేతనే మహాకవులైనారు. చివరకు బీడీ అయినా సిగరెట్టు అయినా తాగందే ఎవ్వరూ కవిత్వం వ్రాయలేరు.

*హేమద్దే అహం త్వాం ఉపాసే :* చుట్ట త్రాగడమువలన కలిగే ఆనందము మధురమైన కావ్యమును చదివినపుడూ ప్రియురాలు చెంపపై

చిటికవేసి సరసోక్తులాడేటప్పుడూ కలిగే ఆనందంతో సమానమైన దని చెప్పవచ్చును. కోపమూ, ద్వేషమూ మొదలైన మనోవికారాలను పోగొట్టడానికి చుట్టవంటివస్తువ ఇంకొకటి లేదు. మిత్రునివలె ఆదరించేది, ప్రియురాలివలె లాలించేది, తల్లివలె బుజ్జగించేది ఒక్క చుట్టే కాని మరొకటికాదు. ఈ వ్యాపారము ఒక్కటే పీయూషపానమువలె మధురమైనదీ, శరద్రాత్రి వలె మనోహరమైనదీ అయిఉన్నది. కాబట్టి మనమందరమూ ఈ చుట్టకు నమస్కరించక తప్పదు. చుట్టయొక్క మహాత్మ్యమునూ, పరువమునూ, ప్రయోజనమునూ గుర్తింపనికొందరు నాస్తికులు దాన్ని గురించి అపభాషణ చేస్తూఉండడము శోచనీయము. హేచుట్టే, అహం త్వాం ఉపాసే, తమసోమా జ్యోతిర్గమయ.

*పొగాకును స్తుతించడము :* ఏహ్యమూ, నింద్యమూ, అసభ్యమూ అయిన విషయాన్ని గురించి ఈ స్తుతి జరిగింది కాబట్టి ఇది స్తోత్రాభాసము అయింది. స్తుతి ఈరూపంలో మనోహరంగా ఉత్తమహాస్యంగా భాసిస్తున్నది. ఎవరో కవి పొగాకు పైని పద్యాలు వ్రాసి ఈ మోస్తరు హాస్యాన్ని సాధించినాడు.

ఈ క్రింది రెండు పద్యాలలో పొగాకును స్తుతించడము వలన రమణీయమైన హాస్యము సిద్ధించింది.

క. మీరుం బొగ ద్రాగుదురా
వారిజభవ ! వామదేవ ! వైకుంఠ ! హరీ !
ఓరీ నారద ! వినురా
యీరేడుజగంబులకును నిది ముఖ్యమురా !

క. ఘుగఘుగమని పొగ లెగయఁగ
నగణితముగ నాజ్యధార లాహుతిగాఁగా
నిగమాదిమంత్రయుతముగఁ
బొగద్రాగనివాఁడు దున్నపోతై పుట్టున్.

క. పొగ[క్రోవికి సతిమోవికి
నగణితముగ నూరబావి కమృతంబునకుఁ
దగ నుచ్ఛిష్టత లేదని
ఖగవాహనుతోడఁ గాలకంఠుఁడు పల్కెన్.

ఇట్లాగే ఏ అల్పవస్తువును గురించి అయినా స్తోత్రం చేస్తే అది స్తోత్రాభాసము అయి నవ్వదగిన వృత్తాంతము అవుతుంది.

శ్రీశ్రీ సిగరెట్టు: పొగాకు చుట్టా బీడీ సిగరెట్టు అనే మూడు రూపాలను పొందినది. ఆ మూడింటిలోనూ ఉండే సత్పదార్థము ఒకటే. అయితే ఈ మూడింటిలోనూ సిగరెట్టుకు ఉన్న ప్రజాదరణ, ప్రతిష్ట మిగతావాటికి లేవు. ఆ సంగతే శ్రీశ్రీ అంటాడు "ఖగరాట్ కృషి ఫలితంగా, పొగాకు భూలోకమందు పుట్టెనుగానీ, పొగచుట్టలెన్నియైనను సిగరెట్టుకు సాటిరావు సిరిసిరి మువ్వా" అని...

ఇది వ్రాసింది శ్రీ, శ్రీశ్రీ.

---(O)---

ఉక్తిమూలము - శక్తిమూలము

అపహసిత మూలకము - అభిభాషణ మూలకము

అపహాస్యము (Mockery)

అధిక్షేపము (Satire)

అవక్షిప్తము - ఎత్తిపొడుపు

అవలగితము (Irony) వ్యంగ్యము

అహోపురుషికము

ఆత్మోత్కర్ష

ఆత్మాపకర్ష

# అర్థాశ్రయ హాస్యము

*సున్నితమైన భావములు కలది :* ఇంతవరకు భావాశ్రయహాస్యము ఎన్ని ప్రకరణాలలో సాధించవచ్చునో తెలిసికొన్నాము. ఇక మిగిలినది అర్థాశ్రయ హాస్యము. ఇందులో హాస్యము శబ్దముల గడబిడతో గాని వికృతశబ్దప్రయోగంతో గాని సంబంధం కలిగియుండదు. చమత్కారం కథ యొక్క అర్థాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. అర్థాశ్రయహాస్యము హృదయసంబంధి. ఇది సానుభూతి, ప్రేమా మొదలగు సున్నితమూ, సుకుమారమూ అయిన భావములతో సంబంధము గలది. ఇది శక్తి మూలమూ, ఉక్తిమూలమూ అని ద్వివిధము. అర్థాశ్రయహాస్యము అత్యుత్తమమైనదానినిగా నేను భావిస్తాను. ప్రతిభలేని రచయిత చేతిలో ఇది క్షుద్రభావసంకీర్ణమై శోభాస్పదము కాక మెచ్చుకోదగినది కాక పోవచ్చును. కాని ప్రతిభావంతుని చేతిలో ఈరకము హాస్యము ధ్వని నిక్షిప్తమైన చమత్కారముతోకూడి రమణీయంగా ఉంటుంది.

*అర్థాశ్రయ హాస్య లక్షణాలు :* అర్థాశ్రయహాస్యమును శబ్దాశ్రయ భావాశ్రయ హాస్యాలతో పోల్చిచూద్దాం. అర్థవైభవము కలిగి రమణీయార్థప్రతిపాదకమై రసజనకమైన చిత్తవృత్తిని కలిగించేదీ జుగుప్సాకరము కానిదీ, వికార రహితమైనదీ, మనోహరమైనదీ అర్థాశ్రయ హాస్యము. శబ్దాశ్రయహాస్యంలో చమత్కారము శబ్దములకూర్పులోగాని ఉచ్చారణలోగాని ఉంటుంది. భావాశ్రయహాస్యము భావములో ఉన్న వికృతిని ఆశ్రయించుకొని ఉంటుంది. అర్థాశ్రయహాస్యము అర్థవైభవము గలిగి ఉండడమే కాక అచ్చట చమత్కారము ధ్వనిని ఆశ్రయించుకొని ఉంటుంది.

(26)

అత్యుత్తమమైనది : భావంలో ఒక మెలిక, ఒక వైపరీత్యము ఒక వింతపోకడ, ఒక అనౌచిత్యము భావాశ్రయహాస్యానికి మూలము. వికృతిభావంలో ఉన్నది. శబ్దాశ్రయహాస్యంలో వికృతి శబ్దముల ఉచ్చారణా వైపరీత్యంవలన హాసజనకమైన విరుపువలనా, రూపవైవిధ్యం వలనా వింతకూర్పువలనా జనిస్తుంది. శబ్దవికృతికంటే భావవికృతి ఉత్తమమైనది. అర్థవైభవంతో కూడిన వాగ్వ్యాపారము అత్యుత్తమమైన హాస్యవృత్తాంతము. ఒక స్త్రీ అలంకారాలు పెట్టుకొని ఉండడము చూచి మనము ఆనందిస్తాము. ఇది బాహిరమైన సౌందర్యాన్ని చూచి ఆనందించడము.

స్త్రీయొక్క దయా, భక్తీ, ఔదార్యమూ, సానుభూతీ వాత్సల్యమూ, వినయమూ మొదలైన సుగుణాలను చూచీ ఆనందిస్తాము. ఇది ఆంతరంగిక సౌందర్యాన్ని చూచి ఆనందించడము. శబ్దాశ్రయహాస్యానికీ భావాశ్రయ, అర్థాశ్రయ హాస్యాలకూ గల భేదము ఈ రెంటికీగలభేదము వంటిదే. శబ్దాశ్రయ భావాశ్రయ అర్థాశ్రయాలలో మొదటిది రూపసౌందర్యములతో ప్రమేయముగలది. తరువాత చెప్పినవి ఆత్మసౌందర్యంతో ప్రమేయంగలవి.

*తరతరాల బూజు మా నిజాము రాజు* : కవిత్వంలో వట్టి మృదుపదములకూర్పు మాత్రమే కాక దానితోపాటు అర్థవైభవముకూడా ఉంటుంది. మరొక్కరచనలో అది మరీఅందంగా ఉంటుంది. "తరతరాల బూజు మా నిజామురాజు" అనే వాక్యంలో స్వరూపసౌందర్యమేకాక వ్యంగ్యరూప రసాద్యర్థ వైభవముకూడా ఉంది. ఈ వాక్యంలో మృదు లలిత పదజన్య హృదయంగమత్వము ప్రధానము. దీనివలన కలిగే ఆనందముకూడా ఉత్తమస్థాయికి చెందినది అయిఉంటుంది. జుగుప్సాకరముకాక వికారరహితమై రసపరిపుష్టమైన ఆనందం కలుగుతుంది. ఈ

ఆనందం కేవలము శబ్దార్థపరిమితముకాదు. శబ్దార్థమును అధిగమించి ధ్వని తరంగములను ఆశ్రయించినది అవుతుంది.

*మందస్మిత పరిమితము :* ఈ రకము హాస్యమువలన మనకు కలిగే ఆనందముయొక్క స్వరూపాన్ని నిర్ణయించడముకూడా కష్టము ఈ ఆనందంయొక్క బాహ్యరూపం హాసము. అర్థాశ్రయహాస్యమువలన జనించే హాసము మధురమంజుల మందస్మిత పరిమితము. ఎంతోలోతైన సముద్రమధ్యమున ఉత్తుంగతరంగాలు ఉండక చిరుఅలలు మాత్రమే ఉంటవి. అట్లాగే ఈ అర్థాశ్రయహాస్యమువలన కలిగే ఆనందము స్మిత పరిజనక సమర్థమై ఉంటుందిగాని అతిహసితమునకు తావివ్వదు. ఆచిరు నవ్వు పెదవులను దాటిరాదు. దానివేళ్లు హృదయంలోకి వ్యాపిస్తవి. హృదయాన్ని తాకగలదే ఉత్తమ హాస్యము.

ఉక్తిమూలము - శక్తిమూలము :

ఉక్తిమూలహాస్యము సంస్కృతమైనది! లోకజ్ఞాన పరిపుష్టమూ మేధాజన్యమూ అయినది. ఉక్తి ఎప్పుడూ ఒక హఠాత్‌జనిత మధు రోహను ఆశ్రయించి ఉంటుంది. కనుల మిరుమిట్లు గొలుపుతుంది. తాత్కాలికమైనట్టీ, క్షణికమైనట్టీ మెరుపు వంటిది. ఉక్తిమూల హాస్య ములో హాస్యజనకమైన వృత్తాంతము చమత్కారగర్భితమైన పలుకు 'ఇది' అని పట్టుకోవచ్చు ఎత్తిచూపవచ్చు. దానిని గుర్తింపవచ్చు. కాని శక్తిమూల హాస్యములో చమత్కారము 'ఇక్కడ', 'ఈ మాటలో', 'ఈ వాక్యంలో' ఉంది, అని చెప్పలేము. శక్తిమూలహాస్యము గుప్తంగా ఉండి రచనను అంతటిని అలముకొని ఉంటుంది.

*శక్తిమూల హాస్యము :* పుష్పపరిమళ భరితమైన వాయువులో సువాసన దాక్కొని ఉన్నట్లు, విచ్చిన గులాబిపుష్పదళములలో సౌరభము దాగుడుమూతలాడుతున్నట్టు, మూడేండ్లబిడ్డ వచ్చీరాని ముద్దుపలుకులో

మాధుర్యం అంతర్లీనంగా ఉన్నట్లు, చిత్రకారుని చిత్రంలో అలౌకికమైన సౌందర్యం నిర్దేశింపరాని విధంగా భాసిస్తున్నట్లు స్త్రీ శరీరంలో అంగ సౌష్ఠవమునకు భిన్నమైనట్టి అతీతమైనట్టి లావణ్యము తులుకుతున్నట్లు, మిత్రుని ప్రియవాక్కులో అమృతము దాగియున్నట్లు, వేదబుక్కులో దైవత్వము నిష్ఠమైయున్నట్లు శక్తిమూల హాస్యంలో చమత్కారం నిగూఢమై ఉంటుంది. అంతటను వ్యాపించి ఉంటుంది. ఆ కలయిక శబ్దార్థముల కలయిక వంటిది. వల్లకీతంత్రీ వినిర్గతమైన మధురధ్వనిలో కాకలీత్వము కరగియున్నట్లు ఈ శక్తిమూల హాస్యంలో చమత్కారం అంతర్లీనమై ఉంటుంది. ఉక్తిమూలహాస్యము మేధనుండి మేధకు వ్యాపిస్తుంది. అట్టిహాస్యము మేధాసంపత్తిగలవాడే పలుకగలడు. మేధాపౌష్కల్యము గలవాడే అర్థము చేసికొనగలడు.

*శక్తిమూలహాస్యము హృదయ సంబంధి :* శక్తిమూలము హృదయ సంబంధి. ఉక్తిమూలము మేధాసంబంధి. శక్తిమూలములో హాస్యము రచన నంతటిలో వ్యాపించి ఉంటుంది. ఉక్తిలో గుర్తింపతగిన ఒక ఊహను ఆశ్రయించుకొని ఉంటుంది. శక్తిమూలము చంద్రకాంతి. ఉక్తి మూలము చీకటిలో మెరసిన మెరుపు. ఒరలోనుండి తీసి విసరిన కత్తి మెరుపువలె ఉక్తిమూలహాస్యము మెరుస్తుంది. ఆతశుకుకుకన్నులుమూతలు పడవచ్చు. గగుర్పాటు కలగవచ్చు. మనిషి "అరే" అని వెనుకకు విరుచుకొని పడిపోవచ్చు! ఆశ్చర్యచకితుడై నిశ్చేష్టితుడు కావచ్చు. మేధావి భావసాగరోదర అంతర్భాగమున మునిగి వెలికితీసిన ఒక అపూర్వ సముజ్వల మౌక్తికరాజము ఉక్తి. వాక్పయోనిధి మధించగా ఆవిర్భవించిన అమృతము శక్తిమూలహాస్యము.

*ఉక్తి పాలపొంగు వంటిది :* ఉక్తి ఒక సముజ్జ్వలమైన దీపిక. శక్తిమూలహాస్యము చంద్రనిష్యందసీహారధార. మేధ అనేటటువంటి అగ్నిస్పర్శచే భావక్షీరమునుండి వెలికి గ్రక్కబడిన తొలిపొంగు ఉక్తి.

కాగి చల్లారిన పాలపై కట్టిన మీగడ శక్తిమూల హాస్యము. సూర్య కాంతివలె తీక్ష్ణమైనది ఉక్తి. శరత్చంద్ర చంద్రికలవలె చల్లనిది శక్తి మూలము. ప్రియురాలు ప్రసాదించిన నఖక్షత దంతక్షతాల వంటిది ఉక్తి విశేషము. పొంగుతున్న హృదయంతో ప్రియురాలు చెంపమీద మృదువుగా చిటిక వేసినట్లు ఉంటుంది శక్తిమూలము. కాగితపు పూలను చూచి ఆ రంగునూ, సొంపునూ, పనితనాన్నీ మెచ్చుకొంటాము. ఆ పూలకు మార్దవము లేదు. సౌకుమార్యము లేదు. సువాసన లేదు. ఆ సౌందర్యము కృత్రిమము. ఉక్తిహాస్యము అటువంటిది. సహజమైన పుష్పానికి మార్దవమూ మనోజ్ఞతా ఉంటవి. శక్తిమూలము అటువంటిది.

*ఉక్తి అహంకారంలోనుంచి పుట్టింది. శక్తిమూలహాస్యము హృదయ నైర్మల్యంలోనుంచి:* ఉక్తిహాస్యములో ఎదుటివానిని చిన్నబుచ్చడమూ, వానిపై దెబ్బతీయడమూ, ఉంటుంది. ఉక్తిహాస్యకర్త తనలోనూ తన శక్తిలోనూ విశ్వాసాన్ని ప్రకటిస్తాడు. గర్వంలోనుంచి, అహంకారంలో నుంచి, స్వార్థచింతలోనుంచి, పుట్టింది ఉక్తి. వినయంలోనుంచి, హృదయ నైర్మల్యములోనుంచి, నిస్వార్థతలోనుంచి జనించినది శక్తిమూల హాస్యము. అహంకారము, ఆత్మవిశ్వాసము లేకపోతే ఉక్తి పుట్టదు. అయినా ఉక్తిహాస్యము ఎందుకు రమణీయమైనది అంటే, అందులో ఉక్తికల్పనలో ప్రదర్శితమయ్యే మేధాసంపత్తి అమోఘమైనది కాబట్టి.

*ఉక్తి మెఱుపు. శక్తిమూలహాస్యం హృదయంలో జొరబడ్డ తేజస్సు:* గర్విష్ఠి కొండకొమ్ము నెక్కి క్రిందనున్నవారితో మాట్లాడుతున్నట్లు ఉంటుంది ఉక్తిహాస్యము. సహృదయుడు తన హృదయాన్ని నీ హృదయానికి దగ్గరగా చేర్చి ఆలింగనం చేసుకొని మాట్లాడుతున్నట్లుగా ఉంటుంది శక్తిమూలహాస్యము. ఉక్తికారుని ప్రసంగం విని నీవు చకితుడవై దిగ్భ్రమచెంది తెల్లబోతావు శక్తిమూలహాస్య ప్రసంగము విన్నతరువాత నీ వదనము ప్రఫుల్ల వికసిత పుష్పము అవుతుంది.

ఉక్తి ఆకాశములోని మెఱుపు. శక్తిహాస్యము ఏ హృదయంలో జొర బడ్డ తేజస్సు.

## అపహసిత మూలకము - అభిభాషణ మూలకము :

*అపహసిత మూలకము–అంతర్విభాగాలు :* ఈ అర్థాశ్రయహాస్యము శక్తిమూలమూ, ఉక్తిమూలమూ అను రెండువిధములని గుర్తించి వాటి లక్షణములేమిటో తెలుసుకొన్నాము. ఈ శక్తిమూల హాస్యము మరల అపహసితమూలకమనీ, అభిభాషణ మూలకమనీ రెండువిధాలు. అప హసితమూలక హాస్యము ప్రధానంగా వెక్కిరింతకు వేళాకోళానికి సంబంధించిన భావములచేత అభివ్యాప్తమై ఉంటుంది. ఈ అపహాస్యము వింతవింత నడకలలో భాసిస్తుంది. ఒక్కొక్కనడక ఒక్కొక్కరకము చమత్కారాన్ని అభివ్యక్తం చేస్తుంది. అపహసితమూలక హాస్యాన్ని అయిదు రకాలుగా విభజించవచ్చు. 1. అపహాస్యము. 2. అధిక్షేపము. 3. అవలగితము. 4. అహోపురుషికము. 5. అవక్షిప్తము అని. వీటి అన్నిటిలోనూ ఒకసంస్థనో, ఆచారాన్నో సంప్రదాయాన్నో వేళాకోళము చేయడము ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఆకార వేషభాషలనుకూడా వేళాకోళము చేయడము ఉండవచ్చు. వేళాకోళముచేయడంలో ఇవన్నీ రమణీయమైనమార్గాలే. అధిక్షేపము, అవలగితము మొదలైనవి హాస్య సాధన ప్రక్రియలలో ప్రసిద్ధిచెందినవి. ఇక ఒక్కొక్కదాన్నీ పరామ ర్శిద్దాము.

## అపహాస్యము (Mockery )

*మదాంధకారము మది మాసెనొకో:* ఒకరిని వెక్కిరించడంలోనూ వేళాకోళం చేయడంలోనూ కొంతహాస్యము, చమత్కారము లేక పోలేదు. ఈ వెక్కిరించడంలో అనేక ప్రకరణాలు ఉన్నవి. ఒకవ్యక్తిని గాని సంస్థనుగాని నీచోపములచే అవహేళన చేయవచ్చు. భారతంలో

ద్రుపద పరాభవ ఘట్టంలో ద్రోణుడు ద్రుపదుణ్ణి వెక్కిరించిన తీరు చూడండి. "వీరెవరయ్య ద్రుపదమహారాజులె! ఇట్లు కృపణులయి పట్టువడన్ వీరికి వలసెనే, ఇపుడుమహా రాజ్యమదాంధకారమది వాసెనొకో!'' ఇది చాలా వాచ్యంగానూ, వ్యక్తిగతంగానూ, మోటుగానూ ఉంది. మహారాజు పట్టుపడ్డారే! మహారాజ్య మదాంధకారము అణిగిందా? అనడములో ద్వేషం ప్రదర్శితమవుతున్నది. వెక్కిరించడంలోకూడా నాజూకుతనం ఉంటేనే అది ఉత్తమహాస్యం క్రిందికివస్తుంది. ఇది మోటుగానూ, బండగానూ ఉంది. ద్రోణుడు కోపాన్ని ద్వేషాన్ని వెడలగ్రక్కాడు. ద్వేషంలోనుంచి ఉత్తమహాస్యంరాదు.

*చక్కనిదే దొప్పచెవులూ దోనెకడుపు*: వాచ్యంగాఉన్నా ఇదికాస్త నయం. మరదలు వదినను వెక్కిరిస్తున్నది. "మావదిన చక్కనిదికాకేం! నూతన తింత్రిణీదళములవంటి నేత్రాలూ, దొప్పచెవులూ, దోనెకడుపూనూ! ఆమె చక్కనిదికాకేమి? రంభలాగ నడుస్తుంది కళ్ళెగరేస్తూ. ఎత్తెత్తి అడుగులువేస్తూ చీరకుదుళ్లు జీరాడిస్తూనూ!'' ఈవెక్కిరింతలో నాజూకైన పద్ధతులూ ఉన్నవి. ఒకగృహస్థు ఇంటికి అతిథివచ్చాడు. ఆయన వెడతానని లేవడముతోనే ఆ గృహస్థుగూడాలేచి గుమ్మందాకా సాగనంపి వచ్చాడు ఆయనను. వచ్చేసరికి ఆయన బావమరిది అక్కగారితో చేరి ఎందుకో విపరీతంగా నవ్వుతున్నాడు. వాడు ఎందుకు నవ్వుతున్నదీ ఆయనకు అర్థంకాలేదు. చివరకు ఆమే అడిగింది. "ఆ వచ్చిన ఆయనను వీధి గుమ్మందాకా పంపించివచ్చారు ఎందుకండీ"అని. ఆయన బావమరిది అన్నాడూ, "ఎవరైనా ఇంటికివస్తే వాళ్లను ఆహ్వానించడంకంటే సాగనంపడమే బావకు ఇష్టమైనపని. గేటుదాకానేకాదు వీధి మలుపుదాకా పంపించివస్తాడు అవసరమైతే"అని. బావగారిలో ఉండే దౌర్బల్యాన్ని బహుసుందరము, చమత్కారము అయినపద్ధతిలో వెక్కిరించాడు బావమరిది.

*శ్రీనాథుని వెక్కిరింపులు* : శ్రీనాథుని చాటువులలో అరవపిల్లను వెక్కిరించడము ఒకటి ఉన్నది. "మేతగరిపిల్ల, జోరునమేకపిల్ల పారు బోతుతనంబున పందిపిల్ల ఎల్లపనులను చెరుపంగ పిల్లిపిల్ల అందమున కోతిపిల్ల యీ అరవపిల్ల"అని. ఇది కేవలము వినోదముకోసము చేసిన పని. ఈర్ష్యాద్వేషాదుల్లో పుట్టినదికాదు. నవ్వి నవ్వించడమే కవిఉద్దేశం. అందుచేత ఈ వెక్కిరింపు ఉత్తమహాస్యమే అయింది. వెక్కిరించడం అంటూవస్తే దేనినైనా వెక్కిరించవచ్చు. అయితే ఆ వెక్కిరింపుకు ఆ రకమైన దాంట్లో ఏదో వైపరీత్యం, వైచిత్ర్యం ఉండవలె. ఏదో ఒక క్రొత్తదనము అసామాన్యమైన సంగతి లేకపోతే వెక్కిరింపుకు అవ కాశం ఉండదు. అందుకనే శ్రీనాథుడు హేళన చేశాడు పలనాటి పురో హితుల ఇండ్లను.

"దోసెడుకొంపలోఁ బసులత్రొక్కిడి మంచము దూడరేణమున్
బాసినవంటకంబు పసిబాలురశౌచము విస్తరాకులున్
మాసినగుడ్డలున్ దలకుమాసినముండలు వంటకుండలున్
రాసెడుకట్టెలుం దలఁపరాదు పురోహితులింటికృత్యముల్."

అనే పద్యములో వెక్కిరింపు ఉంది.

*దాసువారి వెక్కిరింపు* : దాసు శ్రీరాములుగారు వైదికఛాందసుల చేష్టలను సున్నితమైన హాస్యధోరణిలో వెక్కిరించారు.

"లేవరు లెండు లెండనిన, లేచినవారయినన్ తటాలునన్
బోవరు, పోవుచున్నిలిచి పోదుము పోదుము త్రోయకుడటంచు
ఈవరుసన్ గృహస్థు నలయింతురు పెండిలిలో సదస్య
సంభావననాడు చూడవలె బాపనసాముల సాములన్నియున్."

ఈ వెక్కిరించడం అర్థాశ్రయ హాస్యసాధనలో ఒక పద్ధతి అని చెబుతున్నాను. అంతేగాని యీ పద్ధతిని అనుసరించి, ఉత్తమ హాస్యము

సర్వత్రా సాధ్యము అనడము లేదు. వెక్కిరింతలూ వేళాకోళాలూ యీవిధంగా నడుస్తవి. సాహిత్యంలోనుంచి జానపదులు చెప్పుకొనే కథలలోనుంచి ఇంకా ఎన్నో ఉదాహరణలు ఇవ్వవచ్చు ఈ హాస్యప్రక్రియ స్వరూపాన్ని చూపడానికి. ఒకటి రెండు ఉదాహరణలు ఇవ్వడము సాధ్యము కాని, వేళాకోళం నడిచిన ఘట్టాలన్నీ ఇక్కడ ఉదాహరించడం సాధ్యంకాదు.

*మా వదినెలు కోతులు :* సాధారణంగా మన ఇళ్ళలో బావా మరదుల మధ్య, భార్యాభర్తల మధ్య, ఈమోస్తరు వేళాకోళాలు జరుగుతునే ఉంటవి. కొన్ని మోటుగా ఉంటవి. భార్యాభర్తలు జంతు ప్రదర్శనశాలకు వెళ్లారు. మర్కటసమూహాన్ని చూస్తున్నారు. భర్త "ఈ కోతులను చూస్తుంటే, మా వదినలు, మరదళ్లు జ్ఞాపకం వస్తున్నారు. అయితే తోక లేదు మీ అక్కచెల్లెండ్రకు. అది ఒక్కటే లోపం" అన్నాడు. "మా వదినలకూ, మరదళ్ళకూ ఆ లోపంకూడా లేదండీ" అన్నది భార్య. ఈ కథలో భార్యాభర్తలు ఒకరినొకరు వేళాకోళం ఆడుకొన్నారు. అసభ్యంగాలేదు. ఆమె అన్నమాట ధ్వని సమన్వితంగా ఉంది.

*వాక్యార్థాన్ని ఆశ్రయించుకొని ఉన్న హాస్యము :* ఈ వేళాకోళాలలోనూ, వెక్కిరింతలలోనూ శబ్దాడంబరం లేదు. ఇక్కడ చమత్కృతి శబ్దాశ్రయం కాదు. శబ్దముల కూర్పులో ఉన్న వైచిత్రిని, వికృతిని ఆశ్రయించుకొని లేదు ఇందలి హాస్యము కాబట్టి ఇది శబ్దాశ్రయ హాస్యము కాదు. భావంలోనూ వికృతి లేదు లేనిపరిస్థితిని ఉన్నట్లు ఊహించడము కాదు ఇది. అసహజత్వమూ కాదు ఈ రకము హాస్యానికి మూలం. భావనాశక్తి వింతమార్గాలలో పోవడంకాదు ఇది. కాన ఇది భావాశ్రయంకాదు. ఈ హాస్యం వాక్యార్థాన్ని ఆశ్రయించుకొని ఉన్నదని గుర్తించవలె.

*రసవంతమైన వెక్కిరింపు :* ఈ వెక్కిరింపు హాస్యజనకమే. కాని ఈ వెక్కిరింపు మాటలు నిర్మలహృదయంతో అన్నప్పుడూ ద్వేషం,

అసూయ, క్రోధం మొదలైన భావవికారములచేత కలుషితంకానప్పుడూ ఆ హాస్యం ప్రతిభావంతమైన చమత్కృతిగా భాసిస్తుంది. తదన్యమై నపుడు అది జుగుప్సాకరమై ఏహ్యమై చమత్కారాభాస అవుతుంది. అకలుషితమైనదీ, అమాయికమైనదీ అయి, మేధాసంజనితమై ప్రతిభా వంతమై, రమణీయశబ్ద ప్రతిపాదకమై హృదయానందదాయి, అయిన వెక్కిరింపుగాని, వేళాకోళముగాని కావ్యగౌరవమును పొంది సహృద యులు ఆస్వాదింపతగిన రస గుళిక అవుతుంది. లేనిచో పేలవమై నిర సింపదగినది అవుతుంది వ్యంగ్యార్థమును స్ఫురింపజేసే హాస్యవుపలుకే శుద్ధ చమత్కారంగా భాసిస్తుంది. తదన్యము దానికి ఆభాసరూపము.

*లోభివాని నడుగ లాభంబు లేదయా :* ఈ వెక్కిరింపు లేక వేళా కోళము ఇతర హాస్యప్రక్రియలోకూడా గుప్తంగా భాసిస్తూ ఉంటుంది. వేమన లోభివాని స్వభావాన్ని పరమ రమణీయమైన పద్ధతిలో హేళన చేశాడు. "గొడ్డుటావును బితుక గుండ గొంపోయిన పండ్లు రాలదన్ను పాలనీదు, లోభివాని నడుగ లాభంబులేదయా విశ్వదాభిరామ వినుర వేమ" ఇట్లాంటిదే ఇంకొకటుంది.

"మేక కుతుకబట్టి మెడచన్ను గుడువగా ।
ఆకలేల మాను ఆశగాక ।
లోభివాని నడుగ లాభంబులేదయా ।
విశ్వదాభిరామ వినురవేమ."

ఒకడు తన మిత్రునికి ఒక ఇల్లుచూపి "ఇది పరమయోగ్యమైన ఇల్లు. దీనిని నీవు అద్దెకు తీసుకో" అంటాడు ఆ మిత్రుడు అంటాడూ "ఈ ఇంటికిగల ప్రాముఖ్యము ఏమిటీ ? దీనికి ఉన్న ప్రత్యేక సౌకర్యాలు ఏమిటీ?" అని. అతడంటాడూ "ఈ ఇంటికి ఎటుచూచినా రెండుమైళ్ళ లోపున లాయరు అన్నవాడు లేడు. అందుకని ఈ ఇల్లు నీకు అన్నివిధాలా అనుకూలమైనది" అని. లాయరు అందికలో ఉండే మనలను ఎందుకో

ఒకందుకు కోర్టు వ్యవహారాలలో ఇరికించి కోర్టులచుట్టూ త్రిప్పుతాడు అని న్యాయవాదుల వృత్తినిగురించి హేళన చేశాడని గుర్తించాలి.

*జైలుకు వెడతాను బందరు రాను:* ఒకసారి మా శివశంకరస్వామి వారిని బందరు రావలసిందనీ, మా ఇంట్లో అతిథిగా ఒక వారంరోజులు ఉండవలసిందని కోరాను. ఆయన రావడానికి అంత ఇష్టపడలేదు. చివరకు ఆయన అన్నాడూ "నేనెట్లాగూ జైలు కువెడుతున్నానుగా, బందరు రాకపోతేనేం?" అని. బందరులో ఉండడము జైలులో ఉండడములాంటిది అన్న హేళన ధ్వనిస్తున్నది ఆయన మాటలలో. ఇల్లాగ ఈ వెక్కిరింపు సంభాషణలో ఒకప్పుడు వాచ్యంగానూ, మరొక్కప్పుడు ధ్వని నిక్షిప్తంగానూ భాసిస్తూ ఉంటుంది.

*ఆడదాని నాలుక ఆరంగుళాలు:* భావరాజువారు ఒకసారి అన్నారు ఏదో సందర్భంలో. ఆడదాని నాలుక సహజంగా నాలుగు అంగుళాలే అయినా, పెళ్ళి అయినతరువాత ఆరు అంగుళాలు పెరుగుతుందీ అని. స్త్రీయొక్క వాచాలతను బహు సున్నితంగానూ నర్మగర్భంగానూ ప్రకటించారు. వేదాంతి అంటే అందరికీ తెలిసినవిషయాన్నే ఎవ్వరికీ అర్థంగాని పద్ధతిలో చెప్పగలిగినవాడూ అన్న నిర్వచనంలోకూడా వేదాంతుల ప్రసంగధోరణిని హేళనచేయడం మనం చూడవచ్చు.

*నియోగి-వైదికి:* నియోగి అంటే తాను చేయగల పనిని ఇతరుల చేత చేయించి తానే చేసినట్లు అందరికీ తెలియజేసి రావలసిన గౌరవాన్ని అంతా తానే రాబట్టుకొనేవాడు. వైదికి అంటే తాను చేయలేని పనిని చేస్తానని ఒప్పుకొని, నెత్తినవేసుకొని, తాను చేయనూలేక, ఇతరులచేత చేయించనూలేక చివరకు అందరిచేతా చీవాట్లు తినేవాడు. ఈ నిర్వచనంలో నియోగియొక్క నిర్వహణాదక్షతను, మోసకారితనమును, వైదికియొక్క అమాయకత్వాన్ని తెలివితక్కువతనాన్ని స్ఫురింపజేసే హేళన

ఉన్నది. వెక్కిరింపు అనే హాస్యప్రక్రియయొక్క వైశిష్ట్యమూ, వాచ్యార్థ వ్యంగ్యార్థముల ద్వారా ప్రకటితమైన హాస్యప్రతీతీ గుర్తింప తగిన విషయము.

*మరికొన్ని వెక్కిరింపులు :* ఈ క్రింది పద్యంలో చేతగాని పనులనూ చేయకూడని పనులనూ, చేసేవారినందరినీ కవి హేళన చేశాడు.

"నంబి కవిత్వంబు, తంబల జోస్యంబు,
వలనొప్పు కోమటి వైష్ణవంబు
వరసనే యుప్పరివాని సన్యాసంబు
తరువాత శూద్ర సంతర్పణంబు
రజకుని గానంబు రండా ప్రభుత్వంబు
వెలయగా వెలమల వితరణంబు
సాతానిపండిత శాస్త్రవాదము, వేశ్య
తనయు డబ్బకు బెట్టు తద్దినంబు
ఉభయభ్రష్టత్వములు సుమీ ఉర్విలోన."
..............................

పాండిత్యం లేకపోయినా శాస్త్రవాదానికి దిగడమూ, తండ్రి ఎవరో తెలియని వేశ్యకుమారుడు తండ్రితద్దినం పెట్టడమూ హాస్యాస్పదమైన విషయాలు. పొత్తుకుదురని విషయాలకు పొత్తు కుదర్చడము ఇటువంటి విషయాలలో నవ్వడానికి కారణమవుతున్నది.

*అలివంకవారు ఆప్తబంధువులు :* అదీకాక ఇందులో వ్యక్తులు అవహేళనపాలు కాలేదు. అపహాస్యానికి గురియైనది సమాజములోని ఒక వర్గము కాబట్టి ఈ వెక్కిరింత జుగుప్సాకరంగా లేదు. రమణీయంగానే ఉంది. అట్లాగే మనిషికి ఉండే ఒక దౌర్బల్యాన్ని ఒక రకము మనస్తత్వాన్నికూడా వెక్కిరించవచ్చు. పెండ్లిఅయి పెళ్లాము కాపురానికి వచ్చినతరువాత భార్యవైపు బంధువులను ఆప్తులనుగా గ్రహించి తల్లి

వైపువారిని తండ్రివైపువారిని అనాదరణతో చూస్తాడు కుమారుడు. వేమన ఈ విషయాన్ని వెక్కిరింత ధోరణిలో ఈ పద్యంలో చెప్పాడు.

"ఆలివంకవారు ఆప్తబంధువులైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాదిపగవారు
విశ్వదాభిరామ వినురవేమ" అని.

*గంగిరెద్దుకులేవె ఘనతూర్యరావముల్ :* న్యాయపద్ధతిని నడువని ప్రభువును వెక్కిరిస్తూ చెప్పిన పద్యంకూడా బాగానే ఉంది. దుష్టుడైన రాజుకుకూడా పటాటోపం అంతా ఉంటుంది. పరివారము. కైవారములు అన్నీ. అది వ్యర్థంగదా! ఈ విషయాన్ని ఆలంబనగా తీసుకొని వ్రాసిన పద్యం ఇది :

"పదుగురు క్రోతివెంబడి సంచరింపరే
వాహకుల్లేరె శవంబునకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్
కలిమి గల్గదె వారకామినులకు."

ఇట్లాగే నడిచింది పద్యం. రామలింగేశ శతకంలో ఈ రకానికి చెందిన హాస్యం కావలసినంత ఉన్నది.

*నిజం నిజం. నీవన్నది నిజం :* ఇంతకూ ఒక్కో విషయము మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. ఈ అపహాస్యము వ్యక్తిగతంగా ఉన్నప్పుడు సరసంగా ఉండదు. ఈ వ్యక్తిగతమైన అపహాస్యము తిట్లలోకి దిగిన సందర్భాలుకూడా ఉన్నవి. వాటికి సాహిత్యకమైన విలువ లేదు. నవ్వు పుట్టించినా దానికి సభ్యత లేదు. అందులో రామణీయకమూ లేదు. నవ్వి అసహ్యించుకొంటాము. కాని సంఘంలో ఉన్న అనాచారము, అన్యాయము అధికారమదము, మిధ్యాభిమానము ఇటువంటి విషయాలను తీసుకొని వెక్కిరించినా, వేళాకోళము చేసినా ఎవ్వరికీ మనఃక్లేశము కలుగదు.

"నిజం నిజం నీవన్నది నిజం" అనిపిస్తుంది అటువంటి రచనలకు సాహిత్యగౌరవం ఉన్నది.

*ఎదుటివారి సొమ్ము తెల్లవారికి తీపి :* ఇల్లా సాగిపోతుంది ఈ వెక్కిరింత. మానవస్వభావాన్నీ ఆ స్వభావంలో ఉన్న వైపరీత్యాన్నీ, వేమన అనేకచోట్ల వెక్కిరించాడు. పిసినిగొట్టుతనాన్ని ముఖ్యంగా అవహేళన చేశాడు. వ్యక్తులనుగాక, సంస్థలను, దురాచారాలను అవహేళన చేస్తే వికారరహితమైన జుగుప్సాశూన్యమైన ఆనందం కలుగుతుంది. పొరుగింటి పుల్లకూర రుచి. తనకు కావలసినంత ఉన్నా ఇతరుల సొమ్ముకై ఆశించడము మానవునికి ఉన్న దౌర్బల్యాలలో ఒకటి. దానిని వేమన సరసోక్తులలో వెక్కిరించాడు.

"పాలసాగరమున పవ్వళించినవాడు
గొల్ల యిండ్ల పాలు కోరనేల
ఎదుటివారి సొమ్ము తెల్లవారికి తీపి
విశ్వదాభిరామ వినురవేమ."

అని. అట్లాగే ముక్తికై రాజమార్గము ఉండగా ప్రక్కదారులను వెతికే వారిని ఈ క్రింది పద్యంలో వెక్కిరించాడు వేమన.

"గుహలలోన జొచ్చి, గురువుల వెదుకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిమార్గ మదియె ముందుగా జూపురా
విశ్వదాభిరామ వినురవేమ."

*మిండలకొడుకుల సంపద దండుగకే:* ఇల్లాగ మానవ దౌర్బల్యాన్ని దురాచారాలను వేమన వెక్కిరించాడు. ఆ రోజులలో కవులను రాజులూ, ధనవంతులూ పోషించేవారు. ప్రభువులై యుండి కవిని ఆదరించకపోవ డము సంఘ విద్రోహచర్యగానే భావించారు. అటువంటివారిని వేమనా,

చౌడప్పాకూడా అపహాస్యంపాలు చేశారు. దానధర్మాలు చేయకపోవడం కూడా నిందార్హమైన విషయమే. అటువంటివారిని గురించి చౌడప్ప నీచంగా మాట్లాడినాడు.

"మిండల కొడుకుల సంపద
దండుగకే గాని దానధర్మములకు రా
కుండు మహీమండలమున
అఖండితయశ కుందవరపు కవిచౌడప్పా."

*మగముండలకేల మూతిని మీసం :* ఈ క్రింది పద్యంకూడా పిసిని గొటుతనాన్ని అవహేళన చేస్తున్నది.

"తగుపాటి కవుల కియ్యని
మొగముండలకేల గల్గె మూతిని మీసం
దిగగొరగడాయె మంగలి
ఖగరాడ్బల కుందవరపు కవిచౌడప్పా."

ఇల్లాగే ఈ ఇద్దరు కవులు మానవులలోని దుర్గుణాలను, దౌర్బల్యాలను హాస్యపు ధోరణిలో వెక్కిరించారు. ఒక కవి ఆ పరమశివుణ్ణే వెక్కిరించాడు.

"పూయ గంధములేదు, భూతిపూతేగాని
ఎక్క గుఱ్ఱములేదు ఎద్దెగాని
త్రాగ కంచములేదు తలపుఱ్ఱెయేగాని
కొండమీదేగాని ఉండచోటులేదు
గజచర్మమేగాని కట్టవస్త్రములేదు
జోగిరూపేగాని సొగసులేదు" అని.

*కుక్కుటమిశ్రపాదులవారు :* అయితే ఇది వెక్కిరింపు అయినా నిందకాదు దీనిని నిందాస్తుతి అంటారు. అయినా వెక్కిరింపే. మిడిమిడి

చదువులను వెక్కిరించడం కనపడుతుంది ఈ వాక్యంలో. "అయిదు దినాలలో మీమాంస శాస్త్రమును మిడికి మూడు దినాలలో వేదాంత శాస్త్రాన్ని వెలిగించి, తర్కశాస్త్రములను చూచి కుక్కుటమిశ్రపాదుల వారు దయచేసినారు." అపహాస్యము అనే ఈ హాస్యప్రక్రియలో ఎక్కిరింపు సూటిగా ఉంటుంది. (Pure and Simple) కాని నవ్వుపుట్టించు నదిగానే ఉంటుంది. వ్యంగనిష్ఠమైన చమత్కారము ఇంతకంటే మనోహరంగా ఉంటుంది. అధిక్షేపము అటువంటిదే.

*రంభయైన నేకులె వడుకున్ :* పల్నాటిసీమను శ్రీనాథుడు ఎంత చక్కగా వేళాకోళం చేశాడో చూడండి.

క॥ రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడుకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్.

*పలనాటికి మాటిమాటికి బోవనేటికి :*

ఉ॥ అంగడి యూరలేదు వరియన్నము లేదు, శుచిత్వమేమిలే
దంగన లింపులేరు ప్రియమైన వనంబులు లేవు......
......................................దాత లె
వ్వ్వంగను సున్న గాన పలనాటికి మాటికి బోవనేటికిన్.

అన్న పద్యంలోకూడ శ్రీనాథుడు పలనాటిని వేళాకోళం చేశాడు. ఈ విధంగా వెక్కిరింపులూ, వేళాకోళాలూ కూడా బహు రమణీయమైన పద్ధతిలో నడుపవచ్చునని తోస్తుంది. ఈ పద్యాలలో చమత్కారం ఎక్కువగానే ఉన్నది. చమత్కారానికీ హాస్యానికీ భేదం ఉన్నది. ఆ విషయాన్ని గురించి ముందు ప్రకరణాలలో వ్రాస్తాను. అయితే ఇవి ఎందుకు ఉదహరించానంటే ఇందులో వెక్కిరింతా వేళాకోళమూ ఉన్నది కాబట్టీ, ఈ ప్రకరణలో ఆ విషయాన్ని గురించి చెప్పవలె కాబట్టీ! ఒక రచన

చమత్కారభాసితమా, హాస్యవిభూషితమా అన్న సంగతి నిరూపణ చేయడము కష్టము. ప్రస్తుతం దీనిని హాస్యాశ్రితమైన రచనగానే స్వీకరిద్దాము. కల్పవృక్షము కేవలము కుసుమాలూ, ఫలాలు ఉన్నంతమాత్రాన మనోహరము కాక, అది మేరువును ఆశ్రయించి ఉంటేనే మనోహరమైనట్లు హాస్యము చమత్కారాన్ని ఆశ్రయించి ఉంటేనే చారుత్వాలంకార సౌందర్యముతో భాసిస్తుంది.

అధిక్షేపము (Satire) :

*అవగుణాలను మెచ్చుకొనడము అధిక్షేపము :* అధిక్షేపము అన్న ఈ హాస్య ప్రక్రియ వలన శక్తిమూలహాస్యాన్ని సాధించవచ్చు. శక్తిమూలహాస్యమును సాధింపదగిన ప్రకరణాలలో ఈ అధిక్షేపము ఒకటి. ఇదికూడా వెక్కిరింతే. వేళాకోళమే. "The Satirist holds his subject up to redicule by suggesting praise of his faults and weaknesses" అన్నాడు. ఇల్లాగ అవహేళన చేయడము సూటిగా నుండక ఏ పిల్లి మీదనో, కుక్కమీదనో పెట్టి చేస్తే అది రమణీయమైన హాస్యం ఆవడానికి కొంత అవకాశము ఉన్నది. ఒక సంస్థను గాని ఒక విధానాన్నిగాని ఒక సంప్రదాయాన్ని గాని హేళన చేస్తే ఎవరి మనస్సుకూ కష్టం కలుగకుండా అధిక్షేప వ్యాపారము జరిగిపోతుంది. మహమ్మద్-బిన్-తొగ్లక్ అనేక పిచ్చిపనులు చేశాడు. అతని దుష్టపాలనకు ఫలితంగా అనేక గ్రామాలు పాడుబడ్డవి. ఈ విషయము ఏవిధంగా అధిక్షేపవ్యాపారానికి గురి అయిందో చూడండి.

*గుడ్లగూబల కథ :* రెండు గుడ్లగూబలు ఒక పాడుబడిన గుడిలో కూర్చుని మాట్లాడుకొంటున్నవి. ఆ రెండూ వియ్యం పొందాలని ఆలోచిస్తున్నవి. ఒక గుడ్లగూబ అన్నది: "నీ కుమార్తెను నా కుమారునికిచ్చి వివాహం చేయడము నాకు ఇష్టమే. కాని నీవు నాకు ఏడు పాడుబడిన గ్రామాలు అరణంగా ఇవ్వవలసి ఉంటుంది, అని. ఈ మాటమీద రెండో

గుడ్లగూబ "దానికేం తొగ్లక్ ప్రభువు ఇంకా నాలుగు కాలాలపాటు రాజ్యం చెయ్యాలె గాని పాడుబడ్డ గ్రామాలకు ఏం తక్కువ" అన్నది. ఈ కథ తొగ్లక్ పరిపాలనపై అధిక్షేపణము అని తెలుస్తూనే ఉంది. ఇందులో అధిక్షేపము వ్యంగ్య నిక్షిప్తము కాక వాచ్యంగా ఉంది. ఈ వ్యాపారాన్ని వ్యంగ్యనిష్ఠము చేస్తే మనోహరమైంది అవుతుంది.

*గలివరు కథ :* ఇది చూడండి గర్విష్ఠికి తన తోడివారంతా అల్పులులాగా కనిపిస్తారు. అతని దృష్టికి ఔన్నత్యము వస్తుంది. మనస్సులో అతడు తాటిచెట్టంత పెరుగుతాడు. ఆ ఎత్తునుంచిచూస్తే అతనికి మానవులంతా పురుగుల్లాగ అంగుష్ఠమాత్రులులాగ కనిపిస్తారు. ఈ భావాన్ని ఆలంబనగా తీసికొని 'స్విఫ్టు' అనే ఆంగ్ల రచయిత గలివరు యాత్రలు అనే గ్రంథం వ్రాశాడు. గలివరు ఒక నావికుడు. అతనికి సముద్రయానం అంటే ఇష్టం. అనేక ప్రయాణాలు చేశాడు. ఒకసారి ఆయన ఒక దీవిని చేరుతాడు. ఆ దీవిలో ఉండే మనుష్యులకు గలివర్ ఒక అంగుష్ఠమాత్రుడులాగ కనిపిస్తాడు. వాళ్ళు ఈయనను అరచేతిలో పెట్టుకొని పరీక్షించి మనుష్యరూపంలో ఉన్న వింత ప్రాణిగా భావిస్తారు. ఆయనను ఒక ఆటవస్తువుగా వాడుకొంటారు.

*తోడేలు—గొర్రెపిల్ల కథ :* గర్వమూ, స్వాతిశయమూ ఉన్న మనిషి యొక్క దృష్టి ఎల్లాగ మారుతుందో, అతనికి ఇతరులను గురించి, ఎంత తక్కువ భావం ఉంటుందో ఈ విషయము అంతా ఈ కథలో ధ్వని రూపంలో నిక్షిప్తమై ఉన్నట్లు మనకు స్ఫురిస్తుంది. తోడేలు-గొర్రెపిల్ల కథ అందరికీ తెలిసిందే. దుష్టుని ప్రవర్తన అల్లాగ ఉంటుంది. దుష్టుని మానసిక ప్రవృత్తిని అధిక్షేపించడమే ఆ కథయొక్క ప్రయోజనము. మనిషి ఉన్నదానితో తృప్తిపడడు. సహజంగానే ఏదో అసంతృప్తి అతనికి ఉంటుంది. ఏదో విధంగా ధనం లభిస్తే బాగుండునని మనిషి కోరుతూ ఉంటాడు. ఆ ధనంతో ఏమేమో చేయాలని ఊహిస్తుంటాడు.

దానినే గాలిలో మేడలు కట్టడం అంటారు. పగటి కలలు, కన్న గొల్ల పడుచు కథలో ఈ మానవ దౌర్బల్యాన్ని అవహేళన చేయడం కన పడుతుంది.

*శుక్లపక్షము* : ఈ అవహేళన ఒక వ్యక్తిపరంగా చేయవచ్చు. వ్యక్తిపరమైనది అంతరమణీయంకాదు. అట్లాకాక ఏసంస్థనో సమాజాన్నో మూఢఆచారాన్నో అవహేళనచేస్తే అది ఎవ్వరికి నొప్పిగలుగ జేయక రమణీయంగా ఉంటుంది. అనంతపంతులు రామలింగస్వామిగారు వ్రాసిన శుక్లపక్షము తెలుగులో అధిక్షేపకావ్యంగా పరిగణింపబడు తున్నది.

*మహయాళ దేశయాత్ర* : కందుకూరి వీరేశలింగం పంతులుగారు వ్రాసిన సత్యరాజా పూర్వదేశయాత్రలు, మరొకసొగసైన అధిక్షేప కావ్యము. మన సమాజంలో స్త్రీకి తగినంతగౌరవం ఇవ్వడంలేదనీ, వాళ్లకు చదువులేకుండా చేశామనీ, వాళ్లను బానిసలవలె చూస్తున్నామనీ ఆయన భావించి ఆవిషయము మనకు తెలిసిరావడానికి ఆకథ కల్పించారు.

*భార్యావస్తే, భర్త లేచినుంచోవాలె* : ఆ కథలో పురుషులే స్త్రీలు చేసే పనులన్నీ చేస్తున్నట్లు చిత్రించారు. స్త్రీయే ఇంటికియజమానురాలు. ఆమెకు భర్త లొంగిఉండవలె. భార్య భోజనంచేసిన తరువాత, ఆ ఎంగిలి విస్తరిలో భర్త భోజనం చేయవలె. భార్యకు భోజనానంతరం తమల పాకులుఇచ్చి ఆమె పడుకొన్నతరువాత కాళ్ళొత్తి నిద్రపుచ్చి, అప్పుడు తాను భోజనం చేయవలె. భార్య ఇంటికివస్తే భర్తలేచి నిలువబడి సిగ్గు పడుతూ తలుపుచాటుకు పోవలె. భార్య స్నేహితురాండ్రు ఎవరైనా వస్తే భర్తవాళ్ళ కంటపడకుండా గదిలోకివెళ్లి తలుపు వేసుకోవలె.

*సాంఘికఆచారాలను అధిక్షేపించారు* : ఈరకముగా వ్రాసుక పోయి నారు. మన సాంఘికఆచారాలనూ, స్త్రీకి తగినంత గౌరవములేని సాంసా

రికజీవితమునూ ఆయన అవహేళన చేశారు. సంఘసంస్కరణోద్దేశంతో చేసిన హేళనఅది. ఈ పుస్తకంలో వినోదానికి వినోదమూ ఉంది, విజ్ఞానానికి విజ్ఞానమూఉంది. ఎవ్వరిమనస్సునూ కష్టపెట్టదు. ఇది ఉత్తమమైన అధిక్షేపకావ్యము. స్త్రీని మనము ఆదరణతోనూ, ప్రేమతోనూ, గౌరవంతోనూ చూడలేదనీ నీచంగా చూస్తున్నామనీ చెప్పదలిచినారు వీరేశలింగంగారు. ఇప్పుడు స్త్రీని మనము చూచినవిధంగానే పురుషునికి పరామర్శ జరిగితే అందులోఉండే అన్యాయము పురుషులకు బాగాతెలిసి వస్తుందనే ఉద్దేశంతో ఆ మళయాళదేశంలో పురుషుల విధులన్నీ చెప్పారు ఆ పద్యాలలో...

*భర్తవిధులు :* సత్యరాజు పూర్వదేశయాత్రలో మళయాళదేశంలో ఉన్న కొన్నిఆచారాలను ఈ క్రిందివిధంగా వివరించినపుడు విరగబడి నవ్వుతాము.

"పురుషునకిమ్మహి బత్నియె
పరమంబగు దైవతంబు పత్నీ సేవన్
నిరతముచేసెడిపురుషుడె
పరమున నిహమున సుఖంబు బడయుంజుమ్మీ."

"ప్రతిదినంబును పురుషుండు పత్నికంటె
ముందుగాలేచి నదిలోనమునిగి జలము
కలశమునదెచ్చి నిజపత్ని కాళ్లగడిగి
తాను శ్రీపాదతీర్థంబు త్రాగవలయు."

"స్త్రీపాద తీర్థసేవన
మేపురుషుడు చేయునెన్నియేడులు ధరలో
నాపురుషుడన్నియుగములు
పాపములంబాసి మోక్షపదవి సుఖించున్."

"కుష్ఠురోగిణియైనను గ్రుడ్డియైన
భూరివికలాంగియైనను ముసలిదైన
బత్నియెంగిలి భుజియింపవలయు సతము
పుణ్యలోకంబు గాంక్షించు పురుషవరుడు."

"ఏ పురుషు డతివ యెంగిలి
పాపపుమతి నేవగించి, భక్షింపండో
యా పాపాత్ముడు నారక
కూపంబున గూలుజూవె, కోటియుగంబుల్."

"దూరమునజూచి పత్నిని
గౌరవమునలేచి, ఒంటికాలున పురుషుం
డోరగ వంగగవలయును
కూరిమిగూర్చుండ, నిల్వగూడదుసుమ్మీ."

"పురుషుండును గార్ధభమున్
స్థిరముగ దండనములేక, చెడిపోదురిలన్
కరుణదలంపక నెలకొక
పరియైనన్ గొట్టవలయుపత్ని పురుషునిన్."

"పత్నిగొట్టిన తిట్టిన బాధయిడిన
భోగపురుషుల బొందిన, పొందకీర్ష్య
తరుణియే పురుషునకును దైవమనుచు
భక్తినయంబు, సేవింపవలయుజుమ్మ."

"అతివలకు స్వేచ్ఛ భూషణమైనయట్లు
పురుషులకులజ్జయే, మహాభూషణంబు
సూర్యచంద్రులమొగమైన జూడకుండు
పరమపత్నీవ్రతుడె పొందు పరమగతులు."

*పటీరావుకథలు :* పటీరావు కథలలో బహురమణీయమైన అధిక్షేపము ధ్వని నిక్షిప్తమై ఉన్నది. సత్యరాజా పూర్వదేశయాత్రలలో పురుషుని అహంకారము ఆడదాన్ని అణచిఉంచడము మొదలైన విషయాలను అవహేళనచేస్తే పటీరావుకథలలో మిడిమిడిచదువులు చదివిన ఆధునికస్త్రీలలో ఉండే అహంభావాన్ని సత్సంప్రదాయ వైముఖ్యమునూ, అనుపూర్విక సదాచారనిరసననూ మనకూ మనసంస్కృతికి విరుద్ధమైన ఆంగ్లసాంఘిక విపరీతమర్యాదలయందు అనురక్తినీ హేళనచేస్తూ పరమరమణీయమైన అధిక్షేపాత్మకమైన హాస్యమును సృష్టించారు దీక్షితులుగారు.

*ఎత్తిపొడుపు-ఐరనీ-సెటైర్ :* ఎత్తిపొడుపు, ఐరనీ, సెటైర్ లేక అధిక్షేపము అనబడే ఈమూడు హాస్యప్రక్రియలు ఒకదానికొకటి అతి సన్నిహితంగా ఉంటవి. ఏదైనా ఒకరచనను తీసుకొని అది ఏరకము హాస్యప్రక్రియయో నిర్ణయించడం కొంచెంకష్టం. ఐరనీకున్న లక్షణాలు కొన్ని సెటైర్‌కు ఉంటవి. ధోరణిలోఉన్న కొద్దిభేదాన్నిబట్టి నిర్ణయం జరగాలె. ఈ ఎత్తిపొడుపు బొత్తిగా వ్యక్తిగతంగానూ, వాచ్యంగానూ ఉంటుంది. హాస్యము అంతగాఉండదు. ఐరనీలో సుకుమారమైనా పరమ రమణీయమైనా హాస్యము ఉంటుంది. ఐరనీయే మరొకధోరణిలో నడిస్తే సెటైర్ అవుతుంది.

*చుట్ట త్రాగేవాడికి వంకాయకూర రుచి తెలియదు :* చుట్టత్రాగే అలవాటు తీసుకొందాం. దానిని ఈమూడు మూసలలోనూ పోస్తే ఒక్కొక్క దానికి ఎల్లాంటి రూపం వస్తుందో చూద్దాం. మిత్రులంతా కలిసి భోజనం చేస్తున్నారు. వంకాయకూర బాగుందని చుట్ట త్రాగేఆయన అన్నాడు: ఆ తరువాత సంభాషణ ఈ విధంగా జరిగింది : చుట్ట త్రాగనివాడు :- "ఏమి బాగుందయ్యా! నా నోటికి ఏమీ రుచిగాలేదే!" అన్నాడు. "లేదూ! నీకు రుచి అంటే ఏమిటో తెలియదు. గోంగూరపచ్చడి తినేవాళ్ళకు

వంకాయకూర సంగతి ఏం తెలుస్తుంది?" అన్నాడు చుట్టత్రాగే ఆయన. "అదేమిటయ్యా! రుచి తెలియకపోవడానికి మా నాలుక నిరంతర ధూమ తాడితమై మొద్దుపారిపోలేదుగా?" అని చుట్టవిరోధి అన్నాడు.

ఈ సంభాషణలో మిత్రులు ఒకరినొకరు ఎత్తిపొడుపు మాటలు అనుకొన్నారు. అయితే హాస్యం ఏముందీ? నవ్వడానికి చక్కిలిగింత పెట్టే గుణం ఏముంది? హాస్యవిభాగాలలో దీనిని చేర్చాలి కాబట్టి చేర్చాను. ఎందుకంటే ఇది అధిక్షేప హాస్యములో ఒకరకము కాబట్టి. ఈ రకమునకు చెందిన రమణీయమైన హాస్యప్రవచనము నాకు దొరకలేదు కాని, ఈ పద్ధతిలోగూడ సుందరమైన హాస్యము ఎక్కడైనా ఉండవచ్చు నాకు తెలియనిచోట. రెండోది ఈ పద్ధతిలో బాగా నవ్వు పుట్టించే రచనలు ముందుముందు రావచ్చు.

*పొట్టిచుట్ట త్రాగేవాడికి ఉద్యోగం ఇవ్వరు:* తరువాత ఈ విషయాన్నే ఈ క్రిందివిధంగా వ్రాస్తే ఐరనీ అవుతుంది. ఏమనీ: "చుట్ట త్రాగడం తప్పుకాదయ్యా. ప్రతివాడూ త్రాగాలి. చుట్ట త్రాగనివాడికి జీవితమాధుర్యం ఏమి తెలిసినట్లు! గొప్పవాళ్ళు చర్చిల్, కృశ్చేవ్, కృష్ణశాస్త్రిలాంటివాళ్ళు చుట్ట త్రాగుతారని మనకు తెలుసు. కవులంతా త్రాగుతారు. చుట్ట త్రాగితేనే కవిత్వం చెప్పగలుగుతారు." ఇదీ ఐరనీ. రెండవది సెటైర్. ఒక దేశం ఉన్నది. అక్కడ చుట్ట త్రాగడం సదాచారం. ఆ దేశంలో చుట్ట త్రాగనివాడిని నీచంగా చూస్తారు. ఒకడు త్రాగే చుట్ట లావును, పొడవునుబట్టి, అతనికి సంఘంలో గౌరవస్థానం లభిస్తుంది. ఏదైనా టీపార్టీ జరిగినపుడు, చుట్ట పొడవుబట్టి, అతడు కూర్చోవలసిన స్థానాన్ని నిర్ణయిస్తారు. పొట్టిచుట్ట కాల్చేవాణ్ణి దూరంగా కూర్చోబెడతారు.

*జీతం చుట్టల రూపంలో ఇస్తారు:* ఉద్యోగానికి దరఖాస్తు పెడితే నీవేం చదువుకొన్నావు అని అడగరు. నీవు గంటకు ఎన్ని చుట్టలు కాల్చ

గలవు? నీ చుట్ట పొడవెంత? లావెంత? చుట్ట కాలుస్తూ వ్రాయగలవా? చుట్టను నోట్లోనుంచి తీయకుండా మాట్లాడగలవా? నీవు స్నేహితులకు ఎన్నిచుట్టలు బహుమతిగా ఇవ్వగలవు? మొదలైన విషయాలు అడుగుతారు. జీతంకూడా కొంత రొఖ్ఖమూ, కొంత చుట్టలరూపంలోనూ ఇస్తారు. అన్నం తినకుండా చుట్టలుత్రాగి ఎన్నాళ్లు ఉండగలవనికూడా అడుగుతారు చుట్టలు త్రాగడంవల్ల కేన్సర్ మొదలైన జబ్బులు వస్తవని ఆ దేశ వాసులకు తెలుసు. అందుకనే వారు ఆ జబ్బులు వచ్చినవాళ్ళను ఎక్కువగా గౌరవిస్తారు. పొగ లోపలికిపోయి ఊపిరితిత్తులు చెడిపోయినవారికే ప్రమోషను ఇవ్వడము: "వాడికి కేన్సర్‌వ్యాధి రాలేదు. ఊపిరితిత్తులైనా చెడిపోలేదు. వాడికి ప్రమోషన్ ఎట్లా ఇస్తామండీ?" అంటారు అధికారులు.

*హాస్యం బంగారం లాంటిది:* ఈ ధోరణిలో వ్రాయబడిన రచన సెటైర్ అయింది. కాబట్టి ఈ మూడు హాస్యప్రక్రియలూ, బహు సన్నిహిత, బాంధవ్యమును గలిగి యున్నవి. ఇంతకూ హాస్యము కరిగిన బంగారము వంటిది. ఏ రకం దిమ్మెలో పోస్తే ఆ రకం వస్తువు తయారు అవుతుంది. బంగారాన్ని చిన్న చిన్న రేకులుగా కొట్టి చంద్రహారంగా కూర్చుకోవచ్చు. పల్చని కడ్డీలుగా పోసి గాజులు చేయించుకోవచ్చు. సన్నని తీగగా తీసి, నాను చేయించుకోవచ్చు. అట్లాగే హాస్యము ఒక రూపంలో వేళాకోళము, ఇంకొక రూపంలో ఐరనీ, మరో రూపంలో అధిక్షేపమూ, (Satire) అవుతుంది. రూపంలో మార్పేగాని, బంగారము బంగారమే. రచయిత ప్రతిభావిశేషాలనుబట్టి, అతని భావనాశక్తినిబట్టి హాస్యం అనేక రూపాలు పొందుతూ ఉంటుంది.

*పరస్పరం మెచ్చుకోవడము:* అధిక్షేపములో హేళన ఉంది గాని ఆ హేళన సూటిగా ఉండదు. అపహసితములోలాగ ఒక ఉదంతముచెప్పి తద్వారా ఈ హేళన వ్యాపారాన్ని సాధిస్తాడు కథకుడు అధిక్షేపంలో.

ఒక సమాజంలో లేక సమితిలోని సభ్యులు ఒకరిని ఒకరు మెచ్చు కొంటారు. అదీ గర్హ్యమే. అంతకంటే గర్హ్యమైన విషయము మరొక టుంది. అది అధికారంలో ఉన్నవానిని క్రింది ఉద్యోగులూ, ధనవంతుని ఆతని ఆశ్రితులూ, ప్రభువును సేవకులూ,ముఖంఎదుట మెచ్చుకోవడము. అది అంతఃకరణ శుద్ధిగా మెచ్చుకొనడముకాదు. పైవారి అనుగ్రహం సంపాదించుకోవడానికి అల్లాచేస్తారు. అదినీచమైనపని. ఈనైచ్యాన్ని హేళనచేస్తూ పుల్లకవి అనేఆయన ఒకపద్యం వ్రాశాడు. ఆ కవి పైవారిని క్రిందివారు మెచ్చుకొనే ఆచారాన్ని బహురమణీయమైన పద్ధతిలో వెక్కి రించాడు. ఆపద్యం జాగ్రత్తగా చదివితే ఆ వెక్కిరింపు ఎంతమనోహ రంగాఉందో తెలుస్తుంది. ఆ పద్యం ఇది.

సీ. కోణంగి నాట్యముల్ క్రోతులాడించగా
నూర బందులు సభ నున్నయట్లు
గూబకూతలు విని గువ్వలు తలలూచి
పోయి కాకులయొద్ద పొగడినట్లు
కాలువ దరినుండి కప్ప లంకించగా
నెండ్రకాయలు తలలెత్తినట్లు
ఎనుబోతు బిరుదులు మనుబోతు పొగడంగ
మేలుమేలని గొఱ్ఱె మెచ్చినట్లు
గీ. ఓగుదగిడీలు తమలోన నొకరినొకరు
మెచ్చుకొనుచుందు రెటువంటి పిచ్చితనమొ
మేలుమే లెట్టిగుణము నిర్మించినాడు
పుల్లకవి నేలు గోపికా వల్లభుండు.

జంతువులపరంగా ఈ కథ నడిచింది. కాని దీనిని మానవప్రవర్తనకు అన్వయించుకొంటే మనోహరమైన హాస్యము లభిస్తుంది.

ఈ విషయాన్నే తీసుకొని వెక్కిరించడం ఈక్రింది పద్యంలో కూడా కనపడుతుంది.

"ఉష్ట్రములదైన వైవాహికోత్సవమున
గానమొనరించినవి వేడ్క గార్ధభములు
ఎంత చక్కందనమ్మొ మరెంత సుస్వ
రమ్మొనా మెచ్చుకొనెను పరస్పరమ్ము."

ఈ పద్యంలో ఉష్ట్రముల వివాహమహోత్సవమును జరుపుకొంటూఉంటే ఆ ఉత్సవానికి గాడిదలువచ్చి పాడినవట! అంతా సక్రమంగా జరిగిపోయింది. ఉష్ట్రములు, గార్ధభముల గానమాధుర్యాన్ని ఉగ్గడించినవి. గార్ధభములు ఉష్ట్రముల అపూర్వసౌందర్యాన్ని కొనియాడినవి అని చెప్పాడు కవి.

*సాహితీసమితి సభ్యులు:* మనసమాజంలో కొన్ని సంఘాలలోని సభ్యులు, ఒకరినొకరు మెచ్చుకొంటారు సాహితీసమితి సభ్యులలాగ. నాఉద్దేశంలో ఒకరినొకరు తిట్టుకొనేకంటే మెచ్చుకోవడం మంచిపనే. ఎవ్వరిలోనూ మెచ్చుకోదగిన గుణము లేనపుడు పరస్పరం మెచ్చుకోవడం గర్హ్యమైన ఆచారంఅని అనకతప్పదు. అట్టి ఆచారములో యోగ్యతలేదు. సభ్యతలేదు, ఆ కథలో ఈ అసభ్యమైన అయోగ్యమైన అలవాటును నిరసించుట వ్యంగ్యనిష్ఠమై ఉన్నది.

*రావణ ధమ్మీయం, గిరతము:* ఉష్ట్రముల కథలోని హాస్యము సుందరంగా ఉన్నది. అధిక్షేపింపబడిన వ్యక్తులుకూడ దీనినిచూచి నవ్వకుండాఉండలేరు. ఇది ఉత్తమహాస్యలక్షణము. సరసము మధురము లలితము అయిన హాస్యమిది. ఇంతసుందరంగా నడిచిన అధిక్షేపము అరుదు. పాశ్చాత్యసాహిత్యంలో అధిక్షేపహాస్యం ఒకవిశిష్టమైన స్థానం ఆక్రమించుకొంది. ఇంతకుముందు పేర్కొన్న గలివర్‌కథ అటువంటిది పిండిప్రోలు లక్ష్మణకవి వ్రాసిన 'రావణ ధమ్మీయము' అనే కావ్యం ఇటువంటి అధిక్షేపకావ్యమే. గిరతంకూడా అటువంటిదే. పానుగంటివారి సాక్షిలో సమకాలిక దురాచారాలను ఆక్షేపించిన ఘట్టాలు

చాలా ఉన్నాయి. చాటువులలో కూడా ఈరకం హాస్యం పుష్కలంగా లభిస్తుంది.

అవక్షిప్తము - ఎత్తిపొడుపు :

*కోకలనెత్తుకపోయి చెట్లెక్కగలమె :* గయోపాఖ్యానంలో కృష్ణునికి అర్జునునికి జరిగిన సంభాషణలో ఈరకము ఎత్తిపొడుపు అనే హాస్యప్రక్రియ పుష్కలంగా లభ్యమవుతుంది.

"అల్లుడారమ్మని ఆదరంబున బిల్వ
బంపుమామనుబట్టి చంపగలమె
జలకేళి సవరించు జవరాండ్ర కోకల
నెత్తుకపోయి చెట్లెక్కగలమె
ఇల్లిల్లుతిరిగి వ్రేపల్లెలో మ్రుచ్చిలి
మిసిమి ముద్దలదెచ్చి మ్రింగగలమె
గొల్లబొట్టెల గూడి కోలనేకొనియాల
కదుపులనేర్పుతో గాయగలమె
తల్లిదండ్రులు పరులకీ దలచుకొన్న గన్య
బలిమిమై దెచ్చి భార్యగా బడయగలమె
దుష్టులనువంక వీరుల ద్రుంపగలమె
అనపరాధుల దండింప నరుగగలమె."

అనే పద్యంలో అవక్షిప్తము అనే హాస్యప్రక్రియ ద్యోతకమవుతుంది. ఈ హాస్యము మనపూర్వు లెరిగినదే.

*బిచ్చమెత్తుట ఇది క్రొత్తవిద్యకాదు:* శ్రీరామునికీ, ఆంజనేయునికీ జరిగిన సంభాషణలోకూడా అంజలీపుత్రుడు తనస్వామిని ఎత్తిపొడుపుమాటలతో సాధిస్తాడు. అర్జునుడు కృష్ణుని నాజూకైన మాటలతో ఎత్తిపొడవడము కనిపిస్తుంది ఈ క్రింది పద్యంలో.

"అదితికశ్యపులకు గుజ్జువగుచు బుట్టి
యడుగుకొనలేదె ధరను మూడడుగులీవు
బిచ్చమెత్తుట ఇది క్రొత్తవిద్యగాదు
నేవుజెప్పిన విద్యయే నీరజాక్ష!"

*నేనేమన్నా చక్కనిదాన్నా:* భర్త మరదలుపిల్లతో కాస్తచను వుగా మాట్లాడినాడని భార్య ఈర్ష్యపొందుతుంది. ఆతరువాత ఆయన భార్యను పలకరిస్తే ఆమె కుహనాకోపనయై అంటుందీ. "నాతో ఏం మాట్లాడుతారులెండి. నేను చదువుకొన్నదాన్నా ఏమన్నానా, యౌవనము లేదు. చక్కదనము అంతకంటేలేదు. నాతోమాట్లాడడానికి ఏముంటుంది లెండి మీకు"అని. ఎత్తిపొడుపుమాటలు ఇవి. భర్త తన సోదరితో మాట్లాడినందుకు ఆమెకు నిజంగా ఈర్ష్యాలేదు కోపమూలేదు. కేవలం సవ్వులాటకు అన్నమాటలు అవి.

*కారుకొంటానికి డబ్బు:* ఒకడు ఒకకారు కొంటాడు. అదికొంటా నికి ధనము ఏదో అక్రమమార్గాలద్వారా లభించింది అతనికి. ఈ విష యాన్ని మనస్సులో ఉంచుకొని ఆయన మిత్రుడొకడు ఈవిధంగా అంటాడు. "నీవుకూడా కారుకొనుక్కోవయ్యా" అన్నప్పుడు, 'మాకు డబ్బు ఎక్కడినుంచి వస్తుందయ్యా కార్లూగీర్లూ కొంటానికి! గాలికి కొట్టుకొచ్చి మా ఒళ్లోపడ్డది గనుకనా!' అని. ఇందులో అతడు అక్రమ మార్గాలద్వారా ధనార్జనచేశాడనీ వ్యంజనపూర్వకమైన ఎత్తిపొడుపు ఉన్నది. 'సాధింపు' అనే హాస్యప్రక్రియలో ఈ ఎత్తిపొడుపు బహు సున్నితమైన పద్ధతిలో ప్రదర్శితమవుతుంది. కోడలు పల్లెటూరులో బీదకుటుంబములో జన్మించింది. ఆ విషయాన్ని ఎత్తిపొడుస్తూ కోడ లును సాధిస్తున్న అత్తమాటలు చూడండి.

*అత్తగారు కోడలును ఎత్తిపొడుస్తుంది:* పిల్లి వంటఇంట్లోకి వచ్చింది. దానిని ఏకర్రపుల్లతోనో కొట్టబోతూ అత్తఅంటుంది. "పోవే!

పో, వెధవముఖమూ నీవూనూ! అ౦! గుర్రుమంటావు! ఎందుకా మిడిసిపాటు? తింటానికి పూటకు గతిలేదు. దొంగతిండ్లు తినాలిసిందేగా నీగతి! నీ అదృష్టంవల్ల ఈ ఇంట్లోకి వచ్చిపడ్డావు! నీపుటుక ఏమిటో, నీబ్రతుకు ఏమిటో కాస్తఆలోచించుకో. వెధవ నీలుగుపోక!" ఏ పిల్లమీదో పెట్టి కోడలుకూడా ఎత్తిపొడుపు మాటలు అంటుంది అత్తను ఒకప్పుడు. ఆ ఎత్తిపొడుపు వినేవారికి వినోదముగా ఉంటుందిగాని తగిలినవారికి మటుకు ఘాటుగానే తగుల్తుంది.

*శార్కిజమ్:* ఎత్తిపొడుపులో నవ్వునుపుట్టించే పదార్థము, ఉన్నప్పటికీ అది కఠినంగానే ఉంటుంది. ఈ హాస్యప్రక్రియను ఇంగ్లీషులో "శార్కిజమ్'' అంటారు. శార్కిజమ్ అంటే "A taunt or bitter or wounding remark one Ironically worded'' అని ఆక్స్ఫోర్డ్ నిఘంటువులో అర్థంచెప్పాడు. కాబట్టి ఇది ఐరనీకి సన్నిహిత వ్యాపారమున్నూ చురుకుతగిలేదిగానూ ఉంటుందని మనము గ్రహించవలె.

*అత్తగారి ఎత్తిపొడుపు మాటలు:* అత్త అన్నమాటలు వింటే కోడలుకు ఒళ్లుమండి, అత్తగారివంక కొరకొరచూసి ఏదో గొణిగింది. పిల్లిమీదపెట్టి అత్తగారు మళ్ళీ అంటుంది. 'ఎందుకే అట్లాచూస్తావు! అసలే హడలిచస్తుంటే. నీవు చాలా అదృష్టవంతురాలవు. నేనే దురదృష్టవంతురాలను. నేనేమైనా పెంపుడుజంతువునా, అందరూ నన్ను ముద్దుచేయడానికీ పిల్చి అన్నముపెట్టడానికినీ. ముసలి ముండనాయె! నన్నెవరు చూస్తారు?' అని కోడలు, అనుభవిస్తున్న సుఖజీవితాన్ని ఎత్తిపొడుస్తుంది. కోడలూ ఈ ఎత్తిపొడుపువిద్యలో ఆరితేరిన చెయ్యే. పాతచీరఉంటే ఇయ్యమ్మా దొరసానీ అంటూవచ్చిన బిచ్చకత్తెతో ఇలా అంటుంది.

*కోడలు అత్తను సాధిస్తుంది:* "దొరసానినా! నా దొరసానితనం ఏడ్చినట్లేఉంది. చాకిరీచేస్తున్నాను, ఇంతకూడు పడేస్తున్నారు. వంట

మనిషికి పదేసినట్లు! నేను ఈ ఇంటికి యజమానురాలనా దొరసాని తనం వెలగబెట్టడానికి. నాకొడుకు ఏమన్నా సంపాదించి చేతిలో పోస్తున్నాడా సంవత్సరానికి పది చీరలు కట్టిపారేయడానికి! నాకే గతిలేక పాత చీరలు చినిగిపోయినవానిని అతుకులువేసుకొని అఘోరిస్తున్నాను."

*సూదిపోట్లు* : ఇందులో అత్తగారిని ఎత్తిపొడవడం స్పష్టంగా కనపడుతూనేఉంది. ఇల్లాగ కుక్కమీద పిల్లిమీద దేనిమీదబడితే దాని మీదపెట్టి సూదిపోట్లు పొడవడము ఈ ప్రక్రియయొక్క లక్షణము. ఈ ఎత్తిపొడుపూ, ఐరనీ ఒకప్పుడు కలిసిపోతై. ఇది ఎత్తిపొడుపు. ఇది ఐరనీఅని విడదీసి చూపడం కష్టంఅవుతుంది. అయితే ఒకసంగతి. ఐరనీలో మృదుత్వమూ, లాలిత్యమూ ఉంటై. హాస్యముకూడా సుకుమారంగా ఉంటుంది. అది వెక్కిరింత అయినా ఎత్తిపొడుపవలెగుచ్చుకొనే వెక్కిరింతకాదు. ఎత్తిపొడుపు కటువుగాను, బాధాకరంగానూ, ఉంటుంది. ఈ ఎత్తిపొడుపు వ్యక్తిగతమై వాచ్యమై కటువుగా నున్నప్పుడు దానిని ఉల్లకుట్టు అంటారు.

*చోరత్వం బించుకంతయు నేర్వరు* : 'Irony' వ్యంగ్యముగానీ ఎత్తిపొడుపుగానీ, అధిక్షేపం (Satire) గానీ వెక్కిరింతా వేళాకోళాలు అనే విభాగంక్రిందికే వస్తవి. అయితే అధిక్షేపమూ, వ్యంగ్యమూ కొంచెము మృదువుగాను, లలితంగానూ ఉంటవి. ఎత్తిపొడుపు కొంచెం వ్యక్తి నిందాత్మకమై మోటుగా ఉంటుంది ఈ పద్యంలో ఎత్తిపొడుపు ఎంతమనోహరంగా ఉందో చూడండి. "మీరెవ్వరు శ్రీకృష్ణులుగారా వీరెన్నడును వెన్నగానరటగా, చోరత్వం బించుకయును నేరరట. ధరిత్రి నిట్టి నియతులు గలరే!'' వెన్నంటే మీకు అసలుతెలియదు. దొంగతనముఅంటే మీకు బొత్తిగాతెలియదు. అన్నమాటలలో రమణీయమైన ఎత్తిపొడుపుఉంది. ఇతర ఎత్తిపొడుపుమాటలలో మాదిరిగా ఇందులోగుచ్చుకొనేపదార్థం లేకమృదువుగానూ మనోహరంగానూ ఉంది.

*భారతంలో ద్రౌపది ఎత్తిపొడుపు :* కీచకుడు ద్రౌపదిని అవమాన పరుస్తాడు. ద్రౌపది రాజసభలోకి పోతుంది. విరటునితో తనకుగలిగిన అవమానాన్నిగురించి మొరపెట్టుకోవడానికి. సమయభంగం కలుగుతుం దేమోనన్నభయంతో ధర్మరాజు ద్రౌపదిని వారించుఉద్దేశంతో అంటాడు.

క. పలుపోకలబోవుచు విచ్చలవిడి
నాట్యంబుచూపుచాడ్పున నిచటం
గులసతుల గఱువచందము దొలగగ
నిట్లునికి దగునె తోయజవదనా?"

అని. ఎట్లాగయినా ఆమెను అక్కడనుండి పంపివేయాలని ధర్మరాజు ఆదుర్దాపడతాడు. కాని పరాభవాగ్నిచేత దహింపబడుతూఉన్న ఆమె హృదయం అందుకు అంగీకరించలేదు. అనవలసిన నాలుగూఅని మరీ వెళ్లింది. మహారాణి అయిన తనకు జరిగిన తిరస్కృతికి ఆమె కడుపు మండిపోతుంది. 'ఈ సభలోకి రావడము మర్యాదకాదంటారా. నాకేం మర్యాద? నాభర్త శైలూషుండు జూదరి. జూదరిభార్యకు గౌరవం ఎక్కడనుండివస్తుంది ' అనిఅన్నది.

" నాదువల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారియట్ల పిన్నవారు
గాన బతుల విధమకాకయే శైలూషి
గానసంగరాదు కంకభట్ట?"

''అట్లగుటంజేసి నాకు నాట్యంబును పరిచితంబు. మత్పతి శైలూషుండ కాదు, కితవుడునుంగావున జూదరి ఆలికి గఱువతనం బెక్కడిది అనుచు నచ్చోటువాసె.'' ఈ వాక్యాలలో అంతర్గర్భితముగాఉన్న ఉపాలంభనము కాస్త కరుగ్గా ఉన్నది. భర్తలయొక్క చేతగానితనాన్ని ఎత్తిపొడిచింది. ఇట్టి ఘాటైన ఎత్తిపొడుపును 'నాళిక' అంటారు.

*లక్ష్మి-పార్వతీ సంవాదము* : ఈ ఎత్తిపొడుపులో ఇంకోపద్ధతి ఒకరిని ఒకరు ఎత్తిపొడుచుకోవడము. ఈ క్రింద ఉదహరించినది వాచ్యంగాఉంది. అయినా అందులో ఒకచమత్కారం కనిపిస్తుంది. లక్ష్మి, పార్వతి సంవాదము ఇట్లానడుస్తుంది. లక్ష్మి. ఏమమ్మా! నీ మొగుడికంఠంలో నలుపేమిటి? పార్వతి: నీమొగుడుకి ఒళ్లు అంతా నలుపేగా. లక్ష్మి: మీ ఆయన భిక్షుకుడు.అదేంపనమ్మా? పార్వతి: మీఆయనా అంతేగా? నీభర్త బలిచక్రవర్తిని మూడుఅడుగులు ఇవ్వమని అడగలేదూ. ఇట్లా నడుస్తుంది ఆ సంభాషణ. ఇది మనసంఘంలో వ్యక్తులు ఒకరినొకరు వేళాకోళం చేసుకొన్నట్లుగానేఉంది. కాని మనోహరంగా ఉంది.

*ధర్మరాజు కూడా* : పాండవులు అజ్ఞాతవాసం ముగించిన తరువాత ఉపప్లావ్యంలో ఉన్నప్పుడు, వారిని చూచిరమ్మని ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పంపిస్తాడు. ఆయనవచ్చి ధర్మరాజు నుద్దేశించి 'బాబూ మీరంతా కుశలంగా ఉన్నారా? మీ తండ్రి మీ క్షేమసమాచారం తెలుసుకొని రమ్మని నన్ను పంపినారు.' అని అంటే ఆ మాటమీద ధర్మరాజు అంటాడూ! 'కులాసాగానే ఉన్నాము సంజయా. ఆయన దయవల్లనే గదా మేము ఇల్లాగ క్షేమంగాఉన్నాము.' "ఆరాజు మా దెసంగల కారుణ్యముకతమునను సుఖంబున నిట్లున్నారము. నిను బుత్తెంచిన గారవమున నాదుమది వికాసము బొందెన్' అని.

*బాగా అంటించినాడు* : ఇల్లాగ సుఖముగా ఉండడము ఆయన దయవల్లనే కదా అనడంలో మంచి ఎత్తిపొడుపు ధ్వనిస్తున్నది. ఎత్తిపొడుపుమాటలు తగిలినవాడికి కాస్తకష్టంగానే ఉంటవిగాని వినేవాళ్లకు బాగాఅంటించాడురా అని అనిపించి సంతోషాన్ని కలిగిస్తవి.

*మనుచరిత్రలో* : మనోహరమైన ఎత్తిపొడుపు ఉంది. ప్రవరుడు వచ్చాడు. వరూధిని అతన్ని కామించింది. అతనిని ఆ ప్రదేశంలో కొంత కాలముఉంచి తనకోరిక చెప్పాలనుకొంది. ఆ శ్రోత్రియ బ్రాహ్మణుడు

వెళ్లాలె, వెళ్లాలె అని ఒకటేగోల. వైదికకర్మలకు వేళమించి పోతున్న దని! అప్పుడు వరూధిని 'ఏమిటయ్యా వెడతానంటావు కాలునిలువదేం? ఇక్కడి రత్నకందములు, ఇక్కడి నందనచందనోత్కరంబు, ఇక్కడి గాంగసైకతములు, ఇక్కడి ఈ లవలీ నికుంజములు మీ కుటీర నిలయంబులకు సరిరాకపోయెనే అనిఅంటుంది. ఈ అవక్షిప్తము మధురంగానూ, రమణీయంగానూ ఉంది.

*అచ్ఛురితకము :* నిత్యజీవితంలోకూడా భార్యాభర్తల సంభాషణలో ఈ మోస్తరు హాస్యపుపలుకులు దొర్లుతూ ఉంటవి. అవి గుచ్చుకొననివై, వికారపెట్టనివై, మృదుమధురములై, మందస్మితపరిజనక సమర్థములై ఉంటవి. మరదలు బావగారితో అంటున్నది : "అక్కయ్య నౌకరులను తిడుతుందని గోలచేస్తావు గాని ఆమెగారికి అమాయకులనూ తనకంటే తెలివితక్కువవారినీ జూస్తే తగనిజాలి" అని. ఆ మాటలు విని బావగారు నవ్వి "అటువంటివాళ్లు దొరకొద్దూ !" అన్నాడు. భార్యను వేళాకోళం చేశాడు. ఆమెకంటే తెలివితక్కువవారు లేరు అని ధ్వని. ఇది రమణీయమైన ఎత్తిపొడుపు. ఈ హాస్యప్రక్రియనే ఉపాలంభము అని కూడ అంటారు. నిందతోకూడిన ఉపాలంభమునకు పరిభాషణము అని పేరు. గ్రుచ్చుకునేటంతటి తీవ్రంగా ఉన్న ఎత్తిపొడుపును ఉల్లకుట్టు అంటారు. ఎత్తిపొడుపుతో కూడిన నవ్వుకు అచ్ఛురితకము అని పేరు.

## అవలగితము - ఐరనీ (Irony) వ్యంగ్యము

శక్తిమూల హాస్యసాధనకు ఇది మరో మార్గము. దీనిని గురించి ఇంగ్లీషులో ఈ నిర్వచనము ఇచ్చారు. "Employment of words and phrases of a certain meaning for expressing the opposite meaning and simulated adoption of another point of view and simulated ignorance for the purpose of ridicule'' మనము మాట్లాడే మాటలయొక్క వాచ్యార్థము కాక దాని వ్యతిరేకార్థమును ఉద్దేశించి వ్రాసిన వ్యంగ్యరచన ఇది.

మనము చెప్పదల్చుకొన్నది ఆ వ్యతిరేకార్థమే. ఆ అర్థాన్ని స్ఫురింపజేసే లాగున రచన నడుస్తుంది. ఈ రకము రచనలో వివక్షితార్థం ధ్వని రూపంలో ఉంటుంది. వివక్షితార్థానికి వ్యతిరేకంగా మనము చెబుతూ ఉంటాము.

*పరీక్షలకు కష్టపడి చదువవద్దు:* ఈ పద్ధతిలో నడచిన రచన ఎల్లాగ ఉంటుందో ఉదాహరణ పూర్వకంగా చెబుతాను. ఒక ఉపాధ్యాయుడు కుర్రవాళ్ళతో ఇల్లాగ అన్నాడు. "ఒరే బాబూ పరీక్షలు దగ్గరకు వస్తున్నవి. ఆందోళనపడి రాత్రింబవళ్లు కష్టపడి చదువుతారో ఏం ఖర్మో! అటువంటి తెలివితక్కువ పనిమాత్రం చేయకండేం! ప్యాసు కావడానికి అనేక మార్గాలు ఉన్నవి. అందులో కష్టపడి చదవడము ఒకటి. కాని అది ఒకటే మార్గము కాదు. బుద్ధిహీనులు, అప్రయోజకులూ, చేసే పని అది. తెలివి గలవారూ, లోకజ్ఞానం కలవారూ వళ్ళు విరుచుకొని కష్టపడి చదవరు. అందుకని నిద్రాభంగం చేసికోరు.

*పరీక్షలో కాపీ చెయ్యి :* చదివితే మటుకు ప్యాసు అవుతావని నమ్మకం ఏముంది? నీవు చదివిన భాగంలోనుంచే ప్రశ్నలు వస్తవని నమ్మకం ఏమిటి? అందుకని నోట్సు తీసికెళ్ళి కాపీచేసి అవతల పారేస్తే చచ్చినట్లు ప్యాస్‌చెయ్యాలె నిన్ను! ఎవరికోసం చేస్తారు! ఇంకో సంగతి. కాపీచేస్తుంటే పట్టుకొంటారేమోనన్న భయం ఎప్పుడూ పెట్టుకోకూడదు. కుర్రవాడు కాపీచేస్తుంటే పట్టుకోడానికి ఎన్ని గుండెలు ఉండాలి! ఆ పని చేసి ప్రాణంమీదికి తెచ్చుకొనేటంతటి తెలివితక్కువ ఉపాధ్యాయుడు ఎవ్వరూ ఉండరు. ఒకవేళ ఉన్నా వారికి చెప్పవలసిన ముక్కలూ, ఆయనను సన్మార్గానికి త్రిప్పవలసిన విధానం మనకు తెలియకపోతేగద భయపడడానికి?

*మావలె నియములు పడినవా రిలను గలరే :* సూపరెండెంట్సుగా వచ్చిన ఉపాధ్యాయులందరిని ఒకరోజు ముందుగానే మన రాయబారులు

వెళ్లి కలుసుకొని సామదాన దండోపాయాలచేత వాళ్లను మనకు అనుకూలురుగా త్రిప్పుకోగలము. మరేం భయము లేదయ్యా! సంజయ రాయబారం విఫలమైతే కృష్ణరాయబారం పంపుదాము. అదీ సానుకూలం కాకపోతే యుద్ధం ఎట్లాగూ ఉండనే ఉంది. ఆ యుద్ధం ప్రచ్ఛన్న యుద్ధం. దాని సంగతి వేరే చెపుతాను. రాయబారాలవలన కార్యసానుకూలం కాకపోతే, అంటే నయానా, భయానా, చెప్పినా, వినని మొండిఘటం ఎవరైనా ఉంటే అతనికి తెలియజేద్దాం పూర్వచరిత్రలో తన మోస్తరు వాళ్ళకు ఏమి జరిగిందో.

*కాపీ చెయ్యనీయకపోతే కాళ్లు పడిపోతయ్యి:* నాలుగు సంవత్సరాలకు పూర్వం నాగభూషణంగారు ఇల్లాగే ఎంతచెప్పినా వినలేదు. కాని ఏం జరిగిందో ఏమో, రేపు పరీక్ష అనగా, ఇవాళ సాయంత్రమే హఠాత్తుగా ఆయన కాళ్లు పడిపోయినవి. ఆ మరునాడు ఆయన పరీక్షలు జరిగే ప్రదేశానికి వెళ్ళడానికి అశక్తుడైనాడు. అందాకా ఎందుకూ రెండు సంవత్సరాల క్రితంకూడా, ఇలాగే జరిగింది. నరసింహంగారు కొంచెం పెంకెతనం చేసి కాపీ జరగనివ్వను హుత్ హుత్ అన్నాడు. ఆ రాత్రే ఆయన దగ్గరకు ఎవరో ఇద్దరు ముగ్గురు విద్యార్థులు వెళ్లి ఆయనతో ఏంజెప్పారో ఏమో, తెల్లవారుఝామున బండికి ఎవ్వరికీ చెప్పకుండా వెళ్లిపోయాడు. గిట్టనివాళ్లు కొందరు ఆయనను పిల్లవాళ్లు భయపెట్టారని అంటారు. కాబట్టి మరేం భయంలేదయ్యా–" ఈ విధంగా నడిచిన రచనలో ఉండే చమత్కారాన్ని ఐరనీ అంటారు. ఈ రచనలో మనం చెప్పినట్లు చేయమనికాదు, మన ఉద్దేశం. అటువంటి సందర్భాలలో జరుగుతూఉన్న పనులను, విపరీత విధానాలను హేళన చేయడమే రచయిత ఉద్దేశం.

*ఆ విల్లను ఏదో అనే ఉంటావు:* మరో ఉదాహరణ. అత్తగారింటికి పోయే కొత్తకోడలుకు బుద్ధులుచెప్పే పద్ధతి చూడండి. ఈ చెప్పడంలో వాచ్యార్థము వేరు. వ్యంజన వ్యాపారంవల్ల స్ఫురించే అర్థం వేరు. "అమ్మా

అత్తవారింట్లో పతివ్రతలాగ ప్రవర్తించు. మీ ఆయన కాస్త విసుక్కున్నాడా ఆ రోజు వంట మానేసెయ్యి. కటికనేలపై పడుకొని ముసుగు బిగించి కుళ్ళి కుళ్ళి ఏడు. నిజంగా ఏడ్వనక్కరలేదు. ఏడుస్తున్నట్లు నటించు. ఏడ్వదల్చుకొన్నా ఏడ్వవచ్చు. పిలుస్తే పస్తుందాయె ఏడ్పు! నీ ఏడ్పు విన్నవాళ్లు అందరూ, "అదేమిటయ్యా, పెళ్లాన్ని అల్లాగ ఏడిపిస్తున్నావు" అని మీ ఆయననే చీవాట్లు వేస్తారు. "నేనేమీ అనలేదు" అని ఎంత మొత్తుకొన్నా ఆయన మాటలు ఎవరూ వినిపించుకోరు. "ఏమీ అనకపోతే ఎందుకు అల్లాగ ఒక్కతీరున ఏడుస్తుందయ్యా. ఆ పిల్లను ఏదో అనే ఉంటావు" అని అంటారు అంతా.

*మొగుణ్ణి పస్తు పడుకోనియ్యాలి :* ఈలాంటి సందర్భాలలో ఆయన సాధారణంగా నోరెత్తడు. కర్మంజాలక పెదవి విప్పాడా, ఇక ఆ పూట మళ్ళీ తిండి మానెయ్యి. నువ్వు తినకపోతే ఆయనా తినడు. ఆయన తిన లేదే అని జాలిపడకు. మొగుణ్ణి అల్లాగ పస్తు పడుకోబెడుతుంటేనే గాని సన్మార్గానికి రాడు. ఆయన పస్తున్నాడుగదా నేనెట్లా తినేది అనుకొని నువ్వు అన్నం మానేశేవు. సద్యః, ఎప్పుడో ఆయన ఇంట్లో లేనపుడు గాని, నిద్రపోతున్నపుడుగాని కాస్త సందుచూచుకొని నీవు మాత్రం రహస్యంగా తినేశెయ్యి. నీవు పస్తు పడుకొన్నావని జాలిపడి ఆయన హోటలుకు పోడు. ఇట్లాచేస్తివా, ఒకటి రెండు రోజులలో ఆయన కాళ్ళ బేరానికి వస్తాడు.

*అర్జునుడికి గాండీవం, ఆడదానికి సాధింపు ఆయుధాలు :* రాకపోతే పుట్టింటికి పోతానని బెదరించు. నలుగురితోచెప్పి అల్లరి చేస్తివా ఆయన విధిగా లొంగుతాడు. లొంగిపోయిన తరువాతకూడ నాలుగురోజులపాటు బెట్టుగా ఉండి కదిలిస్తే కస్సుమంటూ ఉండు. ఆ తరువాత సాధింపు లంకించుకో. తెలుసుగా సాధింపు ఎట్లాగుండాలో. చీరలులేవనీ, అవిలేవనీ, ఇవిలేవనీ సాధించు. స్త్రీకి ఇది మంచి ఆయుధము. విష్ణుమూర్తికి చక్రం ఎల్లాంటిదో, అర్జునుడికి గాండీవము ఎల్లాంటిదో ఆడుదానికి సాధింపు

అనే ఆయుధం అటువంటిది. ఇంకా దేవుడు మేలుచేస్తే ఈ సాధించడము పిల్లిమీదో కుక్కమీదో పెట్టి నీవు అనాలిసిన మాటలన్నీ అను. ఆ మాటలన్నీ బాణాలలాగ గుచ్చుకోవాలె.

*సాధింపు కవిలెకట్ట ఆడదాని ఆస్తి :* ఈ సాధింపును ఆడపిల్లలు ఉగ్గుపాలతోనే నేర్చుకొంటారు. బామ్మకూ, తన తల్లికీ జరిగిన పోట్లాటలు వింటారుగదా! ఈ సాధింపు సంప్రదాయసిద్ధంగా వస్తూ ఉన్న కార్యక్రమము. ప్రతిస్త్రీ తాను బ్రతికిఉన్నంతకాలము ఈ విద్యను ప్రదర్శించి తనకు వృద్ధాప్యం రావడంతోనే ఆ కవిలెను కోడలుకు ఇచ్చి పోతూ ఉంటుంది.

*తల్లీ కూతుళ్ళమధ్య తట్టెడంత హాస్యం :* భార్యాభర్తలూ, కోడలు అత్తనూ, అత్త కోడలునూ, సాధించుకొంటారు. వదినా మరదళ్ళమధ్య కొండొకచో తల్లి కూతుళ్ల మధ్యకూడా ఈ వ్యాపారం సాగుతూ ఉంటుంది. మహోజ్జ్వలమైన ఈ ఆనుపూర్విక సత్ సంప్రదాయాన్ని నశించకుండా మనవాళ్ల పట్టుకొస్తూ ఉండేవాళ్లు. ఆంగ్లవిద్యా ప్రోద్బలము వలన అన్ని సంప్రదాయాలతోపాటు ఇదికూడా ఆదరణను కోల్పోయి క్రమంగా నశిస్తున్నది. ఈ ఉత్తమ సత్సంప్రదాయము రూపుమాసి పోతుందని "ఇంటావిడతో పోట్లాటలు" అనే గ్రంథంలో ఈ విషయాన్ని కొంతవరకు వ్రాశాను నేను.

*ఇంటిఆవిడతో పోట్లాడు :* ఒక సంస్థలోగాని, వ్యక్తిలోగాని ఉండే దౌర్బల్యాన్ని లేక దోషాన్ని మెచ్చుకోవడముకూడా మృదువమ్ము అనే హాస్యప్రక్రియ క్రిందికే వస్తుంది. దీవినే వ్యాజస్తుతి అంటారు ఏదో కారణముకల్పించుకొని చీటికీమాటికీ భార్యతోతగవులాడడం మన సంఘంలో చాలామంది వ్యక్తులుచేస్తున్నపనే. ఇది చెడ్డపని అని అవాచ్యంగా చెప్పక, అదిచాలమంచిపని అనిమెచ్చుకోవడంలో ఆరచన మృదువమ్ము అవుతుంది. "భార్యతో రోజుకు ఒకసారైనా పోట్లాడు. దానివలన ఎన్నో లాభాలు

ఉన్నవి. ముందు ఓర్పు అలవడుతుంది. పోట్లాట శబ్దవ్యాపారం కాబట్టి పోట్లాటవల్ల శబ్దశక్తి తెలుస్తుంది. అదీగాక పోట్లాటలో ఉపయోగించ వలసిన మాటలూ, సమాసాలూ, ఒకరోజు ముందుగానే వ్రాసిపెట్టుకోవ డమూ, మంచిది. దానివలన భాషాజ్ఞానము వృద్ధి అవుతుంది.

పోట్లాటలవల్ల లాభాలు: యోగులు, ఏండ్లతరబడి తపస్సుచేసి సంపాదించే నిర్వికల్పసమాధి ఈ తగవులవలన లభిస్తుంది. ఎంత పెద్ద కష్టాన్ని అయినా లెక్కజేయకపోవడమూ, ఎంత పెద్ద శబ్దానికైనా చలింపకపోవడమూ, ఈ రెండు బహుకాల తపఃఫలితముగా రాతగినవి ఈ తగాదాలవలననే లభిస్తవి. శబ్దంలో ఉండికూడా, నిశ్శబ్దతను, అనుభ వించడమూ, దుఃఖంలో ఉండికూడా ఆనందాన్ని పొందగలగడమూ, ఇవి మన ఇండ్లలో నిరంతరము జరుగు కలహాలవల్ల మనము, చివరకు పొందగలిగిన సుగుణాలు.

అప్పులు చేయవయ్యా: అప్పుజేసి పప్పుకూడు తినడము మన సంఘంలో వ్యక్తులకున్న దుర్గుణాలలో ఒకటి. అప్పులు చేయకూడదని చెప్పకుండా అప్పుజేయడం తప్పులేదని చెప్పడముకూడా ఈ రకము హాస్యముక్రిందికే వస్తుంది. నేను వ్రాసిన "అప్పులు చేయడమూ తీర్చ డమూ" అనే పుస్తకంలో ఈ రకము అధిక్షేపము మీకు కనపడుతుంది. ఆ పుస్తకంలోనుంచి, ఒక్కవాక్యము ఇక్కడ ఉదహరిస్తాను. "అప్పులు చేయడము తప్పు ఎప్పటికీకాదు. ప్రభుత్వాలే అప్పులు జేస్తవి. దానికి జాతీయ ఋణం అని పేరు. అది కోట్లకుకోట్లు పెరిగిపోయినా ప్రభుత్వం దిగులుపడదు. అల్లాంటప్పుడు, ఏ నాలుగువేలో, పదివేలో అప్పు ఉన్న దని దిగులుపడడము తెలివితక్కువతనం. ఇక చేసిన అప్పు తీర్చడము ఎల్లాగని ఆలోచన భయంకరమైనదే కాని, అటువంటి ఆలోచనను రానీయకూడదు. భగవంతుడే తీరుస్తాడు మనంచేసిన అప్పులు. రామదాసు అప్పులు ఎవరు తీర్చారు? వాడే తీరుస్తాడు మన అప్పులుకూడా."

*అల్లుడు ఎంగిళ్ళెత్తాలె :* ఈ హాస్యప్రక్రియ మన పూర్వులకు తెలియందికాదు. ముఖ్యంగా స్త్రీలపాటలలో ఈ రకము హాస్యము పుష్కలంగా దొరుకుతుంది. చాటువులలోకూడా ఈ రకము వ్యంగ్యహాస్యము కనబడుతుంది. ఒక కవి అంటాడు. "అల్లుని గౌరవించవలె అతనికి పని జెప్పకూడదు. అల్లునిచేత ఇంటిపనులు చేయించడము మంచిదికాదు. అయితే మూడు పనులు చెప్పవచ్చు. ఇల్లు అలకడమూ, పేడ జేయడమూ, ఎంగిళ్లు ఎత్తడమూను" ఈ వ్యంగ్యము చాలాసరసంగా ఉంది. కేవలము నవ్వులాటకు అన్న ముక్క ఆ చివరవాక్యము. ఈ మాటలతో ఏ మరదలుపిల్లో బావతో సరసమాడుతున్నట్లు మనము ఊహిస్తే సరిపోతుంది. ఈ వాక్యాలు వ్యంగ్యంగా అన్నట్లుకూడా అనుకొంటే ఈ రచన పరమ రమణీయంగా భాసిస్తుంది.

*భీముడు వ్యంగ్యంగా మాటాడినాడు :* వ్యంగ్యమే అవలగితము అనేహాస్యప్రక్రియకు ప్రాణము కాబట్టి కీచకవధకథలో భీముడు కీచకుణ్ణి నాట్యశాలలో కలుసుకొని అన్నమాటలలో వ్యంగ్యస్ఫూర్తి పుష్కలంగావుంది. కీచకుడు తనఎదుట చీకటిలోవున్న వ్యక్తి ద్రౌపదే అన్న భ్రమలో ఉన్నాడు. అప్పుడు భీముడు "రా! దగ్గరకురా! నీ ఒడలు నా యొడలును తాకిందాఅంటే అప్పుడు తెలుస్తుంది నీకు స్పర్శసుఖం. అనుభవిద్దువుగాని రా! నీవు ఎంతమంది స్త్రీలనో అనుభవించావు కాని నావంటి స్త్రీని నీవు ముట్టుకొని అయినా ఉండవు. నాతో అనుభవము అయినతరువాత నీవు బ్రతికియుండగా మరో స్త్రీని కోరవు" అంటే 'చస్తావు' అని అంతరార్థం కదా! కీచకునికి జరగబోవు అనుభవము ఎంత భయంకరమైనదో మనకు తెలుసు కాబట్టి, కీచకునియందు కాస్త జాలి వేస్తుంది. భీముని పలుకులలో వ్యంగ్యనిష్ఠమై ఉన్న కసీ, క్రౌర్యమూ. మనకు కొంచెముగా కష్టం కలిగిస్తుంది. ప్రియమైనదీ, మధురమైనదీ, కాకపోయినా, విరసీ అనే వ్యంగ్యహాస్యానికి ఇది ఉదాహరణగా మాత్రమే ఇస్తున్నాను. అల్లుణ్ణి గురించి వ్రాసిన వ్యంగ్యహాస్యము

ఇంతకంటే ఎన్నో రెట్లు రసపుష్టిని కలిగియున్నది. ఈ రకం వ్యంగ్య హాస్యము మన సాహిత్యంలో అంటే పూర్వసాహిత్యంలో చాలా తక్కువ. అ(హ! హ అంటే కొంచెం ఎక్కువ అన్నమాట.

అహోపురుషికము -

*బొటన వ్రేలంత మనిషి :* మురుగుకాలవను పట్టుకొని గంగానదిగా వర్ణించడము అతిశయోక్తి. పొట్టివాడుంటాడు. వాని పొట్టితనాన్నిగూర్చి వాడు సరిగ్గా బొటనవ్రేలంత ఉన్నాడనిచెప్పి ఆ ఊహమీద కథ కట్టుకు పోయినట్లయితే ఆ కథ హాస్యస్ఫోరకంగా ఉండకమానదు. టాంథంబ్ అని అటువంటి కథ ఒకటి ఉన్నది. ఆ అంగుష్ఠమాత్రుని చేష్టలన్నీ నవ్వు పుట్టించేవిగా ఉంటవి. పొట్టితనాన్ని అంత ఎక్కువజేసి చెప్పడమే ఆ హాస్యరచనకు ప్రాణము. ఈ విధంగా ఏ గుణాన్నిగాని అవగుణాన్ని గాని అతిశయంచేసి వికృతిని సాధించవచ్చు. అల్పవిషయాలను, అద్భుత విషయాలుగాను, అనుదాత్తమును ఉదాత్తముగను, అమహత్తర విషయాలను మహత్తర విషయాలుగానూ. మలచి వ్రాస్తే ఈ రకము హాస్యము వస్తుంది.

*పార్వతీశం గణపతి:* మొక్కపాటివారి పార్వతీశం కొద్దిగా అమాయకుడు. ఆ అమాయకత్వాన్ని కొండంతగా పెంచినాడు గ్రంథకర్త. తత్ఫలితంగా, అతని చేష్టలు వికృతమై హాస్యానికి ఆలంబన అయినవి. లోకంలో ఉన్న అనాకారితనాన్ని అంతానూ, అవగుణాలన్నిటినీ, ఒక వ్యక్తికే అంటగట్టడమే కాకుండా వాటిని గోరంత కొండంతలుగా చేసి, తద్రూపంగా హాస్యాన్ని సాధించారు చిలకమర్తివారు గణపతిచిత్రణలో.

*కలహకంఠి చండిక :* పెంకెతనాన్నీ, అవిధేయతనూ, అతిశయింపజేసి, వ్రాస్తే చండిక తయారైంది. కలహకంఠి మొదలైనవారు ఆ కోవలోనివారే: బండెడు అన్నం తిన్నాడని పీపా నీళ్లు త్రాగాడని అతిశయోక్తులు కల్పించి, ఆ శక్తినంతా ఒక వ్యక్తికి అంటగడితే

భీమునిపాత్ర తయారైంది. ఒకరిని అమిత స్వార్థపరునిగా వర్ణించడము గాని, సోమరితనం ఒకరిలో పరాకాష్ఠ పొందినట్లు చిత్రించడంవల్ల గాని, ఈ మోస్తరు రచనలు తయారు అవుతవి. అహోపురుషికము అన బడే ఈ హాస్యప్రక్రియ అతిశయోక్తులు కల్పించడంవలన పుట్టిందే. ఒక భావాన్ని తెగపొగిడించి, సాగదీస్తే దానికి వికృతమైన రూపం వస్తుంది. ఆ వికృతి హాస్యజనకం కాకమానదు.

*గలివరు ఒకగ్రుక్కలో 300 పీపాల సారాయి త్రాగాడు:* స్విఫ్టు అనే ఆంగ్లరచయిత, అతిశయోక్తితో కూడిన కథను ఒకదానిని వ్రాసి ఈ రకము హాస్యమును సాధించినాడు. ఆ కథపేరు గలివరు యాత్రలు. అధిక్షేపమును వ్రాసినపుడు ఈ కథ ప్రశంస వచ్చినది. ఇప్పుడు అతిశ యోక్తులనుగురించి వ్రాయడంలోకూడా ఆ కథ ప్రసక్తే తీసుకొని రావలసివచ్చింది. ఎందుకంటే ఆ కథ అతిశయోక్తులతో కూడియున్నది గనుక. గలివరు సముద్రయానాలు చేయడంలో ఒకసారి 'లిల్లిపుట్టుల' దేశానికి వెడతాడు. అక్కడిమనుష్యులంతా అంగుష్ఠమాత్ర శరీరం గల వారు. వాళ్ల కళ్లకు గలివరు ఒకభయంకరమైన రాక్షసుడుగా కనిపిస్తాడు. వాళ్లలెఖ్ఖప్రకారం గలివరు ఒకగ్రుక్కలో మూడువందల పీపాల సారాయిత్రాగాడు. గలివరుకు కావలసిన భోజనం తయారుచేయడానికి పదిహేనువందలమంది వంటవాళ్లు నియమింపబడ్డారుట! వాళ్లు గలివరుపై బాణవర్షం కురిపిస్తే అవి గుండుసూదులవలె గ్రుచ్చుకొన్నవి గలివరు శరీరంలో. అట్లానడిచింది ఆ కథ. అది ఒకరకమైన అతిశయోక్తి. మరొక ప్రయాణంలో గలివరు తాటియెత్తున వున్న మనుష్యులుగల దేశానికి పోతాడు. ఇదొకరకమైన అతిశయోక్తి.

*సత్యరాజా-లంకాయాత్ర :* కందుకూరి వీరేశలింగంగారు సత్య రాజాచార్య పూర్వదేశయాత్రలు అనే కథఅపుస్తకంలో సత్యరాజా మళ యాళయాత్ర గూర్చి మనము తెలిసికొన్నాము ఆయనే మరొకసారి లంకకుపోయిన కథఒకటి ఉన్నది. అది గలివర్ తాటిఎత్తు మనుష్యుల

దేశానికి పోయిన కథవంటిదే. రాక్షసులదేశంలో సత్యరాజాయొక్క అనుభవములనుగూర్చి కొంచెము చెపుతాను. దానివలన అతిశయోక్తుల వలన ఎటువంటి చక్కనిహాస్యం సాధించవచ్చునో తెలుస్తుంది. ఆ రాక్షసుల దేశంలో మనుష్యులు వందా రెండువందల అడుగుల ఎత్తున ఉంటారు. దానికితగ్గ స్థూల్యమునుకలిగి ఉంటారు. చెట్లు ఎంతఎత్తో మనము ఊహించుకోవలె. అక్కడ ఎలుకలు మనకుక్కలంతఉంటాయి. కుక్కలు గుఱ్ఱాలంతగానూ, పిల్లులు మన గోవులకంటే కొంచెము పెద్దవిగానూ ఉంటవట! సత్యరాజాచార్యులకు ఆదేశంలో మంచిఆశ్రయం దొరుకుతుంది. మహాకాయుడుఅనే రాక్షసుడు ఈ బ్రాహ్మణకుమారుని తనఇంట్లో ఉంచుకొని ఏ ఆపదా రాకుండా కాపాడుతూవుంటాడు. సత్యరాజాకు అక్కడఅన్నీ ఆపదలే! ఏపిల్లి మీదబడ్డా, ఏకుక్క కఱచినా చచ్చిఊరుకొనేవాడు! ఇంట్లోవున్నపుడు ఎలుకపిల్లచాలు అతనిప్రాణాలు తీయడానికి. మహాకాయుడు అతనిని ఎప్పుడూ బయటికి పోనిచ్చేవాడు కాదు. ఎందుకంటే, ఏగద్దో, గద్దే అక్కరలేదు, ఏపక్షిఅయినా అతనిని కోడిపిల్లను తన్నుకపోయినట్లు తన్నుకుపోవచ్చు. బొద్దింకకూడా చాకలి బానలాగుంటే ఇంక ఆయనకు సుఖంగా బ్రతకడము ఎంత కష్టమో ఆలోచించండి.

ఒకరోజున సత్యరాజా అటువంటి ఒకగొప్ప ఆపదనుండి తప్పించుకొన్నాడు. ఆ మహాకాయుని ఇంట్లో ఒక మేకవుంది. వాళ్లకు అది మేకగాని, మనకళ్లకు అది పెద్దపులిలాగో, సింహములాగో కనిపిస్తుంది. ఆమేక పిల్లలనుపెట్టింది. అందులో ఒకటి ఆటకోరుతనంగానో, మరిఎందుకో ఈ బ్రాహ్మణునిపైకి ఉరికింది. దానికి ఆటగాని వీడికి ప్రాణసంకటమేనాయె. అట్లా మీదపడి ఊరుకోక సత్యరాజా మెడపైన తన ముందుకాళ్ళు రెండూపెట్టింది. ఇంకేముంది! ఆయన ప్రాణాలమీద ఆశ వదలుకొన్నాడు. బొందిలో ప్రాణంఉన్నంతవరకు ప్రాణం రక్షించుకొంటానికి ప్రయత్నంచేద్దామని నిశ్చయించు

కొని ఆయన దాంతో యుద్ధం ప్రారంభించాడు. బాహాబాహి, దంతా దంతి, నఖానఖిని దానితో పోరాటం సాగించాడు. ఎట్లాగో చివరకు దాన్ని సంహరించగలిగాడు. దీనికే గ్రంథకర్త భాగశాబక బ్రాహ్మణ కుమార సమరోపాఖ్యానం అని పేరుపెట్టాడు. దీనిని పుణ్యకథగా ఎంచి దీనికి ఫలశ్రుతి చెప్పాడు. ఈ ఫలశ్రుతి విషయమై స్తోత్రాభాసములో చెప్పాను. ఈ కథ ఎందుకుచెపుతున్నానంటే ఇప్పుడు ఏ అతిశయోక్తుల వలన ఎటువంటి మంచిహాస్యము సాధించవచ్చునో చూపడానికి.

అతిశయోక్తితో కూడిన మరికొన్ని విషయాలున్నవి ఈ కథలో. ఆ మేకపిల్ల అరుపులు భయంకరమైన సింహగర్జనలులాగ వినిపించినవి మన బ్రాహ్మణకుమారునికి. ఆ దేశపు మనుష్యులతో మాట్లాడడము సత్యరాజాకు కష్టమైన పని అయింది. ఎందుకంటే మనము ఎంతపెద్దగా అరచినా వాళ్ళకు గుసగుసల్లాగ వినిపిస్తవి. మనం పెద్దగా అరచినా వాళ్ళకు వినపడక, ఏమిటయ్యా, నీ కీచుకీచులు అంటారు. వాళ్ళు మాట్లాడుతూఉంటే మనకు సింహాలు గర్జిస్తున్నట్లూ, ఉరుములు భయం కరంగా ఉరుముతున్నట్లూ ఉంటుంది. సత్యరాజా ఆ దేశంలో ఉన్నన్ని నాళ్లూ చెవులలో దూదిదిండ్లు పెట్టుకొనేవాడు. లేకపోతే చెవులు బద్దలై పోయేవి.

*ఆ దేశంలో మనిషి 200 అడుగుల ఎత్తు:* ఆ దేశాన్ని గురించి ఇంకా తమాషాఅయిన విషయాలు చెప్పాడు గ్రంథకర్త. అవన్నీ చెపితే మళ్ళీ అంత పుస్తకం అవుతుంది ఎంత క్లుప్తీకరించినా. అందుకని ఆ గ్రంథకర్త అతిశయోక్తిని హాస్యసాధనగా వాడుకొన్న రెండుమూడు విషయాలను గురించి మాత్రమే చెపుతాను. ఆ దేశంలో యాభై అడుగుల ఎత్తుగలవానిని పసివానినిగా భావిస్తారు. యువకులు సాధారణంగా నూరు అడుగుల ఎత్తుంటారు. బాగా పెరిగినవారు రెండు వందల అడుగుల పొడుగు ఉంటారు. ఇంకా యెక్కువే ఉంటారు.

మన ఆయుఃప్రమాణము నూరు సంవత్సరాలయితే వాళ్ళ ఆయుఃప్రమాణము నాలుగువేల ఏండ్లు. అక్కడ మంచి యెత్తరి అయినవాడు యెంత పొడుగో సరిగ్గా చెప్పలేము గాని, అటువంటివాడు సముద్రంలో నడుస్తుంటే, మోకాలులోతు నీళ్ళలో నడుస్తూ ఉన్నట్లు కనపడుతుంది.

*రాక్షసుల పేర్లు :* వాళ్ళ పేర్లుకూడా తమాషాగా ఉంటాయి. మహాకాయుడు, హిమాచలము, కైలాసగిరి, దీర్ఘరోముడు, వృశ్చికరోముడు ఇట్లా ఉంటవి వారి పేర్లు. అంగుష్ఠమాత్ర శరీరంగల సత్యరాజా సంగతి విని, జనులు తీర్థప్రజవలె వచ్చారు ఆయనను చూడడానికి. వాళ్ళ శాస్త్రంలోకూడా వాలఖిల్యమహాఋషి ప్రశంస ఉన్నది. 'అందుకని వాళ్లు సత్యరాజాను వాలఖిల్యమహాఋషి అనుకొని, ఆయనకు పండ్లను కానుకగా అర్పించడముకూడా సాగించారు. మహాకాయుని కుటుంబానికి ఫలహారానికి పనికివచ్చేవి అవి. సత్యరాజా ఒక పండో, అందులో సగమో తినేవాడు.

*సత్యరాజా పందికొక్కు నోట్లో పడ్డాడు :* ఒకరోజున సత్యరాజాచార్యులకు మరో పెద్ద ఆపద సంభవించింది. ఏదో ఒక భయంకరమైన జంతువు ఆయనను నోట కరచుకొని ఈడ్చుకొని పోసాగింది. పెద్దపులి నోట్లో పడ్డానురాబాబూ అనుకొన్నాడు సత్యరాజా. ఉక్కిరి బిక్కిరి అయి తన్నుకొన్నాడు. అయినా ఆ జంతువు ఆయనను వదలక లాక్కుపోయి చివరకు మురుగుకాలవలో పడేసింది. అక్కడ ఊపిరిఆడక చావవలసిందే కాని ఆ దారిని పోతూ ఉన్న ఒక రాక్షసకన్య ఆయనను కాపాడి ఆడుకొంటానికి బొమ్మగా పనికివస్తుందని ఆయనను చెంగున మూటకట్టుకొని ఇంటికి తీసుకుపోయింది ఎవ్వరన్నాచూస్తే యెత్తుకొనిపోతారని భయపడి. ఆ పిల్ల ఈ సత్యరాజాను తన గుడ్డలపెట్టెలో పడేసి మూత వేసింది. అక్కడ మెత్తని చెట్టుగుడ్డలపై పడుకొని, ఇదీ ఒకందుకు మంచిదే అయింది, నన్ను ఇక్కడనుంచి పక్షిగాని, జంతువుగాని యెత్తుకు

పోలేదు. గాలికూడా బాగానే ఉంది అనుకొన్నాడు. తనను లాక్కెళ్ళి మురుగుకాలువలో వదిలివేసింది వాళ్ళ దేశపు పందికొక్కు అని దాని తరువాత తెలిసింది ఆయనకు.

సత్యరాజా ఆ బట్టలపెట్టెలో కాపురం చేయసాగాడు. ఆ పిల్ల ఆయనను ప్రతిరోజూ ఒకసారి బైటకుతీసి స్నానం చేయించి, భోజనం పెట్టి, మంచిబట్టలు తొడిగి కాసేపు ఆయనతో ఆడుకొని మళ్లా ఆ పెట్టెలో పెడుతూ ఉండేది.

*మత్కుణాసుర వధ:* ఆ జీవితం బాగానే ఉంది ఆయనకు. కాని ఒకరోజున మరో ఆపద వచ్చింది. ఒక నల్లి ఆయనను పట్టుకొన్నది. అది ఎలుకంత పెద్దది. అంత పెద్దనల్లి కొరుకుతూ ఉంటే యెంత బాధ! ఎంత కొట్టినా అది కదలక, సత్యరాజా శరీరాన్ని పీకి రక్తం త్రాగడం సాగించింది. అంత పెద్ద నోరుగల జంతువ రక్తం త్రాగుతూ ఉంటే మనిషి యెంతసేపు బ్రతుకుతాడు ? ఇంకా కాసేపు అల్లాగే ఊరుకొన్నట్లయితే హరీ అనేవాడు. కాని సత్యరాజా ప్రాణరక్షణకై దానితో పోట్లాడాడు. ఎత్తి విసిరికొట్టాడు. గుద్దాడు. అది చావలేదు. చివరకు అదృష్టవశాత్తు ఆయనకు ఆ పెట్టెలో ఒకమూల బట్టల అడుగున ఒక చాకు కనిపించింది. సత్యరాజా ఆ మత్కుణాన్ని, ఆ కత్తితో పొడిచి చంపాడు ఆఖరుకు. దీనినే మత్కుణాసుర యుద్ధము అన్నాడు గ్రంథకర్త. ఆ కథ యొక్క ఫలశ్రుతికూడా, ఇంకో సందర్భంలో చెప్పాను. ఇప్పటికి అతిశయోక్తి హాస్యసాధనకు యెంత బాగా ఉపయోగపడుతుందో బాగా తెలుసుకొన్నాము.

*మరియొక అతిశయోక్తి-చలిమహాత్మ్యము :* చలికి శరీరం బిగుసుకుపోతుంది. నూనె పేరుకుపోతుంది. చలి ఇంకా ఎక్కువఅయితే నీరు గడ్డకడుతుంది. చలిప్రభావంవల్ల ఈ వస్తువులన్నీ తమ ద్రవ్యత్వ ధర్మాన్ని కోల్పోతవి. ద్రవరూపంలో ఉన్నదానిని చలి ఘనీభవింప

జేస్తుంది. ఘనరూపంలో ఉన్నవానిని చలి కుంచింపజేస్తుంది. చలికి ఉన్న ఈ ప్రాకృతధర్మాన్ని అతిశయింపజేసి నవ్వును పుట్టించేటంతటి వికృతం చేయవచ్చు.

*చలికి మాటలు గడ్డకట్టుకుపోయినవి* : హిమాలయపర్వత ప్రాంతాలను దర్శించివచ్చిన ఒకహాస్యప్రియుడు ఇల్లాఅన్నాడు. "అబ్బో! అక్కడ నీళ్లు కనపడవు. మంచుమయం. మంచుముక్కలు నోట్లో వేసుకొని దాహం తీర్చుకోవలసిందే. నీళ్లు గడ్డకట్టుకుపోతవి. నీళ్ళేమిటి మనుష్యులూ అంతే. ఖర్మంజాలక ఎక్కడన్నా నీటిమడుగులో పడ్డాడా మనిషి అతడు రాతివిగ్రహం అయిపోతాడు. అక్కడవున్న మనుష్యులు ఒకరితోనొకరు మనమో స్తరుగా మాట్లాడుకోవడానికి వీలులేదు. ఒకరు మాట్లాడితే ఆ మాటలు వడగళ్లలాగ భూమిమీదపడతై. ఆ రెండోవాడు ఆ వడగండ్లను ఏరి కాలుతున్న పెనంమీదవేసి వేయిస్తే మళ్ళీ ఆ మాటలు నిజరూపాన్నిపొంది మాటలుగా వినిపిస్తవి. చలికివున్న సహజధర్మాన్ని అతిశయింపజేసి ఈ విధమైన చమత్కారం సాధించాడు రచయిత.

*గింజ భూమిమీద పడేపడడంతోనే మొక్కఅయి కూర్చుంటుంది* : ఈ కథ వినండి. మరోప్రదేశాన్నిగురించి చెపుతున్నాడు. అక్కడ భూమి మిక్కిలి సారవంతమైనది. ఎంతసారవంతమైనదీ అంటే అక్కడ భూమిమీద గింజ పడేపడడంతోనే మొక్కఅయి కూర్చుంటుంది. ఆ కారణంచేత కోళ్లకు ఆహారం వేయడము కష్టము. మనము ఏవైనా గింజలు ఆహారంగావేస్తే అవి భూమిమీద పడకముందే కోళ్ళు వాటిని లటక్కిన ముక్కుతో అందుకోవాలె. అందుకోలేకపోతే ఆ గింజలు భూమిమీదపడి మొక్కలుమొలిచి, కాయలుకాచిందాకా ఉండి ఆ కాయను చీల్చి గింజలుతీసుకొని తినాలె. ఈ పనిఅంతా జరగడానికి పదినిమిషాలు ఆలస్యం అవుతుంది.

*రాత్రినాట్లు ఉదయం కోతలు :* అక్కడ మనుష్యులు మనలాగ భూమినిదున్ని పంటలు పండించుకొని ధాన్యాన్ని నిలబోసుకోరు. ఎందుకూ, అటువంటి అవసరమే ఉండదువారికి. సాయంత్రం ఒక యాభై గజాలమేర బాగుచేసి మనకు కావలసినధాన్యం, వడ్లో జొన్నలో గోధుమలో, కందులో, పెసలో అక్కడ చల్లామా ప్రొద్దున నిద్రలేచే సరికి పంటసిద్ధంగావుంటుంది. పండ్ల విషయంలోనూ అంతే సాయంత్రం పండ్ల మొక్కలను భూమిలో నాటడమూ, ప్రొద్దున పండ్లను చెట్లనుంచి కోసుకుతినడమూ! ఏరోజుకారోజు ఇల్లాగ కావలసిన పండ్లు కాయించు కోవచ్చు. ఒకవిషయాన్నిగురించి ఇల్లాగ అతిశయోక్తులు పలుకడాన్నే మామూలుభాషలో డాబులుపలకడమూ, కోతలుకోయడమూ అంటారు.

*భీమాకంపెనీ ఏజంట్ల కోతలు :* ఒక భీమా కంపెనీ ఏజెంటు తన కంపెనీ, పాలసీదారు వారసులకు భీమా మొత్తం అతిత్వరితంగా ఇస్తుం దని చెపుతూ ఇల్లా అన్నాడు. "ఒకాయన మా కంపెనీలో భీమా చేసిన ఆయన, కర్మవశాత్తు చనిపోయినాడు. బంధుగులు ఆయనను తీసుకెళ్ళి దహనంచేసి వచ్చారు. వాళ్లు వచ్చేలోపుననే కంపెనీవారు భీమా మొత్తానికి చెక్కువ్రాసి ఇంటికి పంపారు" అని. ఈ మాటలు వింటూ ఉన్న మరో ఏజెంటు అంతకంటె యెక్కువైన డాబులు కోశాడు. "మా కంపెనీ న్యూయార్కులో ఉంది. ఆ పట్టణంలో నూరు అంతస్తుల మేడలుకూడా ఉంటవి. అటువంటి మేడలో ఉన్న ఒక పెద్దమనిషి మా కంపెనీలో భీమా చేశాడు. ఒకరోజున ఆయన ప్రమాదవశాత్తు తానున్న 99 వ అంతస్తు నుండి క్రిందికి పడ్డాడు. మా కంపెనీ ఆ మేడలో పదియవ అంతస్తులో ఉంది. ఆ ప్రమాదానికి గురియైన మనిషి 99 వ అంతస్తులోనుంచి పది యవ అంతస్తుకు వచ్చేలోపుననే ఆయన తన జీవితాన్ని యెంతకు భీమా చేశాడో అంత మొత్తానికి చెక్కువ్రాసి, ఆ పడుతూఉన్న ఆయన చేతికే ఇచ్చాడు. ఆ చెక్కు చేత్తోపట్టుకొనే ఆయన క్రిందపడి మరణించాడు. భీమా మొత్తాన్ని తొందరగా ఇయ్యడం అనే విషయాన్ని అతిశయోక్తు లతో పొదిగి ఈ కథలను తయారు చేశారు.

*మరికొన్ని కోతలు:* ఏ విషయాన్ని అయినా సరే ఒక కొసకు లాగితే ఒక ఎత్తుకు పెంచితే వికృతి సిద్ధించి హాస్యానికి ఆలంబనం కాక తప్పదు. ధైర్యగుణాన్నిగురించి, అతిశయోక్తులు చూడండి ఈ కథలో. ఒకాయన అన్నాడు ఒకమారు మా ఊరుదగ్గర ఉన్న అడవిలో నేను తిరుగుతున్నాను. ఆ అడవిలో సింహాలు ఎక్కువగా తిరుగుతుంటవి అన్న సంగతి అందరికీ తెలిసినవిషయమే. మేము ఇద్దరం స్నేహితులము వెడుతున్నాము సింహాలు మాకు అల్లంతదూరంలో గాండ్రు గాండ్రుమంటూ ఉన్నవి. మనిషి ధైర్యంగా ఎదుర్కొంటే సింహము ఏమీచేయలేదు. అవి కనపడినప్పుడల్లా మేము హూష్ హూష్ అని కేకేస్తే అవి భయపడి వెళ్లిపోతూ ఉండేవి.

*మీసాలు పట్టుకొని లాగితే సింహం పిల్లి అవుతుంది:* ఒకసారి ఏమైందీ అంటే నేను ఆ భయంకరమైన అడవిలో ఒక్కణ్ణి అయిపోయినాను. ఎందుకంటే నా మిత్రుడు యెందుకో వెనుకబడ్డాడు. అప్పుడు సింహము ఒకటి గాండ్రు గాండ్రుమంటూ నాపైకి దూకింది. నేను పరధ్యానంగా ఉండి అది రావడము చూడనేలేదు. మీదికివచ్చేసింది. ఏంచెయ్యాలె అని కాస్త ఆలోచించాను. సింహానికి ఎదురుగావెళ్లి మీసాలుపట్టుకొని సాగదీశామా అది పిల్లిఅయిపోతుందని చిన్నప్పుడు ఎప్పుడో ఎక్కడో చదివిన విషయం జ్ఞాపకంవచ్చింది. సింహానికి పంచప్రాణాలు దాని మీసాల్లో ఉంటవట. మీసాలుపట్టుకొని సాగదీశామా సింహము సాధువైపోతుందన్నమాట నిజమే! ఈమాట జ్ఞాపకం రావడముతోనే నేను చటుక్కున నాపైకిదూకిన సింహము మీసాలుపట్టుకొని గుంజాను. గుంజేసరికి అంతభయంకరమైన సింహమూ కుక్కలాగ తోకాడిస్తూ కుయ్ కుయ్మన్నది. ఛా, ఇంకా దీన్ని బాధపెట్టడము ఎందుకని దానిమీసాలు మాత్రం పీకిపారేసి దాన్నివదిలేస్తి, పొమ్మని నెట్టివేశాను. ఇట్లాచెప్పి ప్రక్కనున్న మిత్రునివంక చూశాడు. అది నిజమా అబద్ధమా చెప్పుమన్నట్లు.

*సింహము తోకఆడించింది :* ఆ మిత్రుడు నవ్వుతూ ఇల్లాఅన్నాడు. "నిజమే ఆయనచెప్పింది. దానితరువాత అదే సింహము నాదగ్గరకు వచ్చింది ఏడుస్తూ. దాని పై పెదవినుండి రక్తం కారుతున్నది. ఏమిటా అని నేను దానిదగ్గరకువెళ్ళి ఆ రక్తం ఉన్నప్రదేశమంతా చిన్న తడి గుడ్డతో తుడిచి, కాస్త బోరిక్‌పౌడరు చల్లాను అక్కడ. నాదగ్గర అది పిల్లిలాగ్గా ప్రవర్తించింది మీసాలులేని కారణాన. అక్కడేవున్న మూడో మిత్రుడు ఈ సంగతి నాకు ఇంతవరకు చెప్పలేదేమర్రా! మనం అంతా ఒకదగ్గరే ఉన్నాముకదా, నాతో మాటమాత్రంఅయినా అనక పోయినారా! అన్నాడు.

*సింహాన్ని గొడ్లసావిట్లో కట్టేశాను :* చెప్పకపోవడంవల్ల ఏమి జరిగిందని అంతాఅడిగారు ఆయన్ను. ఆయన ఇల్లాగ చెప్పాడు. "మరేమీ ప్రమాదం జరుగలేదులే. నేను మొన్ననే ఆ అడవిలోనుంచి ఒకసింహాన్ని తోలుకొచ్చి మా గొడ్లసావిట్లో కట్టేశాను. దానికి మీసాలు ఊడిపోయి వున్నవి. పైగా ఆప్రదేశంలో అంతటా తెల్లనిపౌడరు చల్ల బడివున్నది. ఏమిటా ఇది అనుకొన్నాను. మీరుచేసినపని అన్నమాట ఇది." ఈ కథలోవున్న ముగ్గురువ్యక్తులూ ఒకరికంటె ఒకరు ఎక్కువగా కోతలుకోశారు తమ ధైర్యసాహసాలనుగురించి.

*పొగతో ఎలుగుబంటి చచ్చింది:* ఈ కథలో ప్రకటితమైన అతిశయోక్తి మనోహరంగా ఉంది. ఒక యువకుడు స్నేహితునితో చెపుతున్నాడు ఈ కథ. "మా తాతగారూ నేనూ ఒకసారి మా గ్రామానికి సమీపంలో ఉన్న అడవిలోనికి వెళ్ళాము. ఒక చెట్టుక్రింద కూర్చున్నాము. మా తాతగారు కబుర్లు చెపుతూ చుట్ట కాల్చుకొంటున్నాడు. ఇంతలో ఒక భయంకరమైన ఎలుగుబంటి మా మీదికి వచ్చింది. అది గుర్రం అంత ఎత్తున ఉంది. దాని శరీరంపై వెంట్రుకలు గజం పొడుగున ఉన్నవి. నాకు హడలు పుట్టింది. కాని మా తాతగారు దానిదగ్గరకొచ్చి చుట్ట బాగా

పిల్చి ఉఫ్‌న దాని ముఖంపై ఊదాడు, ఆ పొగకు ఆ ఎలుగుబంటి ఉక్కిరి బిక్కిరి అయింది. నోరు తెరువలేకపోయింది. మా తాతగారు మళ్ళీ చుట్ట పీల్చి దాని కాళ్ళపై ఊదాడు. దాని కాళ్లు పడిపోయినవి. అది లేవలేక కుప్పగా కూలిపోయింది. మళ్ళీ చుట్టపీల్చి మూడోసారి ఊదేసరికి అది చచ్చి ఊరుకొంది."

*ఈ రకము హాస్యానికి ఇంకో ఉదాహరణ:* ఒక క్యాలిఫోర్నియా వాసి అంటాడు."మా దేశంలో క్యాబేజీలు ఎంత పెద్దవీ అంటే, ఒక్కొక్క క్యాబేజ్ క్రింద వందమంది మనుష్యులు నిల్చోగలరు." ఆమాటలు విన్న న్యూ ఇంగ్లండు వాస్తవ్యుడు అన్నాడూ-"మా దేశం సంగతినీవు వినలేదు. అక్కడ కాగులు చేస్తారు. ఒక్కొక్క కాగు ఎంత పెద్దదీ అంటే దాని అంచు మణచడానికి ఒకవైపున వెయ్యిమంది సుత్తెలతో బాదుతూ ఉంటే రెండోవైపున పనిచేస్తున్నవారికి ఏమీ వినపడదు. క్యాలిఫోర్నియా వాసి ఆశ్చర్యపోయి అంత పెద్దకాగులు ఎందుకయ్యా? అని అడిగాడు. రెండో పెద్దమనిషి అన్నాడు, "మీ దేశంలో పండే ఆ క్యాబేజీలు వండడానికే" అవి చేస్తున్నారని. ఈ కథలోని వ్యక్తులిద్దరూ ఒకరిని మించి ఒకరు అతిశయోక్తులు పలికారు. ఈ కథ వ్యంజనద్వారాకూడా మనోజ్ఞమైన వాగ్వ్యాపారము అయింది. మొదటి వ్యక్తితో అబ్బాయీ నీవు చెప్పినది ఎంతనిజమో నేను చెప్పినదీ అంతే నిజముసుమా అని చెప్పినట్లు అయింది. ఈ రచనను ఆశ్రయించుకొనిన చమత్కారంకూడా స్పృహణీయమైనదిగా ఉన్నది.

*ఇంకో చిన్న కథ:* మా ఊళ్ళో ఒక సరస్సు ఉంది. ఆ సరస్సులోని నీళ్ళు ఎంత నిర్మలమూ అంటే మనము ఆ సరస్సులోకి చూస్తే సరిగ్గా మనదేశానికి అడుగుభాగంలో ఉన్న అమెరికాలోనివాళ్లు ఏమి చేస్తున్నది కనపడుతుంది. ఇది మరీ చిత్రంగా ఉంది.

ఈ అతిశయోక్తిని రచనలో ఒక అలంకారంగా వాడడము మన పూర్వులకూ, ఆధునికులకూ తెలిసినవిషయమే. ఒకవిషయాన్ని అతిశ

యింపజేయడము ఒకవిధంగా జరిగితే అది కవితాగుణమును సంతరించు కొంటుంది. అదేపని నవ్వుజనింపచేయాలనే ఉద్దేశంతో జరిగినట్లయితే అది అహోపురుషికము అనేహాస్య ప్రక్రియక్రిందికి వస్తుంది.

*వ్యంగ్యచిత్రాలు* : వ్యంగ్యచిత్రాలవల్ల హాస్యం పుట్టించవచ్చు. అతిశయోక్తివలన హాస్యం జనింపజేయడం వంటిదే ఇదిన్నీ. **The humour of the cartoon is Fundamentally Exaggerative** అన్నాడు ఈస్టమన్. మనిషిలోవుండే ఒకవిశిష్టతను, వైపరీత్యాన్ని ప్రత్యేకతను పెంచి, పొడిగించి అతిశయింపజేసి వ్యంగ్యచిత్రాన్ని రూపొందిస్తాడు చిత్రకారుడు. ముక్కు పొడుగుగావుంటే దానిని మరీపొడుగు జేసి, ముఖంఅంతా ముక్కుజేసి బొమ్మలో దానిని ప్రధానం చేసివేస్తాడువ్యంగ్య చిత్రంలో. మేధావిని చిత్రించాలంటే తల పీపాఅంత చేస్తాడు ఆ వ్యంగ్య చిత్రకారుడు. మందమతి తలను చిన్నదిగా దబ్బకాయంతగా చిత్రిస్తాడు. ఆశ్చర్యాన్ని చూపడానికి వెంట్రుకలు నిక్కపొడుచుకొన్నట్లు చూపుతారు. వ్యంగ్యచిత్రం మనిషిలోవుండే ఏ విలక్షణానికో అవలక్షణానికో ప్రాతినిధ్యం వహించి ఉంటుంది. ఉన్న విలక్షణాన్నో అవలక్షణాన్నో గోరంతలు కొండంతలుచేసి హాస్యస్ఫోరకము చేస్తాడు వ్యంగ్యచిత్రకారుడు. **Cartoons are strictly representative.**

ప్రేమ, క్రౌర్యము, ద్వేషము, వాత్సల్యము మొదలైన సుగుణాలనుకూడా ఈ చిత్రాలలో ప్రదర్శించవచ్చును ఈ చిత్రాలను మనము మొదటిసారి చూచినపుడు స్ఫురించని అర్థము కొంచెముసేపు అయిన తరువాత మనస్సుకు తెలుస్తుంది. మరొక హాస్యరచనా విమర్శకుడు **caricature is Fundamentally an art of Exaggeration** అన్నాడు. పద్యం చదవడములో గాని ఉపన్యాసం ఇయ్యడంలోగాని ఒక ప్రసిద్ధుని అనుకరించి నవ్వించవచ్చును. అట్లా అనుకరించడములో మనిషిలోగల ఒకప్రత్యేకతకు ప్రాధాన్యం ఇస్తాడు హాస్యానుకరణ చేసే

వాడు (mimicry) వెక్కిరింతలోకూడా అతిశయోక్తికి చాలా ప్రమే యం వుంది.

శక్తిమూల హాస్యము ఎన్నివిధాల సాధించవచ్చునో చూశాము. ఇవన్నీ రమణీయమైన పద్ధతులే. రచయితయొక్క ప్రతిభనుబట్టి ఈ రామణీయకత పెరుగుతూవుంటుంది. ఈపద్ధతులన్నిటిలోనూ అపహాస్యం లీలగా భాసిస్తూనేవుంటుంది. అతిశయోక్తికూడాఒకరకమైన వెక్కిరింపే. ఇదంతా శక్తిమూలహాస్యంలో అపహసితమూలకము. అనే విభాగం లోనిది.

అతిశయోక్తివంటిదే బర్-లెస్కు అనే హాస్యప్రక్రియ ఒకటి వుంది. ఒకవిధంగాచూస్తే హాస్యానుకరణ (parody) అతిశయోక్తి (Hyperbole), వెక్కిరింత (Ridicule) వ్యంగ్యచిత్రణము, బోధాభాస (Nonsense) బర్-లెస్కు (Burlesque) ఇవన్నీ ఒకతల్లి బిడ్డలే. ముందుగా ఒకటిరెండు ఉదాహరణలు ఈ బర్-లెస్కును గురించి ఇచ్చి అటుతరువాత అభిభాషణమూలకమైన హాస్యాన్ని గురించి చెపుతాను. ఈ రచన చదవండి.

*బర్-లెస్కు :* "ఆరోజు చలి అమితంఅయింది. అడవిలోని చెట్లు అన్నీ చలికి ముడుచుకుపోయినవి. మఱ్ఱిమాకులుకూడా వెంపలి చెట్లంతఅయినవి. కదలలేవు మెదలలేవు. అప్పటికి సూర్యోదయం కావలసినసమయం అయింది. ప్రపంచంలోని నిప్పు అంతాగడ్డకట్టుకుపోయింది. భూమిఅంతా గడ్డకట్టుకొనిపోయింది. భూమి సూర్యునిచుట్టూ తిరగడం మానేసింది. సూర్యుడు ఎక్కి తిరిగే రథం మంచులో కూరుకుపోయింది. ఆయనకూడా స్థాణువు అయిపోయినాడు. ఆయన ఎట్లాగయినా తెల్లవార్చాలని ప్రయత్నం చేస్తున్నాడు. సృష్టిఅంతా స్తంభించిపోయింది. అప్పుడు నేనువెళ్లి సూర్యుని రథచక్రాలను రెండుతాపులు తన్నితే మంచు అంతా పెళ్లికలలాగా ఊడిపడ్డది. రథము మెల్లగా కదిలింది. బిగుసుకు

పోయిన భూమిని రెండుమూడుసార్లు మనిషిని బుజాలుపట్టుకొని ఊపి నట్లుఊపి దార్లోపడేనేటప్పటికి తలప్రాణం తోక్కొచ్చింది." ఒకఇంగ్లే యుడు ఈ హాస్యరచనను బర్‌లెస్కుకు ఉదాహరణగా ఇచ్చాడు.

*అన్నీ ఒకతల్లి బిడ్డలు :* బర్-లెస్కు అనే హాస్యప్రక్రియను తెలుగులో ఏమనాలో నాకుతెలియలేదు. అసంగతము, సందర్భశుద్ధి లేక పోవడము, వెక్కిరింత, అతిశయోక్తి సమపాళ్లగా కలిపితే బర్-లెస్కుగా తయారుఅవుతుందని నాకుతోచింది. ఇది నాన్‌సెన్సుకు అతి సన్నిహితమైన వ్యాపారము. నాన్‌సెన్సుకు బర్-లెస్కుకు భేదం చెప్పలేము. రెండూ కవలపిల్లలలాగుంటవి స్వరూపంలో. మళ్ళీ అవి వేరువేరుగా హాస్యసాధనకు మార్గాలు. బర్‌లెస్కుకు మంచి ఉదాహ రణ దొరకలేదు. ఇప్పుడు చెప్పింది కొంతవరకు సరిపోతుంది.

ఈక్రింది రచన మరొక ఉదాహరణ. "ఆరోజున స్కాట్లెండు తూర్పుతీరము అంతా గందరగోళంగావుంది. అక్కడ సముద్రములో పెద్దతుపాను రేగింది. నానాభీభత్సంగావుంది. ఆ విషయం మనకథకు సంబంధంలేదు. ఆమాటకొస్తే స్కాట్లెండు పశ్చిమతీరమూ, ఉత్తర సముద్రతీరమూ, అన్నీ అల్లాగేవుంటవి. అయినా మనకథ జరిగింది అక్కడకాదు. ఇంగ్లాండు దక్షిణ సముద్రతీరమున. ఆ ప్రదేశంఅంతా ఒకరాజు పరిపాలనలో ఉండేది. ఆ రాజుపేరు "క్నో-ట్ర్యాక్-స్ప్రెన్-ట్వెక్-స్నాత్ర్య" కాని సాధారణంగా "నో-ట్రం-ట్వీ" అంటారు. ఆరాజ్యా నికి రాజధాని "క్నెక్-ట్మాక్య-స్వెం-ట్వ్యకో" అయితే ఆ పట్టణాన్ని చదువుకోనివాళ్లంతా 'క్నోస్పెట్' అంటారు.

*ఆపేర్లు ఉచ్చరింపలేకపోయినా ఫరవాలేదు :* అయితే ఈ కథ చదివేటప్పుడు ఆ పేర్లను సరిగా ఉచ్చరింపలేకపోతే వచ్చిన ఇబ్బంది ఏమీలేదు. వాళ్లకూ కథకూ సంబంధం ఏమీలేదు. ఆ రాజ్యంలో కథ జరిగింది కాబట్టి ఆదేశాన్ని పాలించిన రాజు పేరు చెప్పాను. చెప్పకపోతే

మర్యాదగా వుండదుఅని. "ఏమయ్యా నాదేశంలో జరిగిన కథవ్రాస్తూ దేశానికి రాజునైన నాపేరు చెప్పవా" అనిఅంటాడనిభయం. ఆయన ఈ మధ్యేనాలుగువందల యనభై ఏండ్ల క్రిందట చనిపోయినాడు.ఆయన నివసించిన భవనము ముందుభాగమంతా చళుక్యశిల్పముతో విరాజమానమై ఉండేది. వెనకభాగము గోడలపైన పల్లవులకాలంనాటి శిల్పసంపద వున్నది. మధ్యభాగము ఎట్లాగో తమాషాగావుండేది. కాబట్టి ఒక్కొక్క భాగము ఒక్కొక్కయుగంలో కట్టించినట్లుంది. ఆయనదగ్గర ఇద్దరు నౌకర్లు వుండేవారు ఒక స్త్రీ ఒక పురుషుడు. స్త్రీ చాలా తమాషాఅయిన మనిషి.

*ఆమె అచ్చంగా ఆడమనిషిలాగేవుండేది* : "ఆమెఅచ్చంగా ఆడదానిలాగేవుండేది. అయితే ఆమెకు నూనూగుమీసాలు వుండడంకూడా ఒక అందంగానేవుండేది ఆ రెండోవ్యక్తి మగవాడు. వాడూ సరిగ్గా మగవాడిలాగే వుండేవాడు. అయితే గుర్రంలాగ నడిచేవాడు. పిల్లిలాగ చూచేవాడు వసపోసినపిట్టలాగ మాట్లాడేవాడు. కంఠస్వరం గాడిద కంఠస్వరము. వాని శరీరం సుకుమారంగా సున్నితంగా సుందరంగా మృదువుగా దున్నపోతు శరీరంలాగ వుండేది.''

ఈ ధోరణిలో వున్నవి ఆ కథలోని వాక్యాలు అన్నీ."ఈ సరుకు మనదేశంలో అమ్ముడుపోదు. అందుకనితేలేదు. ఇది కొత్త మచ్చుకు తెచ్చాను. ఈ కథ అంతా స్పానిష్‌భాషలోవుంది. ఉన్నదని ఫ్రెంచి రచయితకు తెలుసునని గ్రీకులో చాలాపుస్తకాలు వ్రాసిన ఒకప్రసిద్ధ కవి అన్నాడని ఆంగ్లకవి పేర్కొన్నాడు. కథ పేర్కొన్నాడుగాని అందులో నుంచి ఒకభాగమైనా ఉదాహరణగా ఇయ్యలేదు. స్పానిష్‌లో ఇట్లా ఉండివుంటుందని నేనేఊహించాను." ఇది బర్-లెస్కు కావచ్చును.

అభిభాషణ మూలకము -

ఒక సంస్థనుగానీ ఆచారాన్నిగానీ అలవాటునుగానీ సంప్రదాయాన్నిగానీ అవహేళనచేసి సాధించిన చమత్కారాన్ని అపహసితమూలక

మైన హాస్యము అన్నాము. అటువంటి అపహాస్యప్రమేయం లేని హాస జనకమైన ప్రసంగాన్ని ఏమనాలె అని ప్రశ్న వేసుకొని దానికి అభిభాషణ మూలకము అని పేరు పెట్టడము జరిగింది. మొదటిదాంట్లో చమత్కారము ఎవరినో దేనినో ఎగతాళి చేయడంలో ఉన్నది. అది అయినా ధ్వని నిక్షిప్తము. అటువంటి లక్షణాలు ఏమీలేక కేవలమూ భాషణలో ఉండే ఒకానొక విశిష్టతవలన చమత్కారమును భాసింపజేసినట్లు అయితే అటువంటిదానిని అభిభాషణమూలకమైన హాస్యము అన్నాను. తన్ను తాను పొగడుకోవడముగాని తన్ను తాను నిందించుకోవడముగాని నవ్వుపుట్టించే పద్ధతిలో నడిస్తే అటువంటి రచనవలన సముద్భవించు హాస్యాన్ని అభిభాషణమూలక హాస్యము అందాము. ఇది పరిహాసాత్మకము కాక జుగుప్సా శూన్యమై హాసప్రేరకమై రమణీయమైన వాగ్వ్యాపారంగా భాసించినపుడే దానికి సాహిత్యగౌరవం లభిస్తుంది.

ఆత్మోత్కర్ష :

ఆత్మోత్కర్ష అంటే తనను తాను పొగడుకోవడం. తనను తాను పొగడుకుంటే తన్నుకొన్నట్లు ఉంటుందని లోకోక్తి. తన్ను తాను పొగడుకొనుటలో గర్వము కనిపిస్తూనే ఉంటుంది. ఆత్మోత్కర్షా పరావహేళనమూ, కలిసే ఉంటవి. తనను గురించి తాను గొప్పగా చెప్పుకోవడంలో పరమసత్యాన్ని వచించడము ఎప్పుడూ ఉండదు. ఒకవేళ సత్యాన్నే వచిస్తే అది హాస్యప్రతిపాదకం ఎప్పుడూ కాదు. లేనిపోని గొప్పలు చెప్పుకొంటేనే నవ్వు వస్తుంది. వట్టి పిరికివాడు తాను మహాధైర్యసాహసోపేతుడనని చెప్పుకొన్నప్పుడే నవ్వు వస్తుంది.

*ఉత్తరుడు అనలేదు అంటే — అది హాస్యము అయ్యేది :* కౌరవ సైన్యాన్ని చూచి పారిపోతూ ప్రాణాలు దక్కించుకొంటానికి ప్రయత్నించిన ఉత్తరుడు ఇంటికివచ్చి, "కొట్టేశాను, కౌరవసేనను దుమ్ము రేగగొట్టాను, ఆ ప్రదేశాన్నంతా నిర్ధూమధామం చేశాను. నేను ఎంత చిన్నవాణ్ణి! అయినా శకుని, జయద్రథ, దుర్ముఖ, వికర్ణ, కర్ణాది యోధ

వీరులు, నా ప్రతాపానికి తట్టుకోలేక తోక ముడిచారు. ఇంకా కాసేపు అట్లాగే యుద్ధం నడిస్తే, కౌరవసేన అంతా హతమైపోతుందని భయపడి అర్జునుడు నన్ను యుద్ధం చేయనీయక రథసారధ్యం చేయమన్నాడు. ఏదో పెద్దవాడు చెప్పాడుగదా అని ఆయన చెప్పినట్లు వినబట్టి బ్రతికి పోయినారు కాని లేకపోతే, కృపాచార్యులు భీష్మాచార్యులు వీళ్ళంతా ఈ పాటికి శృంఖలాబద్ధులై మనముందు నిలబడి ఉండేవారు" అని కోతలు కోసినట్లు తిక్కన వ్రాయలేదు గాని, వ్రాసినట్లయితే ఆ ఉదంతం అంతా హాస్యమయం అయిపోయేది. అది హాస్యగర్భితమైన ఆత్మోత్కర్ష.

*ఫాల్‌స్టాఫ్ :* "షేక్స్పియర్ నాటకాలలో ఫాల్‌స్టాఫుఅనే హాస్య శీలుడు కనపడుతాడు. అతడొకసారి తన అనుచరులతో కలిసి ధనముతో ప్రయాణం చేస్తూఉన్న బాటసారులను దోచుకోవలెనని ప్రయత్నిస్తాడు. కాని ఆ ప్రయత్నంలో ఫాల్‌స్టాఫ్ తన్నులు తింటాడు. అతడు చాలా స్థూలకాయుడు. నడివయస్సులో ఉన్నవాడు. ప్రయాణీకులు ముగ్గురు. ఆ ఫాల్‌స్టాఫూ అతని అనుచరులు కలిసి అయిదుగురు ఉన్నారు. కాని ఈ అయిదుగురూ ఆ ముగ్గురితో తలపడి, దెబ్బలుతిని అవమానాన్ని పొందుతారు." ఇదీ జరిగిన కథ. అయితే ఫాల్‌స్టాఫ్ దీనిని ఎట్లా మలిచి చెపుతాడో, ఎన్ని ప్రగల్భాలు పలుకుతాడో చూడండి.

*వాళ్లు పిరికివాళ్లు :* అతడు చెపుతున్నాడు. "నేనూ నాఅనుచరులూ దారి కాచాము. వాళ్ళుగుర్రాలపైని ధనపుసంచులు వేసుకొని వస్తున్నారు. సమయంచూచి వాళ్ళమీద పడాలని పథకం వేశాము. నా స్నేహితులు వట్టి పిరికిపందలు. తీరా సమయానికి ధైర్యంచేసి వాళ్ళమీదికి ఉరకడానికి సాహసించలేకపోయినారు." అని ఫాల్‌స్టాఫ్ చెప్పడం సాగించాడు నిజంసంగతి ఏమిటంటే ఫాల్‌స్టాఫ్ అందరిలోకి పిరికిపంద. తన వాళ్ళను ముందుకునెట్టి తాను చెట్టుచాటున దాక్కున్నాడు. ఆ బాట సారులు అతని అనుచరులను చావగొట్టారు. దెబ్బలుతిని ప్రాణాలు అర

చేతిలో పెట్టుకొని వాళ్లు కాలికి బుద్ధిచెప్పారు. అంతవరకు ప్రాణాలు బిగ బట్టుకొని దాక్కొని ఉన్న ఫాల్‌స్టాఫ్ కూడా వాళ్ళతోబాటు పరిగెత్తి సుర క్షితమైన ప్రదేశానికి వచ్చినతరువాత, తన స్నేహితులు పారిపోయివచ్చి నట్లూ, తాను ఒంటరిగా ఆ బాటసారులతో పోట్లాడినట్లూ ప్రగల్భాలు కొట్టాడు ఇల్లాగ.

*కథ ప్రారంభంలో పదిమంది చివరకు యాభై మంది అయినారు :*
''మా సన్యాసులంతా భయపడి పారిపోయారు, నేనుమాత్రం సాహసించి వాళ్లపైకి వురికాను. వీళ్లునాకు సహాయంచేయలేదు. సరిగదా కను చూపుమేరలో లేకుండాపోయినారు. కాని నేను ఏమీభయపడక ఒంట రిగా వాళ్లమీద కలియబడ్డాను. అయితే వాళ్లు పదిమందీ నేనొక్కణ్ణి! అయినా ఒకణ్ణి కాళ్లు విరగగొట్టాను. ఒకడికి తలపగిలి నెత్తురుకారింది. మిగిలినవాళ్లు నేలకొరిగారు. అయితే నేనుకాస్త అలసట తీర్చుకొనే లోపుననే ఆ పదిహేనుమంది ఒక్కుమ్మడి నాపైకి వురికారు. ట్రాయ్ యుద్ధంలో హెన్రీ పోట్లాడినట్లు నేను జంకక వాళ్లను ఎదిరించాను. మళ్ళీ ఇద్దరిని బొడుకరపించాను. పదిమందిని పారద్రోలినాను. అయిదు గురిని మూర్ఛపోజేశాను. ముగ్గురిని తరిమివేశాను. అయితే వాళ్లు నిమి షంలోకి తేరుకొన్నారు. ఆ ఇరవై మంది నామీదికి ఒక్కసారి వచ్చి పడ్డారు. నేను తట్టుకోలేక తిరిగివచ్చాను. అప్పటికైనా నాచేతిలోని దుడ్డుకర్ర విరిగిపోబట్టి కాని లేకపోతే ఆ ముప్పైమందిని మట్టుపెట్టే వాణ్ణి. అయినా ఒకకుర్రవాడిపైకి ఏభై మందివచ్చారు. లేకపోతేనా! ఒక్కొక్కణ్ణి కాళ్లు విరగగొట్టేవాణ్ణి.'' అన్నాడు.

అక్కడ వున్నవారంతా విరగబడి నవ్వారు ఈ ప్రగల్భాలు విని. శత్రుబలగం పదిమంది వున్నారు మొదట్లో. చివరకు వచ్చేసరికి వాళ్ళు యాభై మంది అయినారు.

ఆత్మాపకర్ష :

ఆత్మోత్కర్ష ఎట్లాగ హాస్యజనకం చేయవచ్చునో ఆత్మనింద కూడా అట్లాగే హాస్యవృత్తాంతముగా చేయవచ్చును. నేను అంతవాణ్ణి,

ఇంతవాణ్ణి అని ప్రగల్భాలు పలికితే ఎందుకు నవ్వుతామో సరిగ్గాఅందుకే ఆత్మనిందనుచూచి నవ్వుతాము. అంటే అదిగాని ఇదిగాని సత్యభాషణ కానపుడూ నవ్వులాటకు అంటున్నపుడూ మాత్రమే నవ్వించేశక్తి దానికి వస్తుంది.

*నీవు వట్టి వెధవాయవు యస్ సార్ నిజమేనండి :* నేనొకసారి ఒకవిద్యార్థిపై కోపంవచ్చి "ఒరేయ్! నీవు ఎందుకూ పనికిరావురా, వట్టివెధవవు" అన్నాను. వాడు విధేయతతో "నిజమేనండిసార్, మా అమ్మా, మా నాన్నకూడా ఎప్పుడూ ఆమాటే అంటారండి'' అన్నాడు.

*మీకేం తెలియదు :* నేనొక కథలో వ్రాశాను. ''నేను ఏమీతెలియని వట్టి తెలివితక్కువవాణ్ణి అని సమ్మకం కలిగిందినాకు. ఎందుకంటే ఇంటాబయటా అంతా నన్ను ఆమాటే అంటారు. ఇంట్లో మా ఆవిడ ప్రతివిషయంలోనూ "మీకు తెలియదు ఊరుకోండి'' అంటుంది. బజారుకువెళ్లి కూరలబేరం చేస్తున్నాను. వంకాయలూ, దోసకాయలూనూ! వంకాయలు మెత్తగా పువ్వుల్లాగ వుండాలనీ, దోసకాయలు గట్టిగా రాళ్లలాగ వుండాలనీ ఆమెగారు చెప్పింది. అయితే ఆ దుకాణంలో వంకాయలుగట్టిగానూ, దోసకాయలు మెత్తగానూ వున్నవి. ఇదేమిటయ్యా! ఇది మంచిసరుకు అంటావు, వంకాయలు మెత్తగావుండాలె, దోసకాయలు గట్టిగావుండాలె. అట్లాలేవే ఇవి! అనిఅంటే మీకేంతెలుసునండీ పంతులుగారూ! కూరల్లోపుట్టి కూరల్లోపెరిగిన మాకు తెలియదా! మీరు పట్టుకెళ్లండి, నామాటవిని. వంకాయలు మెత్తగావుంటేనే రుచి. దోసకాయలు గట్టిగా వుండాల్సినమాట నిజమేగాని ఈ వానలకు అవి కాస్త మెత్తపడ్డవి. నేను చెపుతున్నాను తీసుకెళ్లండి. తీసికెళ్లి వంకాయలను నీళ్లల్లో నానబెట్టండి కాసేపు. మెత్తపడతవి. దోసకాయలు ఎండబెడితే గట్టిపడతై. బంగారంలాంటి సరుకు." అని అవో వీసెడు, ఇవోవీసెడు నాకు అంటగట్టాడు. ఇంటికెళ్లినతరువాత ఆమె, ''ఇవేమిటండీ, ఇవి

ఎందుకైనా పనికొస్తాయా? మీకేమీతెలియదు. ఊరుకోమంటే ఊరుకో రావే'' అని విసుక్కున్నది. అప్పటినుంచి నేను ఏమీతెలియనివాణ్ణి అనే భావం నాలో బలపడింది.

*నాకు అన్ని జబ్బులూ ఉన్నవి :* ఇటువంటి రచనలో మనిషి తనను గురించి తానే తక్కువగా భావించడం కనిపిస్తుంది. అట్లా భావించి మోసపోవడం చిత్రంగా ఉంటుంది. ఈ రచన నడిచిన విధానంకూడా చమత్కారంగానే ఉంటుంది. జెరోమ్-కే-జెరోమ్ వ్రాసిన "Three Men in a boat'' అనే గ్రంథంలో ఒక పాత్ర తనను గురించి తానే చెప్పుకొంటూ, లోకంలో ఉన్న జబ్బులన్నీ తనకే ఉన్నట్లు మాట్లాడు తాడు. 'A' తో మొదలయ్యే జబ్బులతో ప్రారంభించి 'Z' మీద ఉన్న జబ్బులదాకా ఏకరువుపెట్టి అవన్నీ తనకే ఉన్నట్లు చెబుతాడు. బారిష్టరు పార్వతీశం తన తెలివితక్కువతనాన్ని ప్రదర్శించే నవ్వించగలిగాడు. ఆ పుస్తకంలో పార్వతీశం తన తెలివితక్కువతనాన్ని గురించీ, అమాయకత్వాన్నిగురించీ చెప్పుకొన్నాడు.

తన్ను తాను పొగడుకొనడమునూ. గొప్పలు చెప్పుకోవడమునూ ఏవిధంగా హాస్యస్ఫోరక వృత్తాంతాలుగా మలచవచ్చునో, తననుగురించి తానే తక్కువగా చెప్పుకొనడమునుకూడా హాస్యాశ్రయకథనంగా మార్చ వచ్చునని అన్నాను. తెలివిగలవాడు "నేను వట్టి తెలివితక్కువవాణ్ణి అని ప్రకటించుకొంటే, ఆ వాక్కులో ఉండే కొంటెతనాన్ని జూచి మనము నవ్వుతాము. ఒక పెద్దమనిషి ఒకసారి డాక్టరుగారి డిస్పెన్సరీకి వచ్చాడు. అక్కడ మందుసీసాలు చాలా ఉన్నవి. ఆయన ఆ బల్లదగ్గరకు వెళ్లి ఆ మందుసీసాలను ఎత్తి ఒక్కొక్కదానిలోని ద్రవాన్ని కొంచెం కొంచె ముగా ఓ గ్లాసులోనికి వంచుకొంటున్నాడు. డాక్టరు వచ్చి "ఏమిటి చేస్తున్నారు ?" అని అడిగాడు. మందు కలుపుకొంటున్నాను అన్నాడు ఆ పెద్దమనిషి. డాక్టరు తెల్లబోయినాడు.

*నాటకాస్త పిచ్చివున్నది :* తెల్లపోయి అన్నాడూ నీవు కలుపుకోవ డముఏమిటి? నిన్నెవరు చేయమన్నారు ఈ పనిని? అని అడిగితే, ఆయన అన్నాడు నాకువెవ్వరు ఏమీచెప్పలేదు. నాకే బుద్ధిపుట్టింది. అందిన సీసాలలోంచి మందుతీసికొని గ్లాసులోపోసుకొంటున్నాను త్రాగ డానికి అని. డాక్టరు నీకు ఏమైనా మతిపోయిందా అని అడిగినాడు. ఆ పెద్దమనిషి వెంటనే correct diognisis నాకు కొద్దిగా పిచ్చివుంది అన్నాడు. అందరూ నవ్వారు. నాకు పిచ్చివుందని అన్నమాట అపకర్షా హేతువు. తన్నుతాను నిందించుకోవడంగూడా నవ్వుపుట్టించే వ్యవహారం అవుతుంది. నిజానికి ఆయనకు అంతపిచ్చిలేదు. బహుకొద్దిగా మనః చాంచల్యమువుంది. అతడు తననుగురించి తానే అట్లాచెప్పుకోవడం నవ్వుకుకారణం. అయితే ఈ మాటలు ఆయన అమాయకంగాఅన్నాడు. ఆ మాటనే కొంటెగా అన్నట్లయితే, ఆ వ్యాపారం రమణీయమైన హాస్యంగా భాసించేది. అపకర్షా మూలకమైన ఈ వ్యాపారం వ్యంగ్య మర్యాదతో, చమత్కారసాధనకై జరిగినట్లయితే అప్పుడు మరీ. స్పృహణీయమైనట్టీ, సాహిత్యకమైనట్టీ, మనోజ్ఞమైనట్టీ హాస్యం సిద్ధించేది.

*లీకాక్ :* లీకాక్ అను హాస్యవచన రచనాచతురుడు ఇటువంటి హాస్యమును my financial career అనేకథలో సాధించినాడు. తనను వట్టి తెలివితక్కువవానినిగా, లోకజ్ఞానహీనునిగా ప్రదర్శించుకొంటాడు. ఆ వ్యాసాన్ని ఆధారంగాతీసుకొని ఈ క్రింది కథ నేను వ్రాశాను.

*అప్పుకావాలని ఎవరిని అడగాలె :* "నాకు ఒకసారి డబ్బు అవసర మైంది. ఎవరిని అడిగినా అప్పుఇయ్యలేదు. ఎవరో చెప్పారు బ్యాంకు వాళ్ళు తక్కువ వడ్డీకి అప్పుఇస్తారని." వెంటనే నేను బ్యాంకుకు వెళ్లాను. ఎవరితోచెప్పాలె ఈ విషయం? ఎవరైనావింటే నవ్వుతారేమో! అసలు ఆ భవనంలో ప్రవేశించేటప్పటికే భయంవేసింది నాకు. ఎంతో

మంది గుమాస్తాలు బల్లలముందుకూర్చుని వ్రాసుకొంటున్నారు. ఎవరిని అడగవలసింది తెలియలేదు. అయినా ధైర్యంచేసి ఒక కుఱ్ఱగుమాస్తాతో చెప్పాను ఫలానిపనిమీద వచ్చానూఅని. ఆయనఅన్నాడు"నాతో రండి. మిమ్ములను ఏజెంటుగారివద్దకు తీసుకొనివెడతాను. ఆయనతో మాట్లాడండి"అని.

ఆయనవెంట వెళ్లాను. ఒకగదిలోకి తీసుకెళ్లాడు. అది మెట్లగది. ఆమెట్లు ఎక్కాము. పైఅంతస్థులో ఒకహాలులో ప్రవేశించాము. ఆ హాలు చివరదాకా నడిచాము. అందరూ నావంక వెఱ్ఱిచూపులు చూడడం సాగించారు. పాపం ఈ పెద్దమనిషికి ఎంతఅవస్థవచ్చిందీ అని వారు అనుకొంటున్నట్లు నాకుతోచింది. ఏదో చెప్పరానిభయమూ, సిగ్గూ నన్నుఆవరించినవి. తీరా అసలుసంగతిచెప్పి ఆయన వెంటబడితిని. ఇప్పుడు వెనుదీస్తే బాగుండదు.

ఏమైనాకానీమని నడిచాను, కాని నాకాళ్లు ముందుకు సాగలేదు. మెల్లగా నడుస్తున్నాను. మళ్ళీ ఇంకో మెట్లవరసవచ్చింది. నాముందు గబగబానడుస్తున్న కుఱ్ఱగుమాస్తా నేను వెనకబడడముచూచి చటుక్కున ఆగి నారెక్కపుచ్చుకొని నడిపించడం సాగించాడు. పెద్దవాణ్ణి మెట్లు ఎక్కలేక పోతున్నాను అనుకొన్నాడో ఏమో! అట్లాఅనుకొని ఉన్నట్లయితే సంతోషించవలసిందే. నేను భయపడి పారిపోవాలని చూస్తున్నానని నన్నుగట్టిగా పట్టుకొని నడిపిస్తున్నాడేమోనని ఒకఊహవచ్చింది. దాంతో మరీభయంవేసింది. పైగా అక్కడ పనిచేసేవాళ్లంతా తలెత్తి నావంకచూచి విచారంతో తలదించేసుకొంటున్నట్లు తోచింది నాకు. ఎందుకూ వాళ్లు జాలిపడుతున్నారు. నేను అప్పుకావాలని అడగడము తప్పేమో! వాడు నన్ను ఎక్కడికి తీసుకెడుతున్నాడు. సరే ఏమైనా కానీయమని వాణ్ణి గట్టిగా పట్టుకొన్నాను.

కటికవాడు తీసుకొనిపోతున్నదే మేకపిల్లలాగుంది నాస్థితి అనుకొన్నాను. ఆ అధికారి ఎవ్వరో ఇంతపైన ఉండడానికి కారణం ఏదో

ఉండాలె. అందరిమోస్తరు క్రింది అంతస్థులలో ఉండటానికి ఆయనకు భయం ఎందుకో. ఇంతపైనున్నవాడు ఎంతపైవాడో! పైగా ఆ కుర్ర గుమాస్తా నన్ను రెక్కట్టుకొని లాక్కెళ్ళడంకూడా అనుమానాస్పదం గానేవుంది. ఏంజేస్తాను. సంకటంలో ఇరుక్కొని ఇంతదూరం వస్తిని. ఇప్పుడు ఏముఖంపెట్టుకొని వెనక్కుతిరిగేది. ఇంతలో అసలుగదికి రానేవచ్చాము. గది తలుపుతీసి ఆ అబ్బాయి నన్ను లోపలికినెట్టి తలుపు వేశాడు.

తలుపు మూయడంఎందుకు? నిజానికి అతడు తలుపు మూయ లేదు. అదంతటఅదే మూసుకుపోయింది. వీళ్ల ఇల్లు బంగారంగానూ ఎంతజాగ్రత్తపడుతున్నారు అనుకొని, మెదలకుండా అక్కడే నిల్చు న్నాను. ఆ అధికారి పాపం నన్ను ఏమీఅనలేదు. కూర్చోమన్నాడు. కూర్చున్నాను. మీకు నేను ఏవిధంగా సాహాయ్యపడగలను అన్నాడు ఇంగ్లీషులో. నన్ను మళ్ళీ క్రిందికిపంపివేయడమే గొప్పసాహాయ్యంగా భావిస్తాను అని అందామని తోచింది. కాని అనలేకపోయినాను. ఆయన 'చెప్పండి' అని మర్యాదగానే సంభోదించాడు. నాకు కాస్త ధైర్యం వచ్చింది. నేనుచెప్పడం ఆరంభించాను. "చూడండి నాకు రెండువందల రూపాయలు అప్పుకావాలె. బ్యాంకువాళ్లు ఇస్తారని విని వచ్చాను. ఇది సాహసమైతే క్షమించండి"అన్నాను.

హామీచూపాలె: ఆయన నా అమాయకత్వానికో, తెలివితక్కువ తనానికో దేనికోగాని నవ్వాడు. నవ్వి అన్నాడూ. "మిమ్ములను నేను ఎప్పుడూ చూడకపోయినా, మిమ్ములనుగురించి విన్నాను. అప్పు ఇవ్వ డానికేం! బ్యాంకు ఇస్తుంది. కాని కొంచెం కష్టం. మరేంలేదు ఏదైనా హామీచూపాలె"అని. హామీకి ఏదిపనికివస్తుందీఅని అడిగాను. ఆయన ఏదైనా పనికివస్తుంది. పూర్వం personal security మీద అప్పులు ఇచ్చేవారు. ఇప్పుడు ఇవ్వడంలేదు అన్నాడు. ఆయన

మర్యాదగా మాట్లాడడంవలనా నన్ను ఎరిగున్నట్లు చెప్పడంవలనా నాకు బాగాధైర్యంవచ్చింది. అందుకని అన్నానూ, ఏం? ఆపద్ధతిని ఎందుకు మానేశారు అని. దానివలన చాలాఇబ్బందులు ఏర్పడ్డవి. అప్పు పుచ్చుకొనేవాడు ఏ తలకుమాసిన వెధవనో తీసుకొచ్చి హామీగా చూపేవాడు. ఈ ఇవ్వలేనివాడికి ఇంకొక ఇవ్వలేనివాడు హామీఏమిటి నాతలకాయ! అందుకని ఆపద్ధతిని అప్పులివ్వడము మానేశాము" అన్నాడు ఆయన.

ఈమాటలు వింటే నాకు కష్టంవేసింది. నాకు అప్పుయియ్యకుండా వుండాలనిబ్యాంకువాళ్లు ఈఏర్పాటు చేసినట్లుతోచింది. ఇది వ్యక్తిగతమైన ద్రోహంగా భావించాను. ఏమనేది? అయినా అన్నాను. "చాలా తొందర పడ్డారండి, ఎందరికో కష్టంకలిగించే పనిచేశారు. గవర్నమెంటు చేసేవన్నీ ఇటువంటి పిచ్చిపనులే"అని. తరువాత నా ఇష్టంవచ్చినట్లు కొంచెంసేపు మాట్లాడి చివరకు అడిగాను. మరి ఇప్పుడు ఏంజేయాలి? నాకు అప్పు చాలాఅవసరముగా కావాలేఅని. ఆయనఅన్నాడూ, ఏమైనా స్థిరాస్తి హామీగాచూపితే, నాలుగైదురోజులలో వ్యవహారం పరిష్కారం చేసి మీకు అప్పు యిప్పించే ఏర్పాటు చేస్తాను అని. సరే బాగుంది ఈ వ్యవహారం అనుకొని, "అయితే ఆస్థి అంటే ఎట్లాంటిదండీ అని అడిగాను. ఇల్లూ, పొలం అటువంటిది అన్నాడుఆయన.

ప్ర : అయితే ఒక ఇల్లు హామీగా చూపుతాను నామాట చాలునా మీరొచ్చి చూస్తారా?

జ : మా ఆఫీసునుంచి ఒకరొచ్చి చూస్తారు ఆ విషయం.

ప్ర : అయితే నాకు ఈ అప్పు తొందరగా వచ్చేఏర్పాటు చేయండి. ఎప్పుడు పంపిస్తారు?

జ : మీ ఇష్టం రేపేపంపుతాను మీకు వీలైతే.

ప్ర : అయితే రేపుపంపుతారా? నేను ఆయనకోసం ఎదురు చూస్తుంటాను. ఇల్లాచెప్పి తొందరలో వ్యవహారం పరిష్కారంచెయ్యండి అని మరోసారి ప్రార్థనాపూర్వకంగా మనవిచేసి వచ్చేశాను.

అదిగో ఆ యిల్లే హామీగా చూపుతున్నాను : అనుకొన్నట్లుగానే మరు నాడు ఆయన వచ్చాడు. ఆ సంగతీ ఈ సంగతీ మాట్లాడి వ్యవహారం లోకి దిగాడు. హామీగా పెట్టదల్చుకొన్న యిల్లు చూపిస్తారా ?

జ : ఆ చూపిస్తాను.

ప్ర : చాలాదూరమా, ఆ యిల్లు ?

జ : లేదండీ ! ఇక్కడే. వాకిట్లోకి రండి.

అని ఆయనను బైటికితీసుకెళ్ళి మాయింటికి ఎదురుగా ఉన్న డాబాయిల్లును చూపిస్తూ, "అదేనండి. ఆ డాబాయే మీకుహామీ''అన్నాడు.

ఆయన : "చిన్న ఇల్లే. అయినా ఫరవాలేదు. మీరు తీసుకొనే అప్పు మొత్తం రెండు వందలేగా ? ఈ యిల్లు పనికివస్తుంది. ఒకసారి లోపలికివెళ్ళి చూచివద్దామా ?''

నేను : ఎందుకూ ? ఇక్కడనుంచి చూస్తే చాలదూ ?

ఆయన : అల్లాకాదులెండి. ఒకసారి లోపలికివెళ్ళి చూచివద్దాం.

నేను : ఆ ఇంట్లో ముస్లిములు అద్దెకున్నారు. హిందువులను లోపలికి రానీయరు.

ఆయన : అట్లాఅయితే ఎట్లా ? సరే పోనీ డాక్యుమెంట్సు చూపండి.

నేను : డాక్యుమెంట్సు ఏమిటీ ?

ఆయన : ఆ ఇల్లు మీ స్వంతం అయినట్లు రుజూపరచే పత్రాలు.

నేను : అటువంటి పత్రాలు ఏమీ లేవే.

ఆయన : ఆ యిల్లు మీరు కొన్నదేగా ?

నేను : నేను కొనలేదు.

ఆయన : అయితే ఆ ఇల్లు మీది ఎట్లా అయింది ?

నేను : అది మాది అని చెప్పడం లేదే. ఆ యిల్లు వాళ్ళదే. ఊరికే హామీగా చూపాలంటే చూపిస్తున్నాను.

ఆయన : మీది కానిఇల్లు security గా ఎట్లా ఇస్తారండి ?

నేను : అదేమిటండీ. Security గా ఏదైనా ఆస్థి చూప మన్నారు. చూపుతున్నాను. ఊరికే చూపడమేకదా అనుకొన్నాను గాని అది నా స్వంతం అయినట్లు ఎలాగ రుజూ చేయగలను. దూరాన్నుంచి చూపడమేకదా అనుకొన్నాను.

ఆయన : అయితే, ఆ యిల్లు పనికిరాదు హామీగా.

నేను : ఆ ఇల్లు కాకపోతే, దొడ్డివైపున డా. రామరాజుగారి ఇల్లుంది. అది చూపిస్తాను కావాలంటే. కాని అదైనా నా స్వంతం కాదు.

ఆయన : మీ స్వంతంగానిది ఏదీ పనికిరాదు. ఇంకోరి యిల్లు మీరు యెట్లా తాకట్టు పెడతారండీ ? ఆ ఇల్లుగల ఆయన పోట్లాటకు రారుటండీ ?

నేను : మీరు డాక్యుమెంట్లూ అవీ తెమ్మని అడగకుండా ఉంటే, ఆయన తగాదా పెట్టకుండా నేను చూచుకొంటాను.

ఆయన : అది సరే. వృధా కాలయాపన యెందుకూ? మీ స్వంత ఆస్థి ఏమైనా ఉంటే చెప్పండి.

నేను : ఇంతకంటే స్వంతం ఏమీ లేదు.

ఆయన : సరే, ఇల్లు కాకపోతే ఇంకేమైనా ఆస్థి ఉంటే చూపండి.

నేను : చూపుతున్నవన్నీ కాదంటూ ఉంటిరి. నేను ఇంకేం చూపేది నా బొంద ?

ఆయన : అయితే మీ స్వంతఆస్థి ఏ రూపంలో ఉంది ?

నేను : ప్రస్తుతం అంతా స్నేహితులవద్ద తీసుకొన్న అప్పు రూపంలో ఉంది. నేను చెప్పినదేమీ అబద్ధంకాదు. ఆ రాజుగారి

ఇంటి విషయంలో మాత్రం ఇంటిలోపలకు తీసికెళ్లి చూపగలను. ఈ యింటిని హామీగా పెడుతున్నాను బాబూ అన్నా ఆయన తగూకు రాడు. ఆ యిల్లు నా స్వంతం అయినట్లు డాక్యుమెంటు కావాలంటూ ఉంటిరి. అది యెట్లా సాధ్యం? ఆ తరువాత ఆయన విచారాన్ని ప్రకటించి వెళ్లిపోతుంటే నేను పిలిచి "సరే ఏంజేస్తాం. ఈ దఫా ఇట్లా అయింది. అయితే నేను ఇంతటితో ఊరుకోను. బ్యాంకీవారు ఈయనకు అప్పు ఇయ్యలేదు అనే అప్రతిష్ఠ రావడము నేను సహించలేను. సాధ్యమైనంత త్వరలో ఇల్లు చిన్నదైనాసరే, ఒకటి కట్టించి, అది సక్రమమైన పద్ధతిలో హామీగాపెట్టి, ఇంతకంటే నాలుగురెట్ల మొత్తం అప్పు తీసుకోకపోతే నన్ను మారుపేరున పిలవండి" అని ప్రతిజ్ఞచేసి విసురుగా తలుపుమూసి అవమానంతో క్రుంగిపోతూ. దిండులో తలదూర్చాను.

అదీ కథ. ఇదంతా నా స్వంతమే. అయితే లీకాక్ రచన తరువాతనే నాకు ఇది వ్రాయాలని తోచింది. తనను గురించి తానే పొగడుకొనడము అతిశయోక్తి. తనను గురించి తానే తక్కువగా చెప్పుకోవడము ఆత్మాపకర్ష అనబడే హాస్యప్రక్రియ. understatement is the exact opposite of exaggeration.

పైన చెప్పింది లీకాక్ రచనచూచి వ్రాసింది అని చెప్పాను. ఇది పరమ రమణీయమైనట్టి హాస్యవృత్తాంతంగా నేను భావిస్తున్నాను. సరస్వతీ కంఠాభరణమనదగిన హాస్య వాగ్వ్యాపారము ఇది. అర్థాశ్రయ హాస్యములో ఇంతకంటే రమణీయమైనట్టి హాస్యరస పరిపూర్ణమైనట్టి రచనను నేను ఊహించలేను. ఇది శాస్త్రగ్రంథమే అయినా స్వీయానుభవములను వ్రాయడంవలన ఔచిత్యానికి భంగం కలుగుతుందని నేను అనుకోను. పైనచెప్పిన కథను లీకాక్ ధోరణిలో వ్రాసి దానిని పెద్దలకు కొందరకు చదివి వినిపించాను. వారంధరూ ఉద్దండపండితులు. అందరిలోకి చిన్నవాడైన శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు మాత్రం కాస్త

చిరునవ్వు ప్రసాదించారు. మిగిలినవారు తలలూపారు. ఏదో ఫరవాలేదు అన్నట్లుగా. వారు ఆనందించినట్లే లెక్క నవ్వకపోయినా. పెద్దగానవ్వడము మర్యాదకాదని మన పండితుల అభిప్రాయము. అంతేకాదు. అట్టహాసంగా నవ్వడం మనిషిలో ఉండే అల్పత్వాన్ని సూచిస్తుందని కూడా అభిప్రాయపడతారు.

*ఈ కథ మేఘసందేశం అంత గొప్పది:* సాహిత్యకంగా కాళిదాసుని మేఘసందేశము ఎంత గొప్పదో, హాస్య విషయకంగా ఈ రచన అంత గొప్పదని నా ఉద్దేశం. లీకాక్ రచనవంటి హృదయానందకమైన కథ వ్రాయడానికి ప్రతిభ కావాలె. ప్రతిభ లేనివాడు అట్టి రచన చేయలేడు. ఇది చదివినపుడు నాకు కలిగిన విచిత్రానుభూతి ఇతరులకు ఎందుకు కలుగదో నాకు అర్థం కావడములేదు. నా హృదయ నిర్మాణమే వేరు కాబోలు. చమత్కారం ఏది చదివినా నాకు ఒడలు పులకరిస్తుంది. నా హృదయాన్ని ఉరుకులెత్తించి, నా కళ్ళను చెమ్మగిలించి నా ఒడలును పులకరింపజేసేవి, రెండు. మొదటిది శ్రీరామ కథాకథనము, రెండవది ప్రతిష్ఠ చమత్కార కల్పన.

*లూయీ సింక్లర్:* అమెరికన్ కవి, నవలా రచయిత లూయీ సింక్లర్ కూడా ఆత్మాపకర్షా మూలమున శోభాసంపన్నమైనట్టీ, శబ్దార్థోభయ స్ఫురణచేత సహృదయులకు హృదయానందకమైనట్టీ, రమణీయమైనట్టీ హాస్యమును సాధించినాడు. ఆ కథ ఇది. ఆయనకు నోబుల్ బహుమానం వచ్చింది. అప్పుడు జరిగిన విషయము ఆయన నోటివెంట వచ్చినట్లు యథాక్రమంగా ఉదాహరిస్తాను. "నోబుల్ బహుమానము మిలియన్ డాలర్లు వచ్చిందనివిని నేను ఉప్పొంగిపోయాను. ఎప్పుడువెళ్ళి ఈశుభవార్త మాశ్రీమతికి చెబుదామా అని హృదయము ఉత్తూతలూగింది. ఆ ఉత్తరం పుచ్చుకొని ఇంటికి పరుగెత్తాను. ఆవిడ నేను అంత తొందరగా రావడము చూచి ఆశ్చర్యపోయి, ఏమండీ, ఏమి జరిగింది ? అంత హడావుడిగా వచ్చారు అన్నది. నేను సంతోషంతో ఉప్పొంగిపోతూ

అన్నాను-"నాకు నోబెల్ ప్రైజ్ వచ్చింది" అని. ఆవిడ మరీ ఆశ్చర్యపడి అదేదో గొప్పవాళ్ళకు వచ్చేదికదా మీకెట్లా వచ్చిందండీ అనిఅన్నది."

అర్థాశ్రయ హాస్యములో శక్తిమూలము అనే ప్రకరణము పూర్తి అయింది. దీన్ని అపహసిత మూలకమని, అభిభాషణ మూలకమని రెండు పెద్ద విభాగాలుగా ఊహించి, ఒక్కొక్కదాని స్వరూప స్వభావాలను, సోదాహరణంగా, చర్చించడం జరిగింది. అపహసిత మూలకము, అపహాస్యము, అధిక్షేపము, అవలగితము, అవక్షిప్తము, అహోపురిషికము అను హాస్య ప్రక్రియలవలన సాధించవచ్చు. చిలకమర్తి, కందుకూరి, పానుగంటి వీరి రచనలలో ఈ అయిదు పద్ధతులలోనూ హాస్యము సాధించబడినది. అభిభాషణమూలకమైన హాస్యము, ఆత్మోత్కర్ష, ఆత్మనింద అను రెండు పద్ధతులలో సముద్భవింపజేయవచ్చునని తెలిసికొన్నాము. అపహసితమూలకమైన హాస్యమూ, అభిభాషణమూలకమైన హాస్యమూ ఇంకా ఎన్నోవిధాల సాధించవచ్చు. ఆ పద్ధతులన్నీ ఇక్కడ వివరించడం కుదరదు. కాబట్టి, ఇంతటితో ఈ ప్రకరణము ముగించి, ఉక్తిమూలహాస్యమూ, దాని స్వరూప స్వభావాలు, సాధన మార్గాలూ, వీటిని గురించి కొద్దిగా తెలిసికొందాము.

సరసోక్తి

ఛలోక్తి

నర్మోక్తి

ఆశ్చర్యోక్తి

ద్వంద్వార్థోక్తి

యథార్థోక్తి

వక్రోక్తి

వ్యతిరేకార్థోక్తి

విపర్యయోక్తి

పత్యుక్తి

అజ్ఞోక్తి

మూర్ఖోక్తి

నిరుత్సాహోక్తి

పర్యాయోక్తి

సమాసోక్తి

ప్రగల్భోక్తి

అసంభవోక్తి

వ్యాజోక్తి

విభావనోక్తి

వినోక్తి

అభియుక్తోక్తి

మణిప్రవాళోక్తి

విశేషోక్తి

# ఉక్తిమూల హాస్యము

*ఉక్తిమూల హాస్య లక్షణాలు:* శక్తిమూల ఉక్తిమూల హాస్యాలను గురించి మనము కొంత తెలుసుకొన్నాము. ఉక్తిమూల హాస్య లక్షణాలు కూడా మనము ఎరిగినవే. ఈ ఉక్తివలన హాస్యాన్ని ఉత్పన్నంచేసే శక్తిని 'విట్' (Wit) అంటారు. విట్‌యొక్క ప్రోద్బలముచేత జనించిన రమణీయమైన వాగ్వ్యాపారాన్ని 'జోక్' (Joke) అంటారు. ఇది ఒక రకము కేరడము. ఈ మేలము హఠాత్‌జనితమైన ఒక మధురోహను ఆశ్రయించుకొని ఉంటుంది. ఈ రకముగా క్రేణి సేయుటకు ఎంతో మేధాసంపత్తి కావలె. సమయస్ఫూర్తి కావలె. ఇటువంటి కేరడము సాధారణంగా సరస సంభాషణలో పరివ్యాప్తమై ఉంటుంది. ఈ ఉక్తివిశేషాలు కొన్ని కత్తిపోట్లవలె తగులుతవి. కొన్ని పుష్ప గుచ్ఛములవలె మృదువుగా ఉంటవి. శబ్దశక్తి నెరిగినవాడూ, మేధావి, బుద్ధికుశలత గలవాడే ఇట్టి కేరడ వ్యాపారమున సమర్థుడు కాగలడు.

*ఉక్తిమూల హాస్యము రకాలు:* ఇట్టి ఉక్తి విశేషాలను అర్థం చేసుకొని, అందులో ఉండే చమత్కారాన్ని గ్రహించి, ఆనందమును పొందడము అంత సులభముకాదు. కొంత భాషాజ్ఞానము ఉండవలె. పరిశీలనా శక్తి ఉండవలె. హాస్య రచనలయందు అనురక్తి ఉండవలె. జోక్ (Joke) అనగా రసాత్మకమైన వాక్యము. ఆ రసమును గ్రహించే శక్తి ఉండవలె. ఈ ఉక్తిమూల హాస్యము ఆత్మాశ్రయముగానూ, పరాశ్రయముగానూ కూడా ఉంటుంది. అంటే హాస్యశీలుడు 'జోక్'ను తనపై విసురుకోవచ్చు. ఇతరులపై విసరవచ్చు. ఇక చూద్దాము. ఎన్ని ఉక్తి విశేషాలున్నవో!

సరసోక్తి :

*మనము అంతా కోతులలోనుంచి వచ్చాము :* ఇది చాలా మృదువైన హాస్యోక్తి. ప్రియురాలు మృదువుగా చెంపపైన చిటిక వేసినట్లుంటుంది. మా కుర్రవాడికి పాఠాలు చెబుతూ ఒకచోట మనుష్యజాతి అంతా కోతులలోనుంచి వచ్చింది అని చెప్పవలసివచ్చింది. చెప్పాను. వాడు పరుగెత్తివెళ్ళి ఈ విషయం తల్లితో చెప్పాడు. "అమ్మా ! మనం అంతా కోతులలోనుంచి వచ్చామటే" అని. ఆమెగారు ముక్కు మూతి విరిచి "ఛాఛా మనమంతా కోతులలోనుంచి రావడమేమిటీ" అని విసుక్కున్నది. మా అబ్బాయి తనతెలివినంతా ఉపయోగించి "అంటే, అమ్మా! మన పూర్వులు, మనతాతలు, తాతల తల్లిదండ్రులు అంతా కోతులటే!" అన్నాడు. నేను వింటూనేవున్నా ఈ ప్రసంగం అంతా. ఆవిడ ఏమంటుందో విందామని కుతూహలంకలిగింది. ఆవిడ "ఛాఛా అంతా అబద్ధంరా నాయనా. నాకుతెలుసు. మా నాన్నా, మా తాతా వాళ్లంతా మనమోస్తరు మనుష్యులే" అన్నది. బాబు అన్నాడు వికారంగా నవ్వి, 'నీకేం తెలియదు ఉండవే అమ్మా. నాన్న చెప్పాడు. నిజమేనే. ఏం నాన్నా నిజం కాదూ?' అని అడిగాడు. 'నిజమేరా నాయనా' అన్నాను నేను. దానిపై ఆమెగారు 'ఏమోరానాయనా, మాతండ్రీ, తాతా వాళ్లంతా మనమోస్తరు మనుష్యులని మాత్రం నాకుతెలుసు. మీ నాన్నగారి తండ్రి తాతల విషయమై నాకు అంతగాతెలియదు. నిజమేనేమోలే' అన్నది నేనూ నవ్వకుండా వుండలేకపోయినాను. సరసోక్తి ఇట్లా ఉంటుంది.

*అతివాగుడుకు మందు :* సరసోక్తి బహు మృదువుగానూ, మధురంగానూ ఉంటుంది. ఒకరికి నొప్పికలిగించే విషయం ఆ ఉక్తివిశేషంలో బొత్తిగావుండదు. సరసోక్తిలో కఠినమూ, అప్రియమూ, అయిన విషయము కూడా సుకుమారమూ, ప్రియమూ అయిన దానిలాగ భాసిస్తుంది. ఇంకొకకథ. 'భార్య వాగుడుకాయ. ఎప్పుడూ

ఏదో మాట్లాడుతూనే వుంటుంది. ఆమె ఏదైనా విషయం ఎత్తుకొన్నదా అంటే ఇక ఆ ప్రసంగం కొండవీటి జలపాతంలా సాగాలిసిందే. ఆ మాటలలోని తీవ్రత, ప్రపాతము, ప్రజ్వలత, వేగము, ఎదుటిమనిషిని, ఎంతవిసిగిస్తవో ఆమె గ్రహించలేదు. అందులో ఈ ప్రసంగాలు రాత్రి జరుగుతూవున్న కారణాన భర్తకు నిద్రలేకా, చికాకువలనా ఆరోగ్యం దెబ్బతిన్నది. డాక్టరును చూడమని ఆమెగారు పోరింది. ఆయన డాక్టరుతో మాట్లాడి వస్తూవస్తూ మందుకూడా కొనుక్కొచ్చాడు. "ఈ మాత్రలు నిద్రమాత్రలు, రెండువేసుకొంటే హాయిగా నిద్రపడుతుంది'' అన్నాడు. "అయితేఇంకేం ఎందుకైనామంచిదని మూడు వేసుకోండి" అన్నది, ఆమె భర్త ''ఆమందు నాకుకాదు. నీవు వేసుకోవలె అని డాక్టరు చెప్పాడు" అన్నాడు. ఆమె అతివాగుడుకు అది మందు. ఆ విషయం సుకుమారంగా సరళంగా సరసంగా, ప్రియంగా భర్త భార్యకు తెలియజేశాడు. సరసోక్తి ఇల్లాగ ఉంటుంది.

*మరో ఉదాహరణ:* ఏదోమాటల సందర్భములో ఒకాయన డాక్టరుతో అన్నాడు. ''నేను ఈ ముసలితనంలో కూడా ఇంత ఆరోగ్యంగా ఉంటానికి కారణం శాంతిసౌఖ్యాలతో కూడిన ఆనందమయమైన గార్హస్థ్య జీవితము గడపడమే''నని. "అంటే ఇంట్లో పోట్లాటలూ, తగాదాలూ, చీదరింపులూ అటువంటివి ఏమీలేవన్నమాట."అనిఅడిగాడు డాక్టరుగారు. ముసలాయన "లేకేమండీ! అవి పుష్కలంగానే వున్నవి. అయితే మా ఆవిడా నేనూ ఒకరాజీకి వచ్చాము. ఒకచక్కని ఏర్పాటు చేసుకొన్నాము. ఆవిడకు కోపంవస్తే నేనుమాట్లాడక ఊరుకోవలె. నాకుకోపంవస్తే నేను మాట్లాడకుండా బైటికివెళ్లి ఆకోపం పోయిందాకా పొలాలవెంట తిరిగిరావలె. ప్రతిరోజూ ఈవిధంగా చాలా సేపు మంచిగాలిలో తిరగడమువలన నా ఆరోగ్యము బాగుపడ్డది" అన్నాడు. నిరంతరము కలహాలువున్నవి అనే అప్రియమును ఎంతసరసంగా పొందికగా చెప్పాడో చూడండి.

ఛలోక్తి :

*మీరు అవతారమూర్తులనే భుజిస్తున్నారు :* నడిమింటి మంగళేశ్వరశాస్త్రిగారి ఛలోక్తి ఒకటివుంది. పూరీ జగన్నాథంలో మఱ్ఱియాకుల విస్తరిలో ఎవ్వరూ భోజనముచేయరు. శాస్త్రుల్లవారు ఏమిటి దానికి కారణం అని అడిగినారట. అక్కడవున్న పండితుల్లో ఒకాయన ఇట్లా అన్నాడు "అయ్యా! శ్రీమన్నారాయణమూర్తి వటపత్రశాయి. స్వామి వారికి శయ్య అయిన వటపత్రమున భుజించుట నిషిద్ధము, అందులో ఈ క్షేత్రము స్వామివారి అవతార క్షేత్రము. ఇక్కడ వటపత్రములలో భుజించుట అత్యంత నిషిద్ధము"అని. శాస్త్రుల్లవారు నవ్వి, "ఇట్టి అవతారక్షేత్రమున స్వామివారి అవతారమూర్తులనే భుజిస్తున్న మీకు ఆయన శయ్యయైన వటపత్రములలో భోజనము నిషేధమైనదా?"అన్నారట. ఓఢ్రులు మత్స్యభుక్కులు. శ్రీమన్నారాయణమూర్తి మత్స్యావతారమెత్తినాడు. వారు చేపలు తింటున్నారు. అంటే అవతారమూర్తులనే ఆరగిస్తున్నారు అన్నమాట.

ఛలోక్తులు సరసోక్తులంత మృదువుగా వుండకపోయినా మధురంగానే వుంటవి. ఛలోక్తి విసిరేవారికి ఎంత తెలివితేటలు కావాలో అర్థంచేసుకొంటానికి అంత తెలివితేటలు కావలె.

*ఈ వూరునిండా గాడిదలే :* శ్రీమతి చిట్టెమ్మ శ్రీముట్నూరు కృష్ణారావు పంతులుగారి మనుమరాలు. యూరపులోని అనేక దేశాలలో తిరిగివచ్చింది. చదువుకొన్నది. సరసత తెలిసిన ఇల్లాలు. తాతగారిని చూచిపోదామని వచ్చింది. ఆవిడ దర్బారులో ఒకసారి అన్నది. "ఏమండీ తాతగారూ! ఈ ఊరినిండా గాడిదలేనే" అని. బందరులో గాడిదలు ఎక్కువగా ఉన్నమాట నిజమే. చిట్టెమ్మ తాతగారితో ఎకసెక్కెములాడింది. ఆమాటవిని పంతులుగారు "అవునమ్మా! నీవన్న మాటనిజమే. ఈ ఊరునిండా గాడిదలే. ఇవిచాలనట్టు అప్పుడప్పుడు

ఈగాడిదలను చూడడానికి పొరుగూరి గాడిదలుకూడా వస్తుంటవి." అన్నాడు. చిట్టెమ్మకూడా నవ్వింది. ఇది ఛలోక్తి.

*రోగం ముదిరినతరువాత చికిత్స:* ఒకాయన డాక్టరు దగ్గరకు వెళ్లాడు. రోగులంతా కూర్చునే గదిలో కూర్చున్నాడు. డాక్టరుగారు ఎంతసేపటికి రాలేదు. విసుగెత్తిపోయింది. ఒకగంట అయినతరువాత వచ్చాడు డాక్టరు. ఏమండీ! చాలసేపు కూర్చున్నట్లున్నారు? అన్నాడు ఒకవిధంగా క్షమాపణ పూర్వకంగా. రోగి అన్నాడు "ఎంతసేపు కూర్చుంటే ఏమిగానీండి. అయితే ఒక్కటి. రోగం ముదిరిపోకముందే చికిత్సచేస్తారనుకున్నాను" అన్నాడు. సున్నితంగా కనపడ్డా గాఢంగానే తగిలింది డాక్టరుకు ఈ దెబ్బ. అయితేనేం ఈ ఛలోక్తికి ఆయనా నవ్వుకొన్నాడు.

*రైలుఎక్కు అవ్వా!:* గుంటూరుబండి పూర్వపురోజుల్లో బహు నెమ్మదిగా నడిచేది. ఆ విషయాన్ని ఆధారంగా తీసుకొని అనేక ఛలోక్తులు పుట్టినవి. గుంటూరుబండి నడుస్తున్నదట. మంగళగిరివద్ద పొలాల్లో ఒక ముసలమ్మ నెమ్మదిగా గుంటూరువైపు నడుస్తూ పోతూ ఉండడం గార్డుచూచి జాలిపడి బండిఆపి "ఎక్కు అవ్వా? పాపం ముసలిదానివి ఏంనడుస్తావు! గుంటూరులో దిగబెడతానురా" అన్నాడట. ఆ ముసలమ్మ "నీ మంచితనం నిన్ను అట్లాఅనిపించింది. నూరేళ్లు బ్రతుకు నాయనా! బండి ఎక్కడానికేంలే! ఇంకోసారి ఎప్పుడైనా ఎక్కుతాను. బండి ఎక్కమంటే ఎక్కలేదని మనస్సులో కష్టం ఉంచుకోకునాయనా ఇవ్వాళ కాస్త తొందరపని ఉందిబాబూ!" అన్నదట.

ఇంకో ముసలమ్మతో గార్డు "ఈపిల్లవాడికి అరటిక్కెట్టు పుచ్చుకొన్నావేమమ్మా నిండుటిక్కెట్టు కొనక"అని అంటే, ఆమెగారు "బెజవాడలో ఎక్కినపుడు అబ్బాయికి నిండుటిక్కెట్టు కొనాల్సినంత ఈడెక్కడిది బాబూ!" అన్నదట. ఇవి బహురమ్యమైన ఛలోక్తులు.

అయితే ఇవి ఉద్దేశపూర్వకంగా అన్నవి. అంటే ఛలోక్తి కర్తకు ఈ మాటలలో ఉండే చమత్కారము తెలుసు. తెలిసేఅన్నారు. ఒకప్పుడు ఆ చమత్కారమును ఉద్దేశించకుండా అమాయకంగా అన్నమాటలలో కూడా భాసిస్తుంది.

*మనిషివికావు-పందివే :* ఒకావిడ చిన్నబ్రష్ ఒకటితీసుకొని తన నగలేవో కడుగుకొంటున్నది. ఆవిడగారి మరదలు వెనుకనుండి వచ్చి ఆమెచేతిలోని బ్రష్ లాక్కొని దానివెంట్రుకలను నలిపి వింతగాచూస్తూ అన్నది. ''వదినా! పందివా? మనిషివనుకొన్నా!''అని. వెంటనే వదినె గారు 'అవునమ్మా! మనిషివికావు పందివే!' అన్నది. అయితే అమ్మా యికి ఛలోక్తి అనే విషయపరిజ్ఞానం లేకుండ అమాయకంగానే బ్రష్ యొక్క వెంట్రుకలను దృష్టిలోపెట్టుకొనే అన్నప్పటికీ వదినెగారికి అది ఛలోక్తిఅయింది. ఆవిడకూడా ఉద్దేశపూర్వకంగా అన్నా అనక పోయినా సమాధానం రమణీయమైన ఛలోక్తిగా భాసించింది.

*పిచ్చివాళ్లు-ఆయన మాలో ఒకరు:* ఒక పిచ్చిఆసుపత్రి సూపరిం టెండెంటుగారు బదిలీఅయి వెళ్లిపోతున్నారు. ఆయన చాలామంచివాడు. ఆయన వెళ్లిపోవడం అందరికీ విచారం కలిగించింది. ఆ సందర్భంలో మాట్లాడినవాళ్లల్లో పిచ్చికుదిరి ఇంకా కాస్తోకూస్తో ఉంటే అదికూడా పోయేందుకు చికిత్సపొందుతున్నవాళ్లు ఉన్నారు. అటువంటివాళ్లలో ఒక పెద్దమనిషిని మాట్లాడమన్నారు. ఆయన సూపరెంటెండెంటుగారి సుగుణాలను గురించి చెపుతూ, "వీరు నిగర్వి, మాలో ఒకడుగా మెలి గాడు"అని అనేసరికి అంతా గొల్లుమన్నారు. ఇదీ ఛలోక్తే ఛలోక్తిగా అందామని అనకపోయినా.

మంగళేశ్వరశాస్త్రిగారిదే మరొక ఛలోక్తి. పార్వతీపురంలో నడి మింటి మంగళేశ్వరశాస్త్రుల్లుగారు ఉండేవారు. ఆయన ఉద్దండ విద్వాంసుడు. బొబ్బిలి మహారాజుగారు ఆయనకు మిత్రుడు. ఒకసారి

రాజావారు శాస్త్రిగారిని అడిగినారట ఏమండీ శాస్త్రిగారూ! మనము ప్రయాణమై పోతున్నప్పుడు దారిలో నక్కఎదురైతే మంచిదిఅంటారు. అయితే నక్క కుడినుండి ఎడమవైపునకు పోతే మంచిదా, ఎడమ వైపునుండి కుడిప్రక్కకుపోతే మంచిదా అని. శాస్త్రిగారు "అది కరవ లేదుగద! కరవకుండా ఎటుపోయినా మంచిదే" అన్నారట.

నర్మోక్తి:

*అర్ధరూపాయికి గతిలేకపోతే యుద్ధం ఎందుకు ప్రారంభించాలి:* మరొక ఉక్తివిశేషముంది. అందులో పదలాలిత్యం ఉండదుగాని ఆ వాక్కులో ఒకసత్యము దాక్కొనిఉంటుంది సర్మగర్భమైన వాక్కు అది. యుద్ధపురోజుల్లో యుద్ధనిధి వసూలుచేస్తున్నారు. ప్రతివారు ఎవరికితోచిందివారు ఇస్తున్నారు. నన్నూ అడిగారు. నేనూ ఒక అర్ధ రూపాయి సమర్పించాను. మా కాంతం నేను ఇవ్వడం చూస్తూనేఉంది. "ఎందుకండీ డబ్బు అడుగుతున్నారూ" అని ప్రశ్నవేసింది. "మన ప్రభుత్వంవారు జర్మనీతో బ్రహ్మాండమైన యుద్ధంచేస్తున్నారు. దానికి బోలెడు డబ్బుకావాలె. తలాకాస్త ఇస్తున్నారు"అన్నాను. "మీరెంత ఇచ్చారు?"అంది. అర్ధరూపాయి ఇచ్చానన్నా. "ఆవిడ ముక్కుపైన వేలేసుకొని ఆశ్చర్యాన్ని ప్రకటించి అన్నదీ! "అదేంపనండీ ప్రభుత్వం వారు యుద్ధముచేస్తున్నారూ? ఏంచెయ్యకపోతే"అని. అందులో అర్ధ రూపాయకు గతిలేనివాళ్లు యుద్ధం ఎందుకు తలపెట్టాలండీ అని మళ్ళీ అన్నది. ప్రభుత్వంవారు యుద్ధనిధికి ప్రోగుచేయడాన్ని గురించి బ్రహ్మాండమైన నిరసన ఇందులో ఉంది.

ప్రభుత్వపుచర్యను ఎంతకఠినంగా విమర్శించినా ఈ ఫలితంరాదు. వేయిపడగలు అనే నవలలో ఉన్నది. సుబ్బన్నపేట పెరిగి పెద్దపట్టణ మైనదట. సుభాన్‌పేట అని బల్లపై వ్రాసినారు. ఒకచారిత్రక పరిశోధ కుడు అదిచూచి, "ఇచ్చట సుభానుడుఅను రాజు పాలించి ఉంటాడు. ఆ

విషయం పరిశోధనవల్లగాని తేలదు. చాళుక్యరాజో వాకాటకప్రభువో కావచ్చును"అన్నాడట. చరిత్ర పరిశోధనలో ఉండే అవతవకపనులను విమర్శిస్తున్నది ఈ వాక్యము.

సమయోక్తి:

*సారాయికాదు పవిత్రజలము:* ఒక్కొక్కప్పుడు ఆ సమయానికి ఏదో సరసమైనమాట అనడం చాలాతెలివియైన పనిఅని వినేవాడికి తోస్తుంది. ఆ హాస్యపుపలుకు ఆ సమయానికి అతికినట్లు సరిపోవడమూ హఠాత్‌జనితమైన ఒకసంఘటనలోంచి బయటపడడానికి తోడ్పడమూ, ఆ సమయోక్తికి లక్షణాలు. ఇదీప్రతిభాజన్యమే. సారాయి అమ్మకూడదు త్రాగకూడదు. అదీ ప్రభుత్వంవారి ఆజ్ఞ. ఒక క్రైస్తవుడు కొంత సారాయిని సేకరించి రహస్యంగా అమ్మటానికి తీసుకొనివెడుతున్నాడు. కాని పోలీసులు పట్టుకొన్నారు. "ఏమిటి ఈ సీసాలోని"దని అడిగారు. 'ఇది పవిత్రజలము' (Holy water) అన్నాడు. పోలీసు వాసనచూచి కొంచెం రుచి చూచి "ఏమయ్యా! ఇది సారాయి. కావలిస్తే నీవేచూడు." అన్నాడు. క్రైస్తవఆసామీ కొంచెము రుచిచూచి, ఆశ్చర్యమును ప్రకటించి "నిజంబాబూ ఇదిసారాయి. ఆ ఏసుప్రభువు తన మాహాత్మ్యమును వెల్లడిచేశాడు. నీటిని ద్రాక్షరసంగా మార్చాడు.'' అని మోకరించి ప్రార్థించినాడట. ఆ సమయానికి అన్వయించే ఆమాట అనడములో ప్రతిభ ద్యోతకమౌతున్నది.

ఆశ్చర్యోక్తి:

*నేను తండ్రినిగాదు తల్లిని:* పరమఆశ్చర్యాన్ని కలిగించే సంఘటనలు, ఆశ్చర్యంతోపాటు ఆనందాన్నికూడా కలుగజేస్తవి. ఆనందానికి సూచనగా నవ్వడమూ జరుగుతుంది. ఈక్రింది సంభాషణలో ఒకవాక్యం కంటే మరొకవాక్యం ఆశ్చర్యజనకంగా ఉన్నవి. ఇద్దరువ్యక్తులు ఈ కాలపు వేషధారణను గురించి ప్రసంగిస్తున్నారు. "ఏమిటో వీళ్ల వేషం.

అటుచూడండి. ఆ వ్యక్తి ధరించిన కోటు కత్తిరించిన జుట్టు బ్లూ పాంటూనూ! ఆడదైందీ మొగవాడైందీ తెలియడంలేదు'' అన్నాడు మొదటివ్యక్తి. రెండోవ్యక్తి అన్నాడు. "అది ఆడపిల్ల మాఅమ్మాయి." మొదటివాడు ఆశ్చర్యపడి ''క్షమించండి, ఆపిల్లకు మీరు తండ్రి అని ఊహించలేకపోయాను''అన్నాడు. రెండోవ్యక్తి ''నేను తండ్రినిగాదు, తల్లిని!'' అనగా ఈమాటలువిని మొదటివ్యక్తి మరీ ఆశ్చర్యంతో తల మున్కలై అయితే ఇప్పుడు నేను ఆడదాన్నో, మొగవాడినో తేల్చు కోవాలె. అని అక్కడనుండి గబగబా వెళ్ళిపోయినాడు.

## ద్వంద్వార్థోక్తి :

*పతితద్విజుడు:* ''ఆ పండితుడు పతితద్విజుడు'' అన్నవాక్యం ద్వంద్వార్థ ప్రతిపాదకము. "పతితద్విజుడు"పళ్లు ఊడిపోయినవాడు అని అర్థం. కాని ఆమాటకు ఉన్న రెండవఅర్థం స్ఫురించేసరికి అందులోని చమత్కారం విదితమై మనపెదవులపైని చిరునవ్వు భాసిస్తుంది. పతిత ద్విజుడు అంటే పతితుడైన లేక భ్రష్టుడైన బ్రాహ్మణుడుఅని రెండో అర్థము. ఆమాటను మనము అమాయకంగా మొదటిఅర్థంలో అన్నట్లు నటిస్తూ రెండోఅర్థాన్ని స్ఫురణకు వదిలేస్తే వినోదకల్పన జరిగినట్లే.

*మొక్కపాటి-గురుపాదులు:* ఇల్లాగే మొక్కపాటివారు, గురు పాదులు అన్నాను నేనొకసారి. వారు మాకు గురుతుల్యులే. ఈఅర్థంలో ఆయనను గురించి గౌరవపురస్సరముగా మాట్లాడినట్లు వినేవారికి తోస్తుంది. అయితే ఇందులో కొంటెతనం ఉంది. 'వారిపాదములు చాలాపెద్దవి' ఆ విషయం స్ఫురణకువచ్చినప్పుడు అందులోఉండే కొంటె తనం గ్రహించి నవ్వుకోకమానము. అల్లాగే కైంకర్యముచేశాడు అన్న మాట. కింకరుడు అన్నమాట ద్వంద్వార్థములు కలిగియున్నది. మావాడు కైంకర్యం చేశాడు అని దేవతా నివేదనచేశాడు అనేఅర్థంలో అన్నట్లు నటిస్తే 'కాజేశాడు' అనే అర్థం వినేవాడికి స్ఫురించి నవ్వుకొంటాడు.

వళ్లంతా తామర : ఇల్లాగ రెండుఅర్థములు గలమాటలు తీసికొని అనింద్యార్థంలో ఉపయోగిస్తున్నట్లు నటిస్తూ రెండోఅర్థం ధ్వనిలో నిక్షిప్తంచేస్తే ఆ వ్యాపారం చమత్కారమయమై హాసహేతువు అవుతుంది. స్త్రీని వర్ణించడంలో 'ఆమె మోము తామర', 'కన్నుతామర', 'చరణములు తామర', 'కరంబులు తామర'అని ఉంది ఒక పద్యంలో. ఒక హాస్యశీలుడు ఇదేమిటి అబ్బా! మొల తామర విన్నాముగాని. ఈమె ఒళ్లంతా తామర అంటాడు. ఇదేదో దూలగొండిలాగున్నది అన్నాడు. కళ్లను చేతులను కాళ్లనూ పద్మాలతో పోలుస్తారు. పద్మం అనే మాటకు బదులు తామర ఉపయోగించి చమత్కారం సాధించాడు కవి. తామరకు రెండుఅర్థాలు ఉండడమువల్లనే ఈ చమత్కారం సాధ్యమైంది. కాబట్టి దీనిని ద్వంద్వార్థోక్తి క్రిందకు చేర్చినాను. ఈ ఉక్తి శ్లేషవంటిదే. కాని నేను దీనిని ఒకప్రత్యేక ఉక్తి విశేషంగా రూపొందించి ద్వంద్వార్థోక్తి అని పేరుపెట్టాను.

ఆ పద్యం ఇది. "అటుపయి మోము దామరట, యక్షియుతామర లోన దామరేయట! చరణంబు దామరయెయంట, కరంబును దామరంట, ఇంతటి విపరీతమున్నె మొలతామర వింటిమిగాని మేనియంతట నిటు తామరంగలుగు తన్వి నిజంబుగ దూలగొండియే." ఇది సెట్టి లక్ష్మీనృసింహకవిగారి పద్యం.

యథార్థోక్తి:

నిజంచెప్పినా ఉన్నది ఉన్నట్లు చెప్పినా అందులో అసంగతమైన విషయము ఏమీలేదుకాబట్టి నవ్వురాదు. కాని ఒక్కొక్క పరిస్థితిలో నిజంచెప్పినా నవ్వువస్తుంది. నీవు నిజంచెప్పవని అనుకొన్నప్పుడు ఠపీమని నిజంచెప్పేస్తివా వినేవాడు ఆశ్చర్యచకితుడై, విస్మయతాడితుడై ఫక్కున నవ్వుతాడు. నిర్ణిరీక్షితమైన అనూహ్యమైన సత్యప్రవచనము హాసకారణమే! అంటే ఆ సత్యప్రవచనము నీవుఊహించని

కారణాన విపరీతంగాతోచి విచిత్రంగాకనపడి హాసజనకము కాకమానదు. ఆ నిజంచెప్పడము సత్యవాక్యపరిపాలనా సక్తివల్లకాక, నీవన్నమాట అపార్థం చేసుకోవడంవల్ల బుద్ధిమాంద్యానికి ఫలితంగాగాని అయినట్లయితే ఆమాట వినోదసంభరితమై హాసజనకం అవుతుంది.

*నేను పట్టుబడలేదు* : ఒక కంపినీవారు కారు డ్రైవరుకోసం ప్రకటనచేశారు. ఒకడువచ్చాడు. అతనిని తీసుకొందామనే అనుకొన్నారు కంపినీవారు. అతనిచేతికొక ఫారం ఇచ్చి దాన్నిపూర్తిచేసి ఇవ్వమన్నారు. అంటే కొన్నిప్రశ్నలకు జవాబు వ్రాయవలెనన్నమాట. మొదటిప్రశ్న 'పూర్తి పేరేమి?' వ్రాశాడు. 'ఏఊరు?' సమాధానం వ్రాశాడు. 'వయస్సు ఎంత?' చెప్పాడు. 'అనుభవం?' నాలుగేండ్లు. తరువాతప్రశ్న 'నీవు ఎప్పుడైనా నేరంచేసినందుకు అరెస్టు అయినావా?' లేదు, అనివ్రాశాడు. "ఎందుచేత!" అని తరువాత ప్రశ్న. అరెస్టుఅయి ఉన్నవాళ్లను ఉద్దేశించి వేసినప్రశ్న అది. "ఎందుకూ?" అంటే ఏ నేరము చేసినందుకు అరెస్టు అయింది వ్రాయవలె. ఇతడు అరెస్టుకాలేదుగా, అందుకని ఏమీ వ్రాయ సక్కరలేదు. కాని ఈ మందమతి ఎందుకు అరెస్టుకాలేదో వ్రాయమన్నాడుఅనుకొని "పట్టుబడలేదు కాబట్టి"అని సమాధానం వ్రాశాడు.

*ఏదైనా చూడడానికి కళ్ళజోడు కావాలె* : ఈ కథలో డ్రైవరు ప్రశ్నను తప్పుగా అర్థంచేసుకొని పరమసత్యమైన విషయాన్ని బయట పెట్టాడు. అల్లాగ ప్రశ్నను అపార్థం చేసుకొన్నందుకే నవ్వుతాము. ఆ తరువాత చెప్పఅవసరములేని విషయాన్ని అనవసరంగా ఉచితానుచిత జ్ఞానంలేకుండా చెప్పడమువల్ల మరీ నవ్వుతాము. ఈవిధంగా యథార్థోక్తులుకూడా హాసజనకములు అయినవి. అల్లాగే అందరికితెలిసిన విషయాన్ని ఒకవిశేషంగా భావిస్తే అట్టిభావన పరమసత్యమైనది అయినా హాస్యాస్పదం అవుతుంది. విశేషం కానిదానిని విశేషంగా భావించడంలో వైపరీత్యం ఉంది. ఈ కథ వినండి. 'ముగ్గురు ముసలమ్మలు కూర్చుని

మాట్లాడుకొంటున్నారు. 'ఏమమ్మా నీవు కళ్లజోడు ఉపయోగిస్తావా?' రెండవఆవిడ "లేదమ్మా! నేను ఉపయోగించను" మొదటి ఆవిడ మూడవఆవిడను అడిగింది. 'ఏమమ్మా నీసంగతి ఏమిటీ? నీవు కళ్లజోడు ఉపయోగిస్తావా?'అని. ఆవిడ 'నాకు కళ్లజోడు కావలె. అయితే ఎప్పుడూ అక్కరలేదు. ఏదైనాచూడడానికి మాత్రం కళ్లజోడుకావలె' అన్నది. కళ్లజోడు అనేది చూడడానికేకాని తింటానికికాదుగా! విచిత్రం ఏమీలేని విషయాన్ని విశేషగర్భితమైన ఉదంతంగా భావించి మాట్లాడితే నవ్వురాదూ? ఆమెచెప్పింది నిజమే అయినా నవ్వువస్తుంది.

*బస్సువచ్చిందాకా కూర్చోవాలె:* బస్సుకోసం ఎంతసేపు నిరీక్షిస్తూ కూర్చోవాలో చెప్పగలవా అని ఒకపల్లెటూరు ఆసామీ ఒకాయనను అడిగితే అయన బస్సువచ్చిందాకా కూర్చోవలసిందే అన్నాడు. ఇటువంటి ఉక్తులు హాస్యజనకములు. అవతలమనిషి మనలను అపార్థం చేసుకోవడంలో బహిర్గతమైన బుద్ధిమాంద్యత (Stupidity) మనలను నవ్విస్తుంది. తరువాతవచ్చే సమాధానము పరమసత్యము అయినా మనము అనుకోనిది కావడముచేత విస్మయచకితులమై నవ్వుతాము.

## వక్రోక్తి :

*వక్రోక్తి రకాలు:* వక్రోక్తి అనగా స్వభావవిరుద్ధమగు లోకోత్తర వైచిత్ర్యము. నిజానికి వక్రతలేనిది కావ్యమూలేదు. హాస్యమూ లేదు. శబ్దగతమైన వక్రతవలననే శబ్దాశ్రయహాస్యము పుట్టింది. భావగతమైన వక్రతే భావాశ్రయహాస్యానికి మూలము. వక్రత అర్ధగతంగా ఉంటే అది అర్థాశ్రయహాస్యమైంది. అయినా వక్రోక్తి అని ఒక ఉక్తి విశేషము కల్పించబడింది. ఈ వంకరతనం శ్లేషలో ఉండవచ్చును. అది శ్లేషవక్రోక్తి. కాకువులో ఉండవచ్చును అది కాకువక్రోక్తి.

*వక్రోక్తి లక్షణాలు :* హాస్యరస స్ఫోరకమైన వక్రోక్తి మూడు లక్షణాలను కలిగి ఉంటుంది. 1. వక్రతఅంటే వైచిత్ర్యము. 2. అది

హాస్యజనకంగా ఉండవలె. 3. ఆ చమత్కారము ధ్వని నిక్షిప్తమై ఉండవలె. వక్రత ధ్వని నిక్షిప్తమై ఉన్నప్పుడే మనోహరంగా ఉంటుంది. ఒకకథ: భార్య భర్తశీలాన్ని శంకించి నిష్టురోక్తులాడుతూ "మీకు చక్కనిపిల్ల కనపడితేచాలు 'నాకు పెండ్లి అయింది, నాకు పెండ్లాముంది అన్నసంగతే మర్చిపోతారు" అన్నది. భర్త "కాదు కాదు భార్యా, నాకు చక్కని స్త్రీ కనపడ్డప్పుడు నాకు పెండ్లి అయిందన్న విషయము సూది పెట్టి గుచ్చినప్పుడు కలిగే బాధతో జ్ఞాపకంవస్తుంది" అన్నాడు భార్యకు అర్థమైంది. భర్త తనకు పెళ్లి అయిన విషయము బాధతో జ్ఞాపకం వస్తూనే ఉంటుంది అని చెప్పడంలో భార్య అందమైనది కాదన్న విషయమును ధ్వనింపజేశాడు. అప్రియాన్ని తియ్యనిమాటలతో గుప్తంగా మనోహరంగా జుగుప్సారహితంగా చెప్పాడు. ఆ అప్రియము ధ్వని నిక్షిప్తము. ఇది చక్కని వక్రోక్తి.

*భీమామొత్తం అంతా నీకేవస్తుంది:* ఒక అభిప్రాయంలో మాట్లాడు పైకికనబడుతూ వేరొక అభిప్రాయమును స్ఫురించేలాగున చేయడమే వక్రోక్తి లక్షణము. భార్య క్రొత్తగా కాపరానికివచ్చింది. పాపం ఆమె వంట కమ్మగాచేయలేదు. భర్త ఆ మాట ఆమెకు చెప్ప లేదు మనస్సు కష్టపెట్టుకొంటుందని. భార్య తాను వంటబాగానే చేస్తున్నా ననుకొని "రోజూ సంవత్సరం పొడుగునా ఇల్లాగేచేస్తే నాకేమిస్తారు?" అని అడిగింది. భర్త "నా జీవితభీమా మొత్తంఅంతా నీకొస్తుంది" అన్నాడు. భార్యకు అర్థంఅయ్యే ఉంటుంది. అయినా ఆ ఉక్తిరమ్యతకు ఆమెకూడా నవ్వింది. దీన్ని రసవక్రత అందాము. రసము ఇక్కడ వ్యంగ్యరూపంగా ఉన్నది. ఇల్లాంటివి వక్రోక్తులు. కవి ప్రతిభనుబట్టి వీటి రామణీయకత పెరుగుతూ ఉంటుంది. వక్రోక్తులు ఆనందమును చేకూరుస్తవి. హాసజనకంగానూ ఉంటవి.

వ్యతిరేకార్థోక్తి:

ఈ ఉక్తివిశేషంలో ఉండే తమాషా ఏమిటీఅంటే కథకుడు ఒక

అర్థాన్ని ఉద్దేశించి దానికి వ్యతిరేకార్థం వచ్చేటట్లు మాట్లాడుతాడు. ఎందుకు అల్లాగఅంటాడూ అంటే అల్లాగఅనడము వలన ఒక చమత్కారం సిద్ధిస్తుంది కాబట్టి. అది ఒకతమాషా. నీవు అన్నమాటల యొక్క వాచ్యార్థము ఒకటి. అయితే స్ఫురణవలన వ్యతిరేకార్థము భాసిస్తుంది. పిల్లవాడితో తండ్రి పరిహాసానికి ఇల్లాగ అంటాడు. "నాయనా ఇప్పుడు రాత్రి ఒంటిగంట అయింది. ఇంకేంపడుకొంటావులే! నిద్రపోవడం ఎందుకూ? ఇంకాకాసేపు గడిపేస్తేవా తెల్లవారుతుంది" అని.ఇల్లాగ నిద్రపోవద్దని చెపుతున్నా ఇక పడుకొని నిద్రపోఅని తండ్రి కుమారుణ్ణి కూకలేస్తున్నట్లేగా!

*నన్ను ముద్దుపెట్టుకోవద్దు సుమండీ:* భార్యాభర్తల మధ్య ఇటువంటి వాగ్వ్యాపారము తరుచు జరుగుతూ ఉంటుంది. భార్య భర్తతో అంటుందీ 'చూడండి. నన్ను ముద్దుపెట్టుకోవద్దు సుమా! అల్లాంటి ప్రయత్నం చేస్తిరో నాకుకోపం వస్తుంది.' అల్లాఅనడంలో ఆమె భర్తను తనను ముద్దుపెట్టుకోమని ఆహ్వానిస్తున్నదన్నమాట. ఇట్లా చెప్పడంలో అందంపున్నది. ఇదిఒక వక్రోక్తి. చక్కలిగింతపెట్టి మనలను నవ్విస్తుంది. కాబట్టి ఇది ఉత్తమహాస్యం. ఒకసారి నేను ఒక జోక్సు పుస్తకం చదువుతున్నాను. రావూరువారు వచ్చారు. ఆయన ఏమండీ ఆ పుస్తకం వ్రాసినఆయన మన హాస్యోక్తులు ఏమైనా కాజేశాడేమోనని చూస్తున్నారా? అన్నాడు. ఆయన ఉద్దేశం నేనే ఆపుస్తకంలోని జోక్సును కొన్నిటిని కాజేద్దామని చూస్తున్నానని.

ఇల్లాగఅంటే నవ్వు రాకమానదు. ఇదికూడా మనోహరమైన ఉక్తివిశేషాలలో ఒకటి. ఇటువంటి మాటలు ఒకతమాషా అయిన పద్ధతిలో ప్రసన్నవదనంతో తళతళలాడుతున్న కళ్లతో వంకరచూపులు చూస్తూ అంటే ధ్వని నిక్షిప్తమైయున్న ఆ రమణీయమైన అర్థము వెంటనే స్ఫురించి మనస్సు ఆనందంతో నిండిపోతుంది.

*నాకు కోపంవచ్చింది:* ఒకాయనకు భార్యమీద కోపంవచ్చింది. భార్యదగ్గరకువచ్చి "ఏమండీ! భోజనానికి లేస్తారా?" అని అడిగింది. ఆయన బుంగమూతిపెట్టి 'లేవను' అన్నాడు. భార్య: "ఏం?" భర్త: "నాకు కోపంవచ్చింది." భార్య: "ఎట్లాపోతుంది?" భర్త: "పోదు" భార్య: "ఎట్లాపోదో నేను చూస్తాగా." భర్త: "ఈకోపం పొయ్యే కోపంకాదు. పోదు. నీవు చెయ్యిపట్టుకొని లాగి వెనుకనుంచి నెడుతూ తీసికెడదామనుకొంటున్నావేమో? అవేమీసాగవు. అల్లాగచేసినా రాను. చక్కలిగింత పెట్టడం అల్లాంటిపనులు చేస్తివా మా అమ్మను కేకేస్తాను" అన్నాడు. ఈ వాక్యంలో ఉండే చమత్కారము గ్రహించలేని స్త్రీ ఉండదు. వ్యతిరేకార్థ స్ఫురణ ఈవిధంగా మనోహరమైన వ్యాపారము అయింది. దీనివలన సిద్ధించే హాస్యముకూడా పరమరమణీయంగా ఉంటుంది.

విపర్యయోక్తి:

*నెమళ్లు నాట్యంచేస్తే మేఘాలు వస్తవి:* ఏసంఘటనకైనా కారణం ఉంటుంది. ఫలాని పనివల్ల ఈ కార్యం జరిగిందీ అంటాము. కారణము వలన కార్యము జరుగుతుంది. ఆకాశము మేఘావృతమైనపుడు నెమళ్లు పురివిప్పి నాట్యంచేస్తవి. నెమళ్లు నాట్యం చేయడానికి మేఘాలుకారణం. అయితే నెమళ్లు నాట్యంచేస్తే ఆకాశం మేఘాచ్ఛన్నం అవుతుంది అంటే కార్యకారణ విపర్యయము ఏర్పడ్డది అనవచ్చు. కారణమైనదానిని కార్యంగా చేశాము. కార్యాన్ని కారణంగా పేర్కొంటే విపరీతంగా ఉండి వినోదహేతువు అవుతున్నది.

*చెట్లు చిగిరిస్తే వసంతం వస్తుంది:* "చెరువు ఎండిపోతే ఎండలు మండిపోతవి" అనేది విపర్యాయోక్తే! నిజానికి ఎండలు మండిపోతేనే చెరువులు ఎండిపోతవి. "చెట్లు చిగిరిస్తే వసంతం వస్తుంది." ఇది కూడా విపర్యాయోక్తే! వసంతంవస్తే చెట్లు చిగిరిస్తవి. ఇటువంటివే

మరికొన్ని. "కుక్కలు అరిస్తే దొంగలువస్తారు." అదికాదు అనాలిసింది దొంగలువస్తే కుక్కలు అరుస్తవి." "చీకటిపోతే చంద్రుడువస్తాడు." అన్నమాట విపర్యాయోక్తి. చంద్రుడువస్తే చీకటిపోతుంది. ఇల్లాగే ముందుచెప్పవలసినదానిని వెనకా, వెనుక చెప్పవలసినదానిని ముందూ చెప్పి కార్యకారణ విపర్యాయోక్తిని సాధించవచ్చు. ఇల్లాంటి హాస్య రమ్యమైన మాటలనే విపర్యాయోక్తి అన్నాము.

ప్రత్యుక్తి:

*మాటకుమాట అంటించడం:* ఎదుటివానిని హాస్యం చేయడము మానవునికి సహజంగా ఉండే గుణాలలో ఒకటి. హాస్యంచేయడమూ, అంటే నవ్వులాటకు ఏదో ఒకమాట అనడము. అల్లాగ అన్నమాట ఇవతలవ్యక్తి మనస్సును కష్టపెట్టేదిగా ఉంటుంది ఒకప్పుడు. అల్లాగ కష్టం కలిగించేమాట అన్నప్పుడు విప్రకృతుడు ఊరుకొంటే నవ్వేసి ఊరుకొంటాడు. లేకపోతే మాటకుమాట అంటిస్తాడు.

*డబ్బు-డబ్బు-డబ్బు:* ఇంకోకథ. భార్య ఇంటిఖర్చుకై పది రూపాయలు అడిగింది. ఇదివరలో ఇచ్చినదంతా నిమిషంలోకి ఖర్చుచేసి నందులకు కోపంవచ్చి ఆయన భార్యతో "డబ్బు,డబ్బు,డబ్బు! ఎప్పుడూ డబ్బులేదనే గోల! నీకులేనిది డబ్బుకాదు. కాస్త ముందుఆలోచనలేదు. ఇంతకూ అసలు నీకు తెలివితేటలులేవు"అన్నాడు. భార్య "అవి మీదగ్గర దొరకవుగా! అందుకని డబ్బు అడుగుతున్నానన్నది." భార్య అన్న మాట సరసంగావుంది. ఇటువంటివే రిపార్టీలంటే! మేధాపౌష్కల్యం కలవారే ఇట్లా మాటకుమాట అనగలరు.

*అట్లామాట్లాడితేగాని మీకుతెలియదాయె :* ఇంకోకథ చెపుతాను. ఒక సారి నేను మా ఆవిడతో కోపంగా అన్నాను. "అల్లాగ స్టుపిడ్‌లాగ మాట్లాడతావేం?"అని. ఆవిడకోపగించుకోలేదు.శాంతంగా మళ్ళీఅన్నది. "అట్లా మాట్లాడితేగాని మీకుతెలియదాయె చచ్చి. మరి ఏంజేసేది?

"అని. కొంచెంఆలోచిస్తేనేగాని ఇందులోవుండే చమత్కారం తెలియదు. రిపార్టీకి ఇదీ మంచి ఉదాహరణే.

*టామెర్లేన్ కథ:* ఇంకో ఉదాహరణ: టామెర్లైన్ మనదేశంపైకి దండెత్తివచ్చినాడు. ఆ సందర్భంలో ఆయన ఒకనగరంలో ఉన్నప్పుడు జరిగినవృత్తాంతం ఇది. ఆ ఊళ్లో ఒక సంగీత విద్వాంసురాలు ఉండేదట. తైమూరు ఆమెను పిలిపించి తనసన్నిధిలో సంగీతం పాడమని కోరినాడు. ఆమె అద్భుతంగా పాడింది. ప్రభువు మెచ్చుకొని ఆమెకుతగిన పారితోషికమిచ్చి అంతాఅయిపోయినతరువాత "ఏమమ్మా నీ గానం మనోహరంగా ఉన్నది. అందుకు సందేహములేదు. కాని నీ గానదేవత గ్రుడ్డిదై ఉండాలె. లేకపోతే నీవంటి కురూపిని ఆశ్రయించి, నిన్ను ఇంత ప్రజ్ఞావంతురాలను చేస్తుందా"అన్నాడు. ఆ మాటమీద ఆమె ధైర్యంగా "మీరు అన్నమాట నిజమే. అయితే ఆమె ఒక్కతే గ్రుడ్డిది కాదు. లక్ష్మికూడా గ్రుడ్డిదే. లేకపోతే నీవంటి కుంటివానిని వరించి ఇంత మహదైశ్వర్యమును ఇస్తుందా," అన్నదట. మాటకుమాట అంటించింది. తైమూరు కుంటివాడు అన్నసంగతి అందరికీ తెలిసిన విషయమే.

*అడిదము సూరనకవి :* అడిదము సూరనకవిని గురించి ఇటువంటి కథ ఒకటుంది. అది మంచిరిపార్టీ. ఒకసారి ఆయన వీధివెంట వెడుతూవుంటే భయంకరమైన కుక్కఒకటి ఆయనను కరవొచ్చింది. ఆయన పరుగు లంకించుకొన్నాడు. ఆ వీధి చివర గుమిగూడియున్న తనస్నేహితులను కలిసికొన్నాడు. వారు ఏమయ్యా కవీ! అంత భయపడ్డావేమి? గాడిదవలె పరుగెత్తుకొనివచ్చావు అని హేళనచేశారు. కవి అన్నాడూ! అవునయ్యా కుక్క కరుస్తుందని భయపడి పరుగెత్తుకొని వచ్చాను, ఇకఏమీ భయములేదు. స్వజనంలోపడ్డాను. అన్నాడట. అందరినీ గాడిదలనుచేసిన ఈ ప్రత్యుక్తి రమ్యంగావుంది. ఈ సంగతి అందరికీ తెలిసింది అంతా నవ్వారు.

*రిపార్టీ కత్తియుద్ధములాంటిది:* ప్రత్యుక్తి కత్తియుద్ధము వంటిది. (It is sword play) ఇందులో పాల్గొనేవ్యక్తులు ఒకరినిఒకరు మాటలతో గాయపరుచుకోవలెనని ప్రయత్నిస్తారు. ఆకాశంలో అటువైపు ఒకమెరుపు, ఇటువైపు ఒకమెరుపు మెరిసినప్పుడుచూస్తే మనకు కలిగిన ఆనందం ఇటువంటి సంభాషణవినడంవల్ల కలుగుతుంది. ఇంకో రెండు ఉదాహరణలతో ఈ నేర్పు ఎల్లాగ ఉంటుందో చూపిస్తాను.

*దద్దమ్మలతో మాట్లాడడానికి నాకు టైములేదు:* ఇద్దరు వ్యక్తులు మాట్లాడుతున్నారు. సంభాషణ స్వభావంలోకి తీవ్రతవచ్చింది. ఒకాయనకు కోపంవచ్చింది. "నాకు తెలివితక్కువ దద్దమ్మలతో మాట్లాడడానికి టైములేదు. వెడుతున్నాను." అని గుమ్మంవైపు నడిచాడు. రెండోవ్యక్తి నిర్వికారంగా "నాకు ఉంది రావయ్యా"అన్నాడు.

*నీవు గొడ్లడాక్టరువా?:* ఒకాయన ఒకడాక్టరుదగ్గరకు వెళ్లాడు. ఆయనకు అక్కడివ్యవహారం ఏమీనచ్చలేదు. డాక్టరుపై ఒకవిసురు విసురుదామని "ఏమయ్యా నీవు గొడ్లడాక్టరువటగా?" అన్నాడు. డాక్టరు. "అవును. నీజబ్బుఏమిటో చెప్పు"అన్నాడు శాంతంగా. ప్రత్యుక్తి ఈ ప్రసంగంలో రమణీయంగానూ, దీప్తిమంతంగానూ ఉన్నది.

*నీవేరా ఆకథలు రాసింది:* నా అనుభవంకూడా ఒకటి చెపుతాను. ఒకమాటు నేను స్కౌటు ట్రైనింగుకు వెళ్లాను. రావలసిన ఉపాధ్యాయులంతా రాలేదు. నాకంటేముందుగా ఒక్కడంటే ఒక్కడే వచ్చాడు. ఆయన ఒకపాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. ఆయనపేరు ఆచంట సత్యనారాయణ. ఆయనే ముందు నన్ను పలుకరించి తనపేరూ ఉద్యోగమూ మొదలైనవిషయాలు చెప్పాడు. "నీవు ఎవరవురా అబ్బాయి?" అన్నాడు. నేను అన్నానూ, నాపేరు మునిమాణిక్యం నరసింహారావూ అని. ఆమాట విని ఆయన ఉలిక్కిపడి ఆశ్చర్యంతో వెనక్కు విరుచు

కాని కళ్లు పెద్దవిచేసి చూస్తూ "ఆఁ-అంటే నీవు ఆ కథలు వ్రాసేవాడివా?" అనిఅడిగాడు. "అవును" అని నేను ఒప్పేసుకొన్నాను.

*నీవు వాడివి అన్నమాట: వెధవాయ లాగున్నావేం?* ఆయన కాసేపు అట్లాగే గుడ్లు మిటకరించిచూచి, చివరకు ఎట్లాగో తేరుకొని "ఆఁ- అయితే నీవు వాడివన్నమాట. ఓరి! నీకథలు చదివి నీవు ఎంత గొప్పవాడివో అనుకొన్నాను. ఓరి నీదుంపతెగ. వాడివట్రా నీవు! ఇట్లా ఉన్నావేం? అన్నాడు. ఎట్లా ఉన్నాను? అన్నాను అమాయకంగా. ఆయన నన్ను వింతమృగాన్ని చూచినట్లుచూచి, ఎట్లాఉన్నావా! వెర్రివెధవాయ లాగున్నావు అన్నాడు. నాకు కోపంరాలేదు. ఆయన మాట్లాడేపద్ధతి లోనూ, కంఠస్వరంలోనూ, ఏదోమాధుర్యము, హృదయనైర్మల్యము, ఆదరణ, ప్రేమ, ఆప్యాయత, నాకు గోచరించినవి. కాసేపు నవ్వు కొన్నాము. ఇద్దరం స్నేహితులమైనాము.

*నీవూ వెధవాయవేనే!* ఆ ట్రైనింగు వారమురోజులూ మేము ఇద్దరమూ కలిసేతిరిగాము. ఆయన వట్టి వెర్రివానిలాగ ప్రవర్తించాడు. ట్రైయినింగు అయిపోయింది. అంతా ఇళ్లకువెళ్లిపోతున్నాము. ఆ సమయంలో నేను ఒక్కమాట అన్నాను. "ఏమయ్యా, మొదటిరోజున నీవు నన్ను వెర్రివెధవాయలాగున్నావు అన్నావు. ఈ వారంరోజులనుంచీ చూస్తున్నాను, నీవూ వెర్రివెధవాయవేనే!"అన్నాను.

*ఆ సంగతి కనుక్కొంటానికి నీకు వారంపట్టిందిరా?* మాటకుమాట అప్పజెప్పానుకదా అని కొంత తృప్తికలిగింది. ఆయన మళ్ళీ నన్ను వెర్రివానిని చూస్తూఉన్నట్లు చూచి, అయితే ఆ సంగతి కనుక్కొంటానికి నీకు వారంరోజులు పట్టిందిరా పిచ్చినాయనా అన్నాడు. మళ్లీ నేనేదెబ్బ తిన్నాను. కాని ఆ దెబ్బ మృదువుగానూ, శోభాయమానంగానూ పరిహాస మార్దవముగాను ఉన్నది. హృదయసంవాద సరసము, చమత్కార భాసితము అయిన ఈశబ్దవ్యాపారము మనోహరంగా ఉంది.

*రిపార్టీ రెండురకాలు* : ఇంకోసంగతి చెప్పాలె. ఈ ప్రత్యుక్తి అనే చమత్కృతి రెండురకాలు. ఉక్తి ప్రయుక్తి వ్యాపారంలో ఒకప్పుడు మనమే క్రిందపుతాము. అంటేఅది మనప్రతిష్ఠకూ గౌరవానికి భంగంకలిగించేదిగా ఉంటుంది. (Derogatory) పైనచెప్పిన కథ అటువంటిది. ఎందుకంటే ఆయన అన్నాడు, నీవూ వెర్రివెధవవేనే అన్నప్పుడు నీకు ఆసంగతి కనుక్కొంటానికి వారంరోజులు పట్టిందిరా అని: అంటే నేను నిన్నుచూచిన తక్షణం నీవువెర్రివాడివని కనిపెట్టాను. నేనూ వెర్రివాడినని కనుక్కొంటానికి నీకు వారంపట్టిందా అనిఅన్నాడన్న మాట. చివరకూ వాడిదే పైచెయ్యి అయింది. అది మనదృష్ట్యా (Derogatory Repartee.) రెండోది (Complimentary Repartee) ఇందులో మనదే పైచెయ్యిఅవుతుంది. దానికో ఉదాహరణచెప్పి ఈ ప్రసంగం ముగిస్తాను. అదీ నా అనుభవమే.

*నేను ప్రధానోపాధ్యాయుణ్ణి కావాలని కోరిక* : నేను చాలాకాలం బడిపంతుల్ని గదా. బడిపంతులుగా ఉన్నరోజులలో ప్రధానోపాధ్యాయ పదవిని సంపాదించాలని మహా ఉబలాటంగా ఉండేది. ప్రధానోపాధ్యాయునికోసం వేసిన ప్రకటనలుచూచి, దానికోసం ఆ ఊరువెళ్లి ఇంటర్వ్యూకు హాజరు అవుతుండేవాడిని. ఒకసారి మంగళగిరివెళ్లాను, జిల్లాపరిషత్తు అధ్యక్షుడు మరికొంతమంది సభ్యులు, ఒకకమిటీగా ఏర్పడి మమ్మలనందరిని ఇంటర్వ్యూ చేశారు. మాలో కొంతమంది విద్యాధికులు, యం.ఏ.లు. ఆ కమిటీవారు ఒక్కొక్కడిని పిలిచి నుంచో పెట్టి ఏవోప్రశ్నలు అడిగి పొమ్మనడం సాగించారు. వాళ్ల అంతకు ముందే అనుకొన్నారట. ఆ ఉద్యోగం తమకు అయినవాడికి ఎవరికో ఇద్దామని. ఇదంతా ఒక నాటకమట.

*కథలువ్రాసేవాడివి మేస్టరుగా ఏంపనికొస్తావు ?* సరే ఏంజేస్తాను నేనూ వెళ్లి నిలబడ్డానికి ఇష్టంలేక అక్కడొక కుర్చీఉంటే అందులో

కూర్చున్నాను. వాళ్లకు ఇది అవిధేయతగాతోచింది. అయినా ఏమీ అన లేదు. సమయముజూచి ఏడ్పిద్దామని అనుకొని ఉంటారు. ప్రశ్నలు ప్రారంభం అయినవి. ఏ ఊరనిఅడిగారు. చెప్పాను. నీపేరూ? అన్నారు. చెప్పాను. పరిషత్తు అధ్యక్షుడు నావంక పరీక్షగాచూచి, ముఖంచిట్లించి, అయితే ఆ కథలు వ్రాసేవాడవు నువ్వేనా? అని అడిగాడు. అవును నేనే అన్నాను. వెంటనే ఆయన ఒకనిశ్చయానికి వచ్చినవాడిలాగ ముఖం పెట్టి "కథలు వ్రాసేవాడివి నీవు మాస్టరుగా ఏమిపనికొస్తావయ్యా?" అన్నాడు కోపంగా. నేను వినయంగా తలవంచి "చిత్తం మాస్టరుగా పనికిరానని నాకూతెలుసునండి కాని హెడ్‌మాస్టరుగా పనికొస్తానేమో నని...అని నసిగాను.

*కాంప్లిమెంటరీ రిపార్టీ*: ఈ కథలో నాదే పైచెయ్యి అయింది చివరకు. మొదట నన్ను ఒకదెబ్బతీశాడు గాని చివరకు నామాటతో వాళ్లకే చిన్నతనం అయింది. నా ఉక్తి మెరుపులాగ తగిలింది వాళ్లకు. షాక్‌అయిపోయినారు. సరే వెళ్లండి మీసంగతి అంతా మాకుతెలుసు. మిమ్ములను ప్రశ్నించనవసరంలేదు అన్నారు. నేనూ అదే అనుకొన్నా నండి అనిచెప్పి వచ్చేశాను. మీ సంగతి నాకూతెలుసు అని వ్యంగ్యంగా అన్నట్లుఅయింది.

అజ్ఞోక్తి:

*నైషధాన్ని వ్రాసింది ఎవరు?* అజ్ఞానంలో అన్నమాటలు కూడా నవ్వుపుట్టించేవిగా ఉండవచ్చు. ఒకసారి నేను క్లాసులోకివెళ్లి నైషధం వ్రాసింది ఎవరురా? అనిఅడిగాను. ఒక్కరూ చెప్పలేకపోయినారు. నైషధంలోని పద్యాలు కొన్ని వారి పాఠ్యగ్రంథంలో ఉన్నాయికూడా. ఆ పద్యాలు ఎవరువ్రాసిందీ వారికి తెలిసిఉండవలసిన విషయము అందుకే ఆ ప్రశ్న అడిగాను.

*నేకాదండీసార్*: ఆ చిన్న ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయే సరికి నాకు కోపంవచ్చింది. ఒక చిన్నకుర్రవాడివంక ఉరిమిచూస్తూ

మళ్లీ అడిగాను. ఎవర్రా నైషధం వ్రాసిందీ? అని. వాడు భయపడి నేనుకాదండీసార్: అన్నాడు.

సరే విద్యార్థుల జ్ఞానం ఇంత అధ్వాన్నంగా ఉందిగదా అని నవ్వు కొని ప్రధానోపాధ్యాయునివద్దకువెళ్లి ఇల్లా ఉందండి పిల్లలసంగతి. నైషధం వ్రాసింది ఎవర్రా అని అడిగాను. ఎవ్వరూ చెప్పలేక పోయి నారు. ఒక్క చిన్నవెధవను దబాయించి అడిగితే నేను వ్రాయలేదండీ అని ఏడ్పుముఖం పెట్టాడండీ అని నవ్వాను. ఆయనా పాపం నాతోపాటు కాసేపు నవ్వి చివరకు అన్నాడూ "చిన్నవెధవ భయపడి లేదన్నాడు కాని వాడే వ్రాసుంటాడు"అని తనఅభిప్రాయాన్ని చెప్పాడు.

*కలరావల్ల చావులు 12.5%* :ఇల్లాగ అజ్ఞానంవల్ల అన్నమాటలు వినోదాత్మకంగా ఉంటవి. ఇవే అజ్ఞానోక్తులు. ఇంకొక ఉదాహరణ: పూర్వపురోజులలో జిల్లాబోర్డులకు ప్రెసిడెంట్లు ఉండేవారు. చదువు సంధ్యలు లేనివాళ్లుకూడా ధనవంతులైన కారణాన, పలుకుబడిని వినియోగించి ఓట్లుసంపాదించి ప్రెసిడెంట్లు అయ్యేవారు. అల్లాంటి ఒక ప్రెసిడెంటు సంగతి. జిల్లాలో కలరావ్యాపించింది. చావులను గురించి రిపోర్టువచ్చింది. అందులో కలరావలన చావులు 12 5% అని ఉన్నది.

*ఏమిటండీ ఈచుక్కకు అర్థము ?* కలరావల్ల చావులు నూటికి 12 అంటే తెలిసేది. పన్నెండు తరువాత చుక్కపెట్టాడు. ఆ తరువాత అయిదుఅంకె ఉంది. చుక్క పొరపాటున పెట్టాడు అనుకొంటే నూటికి నూటఇరవైఅయిదుమంది చనిపోయినారు అని అర్థంవస్తుంది. ఈ చుక్కకేదో అర్థంఉండాలె. ఏమిటబ్బా అని ఆయన తీవ్రంగా ఆలో చించాడు. ఏమీపాలుపోలేదు. చివరకు వైస్‌ప్రెసిడెంటును పిలిచి ఈ చుక్కకు అర్థం ఏమిటయ్యా? అనిఅడిగాడు.

*5గురు చావడానికి సిద్ధంగా ఉన్నారు :* వైస్‌ప్రెసిడెంటు కాస్త ఆలోచించి ఇల్లాఅన్నాడు. "మరేమీలేదండి. కలరావల్ల నూటికి పన్నెండు

గురు చనిపోయినారు అని తెలుస్తునే ఉందిగదా. ఇంకో అయిదుగురు చావడానికి సిద్ధంగాఉన్నారు. అందుకని కాస్త చుక్క అడ్డంపెట్టాడు అని ఇల్లాగ విపులంగా చెప్పాడు. అజ్ఞానంవల్ల అన్నమాటలు ఇవి. అజ్ఞానోక్తులు.

మూర్ఖోక్తి :

*భార్య భర్తతో—మా అన్నయ్యాను చూచిరండి అంటుంది :* నేను మద్రాసుకు ప్రయాణమై పోతున్నాను. మా ఆవిడవచ్చి "చూడండి ఎల్లాగూ వెడుతున్నారు. బెజవాడలో కాస్తదిగి మా అన్నయ్యాను చూచి రండి. ఆయన ఈ మధ్య జబ్బుపడిలేచాడు. చూచిరాకపోతే బాగుండదు." అన్నది. నేను సరే అన్నాను. అనడము అన్నానుగాని వెళ్లేటప్పుడూ దిగలేకపోయినాను, వచ్చేటప్పుడూ దిగలేకపోయినాను. ఇంటివచ్చాను. మా అన్నయ్యాను చూచివచ్చారా అని ఆమె అడుగుతుందని నాకుతెలుసు. అడగనూ అడిగింది. అడిగినప్పుడు నేను మీ అన్నయ్యాను చూచి రావడం పడలేదు అని ఒక్కమాట అని ఉండినట్లయితే సరిపోయేది. అంతే ఆమెమనస్సు కష్టపెట్టుకొంటుందని చూచివచ్చాను అని అబద్ధం ఆడాను.

*శుక్రవారం సాయంత్రం 6-30 కి బెజవాడలో మీ అన్నయ్యాను చూశాను :* ఇక అక్కడనుంచి ఒకదానితరువాత ఒకటిగా ఒకదానికి పోటీగా, ఇంకొకటిగా ఒక అరడజను అబద్ధాలు ఆడవలసివచ్చింది. చివరకు ఆవిడ అడిగింది-ఎప్పుడండీ మా అన్నయ్యాను మీరు చూచింది? అని. శుక్రవారం సాయంత్రం ఆరుగంటల ముప్పైనిమిషాలకు నేను ఆయనను ఆయన స్వగృహంలో చూశాను. అని బ్రహ్మాండమైనఅబద్ధం ఆడేశాను. ఆమె ఎట్లా పసిగట్టిందో నేను అబద్ధాలాడుతున్నానని. పసిగట్టి, "ఎందుకండీ అబద్ధాలాడుతారూ?" అన్నది. నేను అబద్ధాలు ఆడడములేదని దబాయించాను. ఇట్లాజరిగింది సంభాషణ.

ఆమె : శుక్రవారం ఆరుగంటలకు మీరు మా అన్నయ్యను బెజవాడలో చూశామనే అంటారు?

నేను : ఆరుగంటలుకాదు ఆరుగంటల ముప్పైనిమిషాలకు.

ఆమె : బెజవాడలో వాళ్ల ఇంట్లోనే చూశారూ?

నేను : ఓ ! చూశాను.

*ఆవేళప్పుడు మా అన్నయ్యా ఈవూళ్లో మనింట్లో ఉన్నాడు* : ఆవిడ విరగబడి నవ్వి, ఇక ఊరుకోండి. మీరు గురువారం సాయంత్రం మద్రాసు వెళ్లారా. శుక్రవారం ప్రొద్దున ఆయన మనఇంటికి వచ్చారు. శుక్రవారం అంతా మనఇంట్లోనే ఉన్నాడు. శనివారం సాయంత్రం వెళ్లాడు. ఇప్పుడు చెప్పండి. శుక్రవారం సాయంత్రం ఆయన ఈ ఊళ్లో ఉన్నాడుగదా మీకు బెజవాడలో ఎట్లాకనపడ్డాడండీ! అన్నది. ఇక ఏం జేసేది? మొండికెత్తాను. నేనన్నానూ "ఆ జ్ఞానం మీ అన్నయ్యకు ఉండాల్సింది. బందరులో నీకు కనపడ్డరోజునే, అదేసమయానికి బెజవాడలో నాకు కనపడకూడదని! అయినా మీ అన్నయ్య ఎక్కడబడితే అక్కడ ఎవళ్ళకుబడితే వాళ్లకు కనపడుతూ ఉంటాడు. ఈ మొండి జబాబుతో ఆవిడ ఫక్కున నవ్వి ఊరుకొంది. మూర్ఖోక్తి (మొండియుక్తి)అంటేఅది.

నిరుత్సాహోక్తి :

*కొందరిని ఏదీచలింపజేయదు* : ఒకరకం మనుష్యులు ఉంటారు. వాళ్లను ఏదీ చలింపజేయలేదు. వాళ్లకు ఏదీగొప్పగా తోచదు. మానవుడు ఇప్పుడు ఎన్నో క్రొత్తవిషయాలను కనిపెడుతున్నాడు. అతడు అనేక ఘనవిజయాలను సాధిస్తున్నాడు. కాని ఈ రకం మనుష్యులను ఏదీ చలింపజేయదు. ఏ ఘనకార్యాన్ని గూర్చి చెప్పినా నిర్లిప్తతతో నిర్వికారంగా నిర్లక్ష్యభావంతో నిరసనభావంతో పరామర్శ చేస్తాడు.

*అటజని...చూశాడు అంతేగా ?* "అటజనికాంచె" అనే పద్యాన్ని చదివి వినిపించి "చూడు ఈ పద్యం ఎంతగంభీరంగా సుందరంగా

భావయుక్తంగా నడిచిందో'' అంటే ఏమిటయ్యా ఆ భావగాంభీర్యం? ప్రవరుడు శీత శైలాన్ని చూశాడు. అంతేగా, కాకపోతే ఆ పద్యం సంస్కృత సమాస భూయిష్ఠమై ఓజోగుణ ప్రధానంగావుంది. భాష నీ చేతులో ఉంటే నీవు ఇంతకంటే ఎక్కువ గంభీరంగానే వ్రాస్తావు. శీతశైలం చూశాడట! చూడకేంచేస్తాడయ్యా అక్కడిదాకావెళ్లి చూడ డముకూడా ఒకఘనకార్యమేనా? మా అబ్బాయి కొండవీటి కొండలు చూశాడు. మా అమ్మాయి కొండపల్లి కొండలను చూచింది. చూడకేం చేస్తారూ అక్కడిదాకా వెళ్లినవాళ్లు? కళ్లు మూసుకోలేదు. అదీ ఘన కార్యము. పర్వతసానువులయందు ఏనుగులను చూశాడని చెప్పాడు కవి. ఓరి వీడిఇల్లు బంగారంగానూ! అటువంటి మహారణ్యప్రదేశంలో ఏను గులను చూడక ఎనుబోతులను చూస్తాడుటయ్యా?" ఇల్లాగ అంటాడు అటువంటి మనఃప్రవృత్తిగలవారు.

*మనిషిఅయినతరువాత ఏదో ఎక్కుతూ ఉంటాడు :* టెన్సింగు ఎవరెస్టుశిఖరం ఎక్కినసంగతి విని అంతా సంతోషంతో పొంగిపోయి నారు. మనవాడు "ఏమిటయ్యా పర్వతశిఖరం ఎక్కాడూ? ఎక్కితే ఏమిటాగొప్ప? కొండలుఎక్కడము ఆ జాతివాళ్లకు అలవాటు. మనకు అలవాటుఉన్న విషయాలలో మనమూ ఎక్కుతునే ఉన్నాము, గోడలూ, చెట్లు అల్లాంటివి. పోనిద్దూ మనిషైనతరువాత ఏదోఎక్కుతుంటాడు. దిగుతుంటాడు. పడుతుంటాడు, చస్తుంటాడు అల్లాగే ఇదీను.

*మళ్లీ దిగినాడాలేదా? ఒక్కసంగతి చెప్పు. పోనీ ఎక్కినాడనుకో.* ఎక్కినవాడు అక్కడకూర్చుని ఏమైనా వెలగబెట్టాడా? మళ్ళీదిగాడా లేదా? మరి ఇంకేం? దిగేవాడు అసలు ఎక్కడం ఎందుకూ? అదొకపిచ్చి. మనిషైనతరువాత ఏదో ఎక్కుతుంటాడు. దిగుతుంటాడు. దానికి మనం చంకలుకొట్టుకోవలసిన అగత్యంలేదు. ఇదీ అతనిధోరణి.

*శని ముడ్డిమీద తంతూఉంటే...:* ఒకసారి అన్నానూ! "చూశారా బాబూ, మనవాడు వర్తకం మొదలుపెట్టి సంవత్సరమైనా కాలేదు.

అప్పుడే వాడు లాకు అకారంచుట్టాడు. ఎంత వ్యవహారదక్షుడో. ఎంత ప్రయోజకుడో చూశారా?"అని. ఆయన చప్పరించి వాడిజాతకం అల్లాంటిదయ్యా. శుక్రమహాదశ. గుర్వంతరం. లగ్నాన్ని బుధుడు చూస్తున్నాడు. ఇన్నిపుణ్యగ్రహాల వీక్షణంపడ్డదాయె. పైగా శనిఉచ్ఛలో ఉండి ముడ్డిమీద తంతూఉంటే. వాడు సంపాదిస్తాడా, వాడితల్లోజేజెమ్మ సంపాయిస్తుందా? గ్రహబలం అయ్యా అదంతా. ఇల్లాగ ఏవిషయాన్ని గురించి అయినాసరే నిరసనగా మాట్లాడుతాడు. అటువంటి మనః ప్రవృత్తిగలవాడి మాటలనే నిరసనోక్తులు అంటున్నాను.

## పర్యాయోక్తి:

*ప్రశ్నలోనుంచే సమాధానం లాగేపద్ధతి:* కొందరు వ్యక్తులున్నారు. వాళ్లదగ్గర ఏప్రశ్నకైనా సమాధానం సిద్ధంగా ఉంటుంది. నీవు ఏప్రశ్న అయినా అడుగు తాక్కున సమాధానంవచ్చేస్తుంది. ఆ ప్రశ్న ఎటువంటి దైనాసరే జ్యోతిశ్శాస్త్ర సంబంధంకానీ, మానసికశాస్త్రమునకు సంబంధించినదికానీ. చరిత్ర భూగోళమూ, సైన్సు వీటిలో దేనికి సంబంధించినదైనా సరే, తెలియదు అనడములేదు. అతడుచేసే గారడీ ఏమిటంటే ఆ ప్రశ్నలోనుంచే సమాధానాన్ని లాగుతాడు. ఆ ప్రశ్నలోఉన్న మాటలనే మార్చి సమాధానంగా రూపొందిస్తాడు.

*పిల్లి చీకట్లో ఎట్లాచూడగలుగుతుంది? దానికి కళ్లుకనపడతవి:* ఒక ఉదాహరణ చూపిస్తే ఆ తమాషా ఏమిటో తెలుస్తుంది. "ఒంటె మెడ అంతఎత్తుకు ఎత్తి నడుస్తుందేమండీ"అని అడిగితే అతడంటాడూ, "దానిమెడ పొడుగయ్యా. అందుకని అల్లాగ అది ఎత్తక తప్పదు." నీవు అడిగిన ప్రశ్నలోనే ఉంది సమాధానంలోని విషయం. "పిల్లి రాత్రిళ్లు ఎల్లాగచూడగలుగుతుంది?"అని అడిగితే "ఎందుకు చూడగలుగుతూందంటే దానికి చీకట్లో కళ్లుకనపడుతవి కాబట్టి" అని సమాధానం వస్తుంది. ఇల్లాగ ఏ ప్రశ్నఅడిగినా సమాధానం

కోసం వెతుక్కోకుండా చెప్పగలుగుతాడు ఆ రకం మనఃప్రవృత్తి గలవాడు.

*అకాలవర్షాలకు కారణం సకాలంలో కురవకపోవడమే :* "సగోత్రీకులపిల్లను ఎందుకుచేసుకోకూడదు?" అనిఅడిగితే "అది తప్పుపని అయ్యా 'అల్లాగచెయ్యకూడదని శాస్త్రాలూ, వేదాలూ ఘోషిస్తూఉంటే ఎల్లాగ చేసుకొంటావు?" అంటాడు. ప్రశ్నలో ఉండే విషయాన్నే కొంచెం విపులీకరించి సమాధానంగా రూపొందిస్తాడు. ఇది పర్యాయ పదం వాడడంవంటిదే. ఈ అకాలవర్షాలకు కారణంఏమిటి?" అంటే, "వర్షాలు సకాలంలో పడకపోవడమే'' అంటాడు. బీహారులో వరదలు వచ్చినవి. జవహర్‌లాల్ వెళ్లి చూచివచ్చినతరువాత ''ఎలాగున్నది వరద?" అని అడిగారు మిత్రులు. "అంతా జలమయంగాఉంది"అన్నాడు జవహరులాల్. దీనినే తర్కంలో ఆత్మాశ్రయవాదము అంటారు. ఇది పర్యాయోక్తి అనే చమత్కార విశేషం.

పునరుక్తి :

ఒకసారి అన్నమాటను మళ్లీమళ్లీ ఉపయోగించడాన్ని పునరుక్తి అంటారు. దీన్నికూడా హాస్యసాధనకై వినియోగించవచ్చు. పునరుక్తి అంటే మొదటఅన్నమాటను మళ్లీఅనడము ఇదొకపద్ధతి. మొదట ఒక భాషలోఅని రెండోసారి అదేఅర్థం ఇచ్చేమాటను మరోభాషలో అనడం రెండవపద్ధతి. కన్యాశుల్కంలో ఈరకమైన హాస్యము పుష్కలంగా దొరుకుతుంది. ఈ క్రిందివి దీనికి ఉదాహరణలు.

పునరుక్తులు కొన్నిఇస్తాను. ఈ క్రింద ఉదహరించినవి మనోహరంగా ఉన్నవి. ఆమె కమ్మని వంటకాలు తయారుచేయగలదు. ఆమె ఎంతబాగాచేస్తుంది? అంటే, ఆమెచేసిన ప్రతివస్తువతింటానికి రుచిగా ఉంటుంది. ఒకప్పుడు ఆ పునరుక్తి అంతవాచ్యంగా ఉండక అర్థాన్ని ఆశ్రయించుకొని ఉంటుంది. పైవాక్యంలో పునరుక్తి

శబ్దాన్ని ఆశ్రయించుకొనివుంది. ఈవాక్యం చూడండి, భర్త అంటాడు భార్యతో. "వాషింగ్‌మెషీను మామూలుది కొనమంటే నీవు ఖరీదుగలది కొన్నావు. అది కొంటానికి అయినఅప్పు తీర్చడం ఎంతకష్టము!" భార్య అంటుందీ, "ఏమంత కష్టంలెండి కాకపోతే ఆ అప్పు తీర్చడానికి నెలకు యాభై చొప్పున సంవత్సరం పట్టేబదులు ఇంకో పన్నెండునెలలు కట్టాలె అంతేగా? భర్త అన్నమాటను కాదన్నట్లు కనిపిస్తుంది గాని నిజానికి ఇద్దరూ ఒకేమాట అన్నారు. ఇంకొక పునరుక్తి. ఆమె ఎంత చెవిటిది అంటే ఎవరన్నాపిలిస్తే వస్తున్నాను అనిఅనలేదు. ఇంకో అన్యాయం ఏమిటీఅంటే ఆమెమాటలు ఆమెకు వినపడక నేను ఏమన్నాను అనిఅడుగుతుంది. ఆమె ఎంతమూగది అంటే, పాపం ఆకలైనా అన్నంపెట్టమని అడుగలేదు.

సమాసోక్తి!

*చెంబు అంటానికి చేంతాడంత సమానము :* రెండుమూడు అక్షరములతో కూడిన ఒక్కమాటలో ఇమడ్చగల భావాన్ని పెద్దసమాసంలో వ్యక్తంచేస్తే నవ్వువస్తుంది. 'చెంబు'అంటానికి "జలాది ద్రవ్యాధారక సమర్థక లోహాదిపదార్థ నిర్మిత ఘటికా విశేషము" అనిఅంటే ఏదో విచిత్రంగా ఉండి విపరీత ఊహాపరిపుష్టమై హాస్యజనకంగా ఉంటుంది. దీనిని నేను సమాసోక్తి ఎందుకుఅన్నానూ అంటే, ఒక అల్పమైనభావము ఒక పెద్దసమాసములో వ్యక్తంచేయబడ్డది కాబట్టి. సమాసోక్తికి లక్షణగ్రంథంలో ఇచ్చిన నిర్వచనంకాదు ఇది. నేనుకల్పించినది. ఇలాగ కల్పించుకొనే హాస్యానికి పారిభాషికపదాలను నిర్మించుకొనవలసిన అగత్యం ఎంతైనా ఉంది.

*అందమైనవాడు అంటానికి అంత పెద్ద సమాసమా?* క్లిష్టము అనే కావ్యదోషాన్నికూడా హాస్యసాధనకై ఉపయోగిస్తే పైనజెప్పిన సమాసోక్తివంటిదే అవుతుంది. అందమైనవాడు అంటానికి "పవనాశనేంద్రధర మకుటాలంకార మణి జనక వరపుత్రీ రమణకుమారరూప దీపితుడు"

అంటే క్లిష్టము అనే కావ్యదోషము అన్నారు. కాని మనకుమాత్రం ఇంత డొంకతిరుగుడుగా చెప్పడం వినోదంగా ఉంటుంది. నవ్వుతాము. దీన్నే నేను సమాసోక్తి అనేది.

ప్రగల్భోక్తి :

*నమ్మటానికి వీల్లేని విషయాన్ని నమ్మమని చెప్పడము :* ఒకడు తాను చేయలేనికార్యాన్ని చేసినట్లూ, నమ్మడానికి వీలులేని విషయాన్ని నమ్మమని చెబుతున్నపుడూ నవ్వువస్తుంది. అవి ప్రగల్భాలు. ప్రగల్భాలు అతిశయోక్తులవంటివే. ప్రగల్భాన్నే విస్తరించి కథగా పెంచితే అతిశయోక్తి అనే అర్థాశ్రయ హాస్యప్రక్రియ అవుతుంది.

*రూళ్లకర్రలాంటి చుట్ట రాత్రంతా కాలుతూఉండేది :* ఒకఆయన ఈకాలపు మనుష్యుల బలహీనతను అల్పత్వాన్ని గురించి ప్రసంగిస్తూ ఇట్లాఅన్నాడు. "ఈకాలపు మనుష్యులు ఎందుకూపనికిరారు. పిట్టతిండి తింటారు. పిట్టకూతలుకూస్తారు. మాకాలపువాళ్లు ఒక్కొక్కడు శేరు బియ్యపుఅన్నం అలాగ్గా ఊదేశేవాడు. అందాకాఎందుకు! చుట్టలు ఇప్పటికాలంవాళ్లూ కాలుస్తారు. మావాళ్లూ కాల్చేవాళ్లు. అయితే ఎంత భేదం! మావాడు భోంచేసి చుట్టముట్టించాడా అంటే, ఆ చుట్ట రాత్రంతా అలాగకాలుతూ ఉండేది నోట్లో. రూళ్లకర్రలలాగుండేవి ఆ చుట్టలు. ఇప్పటికాలపువాళ్లు కాల్చేవి చుట్టలు కాదు. చుట్టపీకలు. అదీకాక పదినిమిషాలకంటే ఎక్కువసేపు చుట్టతాగినవాణ్ణి చూపించు.అన్నీ అంతేననుకో.

*ఒక్క గ్రహణం–రెండురోజులుపట్టేది :* గ్రహణాలు పట్టడము నీవు చూశావుగా ! ఎంతసేపు ఉంటుంది గ్రహణం, అర్ధగంట. మహాఉంటే గంట! అంతేగా! మాకాలంలో అసలుగ్రహణంపట్టేదేకాదు. ఎప్పుడైనా కర్మంచాలక పట్టిందాఅంటే ఆ గ్రహణం పట్టింది పట్టినట్టుగా రెండు

రోజులు ఉండేది. అటువంటి గ్రహణాలు ఇప్పుడేవీ? మనుష్యులకేకాక జంతువులకుకూడా జవసత్వాలు ఉడిగిపోయినవి ఇప్పుడు.

*ఆవు తెల్లవార్లూ పాలిచ్చేది :* మా తాత పాలుతీయడానికిముక్కాలు పీటవేసుకొని పొదుగుదగ్గర కూర్చున్నాడంటే సాయంత్రం ఆరుగంటలకు కూర్చుని తెల్లవార్లూ తీస్తునేఉండేవాడు. చివరకు విసుగెత్తి లేచి వచ్చి లేగదూడను వదిలితే అది ప్రొద్దుటినుంచి చీకటిపడేదాకా పాలు త్రాగుతునే ఉండేది. ఈకాలంలో అటువంటి ఆవులూలేవు, అటువంటి మనుష్యులూలేరు.

*స్వంతబావిలోనే పడిచస్తాను :* ఆత్మతృప్తికై అంటున్న మాటలనుకూడా హాస్యమనోహరం చేయవచ్చు. కావాలని అలాచేయవచ్చులేకపోతే అనుకోకుండానే అలాఅంటున్నమాటల్లో చమత్కారం ధ్వనించవచ్చు. ఒకఆవిడ భర్తతోపోట్లాడి బావిలోపడి చస్తానని బెదిరించింది. భర్తకు ఒళ్లుమండి "చావు మనదొడ్లో బావిలేదు. ఎదురింటివారి దొడ్లో ఉంది. పోయిపడు కావాలంటే"అన్నాడట. ఆమెకు అభిమానం పుట్టుకొచ్చి అన్నది. ఎవరిబావిలోనో పడ్డదాకా నాకేం కర్మమండీ! స్వంత ఇంటిపెరట్లోనే బావితవ్వించుకొని మరీపడి చస్తాను అని. ఇదికూడా ప్రగల్భోక్తి వంటిదే. ప్రగల్భము స్వాతిశయములోనుంచి స్వాభిమానంలోనుంచి, గర్వంలోనుంచి పుడుతుంది. ఇదికూడా ఆత్మాభిమానంలో మంచీ గర్వంలోనుంచీ పుట్టింది. గర్వంతోపలికిన మాటలే ఇవి. అందుకవి దీనివి ఈ ఉక్తివిశేషంలో చేర్చవలసివచ్చింది.

*హనుమంతునితోక :* ప్రగల్భము, ఉత్ప్రేక్ష అతిశయోక్తి,ఇవన్నీ దగ్గర బాంధవ్యము గలవి. ఇవి అటు కవితాధోరణిలోనూ ఇటు హాస్యసాధనలోనూ వస్తవి. హనుమంతుడు తనతోకను అమితంగా పెంచి ఎత్తైన సింహాసనముగా అమర్చుకొన్నాడు అన్నమాట. హనుమంతుని నోటివెంట వచ్చియున్నట్లయితే అవి ప్రగల్భోక్తిగా భాసించేది. అయితే

ఆ విషయం పరమసత్యంగా భావిస్తున్నాము కాబట్టి అది హాస్యగర్భిత మైన పలుకుగాకుండా పోతుందని నా అభిప్రాయము. కాని దీనిని నా మిత్రులు ఎవరూ అంగీకరించలేదు. అది సత్యమే అయినా హాస్యమే, పరమసత్యమైన విషయంకూడా నవ్వుపుట్టించేది ఎందుకుకాకూడదు. ఒక వృత్తాంతము వింతయైనదిన్నీ, సాధారణంగా జరిగేది కానిదిన్నీ అయి నపుడు వైపరీత్యమును సంతరించుకొన్నప్పుడు, అది రమణీయమైన హాస్యంగానే భాసిస్తుందిఅని నాస్నేహితులు వాదించారు. ఆ వాదన సరి యైనదిలాగే కనిపిస్తున్నది. ఈ విషయమై ఇంకా ఆలోచించాలె.

## అసంభవోక్తి:

*నీళ్లు రాళ్లలాగుంటే*: అసంభవము అంటే సంభవించడానికి వీలు లేనిది. ఆ విధంగా జరుగుతుందని ఊహించడానికికూడా వీలులేని విష యమును ఆలంబనగా తీసుకొని, పరిహాసజనకంచేసి రచించిన ఉక్తివిశే షము అసంభవోక్తి. ఒకడంటాడూ నీళ్లు పల్చగా ద్రవంగా ఉండబట్టి సరిపోయింది గాని రాళ్లలాగ ఉన్నట్లయితే కొట్టుకొని త్రాగడము కష్టం అయిపోయేది అని.

*వాడినీడే వాడివెంటరాదు*: ఇంకొకటి. ఒకరినిగురించి మాట్లా డుతూ వాణ్ణిజూచి అంతా ఏవగించుకొనేవారు అనిచెప్పి, వాణ్ణిజూస్తే అందరికీ ఎంతఅసహ్యం అంటే వాడినీడే వాడివెంటరాదు అన్నాడు. ఆ పడవఎంతతేలిక అంటేఅది పొగమంచుపైన ప్రయాణం చేయగలదు నీటిమీద ప్రయాణం చేసినట్లు. ఇదీ అటువంటిదే. ఆమెకు తాను చేసే పని ఎవరన్నా చూస్తున్నారేమోనని ఎంతసిగ్గు అంటే, బట్టలు మార్చు కొనేటప్పుడే గాక మనస్సు మార్చుకొన్నప్పుడుకూడా తలుపు వేసు కొంటుంది. ఇది అసంభవము కాకపోయినా అటువంటి చమత్కారం గానే భాసిస్తూఉన్నది.

*తనసుతానే పైకెత్తుకోగలడు :* ఇదిమాత్రము అసంభవోక్తి. ఒకడు ఎంత బలంగలవాడుట అంటే, వాడు ఒకచేత్తో తనజుట్టును పట్టు కొని తననే భూమినుండి ఆరడుగుల ఎత్తునకు లేవనెత్తగలవాడు. ఒకడంటాడూ మిత్రునితో నాకు ఒక్కటే కోరికఉంది. నేను చనిపో యినతరువాత నా భార్య ఎట్లాఏడుస్తుందో చూడాలని ఉందీ అని. ఇది కూడా పైనచెప్పిన వాటిరకమే!

*ఒకేపంచాంగాన్ని ఏండ్లతరబడి వాడుతాడు :* సంభవింపడానికి వీలులేనివిషయం చెప్పి చమత్కారం సాధించడము ఈ ఉక్తివిశే షముయొక్క లక్షణము అని మళ్ళీచెపుతున్నాను. ఒక పీనాసిని గురించి చెపుతూ హాస్యానురక్తుడు ఏమన్నాడుఅంటే అతడు తగని పీనాసి. ఎంతపీనాసిఅంటే ఒకేపంచాంగాన్ని ఏండ్లతరబడి వాడుకొం టాడు"అని! కోటు అల్లాగ వాడుకోవచ్చు. బ్లేడు వాడవచ్చు. కాని పంచాంగం ఎట్లావాడుతాడు! అసంభవం. అటువంటివిషయాన్ని గురించి సంభవంలాగ మాట్లాడితే నవ్వువస్తుంది. ఆమె ఎంతఎత్తు అంటే తన పళ్లు తనకే అందక కుర్చీఎక్కి పళ్లు తోముకొంటుంది. మరొకటి. ఆమెకు జ్ఞాపకశక్తి ఎంతపోయింది అంటే, ఆమె బ్రతికిఉన్నదో లేదో ఆమెకుతెలియదు. ఆ విషయం ప్రక్కవాళ్లను అడిగితెలుసుకోవలసిందే! ఒక కొంటెకుర్రవాడు ఆమెతో అన్నాడు. నీవు బ్రతికిఉన్నావని ఎవర్ను చెప్పారమ్మా? ఆ మాట అబద్ధంఅని. వెంటనే ఆమె నేను చచ్చిపోయిన సంగతి నాకెందుకు చెప్పలేదని ఏడుస్తూ కూర్చున్నది.

*చన్నీళ్లు కాస్త వేడిగాఉండాలె :* చన్నీళ్ళ స్నానంచేయడంమంచిది అంటే ఒకడు ఎంతమనోజ్ఞమైన హాస్యోక్తి పలికినాడో చూడండి. వాడు అన్నాడూ? "నిజమే ఆమాట చన్నీళ్ల స్నానంచేయడమేమంచిది. హాయిగాకూడా ఉంటుంది. కాకపోతే, ఆ చన్నీళ్లు కాస్తవేడిగా ఉండాలె అంతే." "ఆయన ఎంత మంచికవి అంటే, ఆయన పద్యాలన్నీ వచనం లోనే వ్రాయగలడు అన్నమాటకూడా అసంభవోక్తే! అసంభవదోషము

అనేది కావ్యదోషాలలో ఒకటి. అది హాస్యసాధనకై ఇక్కడ విని యోగపడ్డది. పైనచెప్పిన ఉదాహరణ లన్నిటిలోనూ అసంభావితత్వము వ్యక్తమగుతూనే ఉన్నది. ఈ అసంభావితత్వము ఎన్నివిధాల ప్రకటిత మైనదో చూడండి. ఒక హాస్యరచనాసక్తుడు అంటాడూ, భార్యా విధేయుడు వేళకు ఇంటికి చేరుకొంటాడు. చేరుకోకపోతే భార్య చెవులు మెలవేస్తుందనో, సాధిస్తుందనో భయము. అటువంటివాడుట, తనను వేళకు ఇంటికి తీసుకొనిపోయే రైలు తప్పినా ఎక్కడం మానడట! అదెట్లా సాధ్యమని అడిగితే హాస్యము చచ్చి ఊరుకొంటుంది. తమాషా అంతా అసంభవమైనదానిని సంభవముగా చెప్పటంలోనే ఉన్నది. వెంట్రుకలు రాలిపోతున్నవి ఏంజెయ్యాలె అనిఅడిగితే హాస్యవేత్త అన్నాడు. మరేంలేదండి వెంట్రుకలు ఊడి బయటపడిపోకుండా లోపల ముడివెయ్యాలె అని!

ఇది మరీ తికమకలుగా ఉంది. ఒకలాయరు తనతో మాట్లాడా లని వచ్చిన మిత్రునితో అంటాడు. "నీవు ఇక్కడే నాకోసం వేచి యుండు. నేను వెడుతున్నాను. నేను లేనప్పుడే నేనురావచ్చు." తెను గులో బాగాకుదరలేదు. ఇంగ్లిషులో I may come in my absence అని ఉంది. దీనిని absurd అంటావు. అవును absurdity లోనే ఉంది మనోహరమైన చమత్కారము. అసలు absurdity ఉందే, అది హాస్యానికి గని. మేరుపర్వతంలాంటిది. అక్కడే కావలసినంత హాస్యాన్ని తవ్వుకోవచ్చు. అదే ఎంతహాస్యం కావాలంటే అంతా ఇస్తుంది.

వ్యాజోక్తి:

*వ్యాజోక్తి అంటే:* వ్యాజోక్తి అంటే ప్రకటితమైన వస్తువును వ్యాజముచే రాచి చెప్పినచో వ్యాజోక్తి యగును. అని కావ్యాలంకార సంగ్రహములో వివరణ ఉంది. నాయికకు నరసభూపాలుని చూచుట

వలన ఆనంద బాష్పములు వస్తే, ఆ మాట చెప్పడానికి సిగ్గువలన ఆమె ఆనందబాష్పములు, అగరు ధూపములవలన కలిగినవని చెబుతుంది. అంటే అసలు కారణాన్ని దాస్తున్నది. ఈ క్రింది కథలో అదేమో స్తరు వ్యాపారం జరిగింది. కాబట్టి దీనిని వ్యాజోక్తి అన్నాను.

*భర్త చెవులు మెలివేస్తుంది :* కథకుడు అంటాడు. "ఆమె చాలా దయగలది". ఆమెకు భర్తయందు ఎంత దయా ప్రేమా ఉన్నవీ అంటే ఆమెకు కోపం వచ్చి మగని చెవులు మెలివేసినా, తత్ఫలితంగా వచ్చిన వాపు తగ్గడానికి ఆమె వెంటనే మందురాస్తుందట." ఆమె భర్త చెవులు మెలివేసింది. అన్నప్పుడు, ఆమె ధూర్త లక్షణం ప్రకటితమైనది. వెంటనే మందురాస్తుంది అనేమాట ఆమె ధూర్త లక్షణాన్ని దాచుటకు చెప్పబడినది. అసలు ప్రకటితమైన విషయాన్ని మరియొక పనివల్ల దాచడానికి ప్రయత్నం ఇది. కాబట్టి వ్యాజోక్తిలో జరిగే పనే ఇక్కడ జరిగింది. అందుకని దీనిని వ్యాజోక్తి అన్నాను.

*ఆయనపై కాఫీకప్పు విసురుతుంది :* అట్లాంటివే మరికొన్ని. అప్పుడప్పుడు కోపంవచ్చి ఆమె భర్తపై కాఫీకప్పు విసురుతుంది. కాని ఆయన బట్టలు ఖరాబ్ అయిపోకుండా, అందులో ఉన్న కాఫీని వేరే గిన్నెలో పోసి వట్టి కప్పునే విసురుతుంది. అంతే కాకుండా, ఆ కప్పులో ఉన్న స్పూనును కూడా తీసివేస్తుంది అది ఆయన ముఖానికి తగిలి గాయం అవుతుందని భయంతో.

*అత్తా నీ కొడుకు ఆకలికి ఉండలేడు :* ఈ విషయం వ్రాస్తున్నప్పుడు మా ముసలావిడ చెప్పిన ఒక చిన్నకథ జ్ఞాపకం వస్తున్నది. ఒక ఇంటి కోడలు లేచిపోతూపోతూ, అత్తగారిని పిలిచి, అత్తా! అత్తా! నీ కొడుకు ఆకలికి ఉండలేడు. జాగ్రత్తగా చూచుకో అని చెప్పిందట.

*పారిభాషిక పదాలు :* చేసే పనివలన ప్రకటితమయ్యే గుణము ఒకటి. దాని తరువాత అన్నమాటలవల్ల స్ఫురించే భావము మరొకటి.

ఆ మాటలలో ఆ ప్రకటితమైన భావాన్ని దాచడానికి ప్రయత్నము ఉన్నది. ఏది ఎట్లా ఉన్నా లక్షణ గ్రంధకర్త ఇచ్చిన అర్థంలో ఇది వ్యాజోక్తి కాదుకాని, హాస్యసంబంధంగా, దీనిని వ్యాజోక్తిగా నేను పేర్కొన్నాను. హాస్యవిషయకంగా, పారిభాషిక పదాలు లేవు కాబట్టి సాహిత్యకంగా ఒక అర్థంలో స్థిరపడిఉన్న మాటలకే విశేషార్థం కల్పించి ఇటువంటి పారిభాషిక పదాలను, సృష్టించవలసి వచ్చిందని ఇదివరకే చెప్పినాను. ఇప్పుడు చేస్తున్నపనీ అదే!

విభావనోక్తి:

*చీర అదంతటదే తగులబడ్డది :* విభావన అని ఒక అలంకార మున్నది. కారణం లేనిదే కార్యము పుట్టదు. అయితే కవి ప్రౌఢోక్తిచే అట్లు పుట్టినట్లు చెపితే, అది విభావనాలంకారము అని లక్షణ గ్రంథాల్లో ఉన్నది. అయితే విభావనాలంకారములో జరిగేపనే హాస్యపరంగా జరిగి అది హాస్యోక్తిగా భాసిస్తే దానిని విభావనోక్తి అంటే తప్పేమిటి? ఇటువంటి ఉక్తి విశేషాలు మనము సాధారణంగా పిల్లలు మాట్లాడే మాటలలో గుర్తించవచ్చు. ఇంట్లో పిల్లలు అల్లరి చేస్తున్నారు. మేడ పైనున్న నేను ఆ కేకలూ, బొబ్బలూ, విని ఏదో జరిగిందని గబగబా క్రిందికి దిగివచ్చాను. ఏదో గుడ్డ తగులబడుతున్నది. ఏమిట్రా అది? అని అడిగాను. అమ్మచీర అన్నారు. ఎందుకు తగులబడుతున్నది? నిప్పు పుల్లగీచి దానిపై వేశారు ఎవరో! ఎవర్రా ఆ పని చేసింది? అని కోపంగా అడిగాను. నిప్పుపుల్ల గీచి మేము వేయలేదు నాన్నా అని అందరూ ఏకకంఠంతో చెప్పారు. నాకు ఆశ్చర్యమూ వేసింది. కోపమూ వచ్చింది. వళ్లూ మండింది. ఛా గాడిదల్లారా ఎవరు ఆ పని చేసింది? చెప్పండి. ఇంత అఘాయిత్యం చేసింది ఎవర్రా! అని కోపంగా అడిగాను. మా పెద్దవాడు అయిదేండ్లవాడు ధైర్యంచేసి అంటాడూ. "మేమంతా ఇక్కడే ఉన్నాం నాన్నా మేము ఎవ్వరమూ నిప్పుపుల్ల గీచి చీరమీద వేయలేదు" అని. మరి ఎట్లా అంటుకొందిరా అని అడిగితే

ఈ తథా పెద్దపిల్ల అంటుంది, ఏమోనాన్నా అదంతట అదే అంటుకొంది. మేము చూస్తూ ఉండగానే అది భగ్గున మండింది. అని ఇక్కడ కారణం లేకుండా కార్యం జరిగినట్లు చెబుతున్నారు పిల్లలు.

*బల్లమీద గ్లాసు మొగ్గ వేస్తుంది :* ఇటువంటి పనులు అప్పుడప్పుడూ జరుగుతూ ఉంటవి. మా ఆవిడ బల్లమీద పెట్టిన మంచినీళ్ల గ్లాసు, అదంతట అదే మొగ్గేసి బోర్లపడుతుంది. పుస్తకాలన్నీ తడిసి పాడై పోతవి. లాంతరు అదంతట అదే క్రింద పడుతుంది. నూనె అంతా వలకపోసుకొంటుంది. పుస్తకంలోని పేజీలు వాటి అంతట అవే చినిగి ముక్కలై పోతవి. మరీ విచిత్రమైన విషయం ఏమిటీ అంటే మా ఆవిడ పులుసు రాచిప్ప పొయిమీదపెట్టి దొడ్లోకివెళ్లి వచ్చేసరికి స్నానాల గదిలో డబ్బాలో ఉన్న బొగ్గులు అవంతట అవే నడిచి వచ్చి పులుసు రాచిప్పలో పడతవి. విభావన అనే వ్యాపారం పైన చెప్పిన పనులన్నిటి లోనూ కనపడకుండా జరుగుతూనే ఉన్నది. అలంకారంగా ఉండవలసిన వాగ్వ్యాపారం హాస్యవిభాసితము అయింది.

*కారణం లేకుండా జరిగే మరికొన్ని పనులు :* కారణం లేకుండా కార్యము సిద్ధించడము ఇంకా అనేక విధాలుగా ఉంటుంది. దేశం ఎండ లేకుండా మండిపోతుంది ఒకప్పుడు. భార్యను ప్రేమలేకుండా ప్రేమిస్తాడు ఒక్కొక్క భర్త. ఒక్కొక్కరి ముఖం కోపం లేకుండానే చిటచిట లాడుతూ ఉంటుంది.

*ఆవు అదంతట అదే చచ్చింది :* రైలులో ప్రయాణంచేస్తున్నాము. పొలాలమధ్య రైలు హఠాత్తుగా ఆగిపోయింది. డ్రైవరు దిగిచూస్తే, ఆవు ఒకటి రైలు పట్టాలమధ్య రక్తసిక్తమై పడిఉంది. ఆ ఆవుగల ఆసామి వచ్చి, నా ఆవును చంపావు అని డ్రైవరుతో తగాదా పెట్టు కొంటే డ్రైవరు అంటాడూ, "నేను నీ ఆవును చంపలేదు. నా ఇంజను నీ ఆవు మీదుగా పోలేదు, నీ ఆవు అదంతట అదే చచ్చింది. ఎవరూ

చంపలేదు. అని! అయితే దాని కాళ్లు ఎట్లా తెగిపోయినవి? తల ఎట్లా మొండాన్నుంచి విడిపోయిందీ? అంటే—''ఏమో! ఆ కాళ్లు వెధవకాళ్లు. అవంతట అవే తెగిపోయినవి. నీ ఆవు తన తలను తానే ఇంజను చక్రాలక్రింద పెట్టి నరుక్కున్నది" అని అంటాడు. పోనీ నీవు ఇంజనును నడుపుతున్నావుగదా! చూచి నడుపవద్దుటయ్యా! అని అంటే డ్రైవరు మళ్లీ అన్నాడు. ''ఇంజనును నేనేమీ నడుపడంలేదు. అదంతట అదే నడుస్తున్నది'' అని.

ఈ కథలో జరిగిన ఉపద్రవాలకు దేనికీ కారణంలేదు. అన్నీ అవంతట అవే జరిగినవి. కారణంలేకుండా కార్యమును సిద్ధింపజేయుట అనేవిషయమును హాస్యముఖంగా నడిపిస్తే ఇటువంటి అర్థశూన్య వైభవోపేతమైనట్టీ, అసంబద్ధ వ్యాపారభాసితమైనట్టీ, హాస్యమహిమా సమాయుతమైనట్టీ, పరమరమణీయమైనట్టీ, హాసజనక సమర్థమైనట్టీ హాస్యోక్తులు సముద్భవించినవి.

ఇవన్నీ విభావనోక్తులే:

వాహకుడు లేని పల్లకి
నాదకుడులేని వల్లకి

కడుపులేని కానుపు
తడుపులేని నానుపు

మగువలేని దాంపత్యం
మగడులేని పాతివ్రత్యం

ప్రియురాలులేని అనురాగం
జవరాలులేని పెనుభోగం

నాటకంలేని వేసాలు
మగతనములేని మీసాలు

బిడ్డలులేని ఇల్లరికము
అత్తలేని కోడలికము

భాగ్యాలులేని పంపకము
రోకళ్లులేని దంపకము

ఉన్నటుల అన్నప్పుడు
ఊహింపుడు విభావనోక్తి
కారణంలేని కార్యంగల
కవితా చమత్కారోక్తి
స్వకీయము లీ ఎగ్జాంపుల్స్
సరసము లీ శాంపుల్స్.

వినోక్తి :

ఇది ఒక అలంకారము. ఒకదానిని త్యజించుటవలన వేరొకటి సుందరముగాగాని, అసుందరముగాగాని ఉండునట్లు చెప్పినచో అది వినోక్తి అన్నాడు కావ్యాలంకార సంగ్రహకర్త. "క్రూరతలేని చూపు సుందరము. రవిలేని నభంబు అసుందరము." ఇవి ఆ గ్రంథకర్త ఇచ్చిన ఉదాహరణములు. మన ఇండ్లలో భార్యాభర్తల సంభాషణలో కొంచెం హెచ్చుతగ్గుగా ఇదేమోస్తరు ఉక్తివిశేషాలు దొర్లుతునే ఉంటవి. నాగది అంతా గలీజుగా ఉంది. పుస్తకాలన్నీ చిందరవందరగా పడేసి ఉన్నవి. చినిగిపోయిన కాగితాలు, లక్కపిడతలు, పేడబొమ్మలు గదిలో అంతటా పడేసిఉన్నవి. నేను విసుక్కొని కాంతంతో "ఇదేమిటి కాంతం ఇల్లంతా ఇట్లా ఉంది అసహ్యంగానూ" అంటే ఆవిడ అంటుంది, "అట్లా ఉంటేనే అందమండీ, పిల్లలుగల ఇల్లు అని తెలుస్తుంది. అవిలేకపోతే శోభేలేదు" అని. అవిలేకపోతే గృహము అసుందరము అన్నమాట. అల్లా అన్నప్పుడు అది వినోక్తి అయింది.

ఆమె మరొకసారి అన్నది. "కిచకిచలాడే పిచ్చుకలు, గలగల లాడే పిల్లలు లేని ఇల్లు ఇల్లేకాదని." ఇది వినోక్తే. మన ఆడవాళ్లు

మాట సామెతగా అనే మాటలలో ఈ వినోక్తి భాసిస్తూ ఉంటుంది. ఆమె ఒకసారి అన్నది. "గోడలకు బూజులు, కోడలుకు పోజులూ పనికిరావని." అల్లాగే "వాసనలేని మద్యమూ, దోసములేని పద్యమూ, సుందరములు." "ప్రాకారంలేని గోపురాలు, సహకారంలేని కాపురాలు." "అందములేని నవ్వు, మకరందములేని పువ్వు." కండలులేని ఒళ్లు, ముండలులేని ఊళ్లు అసుందరములు అని ఒక స్నేహితుడన్నాడు.

బొజ్జలేని గణపతి
లజ్జలేని కులసతి

టాపులేని కారులూ
పోపులేని కూరలూ

జుట్టులేని శిరములు
బొట్టులేని ముఖములు

ఎరుకలేని చదువులు
ఎరుపులేని పెదవులు

ముక్కులేని మోములు
ముద్దులేని ప్రేమలు

ఒకగుణమును బాసివస్తు
వొప్పిదమును బాయుననెడి
వింతయైన వినోక్తికి
సొంతమైన ఎగ్జాంపుల్స్
చొక్కమైన శాంపిల్స్.

ముదురులేని ముంజలు
ముసురులేని సంజలు

ముండ్లులేని బాటలు
ముళ్లులేని మాటలు

మచ్చలేని జాబిలి
రొచ్చులేని వాకిలి,

పుచ్చులేని గింజలు
పచ్చిలేని లంజలు

మట్టిలేని బుర్రలు
పొట్టలేని పిర్రలు

ఒకటిలేని కతన వర్ణ్య
మొప్పిదమగునని చెప్పెడు
వింతయైన వినోక్తికి
పొంతమైన ఎగ్జాంపుల్స్
చొక్కమైన శాంపుల్స్.

అభియుక్తోక్తి:

అభియుక్తుడు అంటే పండితుడు. బాగా తెలిసినవాడూ, అనుభవజ్ఞుడూ అన్నమాటను అభియుక్తోక్తి అంటున్నాను. ఇంగ్లీషులో అటువంటి ఉక్తివిశేషాన్ని Epigram అంటారు. జ్ఞాని తన అనుభవాన్ని అంతా మాటుపెట్టి అన్నటువంటి ఒకమాట. ఆ ఒక్కమాటలో ఎంతో విజ్ఞానము ఇమిడిఉంటుంది. అందులో ప్రతిభాయుక్తమైన యుక్తిగాని ప్రజ్ఞాయుతమైన భావనగాని ఉంటుంది. ఒకప్పుడు అది మనలను ఆశ్చర్యచకితులను చేస్తుంది. అటువంటి మాటవిన్నప్పుడు నీ పెదవులపై చిరునవ్వు భాసిస్తుంది. ఒకప్పుడు ఆ ఉక్తి చురుక్కున తగులుతుంది. తేలుకుట్టినట్లు ఉండినా ఉండవచ్చు. అయితే ఈ ఉక్తివిశేషాలలో చమత్కారం తళుకుతళుక్కని మెరుస్తూనే ఉంటుంది. మచ్చుకు ఒకటిరెండు ఉదాహరణలిస్తాను.

ఆడవాళ్లను తప్పకుండా అడిగిచూడు సలహా
ఆచరణలో మాత్రం ఏదైనాచేయి అది మినహా.

ప్రేమతో వచ్చింది ఒక్కటే ఇక్కట్టు
సుఖ దుఃఖాలమధ్య అది సీజనుటిక్కట్టు.

దయ్యాలవంటిదంటాను నిజమైన మక్కువ
లోకంలో అది కనబడేది తక్కువ వినబడేది ఎక్కువ.

అసలు అడ్రసులేనివాడు అడవా రకం
రెండు అడ్రసులు ఉన్నవాడు ఛడవారకం.

పాతదన్నది ఎల్లను మారుతుంది
కొత్తదానికి చోటిచ్చి తీరుతుంది.

వట్టిగొడ్డుకు అరుపులెక్కువ
మట్టిబుర్రకు మాటలెక్కువ.

మణిప్రవాళోక్తి:

సంస్కృతము, ఆంధ్రము, ఈ రెండు భాషలకు చెందిన పదాలను ఉపయోగిస్తూ చేసిన రచనను మణిప్రవాళము అంటారు. మొదట మలయాళము, సంస్కృతము కలిపిన రచనలను మణిప్రవాళ రచనలు అనేవారు. ఇప్పుడు తెలుగులోకూడా అటువంటివి బయలుదేరినవి. ఒక్క ఉదాహరణ మాత్రము ఇస్తాను.

"తండులాని గృహమందు నసంతి
తిండికైతే పదిమంది వసంతి."

ఇటువంటి వాక్యాలలో ఎక్కువ హాస్యం ఉండదు. ఇదికూడా మణిప్రవాళోక్తే.

"రేరే గజ్జలిగా! కిమస్తినగరే?
ఏమబ్బ ఎపుడొస్తిరి?"

ఇల్లాగే ఇంకాకొన్ని ఉక్తివిశేషాలను సాధించవచ్చును.

విశేషోక్తి:

పెక్కు కారణాలున్నా కార్యము పుట్టనట్లు వర్ణించడము విశేషోక్తి అన్నాడు లక్షణ గ్రంథకర్త. దీనిని హాస్యపరంగా వాడితే ఈ క్రింద చెప్పబడినటువంటి వాక్యాలు పుడతవి.

"పల్లం ఉన్నా పారదు నీరు
నాలుక ఉన్నా మాట్లాడదు నోరు."

విశేషోక్తి అలంకారముగా వాడినపుడు దాని స్వరూపం వేరు. కవులు శ్లేషచేత విశేషోక్తిని సాధిస్తారు. దాని స్వరూపాన్ని కొద్దిగా మార్చినాను. ఈ క్రింది భాషణలు విశేషోక్తియొక్క లక్షణాలను కలిగి యున్నవి.

ఎరువు వేసినా ఎదగదు మా గులాబిమొక్క
మందులుతిన్నా కుదరదు మావాడి తలతిక్క.

వాకిలి ఉన్నా తలుపులు లేవు
కురుపులు ఉన్నా సలుపులు లేవు.

ఎర్రగ బుర్రగ ఉన్నది ఏమితక్కువ
ఏలనన్నాడు మగడు, తెలివితక్కువ.

---

# పూర్వ సాహిత్యంలో హాస్యము

లక్షణ గ్రంథాలు:

మన పూర్వులు హాస్యాన్ని చిన్నచూపు చూశారు. ఉత్తమహాస్య స్వరూపాన్ని కొంతవరకు తెలుసుకొన్నారు గాని ఆదరించలేదు. పూర్వ గ్రంథాలలో నేను అనుకొన్న ఉత్తమ హాస్యం బహుతక్కువగా ఉంది. లక్షణగ్రంథాలలో ఇచ్చిన ఉదాహరణలను బట్టి "వారి ఊహ ఇంతవరకే పోయిందే! ఇంతకంటే రమ్యమైన మనోహరమైన హాస్యము వీరికి దొరకలేదా గ్రంథాలలో!" అని అనిపిస్తుంది. చక్కని హాస్యం తెలిసి ఉంటే వారు అంత పేలవమైనట్టి ఉదాహరణలు ఎందుకిస్తారు! చూడండీ.

*నరసభూపాలీయము:* నరసభూపాలీయములో హాస్యము అంటే ఇట్లా ఉంటుందని ఒక ఉదాహరణ ఇచ్చాడు, అది పేలవమో కాదో రమణీయమో కాదో మీరే ఆలోచించండి. శత్రుసైనికులు నరసభూపాలుడు వస్తున్నాడని తెలిసికొని పరుగెత్తుకొనిపోయి గుఱ్ఱాలను ఎక్కారట. ఆ తొందరలో భయభ్రాంతులైన కారణాన తోకవైపు ముఖంపెట్టి కూర్చున్నారట. ఈ వర్ణన చదివి నవ్వుతాము. కాని ఇది ఉత్తమ హాస్యమా?

*ప్రతాపరుద్రీయము:* ప్రతాపరుద్రీయంలో కొప్పులు పెట్టుకొని కళ్లకు కాటుక పెట్టుకొని, కృత్రిమ స్తనములను ధరించి స్త్రీ వేషముతో ప్రచ్ఛన్నరూపులై కాకతీయాంధ్ర నగర వీధులలో చనుచున్న శత్రు రాజులను చూచి దుండగీంద్రగు విటులు దువ్వలువలూడ్చి, కుచములు లాగి, నీవిని తాకి, హీ హీ అని నవ్వుతున్నారు. అదీ హాస్యానికి ఉదాహరణ.

*రసగంగాధరములో:* రసగంగాధరములో అంటాడూ "గోవు యొక్క పృష్ఠభాగం దర్శనీయంకదా, రాసభసతియొక్క పృష్ఠభాగం ఏల దర్శనీయముకాదూ" అని. ఈ ఉదాహరణలు పేలవంగానూ, అసభ్యంగానూ, జుగుప్సాకరంగానూ ఉన్నవని నా అభిప్రాయము. ఒక పద్యం రమణీయంగా ఉన్నది. అనేముందు ఎన్నో విచారిస్తాము. రమణీయార్థ ప్రతిపాదకంగా ఉండవలె. ధ్వనివ్యంజకముగా నుండి అర్థవైభవాన్ని ప్రకటితం చేయవలె.

హాస్యరచనకు కూడా, కావ్యానికి ఉండే లక్షణాలు ఉండవలె. ధ్వని సమన్వితంగా ఉండి రమణీయార్థ ప్రతిపాదకమైనది, వికార రహితమైనది అశ్లీల స్ఫోరకం కానిది, జుగుప్సాకరముకానిది, సభ్యమైనది, రసజనకమైన చిత్తవృత్తిని కలిగించేది ఉత్తమహాస్యము. పైనచెప్పిన ఉదాహరణలు అటువంటి ఉత్తమ హాస్యానికి చెందినవేనా? అని ప్రశ్న.

*నిరాదరణ:* పూర్వకాలపు కవులలో హాస్యం మృగ్యం అని అనడంలేదు. చాలాతక్కువ అంటాను. ఆ కవులు హాస్యం జోలికి ఎందుకు పోలేదూ అని ఆలోచిస్తే నాకు ఒకటి తోస్తుంది. హాస్యానికి ఆ రోజులలో ఆదరణలేదు. హాస్యశీలుణ్ణి నటవిట విదూషకాదిగాగల పాత్రలతో కలిపి కూర్చోబెట్టినారు. అటువంటివారిని అపాంక్తేయులుగా పరిగణించారు. సంఘంలో హాస్యశీలుడు అంతనీచంగా చూడబడుతూ ఉంటే చూస్తూచూస్తూ మర్యాదగల ఏ కవి హాస్యరచనలు చేయడానికి సాహసిస్తాడు?

రెండవది అనౌచిత్యము, అసందర్భము, అసంగతము అయిన ప్రసంగాలవల్లనే నవ్వువస్తుంది. అవి కావ్యదోషాలు. ఆత్మగౌరవమున్న కవి ఎవరూ కావాలని బుద్ధిపూర్వకంగా తన కావ్యంలో అనౌచిత్యాన్ని ప్రవేశపెట్టడు. ఆ కవులు చెప్పేది ఏదో దానిని నవ్యంగానూ సరసంగానూ, సుందరంగానూ, చెప్తారేకాని, డొంకతిరుగుడుగా చెప్పి నవ్వించాలని ప్రయత్నం చేయరు. చేయలేదు.

*నాటకాలలో నాయకులు :* నాటకాలలో ఏమైనా మంచి హాస్యం దొరుకుతుందేమోనని చూస్తే అట్టే దొరకదు. ఎందుకంటే పూర్వకాలపు పండితులు, కవులూ, హాస్యాన్ని గొల్ల భాగోతులకు, కేతిగాళ్లకు, భాండికజనమునకు, గంధోళిగాళ్లకు ఇచ్చేసి తాము గంభీరమైన రచనలు చేసేవారు. నాటకంలోని పాత్రలు ఎవరూ హాస్యోక్తులు మాట్లాడరు. నాయకుడుగాని, నాయికగాని చమత్కారంగా మాట్లాడరు.

నాయకులు ధీరోదాత్తుడు - ధీరలలితుడు, ఇట్లా రకరకాలుగా ఉన్నారు. ధీరోదాత్తాదులు గంభీరప్రసంగాలు చేస్తారేగాని తేలిక ప్రసంగాలు చేయరు. వారు సాధారణంగా నవ్వనేనవ్వరు. నవ్వితే వారిలో ముఖ్యంగా ఉండవలసిన ధీరత్వ శాంతత్వాది గుణాలకు భంగమువాటిల్లినట్లే. ఆ నాయకులు ప్రియురాలుతో మాట్లాడుతున్నప్పుడు సహితం తమ ధీరత్వమునకూ నిగ్రహమునకూ భంగం వాటిల్లే హాస్యప్రసంగాలు చేయకూడదు. చేయరు. చేస్తే ఔచిత్యభంగం కలుగుతుంది.

*నాయకుడు ధీమంతుడై ఉండాలని ఎక్కడా చెప్పలేదు:* హాస్యకల్పనకుగాని, ప్రసంగానికిగాని, నిశితమైన మేధాశక్తి కావలె. మేధలేనివాడు ఉత్తమహాస్య ప్రసంగాలు చేయలేడు. ఈ ధీరోదాత్తాది నాయకులు ఎవరూ ధీశక్తికలవారుగా ఉండాలని ఎక్కడా చెప్పలేదు. ఒక్కొక్క నాయకుడు ఎటువంటి గుణములుగలవాడై యుండాలో చెప్పాడు. చూడండి. ధీరోదాత్తుడు ధీరత్వమును ఉదాత్తత్వమును కలవాడు. ప్రధాననాయకులకు అందరికీ ఈ ధీరశబ్దము ఉన్నది. ధీరుడు అంటే క్లేశమును సహించువాడు. ఉదాత్తుడు అంటే ఆత్మశ్లాఘలేనివాడు. అతడు గంభీరుడున్నూ గూఢమానము కలవాడున్నూ, సహనముగలవాడున్నూ అయి ఉండవలె.

మానము అంటే కోపము. ధీశక్తికలవాడై ఉండాలని ఎక్కడా అనలేదు. అదీ గమనించవలసిన విషయము. ధీరోద్ధతుడు మాయల

మారి. అహంకారి. ఆత్మశ్లాఘ కలవాడు. ధీరశాంతుడిలో ప్రధానంగా ఉండవలసింది శాంతగుణము. లలితకళలయందు అనురక్తుడు ధీరలలితుడు. ఇతడు భోగి. లలితకళలు అనగా నృత్యము గానము చిత్రకళ మొదలగునవి. వీనియందు నిరతుడును మృదుస్వభావము కలవాడునూ, అయినవాడు ధీరలలితుడు. పండితుడు, ధీమంతుడూ, ప్రసంగ కుశలుడూ అయినవాడు నాయకుడుగా ఉండాలని ఎక్కడాలేదు.

*ప్రసంగకౌశలం నాయికలకు అక్కరలేదు:* నాయికలనుతీసుకొన్నా అంతే. నాయికలలోకూడా అనేక రకాలున్నారు. ప్రియునితో హాస్యంగా మాట్లాడాలనికాని, ప్రసంగకౌశలం ఉండాలనిగాని ఎవ్వరి విషయంలోనూ చెప్పలేదు. నాయిక నాయకునితో సరస సల్లాపాలు జరపడము బహు అరుదు. గ్రంథకర్త నాయికచేత హాస్యప్రసంగాలు చేయించడు. చేస్తే కొంపమునిగిపోదూ! ఔచిత్యం భంగపడుతుందని భయం.

*నాయికలు ఏడుస్తారు:* కాకపోతే ప్రియుడు పరస్త్రీతో సంచరిస్తున్నాడని అనుమానంతోస్తే ఏడ్వడమూ, విరహవేదనపొంది మెడలోనున్న ముత్యాలహారాలు త్రెంపిపోయడమూ తప్ప మరోవ్యాపారం లేదు నాయికలకు. అందరూఅంతే. ఈ నాయికలు కోపమనస్కలైనప్పుడు మాత్రం వక్రోక్తులతో ప్రియుని ఎత్తిపొడుస్తారు. ఏమైనా హాస్యం దొరికితే ఈ ఎత్తిపొడుపులలో దొరకాలె. ఈవిధంగా ఉత్తమ పాత్రల పరంగా హాస్యము లేనపుడు ఇక నాటకాల్లో హాస్యం ఎక్కడ దొరుకుతుందీ?

*ఉపనాయకులు-విదూషకుడు:* పోతే పీఠమర్దుడు మొదలైన ఉపనాయకులుఉన్నారు.వీరందరు ఒకశ్రేణిలోనివారే. అందులో ఆపీఠమర్దుడు ప్రధాన నాయకుడికన్న కొంచము తక్కువవాడు. వట్టి అసమర్థుడు. జూదరి. మాటకారి. వేశ్యానాగరకులకు పరస్పరం సందేశాన్ని చెప్పే

వాడు. వీరంతా నీచులు. వాళ్లు ఉదాత్తమైనటువంటి, ఉత్తమమైనటు వంటి హాస్యప్రవచనములు చేయలేరు.

*విదూషకుడు :* ఇక విట, చేట విదూషకులు ఉన్నారు. వీరు హాస్యప్రసంగాలు చేస్తారు. కాని పేలవము అసభ్యము అయిన హాస్యం అది. ఇందులో విదూషకుడు ముఖ్యుడు. ఈ విదూషకుని గూర్చి గొప్పగా చెబుతారు. అతడు ప్రసంగ కుశలుడని ప్రసిద్ధి. విదూషకుని హాస్యప్రసంగాలు నవ్వుపుట్టించే మాట నిజమే. కాని ఆ హాస్యముచాలా నీరసమైనది. చౌకబారుది. పేలవమైనది. ఇతడుకలహాసక్తుడు. నాయికా నాయకుల మధ్య చిట్టి తగాదాలు పుట్టిస్తాడు. ఇతని విసురులన్నీ చాల వరకు భోజనాన్నిగురించే. కాకపోతే దాసీలతో చౌకబారు హాస్యము ఆడుతూ ఉంటాడు. విదూషకుడు అంటేనే విస్తారము దూషించేవాడు అని అర్థము. హాస్యకల్పన చేయడానికి ఎన్నో సుగుణాలు ఉండవలె. ఇటువంటి నీచపాత్రనుండి ఉత్తమహాస్యం ఎట్లావస్తుంది? మొత్తము మీద నాటకాలలో ఉదాత్తమైన, రమణీయమైన హాస్యసంపద కొరవ డిందని అనుకోవచ్చు.

భారతము :

*భీముడు హనుమంతుని తోకను ఎత్తలేకపోయినాడు:* పరమసత్యాలు ఎప్పుడూ హాస్యవృత్తాంతాలుకావు. నన్నయభట్టు రచనలో భీముడు సౌగంధికాహరణార్థమై పోతూ దారిలో హనుమంతుని చూశాడు. దారి కడ్డం లెమ్మంటే అతడు లేవలేదు. "నేను ముదుసలిని. నాతోకను నీ దారి కడ్డంగా ఉన్నంతమేరను నీవే తొలగించుకో" అన్నాడు. భీముడు ప్రయత్నించి హనుమంతుని తోకను అంగుళమైనా కదల్చలేకపోయాడు. హనుమంతుడు అంత మహాబలశాలి అని చెప్పడమే కవి ఉద్దేశము. అది పరమసత్యము. అతిశయోక్తికాదు. ఇందులో నమ్మతగని విష యాన్ని నమ్మించాలని ప్రయత్నమూలేదు. ఆ దృష్టితో పరామర్శిస్తే ఇందులో ఏమంత హాస్యము ఉంది? హనుమంతుని తోక ఎత్తలేకపోవ

డము చూచి నవ్వేది పసిపిల్లవాళ్లమాత్రమే. అందులో వికృతిగాని అసందర్భముగాని లేదు. చెప్పినవిషయాలలో పరస్పర వైరుధ్యంగాని అనౌచిత్యముగాని ఏమీలేదు.

*భీముని శరీరంతగిలి రాయి ముక్కలుముక్కలైంది:* తెలుగులో ఉత్తమ కవులని పేరుపడ్డవారెవరూ హాస్యాన్ని పోషిస్తూ రచనలు చేయలేదు. అక్కడక్కడ కొన్ని హాస్యపు చెణుకులు ఉన్నా అవి ఉత్తమహాస్యం క్రిందికిరావు. నన్నయభట్టు భీమునిగురించి వ్రాసిన ఒక పద్యంలో హాస్యచ్ఛాయలు కనిపిస్తవి. కుంతి భీమసేనుని పదిరోజుల వయస్సుగలవానిని ఎత్తుకొని దేవగృహానికి పోతూఉంటే పులి ఒకటి ఆమెకు ఎదురైంది. దానిని చూచి భయపడి కుంతి తనచేతులలోని పసివాణ్ణి జారవిడిచింది. బాలకుడు ఒకరాతిపై పడ్డాడు. ఆ పాటువలన పిల్లవానికి దెబ్బతగులలేదు సరిగదా ఆ రాయే ముక్కలుముక్కలైందట! బకాసురుని వధకై పుత్రుని నియోగించిన సందర్భంలో కుంతి ఈ సంగతి బైటపెట్టి అంటుందీ. "వీడు పుట్టిన పదియవనాడు పెలుచ బడియె, నా చేతినుండి యప్పర్వతమునబడిన వడిజేసి బాలకు నొడలు దాకి యా క్షణంబ రాయెల్ల నుగ్గయ్యె జూవె!" అని.

ఇది నవ్వుపుట్టించే వృత్తాంతమేగాని, కవి మనలను నవ్వించాలని అది హాస్యాస్పద విషయంగా వ్రాయలేదు. నిజంగా జరిగిందని కవి చెప్పదల్చుకొన్నాడు. భీముని శరీరకాఠిన్యం అటువంటిది. నిజమైన వృత్తాంతము చెపితే అదివిని ఆశ్చర్యపడతాము గాని నవ్వము. ఏమి వైపరీత్యం ఉందని నవ్వాలె. అసంగతత్వము, అసహజత్వము ఇందులో ఏమీలేదు. పరమసత్యమైన వృత్తాంతాలు నవ్వు పుట్టించవని నా ఉద్దేశము * భీరువు ధీరుడులాగ మాట్లాడితే నవ్వు వస్తుంది. వృద్ధుడు యువకునిలాగ మాట్లాడినా నవ్వొస్తుంది. అసహజత్వము

* అభిప్రాయభేదమున్నది. వేరొకచోట చెప్పాను ఆ విషయమై.

ఉంటేనే నవ్వువస్తుందని నా అభిప్రాయం. అల్లాగే భీముడు బండెడు అన్నము తినడంకూడా నిజమైన వృత్తాంతం కాబట్టి నవ్వతగిన విషయం కాదు. నవ్వినా ఆ నవ్వు ఆశ్చర్యాన్ని వెల్లడించేది అవుతుంది.

*చండిక :* పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినీ భారతంలో ప్రాసంగికంగా చెప్పిన చిన్నకథలో ఒకటి ఉద్దాలకుని కథ. ఆయన భార్యకు భర్త ఏపనిచెప్పినా దానికి వ్యతిరేకంగా చేస్తుంది. మడి ధోవతి ఇమ్మంటే దానిని నడిమికి చింపి ఇస్తుంది. కట్టుకోవడానికి వీలులేకుండా. జపము చేసుకొంటానికి అక్షమాలిక ఇమ్మంటే దానిని తెంపి ఇస్తుంది. అతిధులు వస్తారు వారిని గౌరవించమంటే అగౌరవ పరిచి పంపిస్తుంది. ఈ వృత్తాంతము హాస్యవంతములు కావని ఎవరూ అనరు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానంలోని కలహకంఠి ఈ చండిక రకమే. ఆమె మాటలలో ఏమైనా హాస్యం దొరుకుతుందేమో చూడవలె.

ప్రబంధాలు:

*సత్యాభామ కృష్ణున్ని దానంచేస్తుంది:* పెద్దనదగ్గరకు వద్దాము మనుచరిత్రలో శృంగారాభాస ఉంది. ఏరసమైనా ఆభాసరూపంలో హాస్యజనకము అవుతుంది. వరూధిని వృత్తాంతము అట్లాకావలిసిందే కాని కాలేదు. పారిజాతాపహరణంలో చివరిభాగంలో సత్య శ్రీకృష్ణుని నారదునికి దానమిచ్చి అతనిఎత్తు ధనమిచ్చి మళ్లీ ఆ మహానుభావుణ్ణి తీసుకోవాలె. ఈ ఘట్టాన్ని హాస్యవంతం చేయవచ్చు. కాని కవి అల్లాగ చేయలేదు. భగవంతుణ్ణి అపహాస్యం చేస్తాడా! చెయ్యలేడు. అసలు హాస్యంలో తేలికతనం ఉంది. ఉదాత్తమైన విషయాలను తేలికతనంతో పరామర్శించడం పొసగనిపని. ఆ పని పూర్వకవులు ఎవ్వరూ చేయ డానికి సాహసించలేక పోయినారు. పూర్వకవులు ఎక్కడన్నా నవ్వు లాటకు అనేమాటలుకూడా గంభీరంగా పెదవులను బిగబట్టి అంటారే గాని తేలికగా అనరు. అది మడిగట్టిన హాస్యము.

*శశిరేఖాపరిణయము :* శశిరేఖాపరిణయములో ఘటోత్కచుడు చేసిన మాయవలన, లక్ష్మణునకు శశిరేఖ కుందేలుగాను, పిల్లిగానూ, కోతిగానూ భల్లూకంగానూ, పాముగానూ కనిపిస్తుంది. ఊహించుకొని ఈ దృశ్యాలు కళ్లముందు చిత్రించుకొంటే వానినిజూచి నవ్వాలని అని పించే మాట నిజమే.

*చంద్రరేఖా విలాపము :* చంద్రరేఖావిలాపంలో హాస్యం ఉందని అంటారు. దానిలో జుగుప్సాకరమైన వర్ణనలు చాలాఉన్నవి. "పళ్లతోమడు గుదప్రక్షాళనము జేయడు" ఇల్లాంటి వాక్యాలున్నవి ఆ పుస్తకంలో. నవ్వుతాము గాని, ఆ నవ్వు వికారరహితమైనదీ నిర్మలమైనదీ కాదు. అటుతరువాత కాలంలో వ్రాయబడిన రావణ దమ్మీయము" అను గ్రంథం అధిక్షేపకావ్యమనీ, అది హాస్యమయమని అంటారు.

శతకాలు :

*చంద్రశేఖర శతకము:* చంద్రశేఖర శతకము పామరులు మాట్లాడే భాషలో వ్రాయబడినది. ఆ భాషలో పామరత్వము ఎక్కువ అయింది. పామరుల నోళ్లలో వికృతిపొందిన శబ్దాలను కవి ఉపయోగించాడు. అయితే అట్టిశబ్దాల సుస్వరూపము చప్పున గుర్తుకురాదు. ఇది శబ్దాశ్రయ హాస్యము. పుస్తకంఅంతా ఒకేపద్ధతిలో వ్రాసిన కారణాన పదిపద్యాలు చదివిన తరువాత విసుగుపుడుతుంది. భాషలో ఉండే వైపరీత్యం క్రొత్తదనాన్ని పోగొట్టుకొంటుంది. చదవాలనే ఆసక్తికూడా నశిస్తుంది.

*మరికొన్ని శతకాలు :* సింహాద్రి నారసింహశతకమూ, ఆంధ్రనాయక శతకమూ మొదలైన శతకాలు హాస్యాన్ని ప్రసాదిస్తవి అంటారు కొందరు. జానపదగీతాలలోకూడా బోలెడు హాస్యం ఉందని కూడా అంటారు డా॥ రామరాజుగారు. నిత్యవ్యవహారాల్లో వదినామరదళ్ల మధ్య, బావా మరదులమధ్య, అత్తాకోడళ్లమధ్య జరిగే సంభా

షణలో కావలసినంత హాస్యము ఉందనీ దానినెవరూ ప్రోగుజేయలేదనీ చాలావరకు గాలికి కొట్టుకపోగా కొంతకొంత జానపదుల సాహిత్యంలో ఇరుక్కున్నదని అంటారు. ఆమాట నిజమే. పూర్వపు అంటే పాత కాలపు పాటలలోకూడా హాస్యము కనపడుతుంది. మొత్తంమీద పూర్వ సాహిత్యంలో హాస్యం తక్కువే అనాలి. గొప్పకవులు ఎవరూ దీని జోలికి రాలేదు.

నవ్యసాహిత్యం :

నవ్యసాహిత్యం అంటే ఇరవయ్యో శతాబ్దంలో పుట్టిన సాహిత్యం అని నా ఉద్దేశం. కందుకూరి వీరేశలింగం పంతులుగారు నవ్య సాహిత్యానికి పితామహుడు. వారున్నూ చిలకమర్తివారున్నూ పానుగంటివారున్నూ సమకాలికులే. ఈ ముగ్గురూ హాస్యరచనలు చేశారు. ఈ పుస్తకంలో అక్కడక్కడ ప్రాకరణికంగా వారి రచనలను పేర్కొనడమూ, యధోచితముగా విమర్శించడమూ జరిగింది.

*చిలకమర్తివారి హాస్యము మడివిడువలేదు :* చిలకమర్తివారు హాస్యప్రియులే. వీరినవలలలో అక్కడక్కడ హాస్యపు చెణుకులు ఉన్నవి. వీరి మందపాలుడు సంస్కృతనాటకాలలోని విదూషకుని సంతతి వాడే. వీరిహాస్యము మడి విడవలేదు. వీరి గణపతియొక్క అనాకారితనమును, అసభ్యపు పనులనుచూచి నవ్వుతాము గాని ఆ హాస్యము సభ్యతగల హాస్యముకాదు. ఆ హాస్యంలో ప్రతిభా ప్రదర్శనము లేదు.

*వేదమువారి హాస్యము మైలపడ్డది :* ప్రతిభను ప్రదర్శించని హాస్యము ఉత్తమమైనదికాదు. ప్రతాపరుద్రీయములోని వేదమువారి హాస్యము తురకభాషా సంపర్కమువలన మైలపడ్డది. మన హాస్యము తురకము నేర్చుకొన్నది. దానితో అది మనదికాకుండా పోయింది.

*గురిజాడవారి తెలుగు హాస్యము ఇంగ్లీషులో ఉన్నది:* గురిజాడవారి హాస్యముకూడా ఇంగ్లీషు సంపర్కమువలన మైలపడ్డది. అదీ మన

హాస్యము కాదనిపిస్తుంది. అయితే కన్యాశుల్కంలోనూ. కొండుభట్టీయంలోనూ ఇంగ్లీషుసంపర్కము లేకుండా హాస్యకుశలమైన పరిహాస భాసితమైన ఘట్టాలు లేకపోలేదు.

*గంభీరమైన కావ్యంలో సుస్మితమైన హాస్యం:* దాసువారిహాస్యాన్ని గురించి ఇంతకుముందే ఏదో సందర్భములో పేర్కొన్నాను. పోతే ముదిగొండ వీరభద్రమూర్తిగారు వ్రాసిన సువర్ణధార అనే కావ్యం హాస్యగ్రంథం కాదుకాని, అందులోని కొన్ని ఘట్టాలు హాస్యాశ్రయమైనవి ఉన్నవి. మార్కండేయము అనే పద్యకావ్యంలోని హాస్యాన్ని గురించి ఒకవ్యాసంకూడా వ్రాసినాను. బహుసున్నితమైన హాస్యమును సాధించినాడు కవి కొన్నికొన్ని ఘట్టాలలో. కొన్నివాక్యాలలో ఉపహితమైన పరిహాసము బహురమ్యమై కృపణుడు గుప్తముగా భద్రపరచిన హేమభూషణమువలె ఉంటుంది. ఒక ఉదాహరణ ఇస్తాను.

*నన్ను బలవంతంగా పట్టుకొనిపోవాలనుకొన్నావా? తెలివిగలవాడవే:* మార్కండేయునకు అంతిమఘడియలు వచ్చినవి. యమధర్మరాజు స్వయముగావచ్చి మార్కండేయునిపై పాశంవేస్తాడు. అప్పుడు "పాశ బంధిత కంఠుడా బాలకుండు పలికెనో దండధరుడ నం బలిమిగట్టి కొంచుబోవదలంచితే కోవిదుడవు 'రానుపో!' శివపూజ పూర్ణమగు వరకు"అనిఅంటాడు కవి. ఈ పద్యంలోని హాస్యం ఎక్కడుంది? పైకి కనపడదు.

*నేను రానుపో:* యముడు ప్రభువు. స్వయముగా వచ్చేశాడు. అతనిని చూస్తేనే భయంకలుగపలెకదా! పైగా అతడు దండధరుడు. పాశంకూడా వేశాడు. ఇతడా చిరుతప్రాణి. భయపడి పర్యుపాసనాధేయుడై ప్రీతివచనములచేతనో ప్రసంగకౌశలముచేతనో వినయప్రదర్శనవలననో ఆ కృతాంతుని ప్రసన్నతను పొందుటకు ప్రయత్నము చేయుటమాని ధైర్యంగా "రానుపో!" అనిఅనడము హాస్యాస్పదము. అంత బలవంతుడైన ప్రభువును ఈ కుర్రడు ఎదిరించడమువల్ల నవ్వొ

స్తుంది. అందులో ఉండే అసంగతత్వమూ అసహజత్వమూ హాస్యానికి మూలము.

*అంతగొప్పవానికి ఈ పసివానిపై కోపమా!* గామావంటి మహా బలశాలిని నాలుగేండ్ల పసివాడు సవాల్‌చేయడంవంటిది ఈ సంఘటన. అప్పుడు ఆ యముడు నవ్వి ఊరుకోవలసింది. అల్లాకాక కోపంతెచ్చు కోవడంకూడా హాస్యస్ఫోరకమే. అంత చిన్నవానిపై తనంతవాడికి కోపంరావడంకూడా అనుచితమే. అనుచితవ్యాపారం ఎప్పుడూ నవ్వు పుట్టిస్తుంది. యముడంటాడు. "ఇదివరకే నీ పూజలు తుదముట్టింప వలసింది. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది"అని. ఇవి తనతో సమానమైనవానితో అనవలసిన మాటలుగాని కుర్రదితో అనవలసినవి గావు.

*నన్ను హింసిస్తావా చస్తావు జాగ్రత్త:* యముడు క్రిందికి దిగాడు. సహజమైన గాంభీర్యమును కోల్పోయినాడా? ఆ భక్తుని చూచి భయ పడ్డాడా? లేక అతని దృష్టి కృపార్ద్రీకృతమైనదా? అని అనిపిస్తుంది. ఈ సంగతి కనిపెట్టి మృకండసూతి యముణ్ణి "నావంటి భక్తుణ్ణి హింసి స్తివా చస్తావురా అబ్బాయి" అంటాడు. ఈ క్షీరకంఠుడు లోకపాల కునికి నీతి బోధించడం మరీ హాస్యాస్పదము.

*ఓరి మహిషవాహనా!* పైగా యముణ్ణి 'మహిషవాహన' అని సంబోధిస్తాడు. నాకుమటుకు ఆ సందర్భములో ఆ సంబోధన వలన ఫక్కున నవ్వొచ్చింది. "ఇంత బుద్ధిహీనుడవేమి?" అన్నట్లు తోచింది. ఆ సంబోధనలో అర్థము ధ్వని నిక్షిప్తము అని నా ఊహ. పైగా ఆ బాలుడు అంటాడూ! "నీతో మాట్లాడడానికి నాకు వ్యవధిలేదూ"అని. ఎంత ధీమా! ఈ సామాన్యుడు ప్రభువుతో "నాకు నీతో మాట్లాడేం దుకు వ్యవధిలేదు." అనడం పూర్తిగా హాస్యాస్పదము.

*నేను గొప్పవాణ్ణోయి కుర్రవాడా!* అంతటితో ఊరుకొన్నా బాగుం ది. అప్పుడు యముడు "నేను ఎంతగొప్పవాణ్ణో నీకుతెలుసా?"అని

తనగొప్పనుగురించిచెప్పి "అట్టిప్రతాపవంతుని మహాత్ముని నన్నుతృణీక రింతువే చిట్టెము గట్టు భక్తిగల జెట్టెడు బొట్టెడ" అంటాడు. తన గొప్పను గురించి తానే బొట్టెనితో చెప్పుకోవలసిన అవస్థ వచ్చినందు లకు నవ్వొవస్తుంది. జాలీ వేస్తుంది.

*కుర్రవాడు యముణ్ణి తన్నాడు:* దానితరువాత ఆ కుర్రవాడు యముణ్ణి తంతాడు. ఎట్లా తన్నాడట. "పదమ్ము రవడి నెత్తి దండధరు బోర ఫెడీలున దన్నె" అన్నాడు కవి. ఆ తన్నుకు యముడు ఒరిగి తడాల్న నేలబడి నెత్తురు కక్కుకొన్నాడు. అదంతా శివమహాత్మ్యము అనుకోండి. దానితరువాత గ్రంథకర్త ఒకచిన్న విసురు విసురుతాడు. "నెత్తురులనుగ్రక్కుచున్ యముడుదోరెను దున్నయు బారెనయ్యడన్." అని. యముడు చనిపోయినాడట. దున్నపోతు మాత్రం ప్రాణాలతో పారిపోయిందట.

*దున్నపోతును ఎక్కినవాడా!* యముడంతవాడు చావడమూ అల్పప్రాణియైన దున్న తెలివిగా పారిపోవడమూనా! ఈ మాట వింటే ఎందుకోగాని ఫక్కున నవ్వుతాము. మహిషవాహన అనడం సమంజ సంగానే ఉన్నదని అనిపిస్తుంది.

## దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి హాస్యము :

*వెధవపేట :* మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు చక్కని హాస్యరచనలు చేశారు. అవి పద్యాలు. ఆ పద్యాలు పుస్తకరూపంగా ఇంకారాలేదనుకొంటాను. దేశములో ప్రతిభాగము తనకు స్వాతంత్ర్యము కావాలని కోరడము జరిగింది కొన్నాళ్ళక్రిందట. పాకిస్తాన్‌వలె విడి పోయి ప్రత్యేక రాజ్యం స్థాపించుకోవలెనని కొన్ని చిన్నసంస్థానాలు కూడా అభిలషించినవి. అట్లాచేస్తే దేశం ముక్కలుముక్కలై పోయి సర్వనాశనానికి కారణం అవుతుంది. ఆ విషయాన్ని మనసులో ఉంచు కొని హేళనచేస్తూ ఈ క్రిందిపద్యం వ్రాసినట్లు తోస్తుంది.

"వీటనున్నశుద్ధ విశ్వస్తలందరూ
గొప్ప సభనుచేసి గోలపెట్టి
వెధవపేట నొకటి వేరె యిమ్మన్నారు
విశ్వదాభిరామ వినురవేమ."

*మొగ్గవేతును అగ్గిపోతును:* సామ్యవాదుల డాంబికపు ప్రతిజ్ఞలను హేళనచేస్తూ ఈ పద్యం వ్రాసినట్లు కనపడుతున్నది.

"కత్తిసాము చేతు గండురాళ్లను మేతు
మొగ్గవేతు నగ్గిపోతుననియె
స్వామి యెవరమంటె సామ్యవాదమన్నాడు
విశ్వదాభిరామ వినురవేమ."

*ఆడవేషంలో మగవాడిలా గుంటాడు:* అర్హతలేని పనులను చేయడానికి సాహసించే అవివేకులను హేళనచేస్తూ వ్రాసిన పద్యాలలో ఇది ఒకటి. ఆడవేషం వేయడానికి అర్హతలేకపోయినా సరదాకు ఆ వేషం వేస్తూ ఉండేవాడిని పరిహసించిన పద్యం ఒకటి ఇస్తున్నాను.

"నాటకాలలో నారివేషమువేయు
పురుషుడట్టులుండు పోతరాజు
ఉత్తయప్పు సరిగయువతీలల్లామయ్యే
విశ్వదాభిరామ వినురవేమ."

*భావకవి:* అటువంటిదే ఇక్కడ ఒక వెక్కిరింపు ఇది.

"మెరుగు కంటిజోళ్లు గిరజాలు సరదాలు
భావకవికిలేని వేవిలేవు
కవితయందు తప్పగొట్టివాడన్నింటను
విశ్వదాభిరామ వినురవేమ."

*మాకీ పాదుషాహై :* ఎప్పుడో రాజ్యమేలిన పాదుషాలు తురక లైన కారణాన తానూ అంతవాణ్ణేనని రొమ్మువిరుచుకొనే కుట్టుసాహేబు సంగతి మరీ హాస్యాస్పదంగా ఉంది.

"మొగలు పాదుషాలు తుఘలక్ నవాబులు
డొక్కచించి తోలు చెక్కిరంచు
కుట్టుసాహేబయ్య కొట్టు బడాయీలు
విశ్వదాభిరామ వినురవేమ."

*నియోగి ప్రభువు :* నియోగులలో కొందరు కరణాలుగా ఉండి గోముఖవ్యాఘ్రములై మంది కొంపలార్పినవారు లేకపోలేదు. నియోగుల దుండగాలను హేళనచేస్తూ కృష్ణశాస్త్రిగారు

''ఆరువేల కొంపలంటించె నయగాడు
ఆరువేల వేరె యప్పుజేసె
అతడుగాక యెవ్వ డారువేల నియోగి
విశ్వదాభిరామ వినురవేమ'' అన్నారు.

*నాయకుడు :* ఎటువంటివారు రాజకీయనాయకులు అవుతున్నారు? శాస్త్రిగారి జవాబు పరమసత్యం కాదని ఎవరంటారు?

''నోటితీటవాడు మేటినాయకుడాయె
మౌనివరుడు పనికిమాలిపోయె
సింహమునకు గ్రామసింహమే గురువయ్యె...'' అన్నారు.

*ఉద్యోగి గుఱ్ఱమై :* ఈరోజులలో గుఱ్ఱాలే కుర్చీలెక్కుతున్నాయి.

"ఉలవచారు త్రాగి ఉద్యోగి గుఱ్ఱమై
దౌడుతీసె లద్దె తానెవేసె
గుఱ్ఱ ముండియుండి కుర్చిపై నెక్కెరా ..." అన్నారు

కవిగారు.

సమకాలిక సంఘదురాచారాలను మనిషిలో ఉండే విపరీత స్వభావాన్ని పరిహసిస్తూ వ్రాసిన పద్యాలుకూడా ఉన్నవి. కాని గ్రంథవిస్తర భీతిచే అవన్నీ ఉదాహరించలేకపోతున్నాను.

## శ్రీ. శ్రీశ్రీ

మహాకవి శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావుగారు కూడా కొన్ని హాస్యపు గేయాలు వ్రాశారు. మూడు యాభయిలు-అన్న గేయసంపుటిలో శ్రీశ్రీ హాస్యవంతములైన గీతాలు చాలా వ్రాసినారు. ప్రాసక్రీడలు అనే విభాగంలో "రాసక్రీడ శృంగారానికి రమ్యమైన ప్రాణం. ప్రాస క్రీడ హాస్యానికి పసందైన బాణం" అంటారు. వీరికి 'నవ్యత్వం పవిత్రము. పనికిరాదు ప్రాచీనత.' అయితే నవ్యులలో కొంత మందిని ఆయన హాస్యధోరణిలో మెచ్చుకొన్నారు. "సౌభద్రుని ప్రణయయాత్ర చదవాలని తొందర, యెంకిపాట వన్నుమోరు కవికోకిల గబ్బిలం విశ్వసత్యనాథాయణ, అగ్గిమీద గుగ్గిలం" మొదలగు వాక్యాలు ఆయన అభిరుచిని వెల్లడిస్తున్నవి.

అల్లాటప్పా వ్రాతలువ్రాస్తే చెవులు మెలేస్తానంటాడు ఈ కవి. అల్లాటప్పా వ్రాతలు రాయడమే చెప్పుకోతగ్గ గొప్పా! ఒప్పుకోదగ్గ మెప్పా. అలాంటి రచయితల చెవులు మెలితిప్పానంటే అది నా తప్పా! అంటాడు శ్రీశ్రీ మహాకవి అయిన శ్రీశ్రీ కలంనుంచి జారినది ఏదైనా గొప్పే.

హాస్యరచనలు వ్రాసినవారు ఇంకా ఎందరో ఉన్నారు. వారిలో ఎంతోమంది ఉత్తమ హాస్యరచనలు వ్రాసినవారు ఉండవచ్చు. అట్టివారు ఎందరున్నారో నాకుతెలియదు. నన్ను క్షమించమని కోరుతున్నాను. శ్రీ నార్లవారి రచనలలో ఎన్నో హాస్యపుపలుకులు దొర్లినవి. వాటిని నేను సంపాదించలేకపోయినాను. అందుకుకూడా క్షమాపణ వేడుకొంటున్నాను. కథలలో అత్తగారి కథలు నాకు దొరికినవి. వాటిలో

మృదువైనది, మధురమైనది అయిన హాస్యము నాకు కనిపించింది. అత్తగారు అనబడేఆవిడ గయ్యాళిదానిగాను కోడలును ఏడిపించుకొని తినేదానిగానూ కథలలో వర్ణిస్తారు సాధారణంగా. కాని ఈ శ్రీమతి భానుమతిగారు సృష్టించిన అత్తగారు అటువంటిదిగాదు. ఆమె అమాయకురాలు. జపాను ఎక్కడుందో తెలియదు. ఆగ్రా దగ్గరేఉంది అంటే నమ్ముతుంది. తనను తీసికెళ్లమని కొడుకును అడుగుతుంది. మడిబట్టలు మడి ఆవకాయ జాడీలతోసహా జపాను ప్రయాణం కడుతుంది. మనుమడూ కోడలూకూడా ఆమెను ఆడిస్తారు. ఆమె అమాయకత్వమే హాస్యానికి ఆలంబన. వాళ్లు తనను హేళనచేస్తున్నారనే అభిజ్ఞకూడా ఆమెకులేదు. అల్లాగే ఆవును పెంచే విధానమునుగూర్చి ఆమెకున్న అభిప్రాయాలూ అజ్ఞానజన్యములై పరిహాసరమ్యంగా ఉంటవి. ఆమె ప్రేమమూర్తి. తన కుమారునిపైన, కోడలుపైన మనుమళ్లపైన ఆపేక్ష ఒలక పోస్తుంది. ఈ కథలలోని హాస్యము జుగుప్సా శూన్యమై, మధురభావ పూరితమై పరమరమణీయమైనదిగా ఉంది. అందుకు సందేహములేదు. కాని అత్తగారి బొమ్మలేసిన ఆర్టిస్టు ఆమెకు జపాన్ దుస్తులు తొడిగి తైతక్కలాడుతున్నట్టుగా చిత్రించాడు. అల్లాంటిదుస్తులు వేసుకోవలెనని ఆమెకు కోరిక ఉన్నట్లు కథలో ఎక్కడా సూచనలేదు. ఆర్టిస్టుకు ఈ సూచన ఎట్లావచ్చిందో తెలియదు. అల్లాంటి బొమ్మను ప్రదర్శించడం వలన ఆ ప్రేమమూర్తిని అపహాస్యం చేసినట్లు అయింది. అపహాస్యానికి గురికావలసిన మనిషికాదు ఆమె. కథలలో ఎక్కడా ఆమెను ఎవ్వరూ హేళనచేయలేదు. అమాయకత్వానికి నవ్వుకొన్నారు. అదివేరు. ఇల్లాగ హేళనచేయడం వేరు.

*ముళ్లపూడి వెంకటరమణ :*

ముళ్లపూడి వెంకటరమణ ఉత్సాహవంతుడైన యువకుడు అని తోచింది నాకు అతని వ్రాతలనుబట్టి. ఇతడు పరమరమణీయమైన శాబ్దిక హాస్యమును సృష్టించగలడని ఇదివరకే చెప్పాను.

నవ్యులైనవారిలో మల్లాది విశ్వనాథ కవిరాజుగారు, మల్లాది వెంకటకృష్ణ శర్మగారు చక్కని హాస్య ఏకాంకికలు వ్రాసినారు. "నేటి రాజకీయాలు అంతరరాష్ట్రీయ సమస్యలు, కవిసమాజాలు, నాటకసభలు మొదలగువానిపై వీరు వ్యంగ్య రచనలు చేసినారు." అన్నారు సంగమేశ్వరరావుగారు. భమిడిపాటివారు గొప్ప హాస్యరచనలు చేశారు. వీరి విషయమై ఇంతకుముందే ప్రస్తావించాను.

మొక్కపాటి వారిని గూర్చి ఇదివరకు అనేకసార్లు చెప్పినాను. వారి బారిష్టరు పార్వతీశం హాస్యగ్రంథాలలో ముందు చెప్పదగినది. శ్రీశ్రీగారు అన్నట్లు క్షితిలో బారిష్టరు పార్వతీశమును చెప్పి పిదప పలుకవలె గదా! కితకితల కితరులను, భాసిత సిత సుశ్లోకు డతడు. నిజము ఆమాట.

ఇక రావూరును గురించి ఒక్కమాట చెప్పాలె. ఈ హాస్యము మృదువైనది. మధురమైనదీను. హాస్యరస ప్రధానమైన గ్రంథములేవీ వీరు ప్రచురించినట్లులేదు. కాని వీరి వడగండ్లు ఆషామాషీ. చదువని వారుండరు. వీరు మాట్లాడుతూ ఉంటే హాస్యము తొణికిసలాడుతూ ఉంటుంది. వీరు అన్న ఛలోక్తులను కొన్నింటిని ఇదివరకే ఈ పుస్తకము నందు పొందుపరచినాను. హాస్య కల్పనయందు వీరి ఉపజ్ఞ అద్వితీయము.

ఆయన అన్న ఒక్క ఛలోక్తి ఉదాహరించి ఈ పుస్తకాన్ని ముగిస్తాను. సిగిరెట్లు త్రాగడము మానివేయడము మంచిదని అన్నాను నేను ఒకసారి ఆయనతో. ఆయన, "నిజమేనండి అందుకే నేను ఎప్పుడూ మానేస్తుంటాను. ఇప్పటికి ఎంతలేదన్నా, ఇరవైసార్లు మానేసినాను" అన్నాడు. ఈయన దేనినైనను హాస్యవంతము చేయగల ప్రతిభాశాలి. పాషాణమునుండి పీయూషమును పిండగల సమర్థుడు.

అసలు హాస్యానికి పుట్టినిల్లు ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికాలు. ఇతరదేశాల సంగతి నాకుతెలియదు. ఆ దేశాలలో హాస్యము విశిష్టమైన

కళారూపాన్నిపొంది సాహిత్యంలో ఉజ్జ్వలమైన మణివలె ప్రకాశించింది. ఆంగ్ల భాషతో పరిచయం కలిగినతరువాతనే హాస్యంయొక్క సమగ్ర స్వరూపం ఔత్కృష్ట్యం వైశిష్ట్యం మనకు బోధపడ్డవి. మోలియర్, డికెన్సు మార్కుట్వెయిను, లీకాక్‌వంటి హాస్యవేత్తలు తెలుగులో లేరనే అనవచ్చు. ఒకరిద్దరు ఉన్నా అది ఒక విశేషంకాదు.

ఈ మధ్య వ్రాసిన పుస్తకాలలో పాలగుమ్మి పద్మరాజుగారు వ్రాసిన "బ్రతికిన కాలేజి" చక్కని హాస్యనవల. అందులో మృదువైన హాస్యం ఉంది.

ముగింపు :

చమత్కారం: ఇంతవరకు హాస్యంఅంటే ఏమిటో హాస్యం ఎన్నిరకాలో ఒక్కొక్కరకం హాస్యాన్ని ఎన్నివిధాల సాధించవచ్చునో తెలుసుకొన్నాము. అయితే ఒక్కవిషయం ఉంది. మనము చమత్కారము హాస్యము అన్నమాటలను పర్యాయపదాలుగా వాడుతూఉంటాము. హాస్యానికైనా చమత్కారానికైనా ఏదో క్రొత్తతనము, వైశిష్ట్యము ప్రతిభాప్రదర్శనం ఉండాలె. ఈ రెండింటికి భేదం ఏమిటీఅంటే చెప్ప డం కష్టము. స్థూలంగా కావ్యగుణముకలది చమత్కారము అనవచ్చు. కావ్యగుణముగాక మరోవిధమైన రామణీయకతను కలదాన్ని హాస్యము అందాము. చమత్కారము హాస్యానికి సన్నిహితమైనది. చమత్కారంలో ఉండే కావ్యగుణము పెరిగితే అది ఉత్తమమైన కవిత్వం అవుతుంది. చమత్కారం దిగజారి వికృతిని సంతరించుకొంటే అది హాస్యము అవు తుంది. చిత్రకవిత్వమూ, బంధకవిత్వమూ ఇవన్నీ చమత్కారానికి సంబంధించినవే. అలంకారాలన్నీ చమత్కారాన్ని సాధించడానికి ఉపయో గిస్తవి. వికృతితో సంబంధములేని ఏ అందమైనాసరే చమత్కారమే అవుతుంది. కాని ఒకప్పుడు చమత్కారమూ హాస్యమూ కలిసి ఉంటాయి. నేను ఈ పుస్తకంలో ఉదాహరించిన పద్యాలలో కొన్ని అటువంటివి ఉన్నవి.

అమ్మయ్య !

అయిపోయింది. కాని హాస్యాన్నిగురించి చెప్పవలసిన విషయాల్లో కొన్నిటిని ఇంకా చెప్పనేలేదు. "నవ్వెందుకు వస్తుంది" అన్న విషయము సమగ్రంగా చర్చించనేలేదు. బర్గసన్ ఈస్టుమన్ మొదలగు వారి సిద్ధాంతాలను సూచించి వదిలేశానేగాని తృప్తికరంగా పరామర్శ చేయలేదు.

శక్తిమూల హాస్యము, ఉక్తిమూల హాస్యము అన్నవిభాగాలలో చేర్చవలసిన విషయాలు ఇంకా ఎన్నోఉన్నవి. హాస్యప్రయోజనాన్ని గురించి వ్రాయలేదు. ఈ పుస్తకానికి ఆదరణ లభిస్తే, రెండో ఎడిషన్ వస్తే అప్పుడు ఈ విషయాలనుగురించి వ్రాస్తాను. లేకపోతే ముందు ముందు హాస్యాన్నిగురించి వ్రాసేవాళ్లు చూచుకొంటారు ఆ సంగతి.

ఉదార హృదయులగు పండితులు ఈ పుస్తకంలోని దోషాలను సుహృద్భావముతో తెలియజేస్తే సంతోషిస్తాను. ఈ పుస్తకం చదివేవాళ్లు కొద్దిమందే ఉంటారు. వారైనా చదివి ఊరుకొంటారుగాని పుస్తకాన్ని గూర్చి వారి అభిప్రాయాన్ని నాకువ్రాయాలని అనుకోరు. నిజానికి వ్రాయవలసిన పనిలేదు. కాని నేను వేడుకొంటున్నాను. మీ అభిప్రాయాలు నాకు తెలియజేయండి అని ప్రార్థిస్తున్నాను.

—***—